# తిరుపతి గంగ జాతర

'ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్' వారిచే
1994 రామరాజు జానపద విజ్ఞాన అవార్డు" పొందిన గ్రంథం

---

*This Book is published with the
Financial Assistance of*
**Tirumala Tirupati Devastanams
under their scheme
" Aid to Publish Religious Books "**

---

డా॥ పేట శ్రీనివాసులు రెడ్డి
లెక్చరర్
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం
తిరుపతి - 517 502

ఋషితేజ పబ్లికేషన్స్
418, బండ్ల వీధి, తిరుపతి
**1995**

BOOK TITLE : TIRUPATI GANGA JATARA

(THE FAIR OF GANGAMMA IN TIRUPATI)

*AUTHOR : Dr. PETA SRINIVASULU REDDY*



FIRST EDITION - 1995

COPIES - 1000

PRICE—Rs. 70/-

FOR COPIES :

SMT. PETA SAILAJA M Sc.,(Ag)

418, BANDLA STREET

TIRUPATI - 517 501

DTP : 'ADISRI SCREENS
433, BANDLA STREET
TIRUPATI - 517 501

PRINTING :

LAKSHMI PRIYA OFF SET

KUMMALAMMAN KOIL STREET

ROYAPURAM - MADRAS



'ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్' వారి 'రామరాజు జానపద విజ్ఞాన అవార్డు'ను డా॥ సి.నారాయణ రెడ్డి ద్వారా అందుకుంటున్న డా॥ పేటశ్రీ. వేదికపై ప్రొ॥ బి. రామరాజు, ప్రొ॥ నాయని కృష్ణ కుమారి, డా॥సి. వసుంధర,ప్రొ॥ఎన్. గోపి,డా॥సరస్వతి తదితరులు.



నిర్మాణం పూర్తి కానున్న తాతయ్యగుంట గంగమ్మ గుడి రాజ గోపురం

నా శ్రీమతి
శైలజ కు
ప్రేమతో
అంకితం

# కృతజ్ఞతలు

తిరుపతి గంగ జాతరకు సంబంధించి నాకు తెలియని చాలా విషయాలను తెలియ జేసిన మా నాయన కీ॥శే॥ పేట నారాయణరెడ్డికి నా స్మృత్యంజలి.

ఈ గ్రంథానికి రామరాజు జానపద విజ్ఞాన బహుమతినిచ్చి గౌరవించిన ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్ సంస్థకు, పరిషత్ తరపున నాకు అవార్డు ప్రదానం చేసిన డా॥పి. నారాయణ రెడ్డి గార్కి, ఆ కార్యక్రమంలో పాల్గొని నన్ను ఆశీర్వదించిన ఆచార్య బి. రామరాజు గార్కి, ఆచార్య నాయని కృష్ణ కుమారి గార్కి, డా॥సి. వసుంధర గార్కి, ఆచార్య ఎన్. గోపి గార్కి, డా॥పి. సరస్వతిగార్కి, తక్కిన పెద్దలకు నా నమస్సులు.

అవార్డు అందుకోగానే నన్ను ఎంతో ఆత్మీయంగా ఆశీర్వదించి, ప్రోత్స-హించిన ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి గార్కి, ఎస్. వి. యూనివర్సిటీ వైస్-ఛాన్సలర్ ప్రొ॥ ఆర్. రామమూర్తి గార్కి నా హృదయ పూర్వక వందనాలు.

ఈ పుస్తకంలోని ప్రతి అక్షరాన్నీ ఎంతో ఓర్పుతో చదివి, తగిన సలహాలనిచ్చి, ఆప్తవాక్యం రాసి నన్ను దీవించిన గురువర్యులు ప్రొ॥పి. నరసింహా రెడ్డి గార్కి, నన్ను శిష్యవాత్సల్యంతో ఎల్లప్పుడూ ప్రోత్సహించే గురువర్యులు ప్రొ॥ ఎస్జీడి చంద్రశేఖర్ గార్కి, ప్రొ॥డి. భాస్కర్ రెడ్డి గార్కి, ప్రొ॥ ఎ. మునిరత్నం రెడ్డి గార్కి, నా హార్దిక కృతజ్ఞతలు.

ఈ గ్రంథం మొదట 16 పేజీలు మామూలు ప్రెస్‌లో ముద్రించబడింది. ఫోటోల ముద్రణ విషయంగా సహకారాన్ని కోరితే, పుస్తకాన్ని చూసి, 16 పేజీలు పక్కన పెట్టించి, తాను కంప్యూటర్ కొంటున్నానని మొదట గంగమ్మ పుస్తకాన్ని ప్రారంభిస్తానని నాకు హామీని, ధైర్యాన్ని ఇచ్చి ఎంతో ఓపికతో, గంగమ్మ మీద భక్తితో, జాతర మీద ప్రేమతో డబ్బు ప్రసక్తి లేకుండా కష్టపడి, నష్టపడి ఈ పుస్తకం ఈ రూపంలో అందంగా మీ ముందు ఉండడానికి కారకుడు, 'ఆదిశ్రీ' అధినేత పాదిరి ద్వారకనాథ రెడ్డి. అతనికి నాతో పాటు గంగమ్మ కూడా ఋణపడింది. మిత్రుడు ద్వారకకు కేవలం కృతజ్ఞతలు అనే పదం సరిపోదు. అయినా నా హార్థిక ధన్యవాదాలు.

ఈ గ్రంథ ప్రచురణలో నా మీద పడ్డ ఆర్థిక భారాన్ని కొంతైనా తగ్గించడానికి సమ్మతించి, సహకరించిన దేవాదాయ కమీషనర్ శ్రీ సి.హెచ్.వెంకటపతి రాజు IAS గార్కి, శ్రీ తాతయ్య గుంట గంగమ్మ దేవస్థానానికి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎస్.ఆర్. కృష్ణారెడ్డి గార్కి-

ఈ గ్రంథానికి ఉత్సాహంతో కొంత ఆర్థిక సహాయం చేసిన మిత్రుడు, తాతయ్యగుంట గంగమ్మ గుడి రాజగోపురం స్థపతి కాంట్రాక్టర్ శ్రీ ఆర్.రాజేంద్రన్ గార్కి-

ఈ గ్రంథ విషయంలో నాకు అన్ని విధాల సహకరించిన బాల్యమిత్రుడు సూరా నరేంద్రరెడ్డి (రవి)కి-

ఫోటోలు,కెమరాలు,లెన్సుల విషయంలో నాకు ఇతోధికంగా తోడ్పడి, కష్టించిన కళాకారులు, మిత్రులు శ్రీ ఎస్. గాంధిబాబు, శ్రీ సి. పూర్ణ చంద్రుడులకు, అలాగే శ్రీ బి.వి. రమణ, డా॥వి.నా.రె.లకు-

నాతోపాటు నాలుగు సంవత్సరాలు ఫీల్డ్ వర్క్‌లో తోడుగా వున్న ఆత్మీయుడు ఎ. బాలసుబ్రమణ్యం రెడ్డి (ఉమ) కి-

ఈ పుస్తకానికి తమ వంతు సహకారాన్ని అందించిన మామగారు శ్రీ వి.ఎస్. రెడ్డి గార్కి, శ్రీ ఆర్.ఎం.ఉమా మహేశ్వరరావు కు-

ఈ గ్రంథాన్ని సకాలంలో ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్ వారి పోటీకి అందజేసిన ప్రియమిత్రుడు పోకల వెంకటేశ్వర రావుకు-

ఈ గ్రంథానికి తగు సూచనలిచ్చిన ప్రొ॥ ఎన్. భక్తవత్సల రెడ్డి కి, డా॥వై.ఎ. సుధాకర రెడ్డి దంపతులకు, శ్రీ రాఘవన్ సైనాడ్ గార్కి-

కంప్యూటర్ పనిని పర్యవేక్షించి, తీరిక లేకున్నా ఓపిక చేసుకొని మాకు సహకరించిన శ్రీ వి.ఆర్. సోమశేఖర్ గార్కి-

ఈ గ్రంథాన్ని ఎంతో ఓర్పుతో, నేర్పుతో కంప్యూటర్ టైపింగ్ చేసిన కుమారి. శ్రీపురం లక్ష్మి ప్రభ గార్కి-

ఈ గ్రంథానికి శుద్ధప్రతులు తయారు చేసి, గ్రంథ విషయంలో నన్ను నిరంతరం ప్రోత్సహిస్తూ వచ్చిన నా శ్రీమతి శైలజకు-

ఈ గ్రంథ ప్రచురణకు తగిన ఆర్థిక సహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, తెలుగు విశ్వవిద్యాలయానికి-

నా కృతజ్ఞతలు

Petasri

డా॥ పేట శ్రీనివాసులు రెడ్డి.

# ఆప్త వాక్యం

ప్రొఫెసర్. పి. నరసింహా రెడ్డి
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం
తిరుపతి

'బాదరాయణ సంబంధం' అని ఒక న్యాయం సంస్కృతంలో ఉంది. ఒకడెవరో తాను రేగు చెట్టు నీడలో ఉన్నానని, అవతలి వాడు రేగు కొయ్యతో చేసిన బండిలో పోతున్నాడని, అందువల్ల మనిద్దరి మధ్య సంబంధం ఉందని న్నట్లు -- అదీ బాదరాయణ సంబంధం అంటే -- 'బదరీ' అంటే రేగు చెట్టు.

'తిరుపతి గంగ జాతర ' కు నేను నాలుగు మాటలు రాయాల్సి రావడానికి నేను బాదరాయణ సంబంధం ఎందుకు ముడి పెడ్తున్నానంటే మా ఇలవేలుపు 'గంగమ్మ' పేటశ్రీ రాసిన పుస్తకం గంగమ్మదే కావడం. అందువల్ల నాకీ అవకాశం వచ్చిందేమోనని --- పేటశ్రీ నాకు శిష్యుడు. 'శిష్యాదిచ్ఛేత్ పరాజయమ్' అని నానుడి. పేటశ్రీ పరిశోధనలో గురువుల్ని మించి పోవాలనేది నా ఆకాంక్ష. పేటశ్రీ నిత్య పరిశోధకుడు. పగలూ రాత్రీ తిరిగి క్షేత్ర పర్యటన చేయగల దిట్ట. మంచి ఆర్టిస్టు. ఫోటోగ్రాఫర్. ఇవన్నీ ఉండడం వల్ల మంచి పరిశోధకుడైనాడు. నాలుగైదు పుస్తకాలు జానపద సాహిత్యం మీద రాసి ఇప్పటికే లబ్ధ ప్రతిష్ఠుడయ్యాడు. ఇకపోతే ప్రస్తుత గ్రంథం విషయం కొంత. తిరుపతి గంగ జాతర గురించి అడపాదడపా వ్యాసాలు వచ్చాయే గానీ -- ఒక గ్రంథం -- ఇలాంటి విపులమైన గ్రంథం వెలువడలేదు. తిరుపతి గంగ జాతర మిగతా జిల్లాల్లోని గంగ జాతర్లకంటే విశిష్టమైంది -- ముఖ్యంగా వేషాల విషయంలో.

తిరుపతి గంగ జాతరను గురించి ఇంతకన్నా సమగ్రంగా మరోగ్రంథం రావాలంటే మరో దశాబ్దం పట్టొచ్చేమో! పేటశ్రీ గాక మరొకరై ఉంటే ఇంత క్షేత్ర పర్యటన చేసి, గంగ జాతరకు సంబంధించిన సర్వ దృక్కోణాలు పరిశీలించి, వందలాది ఛాయాచిత్రాలు తీసి రాసి ఉండలేరు అనడం అతిశయోక్తి కాదు.

'తిరుపతి గంగ జాతర' అనే ఈ గ్రంథాన్ని రాత ప్రతిగా పుట్టుక నుండి

ముద్రిత ప్రతి వికాసం దాకా నేను పర్యవేక్షించడం జరిగింది. చాలా చోట్ల అతి స్పష్టంగా, చారిత్రక దృక్పథంతో, స్థల పురాణాల్తో పేటశ్రీ గ్రంథాన్ని సమకూర్చడం ముదావహం. గ్రంథ సామగ్రి ఒక ఎత్తు కాగా దాన్ని గ్రంథంగా కూర్చడం మరో ఎత్తు - నిపుణమైన మాలాకారుడు పూలని ఎంత సుందరంగా కూరుస్తాడో పేటశ్రీ అలా కూర్చాడు.

మొదటి అధ్యాయంలో గ్రామదేవతల్ని గురించి స్థూలంగా చెప్పడం - దానికి వివిధ పరిశోధనా గ్రంథాల్ని సమాలోచించాడు. రెండో అధ్యాయంలో తిరుపతి గంగమ్మను గురించి చారిత్రకంగా పరిశీలించాక గంగమ్మ గుడిని గురించి, వేంకటేశ్వర స్వామితో గంగమ్మ కుండే అన్నా చెల్లెలు బాంధవ్యం గురించి సోదాహరణగా వివరించాడు. గంగమ్మకు సంబంధించిన ఐతిహ్యాల్ని సమకూర్చాడు. తిరుపతి గంగ జాతర ఎలా జరుగుతుందో వేషాలు ఏవేవి ఎలా వేస్తారో, ఎందుకు వేస్తారో - వారు ఏమేమి బూతులు తిడతారో (అక్షరాల్ని ఖాళీలు పెట్టి ) పూస గుచ్చినట్లు వర్ణించాడు. తిరుపతి గంగ జాతర ఆధారంగా ప్రజల మనస్తత్వాన్ని వెలికి తీసే ప్రయత్నం - మరీ 'టెక్నికాలిటీస్' జోలికి పోకుండా - చెప్పాడు. చిత్తూరు జిల్లాలో ప్రముఖ గంగ జాతరల వివరాల్తో గ్రంథం ముగించాడు.

ఒక మాటలో చెప్పాలంటే తిరుపతి గంగ జాతరకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వం అని దీనిని చెప్పవచ్చు. దీనిని వివిధ దేశీయ భాషల్లోకి, ఇంగ్లీష్ లోకి అనువదిస్తే బాగుంటుందేమో!

ఇంత ఉత్తమ గ్రంథానికి కాకపోతే ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్ వారి ' రామరాజు జానపద విజ్ఞాన అవార్డు' మరే గ్రంథానికి ప్రదానం చేస్తారు?

చిరంజీవి పేటశ్రీ మరిన్ని ఉత్తమగ్రంథాలు లిఖించి తెలుగు సాహిత్యంలో ఆచంద్రార్కం నిలవాలని గురువుగా ఆకాంక్షిస్తున్నాను. ఇందుకు తగిన శక్తి సామర్థ్యాలు, ఆయురారోగ్యాలు శ్రీ వేంకటేశ్వర స్వామి పేటశ్రీకి ఇవ్వాలని మనసా దేవుణ్ణి సంప్రార్థిస్తున్నాను.

-- డా॥ పి. నరసింహా రెడ్డి

**Nedurumalli Janardhana Reddy**
Former Chief Minister
Andhra Pradesh

సాహితీ మిత్రులు డాక్టర్ శ్రీనివాసులురెడ్డి గారికి,

మీ ఉత్తరం అందినది. 'తిరుపతి గంగ జాతర' మీద మీ పరిశోధనాత్మక పుస్తకానికి జానపద సాహిత్యపరిషద్ వాళ్ళు 'రామరాజు' జానపదవిజ్ఞాన అవార్డ్ ప్రకటించిన విషయం, జులై 23న, మీకు అవార్డు ఇచ్చి సత్కరించిన విషయం వార్తాపత్రికల్లో, టి.వి. లో చూశాను. అర్హతనెరిగి ఇచ్చే అవార్డులకే విలువ, గుర్తింపు ఉంటాయి రామరాజు అవార్డు మీకు ఇవ్వటం నిజమైన ప్రతిభకు పట్టం కట్టడం లాంటిదని భావిస్తున్నాను జానపదవాఙ్మయంలో మీరు మరింత కృషి చేసి ఉన్నతమైన అవార్డులు ఇంకెన్నో పొందాలని మనసారా కోరుకుంటూ

శుభాకాంక్షలతో

మీ

(ఎన్. జనార్ధన రెడ్డి)

డాక్టర్. పేట. శ్రీనివాసులు రెడ్డి,
లెక్చరర్
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి – 517 502.

'Janapriya' 6-3-1109/2, Somajiguda, Hyderabad - 500 482 Tel No 313333, 314444

# విషయ సూచిక

# ప్రస్తావన

తిరుపతి ప్రపంచంలోనే ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. ఇటువంటి పుణ్యక్షేత్రంలో గంగ జాతర ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకోవడం గమనించదగ్గ విషయం. స్థానికులకు వేంకటేశ్వర స్వామి అంటే ఎంత ఇష్టమో, గంగమ్మంటే కూడా అంతే భయభక్తులున్నాయి. భారతదేశంలో తిరుపతి గంగ జాతర వంటి వైవిధ్యం గల జాతరలు చాలా అరుదుగా కన్పిస్తాయి. తిరుపతి గంగ జాతర ఎన్నో ప్రత్యేకమైన అంశాలతో కూడుకొని ఆసక్తికరంగా ఉంటుంది.

నేను తిరుపతిలో పుట్టి పెరగడం వల్ల నా చిన్నతనం నుండి చుట్టు పక్కల పిల్లలతో కలసి జాతర ' వేషాలను వేసేవాళ్ళం. జాతర వస్తోందంటే మాకు సందడి మొదలౌతుంది. అసలే మే నెలలో స్కూళ్ళకు శెలవు. మేం ఊరి బయటకెళ్ళి రేలకాయల్ని దండల కోసం కోసుకొచ్చేవాళ్ళం. అలాగే బంకమట్టితో గోలీలను తయారు చేసి హారాలను కుట్టి పెట్టుకొనే వాళ్ళం. ఇక జాతరలో వేషాలను వేసుకొని చుట్టు పక్కల పిల్లలతో కలసి గుంపుగా బూతులు తిడ్తూ వెళ్ళే వాళ్ళం. ఆ రోజుల్లో ధనికులు, పేదవాళ్ళు అనే భేదం లేకుండా అందరూ తమ పిల్లలచే వేషాలు వేయించే వాళ్ళు. మడిబిచ్చానికి పంపేవారు.

వేషాలు వేసుకొని బూతులు తిట్టే రోజుల్లో మాకు అవి ఎందుకు తిడ్తారో అర్థమయ్యేది కాదు. ఏదో గంగమ్మకు బూతులంటే ఇష్టం అలా జాతరలో తిట్టాలనే వారు. తిట్టే వాళ్ళం. అదో సంప్రదాయంగా ఉండేది. నేను Ph.D. చేసే రోజుల్లో గంగ జాతర మీద వ్యాసం రాయాలనే కోరిక కలిగింది. అప్పట్నుంచి అడపా దడపా గంగ జాతరపై కొన్ని వ్యాసాలు రాయడం జరిగింది. అలా వ్యాసాలు రాస్తున్నప్పుడు బూతులు ఎందుకు తిడ్తారో? పరిశోధించాను. వాస్తవాలు తెలుసుకోకుండా బూతులు తిట్టడం అనాగరికమనుకునే వాళ్ళ అమాయకత్వానికి ఆశ్చర్యపడ్డాను. అందులో మన నాగరికతకు సంబంధించిన ఎన్నో విషయాలు దాగి ఉన్నాయనేవి సత్యం. అలాగే గంగ జాతరలోని చాలా విషయాలు కూడా. ఈ గంగ జాతర సంస్కృతి, సంప్రదాయాలు కాలగర్భంలో కలసి పోకుండా ప్రజలు తరతరాలుగా కాపాడుకుంటూ వస్తున్నారంటే ప్రజలకు గంగ జాతరంటే ఎంత ఇష్టమో అర్థం చేసుకోవచ్చు. గంగ జాతర ఇతర సంస్కృతులకు ఏమాత్రం తీసిపోనట్టిది. ఓ ప్రత్యేకతను సంతరించు కొన్నది. వ్యాసాలు రాసే రోజుల్లోనే నాకు తిరుపతి గంగ జాతరపై పుస్తకం రాయాలనే కోరిక కలిగింది. అప్పట్నుంచి అనేక విషయాలను క్రోడీకరిస్తూ, ప్రతి జాతరలో ఫోటోలను తీస్తూ, ఫీల్డువర్క్స్ చేస్తూ, వీడియోను కూడా తీయించడం జరిగింది.

' తిరుపతి గంగ జాతర ' గ్రంథం మీ ముందుకు తీసుకొని రావడానికి నాకు దాదాపు 5 సంవత్సరాలు పట్టింది.

నేను పుట్టింది మే నెల పదో తేది. మా అమ్మ మాటల్లో చెప్పాలంటే "ఒరేయ్ ! నువ్వు గంగ జాతర్లో మాతంగి వేషాల రోజు పుట్టావురా !" అని అంటుంటుంది. మాతంగి వేషం రోజు అక్షర జ్ఞానం లేని మా అమ్మ నా పుట్టిన రోజును ప్రతి సంవత్సరం గుర్తుకు తెస్తుంది. అలా నేను జాతర సమయంలో పుట్టడం, ఈ గంగ జాతర గ్రంథాన్ని రాయడం, దీనికి అవార్డు రావడం అంతా యాదృచ్ఛికం. నేను చిన్నప్పటి నుండి ప్రతి సంవత్సరం జాతరను చూడడం, అందులో పాల్గొనడం వల్ల నాకు తెలిసిన చాలా విషయాలను పొందుపర్చడం జరిగింది. నేను చూడని, ఇప్పుడున్న పెద్దలకు తెలియని ఎన్నో జాతర విషయాలు నేను రాసి ఉండక పోవచ్చు. అలాంటివి భవిష్యత్తులో ఏవైనా తెలిస్తే మరో ముద్రణలో రాయగల వాడను. ఇప్పటికే గ్రంథ విస్తరణ వల్ల ముఖ్యమైన విషయాలనే పొందుపర్చడం జరిగింది.

'తిరుపతి గంగ జాతర ' గ్రంథంలో ఐదు అధ్యాయాలు, రెండు అనుబంధాలు ఉన్నాయి. మొదటి అధ్యాయం గ్రామ దేవతలు, రెండవ అధ్యాయం తిరుపతి గంగమ్మ, మూడవ అధ్యాయం తిరుపతి గంగ జాతర, నాల్గవ అధ్యాయం తిరుపతి గంగ జాతర - ప్రజల మనస్తత్వం, ఐదవ అధ్యాయం చిత్తూరు జిల్లాలో ప్రముఖ గంగ జాతరలు. అనుబంధాలలో 1. గంగమ్మ కథ, 2. ఏలపాటలు. వీటిని యథాతథంగా ఇవ్వడం జరిగింది. ఇది భావి పరిశోధకులకు ఉపయుక్తంగా ఉంటాయనే ఉద్దేశంతో. ఇక ప్రారంభించండి----

# 1. గ్రామ దేవతలు

భూమి మొట్ట మొదట మండుతున్న గోళం. వర్షాలు పడి పడి భూమి బాగా చల్లబడి పోయింది. వాతావరణం అనుకూలించి ప్రాణ వాయువు జనించడంవల్ల సుమారు రెండు వందల కోట్ల సంవత్సరాలకు పూర్వం సముద్ర జలాల్లో జీవరాశి ఏర్పడింది. తర్వాత భూమిపైన అనేక జీవరాశులు ఆవిర్భవించాయి. ఇలా కొన్ని జీవరాశులు నీటిలో మెదిలేవైతే, ఇంకొన్ని జీవరాశులు భూమిపైన సంచరించేవైతే, మరికొన్ని జీవరాశులు ఆకాశంలో ఎగిరేవిగా ఉద్భవించాయి. వానర జాతుల నుంచి మానవ పరిణామం జరిగింది. మానవుడు తన మేధస్సుతో ఆలోచించడం మొదలు పెట్టాడు. జల ప్రళయాలు, భూకంపాలు, ఉరుములు, మెరుపులు, దావాగ్నులు, సూర్యోదయాలు, కటిక చీకట్లు, పుట్టుకలు, అంటువ్యాధులు, అకాల మరణాలు, క్రూర జంతువులు, విషసర్పాలు వంటివి మానవుడ్ని భయ భ్రాంతులకు, ఆశ్చర్యానికి గురి చేశాయి. మానవుడు స్వప్నాలలోఎప్పుడూ చూడని ప్రదేశాలను చూడడం, జయించలేని వాటిని జయించడం వంటి విషయాలు అద్భుత పరచేవి. తనకు తెలియని అదృశ్య శక్తి ఏదో వీటన్నిటి వెనుక ఉన్నట్లు బలంగా నమ్మాడు మానవుడు. ఈ అదృశ్య శక్తులను తన వశం చేసుకోవడానికి పూనుకున్నాడు. తత్ఫలితంగా ఆరాధనలకు అంకురార్పణ జరిగింది.

1.1. గ్రామ దేవతల ఆవిర్భావ వికాసాలు :-

ఆత్మారాధన దశ (Animism) నుండి మానవుని మత పరిణామక్రమం మొదలై భూతారాధన (Fetishism), పితృదేవతారాధన(Ancestral Worship), జంతు ప్రాధాన్యం (Totemism), మాతృదేవతారాధన (Mother Goddess Worship), దైవారాధన (Worship) ల వరకు వివిధ దశలుగా పరిణామం చెందింది.

చనిపోయిన వాడి ఆత్మ శరీరాన్ని వదలిపెట్టినా, తాను నివసించిన ప్రదేశాలను, వస్తువులను అంటి పెట్టుకొని ఉంటుందని, ఈ ఆత్మ చెట్లను, పుట్లను, రాళ్ళను రప్పలను ఆశ్రయించి ఉంటుందని ప్రాచీన మానవులు నమ్మేవారు. బతికున్న వారికి అవసరమైనట్లే ఈ ఆత్మలకు కూడా ఆహారం, నిత్యావసర వస్తువులు అవసరమని భావించేవారు. తమకు కావలసిన వస్తువులు, తిండి లభించకపోతే ఆత్మలు ఆగ్రహంతో తమ వారికి ఆపదలను, కీడును కలుగజేస్తాయని ఆదిమ మానవులు భయపడేవారు. రాళ్ళను గాని, కొయ్యను-

గాని ఈ ఆత్మలకు ప్రతిరూపంగా చేసుకొని ఆ ఆత్మలకు అవసరమైన వాటిని సమకూర్చి భక్తితో ఆరాధిస్తే తమకు సుఖశాంతులను కలుగజేస్తాయని నాటి మానవులు విశ్వసించేవారు. ఇలా ఆత్మలను ప్రసన్నం చేసుకొనే పద్ధతులు ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలోని ఆదిమ మానవుల్లో సర్వత్రా వ్యాప్తిలో ఉండేవి. ఆత్మారాధనతో ప్రాచీన మానవుడు 'మత' స్వరూపానికి బీజాలు నాటాడు.

ఇలాంటి ఆత్మారాధన (Animism) విశ్వాసాలవల్లే ప్రాచీన మానవుల మత విధానంలో పితృదేవతారాధనకు అంకురార్పణ జరిగింది. పితృదేవతల ఆత్మలు జంతు రూపాల్లో కనిపిస్తాయని ప్రపంచంలో వివిధ ప్రదేశాలలోని వివిధ జాతుల వారు ప్రబలంగా నమ్మేవారు. మలయాలోని సెమాంగులు, ఆస్ట్రేలి-యాలోని కొన్ని ఆటవిక జాతులవారు మరణించినవాని ఆత్మ పక్షి రూపంలో ఎగిరి పోతుందని భావిస్తారు. మన దేశంలో దక్షిణాదిన చనిపోయినవారు కాకి రూపంలో సంచరిస్తారని విశ్వసిస్తారు. అందుకే చనిపోయినవారికి పిండాన్ని చేసి ఆ ఆహారాన్ని కాకులకు పెడ్తారు. ఈ ఆచారం నేటికీ మిగిలే ఉంది. బ్రిటీష్ కొలంబియాలోని హైడా జాతుల్లో నీళ్ళలో పడి చనిపోతే తిమింగలం అవుతారని, యుద్ధంలో చనిపోతే గానం చేసే పక్షులవుతారని, హోటెన్‌టాటు జాతులవారు మరణిస్తే నక్కలు అవుతారని, ఆఫ్రికాలోని దహోమియన్ జాతుల వారు మరణిస్తే పాముగా మారుతారని విశ్వసిస్తారు. ఇలా చనిపోయిన వారి ఆత్మలు వివిధ పక్షులుగానో, జంతువులుగానో మారుతాయని ఇవి తమ పితృదేవతల ప్రతిరూపంగా, అంశగా భావించి వాటిని భయ భక్తులతో పూజించే విధానం ప్రారంభమైంది. ఆయా కులాల వారు, ఆయా జంతువులను తమ పితృదేవతలుగా భావించుకొని వాటిని తమ కుల చిహ్నాలుగా చేసుకొని 'జంతు పూజ' కు శ్రీకారం చుట్టారు నాటి ఆదిమ మానవులు. దీనినే 'టోటమిజమ్ ' (Totemism) అంటారు. తమ కుల దేవతలైన జంతువులను చంపరు, తినరు. ఒక వేళ పొరపాటున తింటే నిర్వంశం అవుతుందని, భయంకర వ్యాధులు సంక్రమిస్తాయని నమ్ముతారు. ఇతరులెవరైన తమ 'టోటమ్' జంతువును చంపడానికి ప్రయత్నిస్తే సహించరు. టోటమ్ జంతువు చనిపోతే మనిషికి చేసినట్లే అంత్యక్రియలు చేస్తారు. కాని ఒక్కొక్కసారి తమ కుల దైవమైన జంతువును ఒక ప్రత్యేక సమయంలో లేదా జాతర, ఉత్సవాలలో చంపి తినడం కొన్ని జాతుల వారిలో ఉంది. దానికి కారణం ఆ సమయంలో ఆ జంతువును తినడం వల్ల వారికి తమ కులదేవత శక్తులన్నీ వస్తాయని విశ్వసిస్తారు.

మొహంజొదారో, హరప్పాల నాగరికతను పరిశీలిస్తే భారత దేశంలో అనార్యులలో టోటమిక మతం క్రీస్తు పూర్వం అనేక శతాబ్దాలకు ముందే ఉన్నట్లు తెలుస్తోంది. సింధునగరంలో బయల్పడిన వివిధ జంతురూపాలను ఆధారంచేసుకొని ఆనాటి దేశాన్ని మీనాడ్ (The country of Fish) పరవ-నాడ్ (The Country of Birds), మరొన్ కొటినాడ్ (The Country of woodpeckers) లతో పోల్చి అక్కడ ద్రావిడులు నివసించినట్లు పేర్కొనబడి ఉంది.

మానవ పరిణామ క్రమాన్ని మూడు దశలుగా విభజించారు. అవి 1. ఆటవిక దశ 2. అనాగరిక దశ 3. నాగరిక దశ.

ఆటవిక దశ నుండే మానవునికి అతీత శక్తులమీద నమ్మకం ఏర్పడింది. ఈ దశలోనే మానవులు జంతువుల్లా గుంపులు గుంపులుగా నదులు వెంబడి, సరస్సుల వెంబడి నగ్నంగా సంచరిస్తూ ఆకలిని తీర్చుకోవడానికి పండ్లను, కాయల్ని, దుంపల్ని, మాంసాన్ని తింటూ సంచార జీవితాన్ని గడిపేవారు. గుహల్లో, చెట్టు తొర్రల్లో తలదాచుకొనేవారు. అప్పట్లో భూమంతటిని అరణ్యాలు ఆక్రమించుకొని ఉండేవి. దట్టమైన అడవుల్లో క్రూర జంతువుల నుండి రక్షణ పొందేందుకు గుహలు లేనిచోట్ల పెద్ద పెద్ద చెట్లమీద గుబురుగా ఉండే కొమ్మల మధ్యలో గూడు కట్టుకొని ఉండేవాళ్ళు. అప్పట్లో మానవుల పరిస్థితి దిన దిన గండం నూరేళ్ళ ఆయుస్సుగా ఉండేది. ఆ భయంలో నుండే భక్తి పుట్టుకొచ్చింది. కొన్ని వేల సంవత్సరాల తర్వాత నిప్పును స్వతహాగా పుట్టించడం నేర్చుకొన్నారు. రెండు చెకుముకి రాళ్ళ రాపిడితో నిప్పురాజుకోవడం గమనించారు. అప్పట్నుంచి ప్రాచీన మానవుల జీవితంలో చాలా మార్పు వచ్చింది. తర్వాత పచ్చిమాంసాన్ని, చేపల్ని కాల్చి తినడం కనిపెట్టారు. సంచార జీవితంలో ఉపయోగించే రాతి ఆయుధాల స్థానంలో విల్లును కనిపెట్టారు. వేట కాస్త సునాయాసమైంది. నిద్రలేచింది మొదలు పొద్దుగుంకే వరకు ప్రాచీన మానవులకు ఆహారాన్వేషణతోనే సరిపోయేది. ఆహారం నిల్వ చేసుకోవడం వారికి పెద్దసమస్య అయిపోయింది. అవసరం మానవులను ఆలోచింప జేసింది. తత్ఫలితంగా వెదురుతో బుట్టను అల్లడం నేర్చుకున్నారు. తర్వాత బుట్టలకు లోపల వెలుపల మట్టిని అతికించి మట్టి పాత్రలను చేయడం నేర్చుకున్నారు. ఆ తర్వాత తిన్నగా వెదురు దబ్బలు మధ్యలో లేకుండానే మట్టి పాత్రలు చేయడం మొదలు పెట్టారు.

ఆదిమ మానవులు మట్టి పాత్రలు చేయడం నేర్చుకున్నాక ఆటవిక దశ అంతమై 'అనాగరిక దశ' ఆరంభమైంది. స్త్రీలు తమ శారీరక పరిస్థితులవల్ల,

గర్భధారణ, పిల్లలను చూసుకోవడంవల్ల వేటలో ఎక్కువగా పాల్గొనలేక పోయారు. పురుషులు వేటకుపోతే, స్త్రీలు పండ్లు, కాయలు, దుంపలు, తిండి గింజల్ని సేకరించి మట్టి పాత్రలలో ఉంచేవారు . ఒక వేళ ఆరోజు వేటలో ఏ జంతువూ దొరకకపోతే స్త్రీలు సేకరించిన ఆహారాన్ని భుజించేవారు. దూరాభారం నుంచి సేకరించిన తిండిగింజలు మట్టి పాత్రలలో దాచేటప్పుడు గింజలు వొలకడం, అవి నీళ్ళతో తడిసి మొలకెత్తడాన్ని గమనించారు. అలాగే తమ నివాసాలకు ముందు తాము తినిపారేసిన పండ్ల విత్తనాల నుండి మొలకలు రావడం కూడా గమనించారు. అప్పట్నుంచి స్త్రీలు తిండి గింజల్ని వెదుక్కొంటూ చాలా దూరం తిరగడం మాని, తమ గృహాలకు ముందున్న ఖాళీ స్థలాల్లో నేలను తవ్వి, గింజలను చల్లి వ్యవసాయానికి శ్రీకారం చుట్టారు. భూమికున్న సఫలతను, స్త్రీలకున్న సఫలతను (Fertility) పోల్చి చూసుకున్నారు. భూమి, స్త్రీ రెండు సమానమని భావించారు. దున్నిన భూమిని నీరు ఫలవంతం చేస్తుందని అలాగే స్త్రీ, పురుషుల సంపర్కంలో పురష వీర్యం వల్ల స్త్రీ గర్భం ఫలవంతం అవుతుందని తెలుసుకున్నారు. సంతానాన్ని ప్రసాదించే స్త్రీ సృజనాత్మక శక్తి అని భావించారు. అప్పట్నుంచి భారతదేశంలో భూమిని భూదేవిగా, పృథ్వీమాతగా బావించారు. " మరణము వలన ప్రాజ్ఞ్మానవుని యందాత్మారాధన (Animism) ముద్భవించి, మెల్లగా నట్టి యాత్మ నుండి మనుష్యరూపమునకు ప్రతిరూప కల్పనను, సంతరించుకొన్న దేవతా భావన రూపు దాల్చినది. మనుష్యులను పీడించు ప్రేతాత్మల నుండి రక్షణకై ఆ మనుష్యుడే భగవ ద్రూపమును కల్పించుకొని, తనకు సంరక్షకునిగా నిలువ బెట్టుకొనెను. ఇట్టి భగవద్రూప కల్పనమునందు మొదటి కల్పన ' తల్లి దేవత ' (Mother Goddess)." [1]

త్రవ్వకాలలో బయల్పడిన వివిధ సంస్కృతులను పరిశీలిస్తే మాతృ దేవతా కల్పనల్ని మనం గమనించవచ్చు. తూర్పు మధ్యధరా సముద్ర ప్రాంతానికి చెందిన దక్షిణ, ఉత్తర దేశాల నాగరికతను పరిశీలించి పురాతత్త్వవేత్తలు ఈ మాతృదేవతారాధన అతి పురాతన కాలంనుండి ఉన్నట్లు ఋజువు చేశారు. ఈజిప్షియన్లకు, రోమనులకు, గ్రీకులకు చెందిన ఐసిస్, సిరిస్, డెమెటర్ వంటి తల్లి దేవతలకు మధ్యధరా సంస్కృతికి చెందిన మాతృదేవతే మూలకారణం. ఈ మాతృదేవతను ఉదార స్వభావంగల భూమాతగా భావించి గ్రీకులు 'గియు' అని, రోమనులు 'టెల్లస్' అని అనేవారు.

---

[1] తెలుగు జానపద గేయ గాథలు -- డా. వాయని కృష్ణకుమారి; పుట - 184

భారత దేశంలోకి ఆర్యులు అడుగు పెట్టకముందే అనార్యులలో మాతృదేవతారాధన ఉన్నట్లు ఆధారాలున్నాయి. భారత దేశంలోకి ఆర్యులు క్రీ.పూ. 1500 ప్రాంతంలో అడుగు పెట్టారు. ద్రావిడ సంస్కృతిగా భావించ బడుతున్న సింధునదీ నాగరికత క్రీ.పూ. 3,000 ప్రాంతంలోనిది. అంటే భారత-దేశంలోనికి ఆర్యులు ప్రవేశించి ఇప్పటికి 3,500 సంవత్సరాలయింది. సింధునదీ నాగరికత వికసించి 5,000 సంవత్సరాలయింది. హరప్పా, మొహంజొదారో త్రవ్వకాలలో బయల్పడిన ముద్రికలను (Seals) పరిశీలిస్తే సఫలతకు (Fertility) స్త్రీ ఆధారమనే భావం ఆ రోజుల్లోనే ప్రబలంగా ఉండేదని మనం తెలుసుకో-వచ్చు. త్రవ్వకాలలో బయల్పడిన ఒక ముద్రికపై స్త్రీని తలకిందులుగా చిత్రించి ఆమె రెండుకాళ్ళ మధ్యలో గర్భం నుండి చిగుర్లు, మొక్కలు మొలకెత్తినట్లు చూపబడి ఉంది. అదే విధంగా మరో ముద్రికను పరిశీలిస్తే వృక్షం మధ్యలో స్త్రీ చిత్రించబడిఉంది. తర్వాత కుషాణుల కాలానికి చెందిన ముద్రికపై యక్షిణి తలపై వృక్షాన్ని చిత్రించబడి ఉంది. దీనిని బట్టి అతి పురాతన కాలం నుండే స్త్రీ సఫలతకు ప్రతీకని విశ్వసింపబడుతోంది. అప్పటి సింధు నదీ లోయలోని ద్రావిడ సంస్కృతికి, ఈజిప్ట్, సుమేరు, క్రేట్, బాబిలన్ హిట్టైట్ తెగల సంస్కృతికి దగ్గర పోలికలు ఉన్నాయి. మొహంజొదారో, హరప్పా త్రవ్వకాలవల్ల సింధు నాగరికతలోని మత పరిణామంలో మాతృ భావన రూపు దిద్దుకొని ఉన్నట్లు పేర్కొనబడి ఉంది.[2] సింధునదీ నాగరికత విధ్వంసం అవడంవల్ల, ఆ తర్వాత ఆర్యులు భారతదేశం లోనికి ప్రవేశించడంవల్ల ద్రావిడులు తిన్నగా ఉత్తర భారత దేశంనుండి తడలు, తడలుగా (గుంపులు గుంపులుగా) దక్షిణ భారతదేశానికి వచ్చి స్థిరపడ్డారని కొన్ని పరిశోధనా సిద్ధాంతాలవల్ల తెలుస్తోంది. వ్యవసాయమే ప్రధానంగా కలిగిన ద్రావిడులకు సఫలతమీద ఎంతో మక్కువ. అందుకే వారు సృజన దేవతలుగా స్త్రీలను ఎన్నుకున్నారు. అబోతును, లింగాన్ని సృజన శక్తికి ప్రతీకలుగా భావించారు. ఇలా ప్రాచీన మానవులు వ్యవసాయ ప్రారంభ దశలో సఫలతను ఆరాధించే విధానం అవలంబించడంవల్ల మాతృదేవతారాధన మొదలైంది.

ప్రాచీన మానవుల్లో మాతృస్వామిక వ్యవస్థ వ్యవహారంలో ఉండేది. స్త్రీ పురుషులకు నియమ నిబంధనలు, కట్టుబాట్లు లేకపోవడంవల్ల వారి

[2] Mohenjodaro and the Indus Civilization, Sir Johan Marshall; Page-52.

సంయోగం వల్ల కలిగిన సంతానాన్ని స్త్రీ సంరక్షించుకునేది. తల్లే ఇంటి పెద్ద, యజమానురాలు. పుట్టిన బిడ్డల్ని తల్లిద్వారానే గుర్తించేవారు. సంతానానికి తల్లి పేరు సంక్రమిస్తుంది. ఎవరు తండ్రో తెలిసేదికాదు. ఒకవేళ స్పష్టంగా తెలిసినా తండ్రికి ఎలాంటి బరువు బాధ్యతలూ ఉండేవికావు. తల్లి ఆస్తి పిల్లలకు సంక్రమిస్తుంది. ఇలాంటి పరిస్థితుల ప్రభావం వల్ల స్త్రీపై గౌరవం ప్రేమానురాగాలు, భయభక్తులు ఏర్పడ్డాయి. పైగా సఫలతకు స్త్రీని ప్రతీకగా గుర్తించడంతో స్త్రీకున్న విలువ రెట్టింపు అయ్యింది. "భూమికి గల శక్తులన్నియు భామలకు గలవని ఆదిమ మానవుల విశ్వాసము. సంతానమును సృష్టించు స్త్రీ, వ్యవసాయ సంపదనధికము చేయునని మాతృస్వామిక వ్యవస్థలోని నమ్మ-కము...... సంతానవతి, గర్భిణి స్త్రీ, సుక్షేత్రము ఈ మూడు అద్భుత శక్తులను పొందునవియే అని వారి విశ్వాసము. సృష్టికి కావలసిన శక్తులు పృథ్వియందు, స్త్రీ యందు కలవని నాటి మానవుల భావన" [3]. అందుకే స్త్రీ శక్తి స్వరూపిణిగా మారింది. సృష్టికి స్త్రీ మూలమనే వాదం వల్ల స్త్రీ మూర్తులను దేవతలుగా చేసుకున్నారు. తాము పండిస్తున్న పంట అధికంగా ఉత్పత్తి అవ్వాలని స్త్రీ దేవ-తలను ఆరాధించే వాళ్ళు నాటి మానవులు. ఆహారం కోసం సంచార జీవితాన్ని గడుపుతూ, అడవులు, కొండల్లో తిరిగి జంతువులను వేటాడి కష్టమైన బ్రతుకును బ్రతికేకన్నా వ్యవసాయంచేస్తూ జీవనాన్ని సాగించాలని తలచారు పురాతన మానవులు. నదీతీరాల వెంబడి అనువైన ప్రదేశాలను ఎన్నుకొని, అడవుల్ని నరికి వ్యవసాయాన్ని మొదలు పెట్టారు. వ్యవసాయం కోసం సంఘాలుగా ఏర్పడిన నాటి మానవులు ఇటుకలతో ఇండ్లు కట్టుకొని గ్రామాలను ఏర్పరుచు కున్నారు. సఫలతను గురించి తెలుసుకున్న మానవులు తమకు కావలసిన మాంసం కోసం గొర్రెలను పెంచడం ప్రారంభించారు. పశువులను మచ్చిక చేసుకొని పాలను స్వీకరిస్తూ, వాటిని వ్యవసాయపు పనులకు వినియోగించడం మొదలు పెట్టారు. పొలం దున్నడానికి నాగలిని కనిపెట్టారు. స్త్రీలు కనిపెట్టిన వ్యవసాయాన్ని పురుషులు ఇలా అభివృద్ధి పరిచారు. వ్యవసాయం స్త్రీలు చేస్తున్నంత వరకు అప్పటి సమాజాలు మాతృస్వామిక వ్యవస్థలో ఉండేవి. పురుషులు వ్యవసాయాన్ని చేపట్టిన తరువాత పితృస్వామ్య వ్యవస్థ అమలులోకి వచ్చింది. గ్రామాలు ఏర్పడిన తరువాత అనేక కట్టుబాట్లు, ఆచారాలను ఏర్పరచుకొన్నారు ఆనాటి మానవులు. వ్యవసాయంలో ఉపయోగించే నాగలిని ఇనుముతో చేయడం నేర్చుకొన్న తర్వాత అనాగరిక దశ నుండి మానవులు 'నాగరిక దశ' లోకి అడుగు పెట్టారు.

---

[3]. తెలుగు జానపద సాహిత్యము-పురాగాథలు : డా. రావి ప్రేమలత పుటలు: 166-167.

మాతృస్వామిక వ్యవస్థనుండి పితృస్వామిక వ్యవస్థలోకి అడుగుపెట్టినా పాత వ్యవస్థ ప్రభావాన్ని పూర్తిగా మార్చుకోలేక పోయారు. వ్యవసాయ దేవతలుగా స్త్రీ మూర్తులే కొనసాగారు. మెక్సికో, టోంగో, గ్రీకు, రోమన్, ఈజిప్టు దేశాలలో వ్యవసాయ దేవతలు స్త్రీలే. " All over the world, the gods of war or mostly male, while the agricultural deities are, for the most part, female; and this naturally arises from the fact that war is the business of men, whereas, among primitive people, the cultivation of the fields was largely left to the women, and also from the fact that the idea of fertility is naturally connected with the female. All over southern India, therefore, the village deities are almost exclusively female." [4] ఆర్యులు యుద్ధోప జీవులు, పశుపాలకులు. వీరిది పితృస్వామిక వ్యవస్థ. వీరు ఆరాధించే దేవతలు వరుణుడు, ఇంద్రుడు, పృథ్వి, ఆకాశం, వాయువు మొదలైనవారు ప్రకృతికి చెందినవారే. ఆర్యులు వ్యవసాయాన్ని వృత్తిగా అవలంబించిన తర్వాత వీరుకూడా వ్యవసాయ దేవతలను స్త్రీ మూర్తులుగానే ఆరాధించారు. వీరిలో కాళి, దుర్గ, ఆదిశక్తి వంటి వారున్నారు.

ప్రాచీన ఆదిమ మానవుడు ఆరాధించిన శక్తి దేవత లేదా మాతృదేవతే గ్రామ దేవత. శక్తి ఆరాధనా పద్ధతి (Sakti cult) ప్రాచీన కాలం నుండి హిందువులలో ఉంది. "Sakti attained the highest position in the Puranas where she was enlisted in the Trinity along with Vishnu and Siva" [5] సింధు నాగరికతలో వేదాలలో కూడా శక్తి ఆరాధనా పద్ధతులను మనం గమనించ వచ్చు. మన పురాణాలలో శక్తి దేవతలను గూర్చి కొనియాడి వారి విశిష్టతను గూర్చి విపులీకరించబడి ఉంది. శక్తిదేవత స్త్రీ మూర్తి. ఇలాంటి శక్తి దేవతలను గూర్చి దేవీ భాగవతం, దేవీ పురాణం, కాళికా పురాణం, మహాభాగవత పురాణాలలో, శక్త్యు పనిషత్తుల్లో విశదీకరించబడి ఉంది. ఇలాంటి మాతృశక్తి దుర్గ, చండి, పార్వతి, భైరవి, కాళిక వంటి పేర్లతో వ్యవహరింపబడుతూ, అనార్యుల దైవమైన శివుని భార్యగా గుర్తింపు పొందింది. తర్వాత ఈ మాతృశక్తిని ఆర్యదైవాల కోవలోకి చేర్చి ఆర్యుల, అనార్యుల మత సమైక్యతకు పురాణాలు దోహదపడ్డాయి. అలాగే తంత్ర శాస్త్రాలను వృద్ధి చేశాయి. ద్రావిడుల 'అమ్మ' శబ్దానికి మారురూపాలుగా ఉమా, అంబికా వంటి పేర్లు ప్రాచీన సంస్కృత సాహిత్యంలో స్థిరపడ్డాయి. తర్వాత వీరత్వంగల దుర్గగా మార్కండేయ పురాణంలో, దుర్గా సప్తశతిలో కీర్తించబడి ఉంది. ఇలా వివిధ

---

4. The Village gods of South India; Henry Whitehead, pages-17-18.

5. Sakti cult in Ancient India, P XV. Dr. Pushpendra Kumar.

పురాణాలలో కీర్తించబడి ఈమె ఆర్యదేవతల కోవలోకి చేరి తగిన స్థానాన్ని సంపాదించుకుంది. వివిధ పేర్లతో పిలువబడే గ్రామ దేవతలు దుర్గాదేవి అవతారంగా భావించబడి శివుని భార్యగా స్థానాన్ని ఏర్పచుకున్నారు.

వ్యవసాయ మూలంగా గ్రామాలు ఆవిర్భవించి, వ్యవసాయ దేవతలే గ్రామదేవతలుగా మార్పు చెందారు. " Probably these village deities came into being at the period when the people began to settle down in agricultural communities." [6] భారతదేశంలోని ప్రజలు అత్యధిక శాతం గ్రామాల్లోనే నివసిస్తున్నారు. గ్రామ దేవతలు తమ గ్రామాన్ని తల్లిలాగా కాపాడుతారని, ఆగ్రహిస్తే కరువు కాటకాలు, ఈతిబాధలు సంభవిస్తాయని, పశు వ్యాధులు, మశూచి, కలరా, ప్లేగు వంటి అంటు రోగాలు ప్రబలుతాయని ప్రజలు నమ్ముతారు. తమ గ్రామాల్లో ఏదైనా అంటువ్యాధులు సంభవించినప్పుడు, వర్షాలు పడక పంటలు పండనప్పుడు, పశువులు రోగాలతో మరణిస్తున్నప్పుడు తమ ఊరి గ్రామ దేవతను శాంతింపజేసి, ఆమె అనుగ్రహం పొందడానికి జాతరలు, ఉత్సవాలు, వేడుకలు వంటివి చేస్తారు. "The object of their religion was to propitiate these innumerable spirits." [7] గ్రామస్థులకు భక్తి కంటే భయమే ఎక్కువ. గ్రామ దేవతలు అనుగ్రహిస్తే పంటలు బాగా పండుతాయని, పశుసంపద బాగా అభివృద్ధి చెందుతుందని, తమ గ్రామాన్ని దుష్ట శక్తుల నుండి కాపాడుతారని, గ్రహబాధలు లేకుండాచేస్తారని, అంటువ్యాధులను నివారిస్తారని ప్రజల విశ్వాసం. గ్రామ దేవతల జాతరల్లో, ఉత్సవాల్లో, వేడుకల్లో జంతు బలులు ఉంటాయి. కారణం ప్రతి గ్రామ దేవతకు రక్తపానం ప్రీతికరమైనదిగా ప్రజలు భావించడమే. జంతువులలో ప్రధానంగా దున్నపోతులు, గొర్రెలు, మేకలు, కోళ్ళను గ్రామదేవతల ఉత్సవ సమయాల్లో అర్పిస్తారు. దున్నపోతులను బలిచేసే ముందు వాటికి వేపాకు మండలను హారంలా కట్టి పసుపు కుంకుమలను పూసి డప్పులు కొడ్తూ, దున్నపోతులను 'కిల కిల' అని అరుస్తూ ఊరేగిస్తారు. ఊరేగింపులో నిమ్మకాయలను కోసి విసిరేస్తుంటారు. "During the procession the people flourish sticks and swords and spears to keep off the evil spirits, and for the same purpose, cut limes in half and throw them up in the air. The idea is that the greedy demons will clutch at the golden

---

[6] The Village Gods of South India; Henry Whitehead, Page-11.

[7] Ibid; Page-11.

limes and carry them off, and so be diverted from any attack on the man who carries the image." [8] ఈ బలి తతంగంలో హరిజనులే ప్రధాన పాత్ర వహిస్తారు. బలి చేసిన తరువాత గ్రామదేవత ముందు దున్నపోతు తలను పెట్టి, దాని కుడికాలును నరికి దాని నోట్లో ఉంచి, దాని నెత్తిన దీపం వెలిగిస్తారు. బలి జంతువు రక్తంతో అన్నాన్ని కలపడాన్ని 'బలిఅన్నం' అంటారు. ఊరి పొలిమేరల్లో, పంటపొలాల్లో ఇండ్లపైన బలి అన్నం చల్లితే గ్రామ దేవత వాటిని రక్షిస్తుందని గ్రామస్థుల నమ్మకం

కొన్ని గ్రామ దేవతల పేర్లు అర్థవంతంగా కనిపించినా కొన్ని పేర్లకు అర్థాల్ని విడమరచి చెప్పలేము. ప్రతి పేరుకు చివర 'అమ్మ' అనే శబ్దం చేరి ఉంటుంది. ఉదా:- గంగమ్మ, వేశాలమ్మ, పోలేరమ్మ, అంకాళమ్మ, నేరేళ్ళమ్మ, ముత్యాలమ్మ.

గ్రామదేవతల పేర్లు, పూజా విధానం గ్రామాలను బట్టి, ప్రాంతాలను బట్టి కూడా మారవచ్చు. ఒక ప్రాంతంలో ఉండే గ్రామదేవతల పేర్లు, పూజావిధానం మరో ప్రాంతంలో ఉండే గ్రామవాసులకు తెలియక పోవచ్చు. అలాగే గ్రామదేవతల కథల్లో కూడా ఎన్నో భేదాలు ఉండొచ్చు. రాయలసీమలో పోలేరమ్మ, మావూరమ్మ, మారెమ్మ, మాతమ్మ, గంగమ్మ, అంకాళమ్మ, ఎల్లమ్మ, దేశమ్మ వంటి దేవతలున్నారు. తెలంగాణాలో ఈదెమ్మ, మహంకాళి, పోచమ్మ, మైసమ్మ, ముత్యాలమ్మ, బాలమ్మ, గుండలమ్మ, మూరమ్మ, మారెమ్మ వంటి దేవతలున్నారు. సర్కారు ప్రాంతంలో గంటలమ్మ, చల్లలమ్మ, మావిళమ్మ, ముత్యాలమ్మ, యాపారమ్మ, అంకమ్మ, గంగమ్మ, పోలేరమ్మ వంటి గ్రామదేవతలున్నారు. గ్రామదేవతలు వివిధ గ్రామాలలో వివిధ రూపాలను, ఆచారాలను, కట్టుబాట్లను కలిగి ఉన్నారు. గ్రామదేవతల్లో ఎంత వైవిధ్యం ఉన్నా వీరిలో కొన్ని సమాన లక్షణాలు కూడా ఉన్నాయి. గ్రామస్థులను బట్టి, ప్రాంతాలను బట్టి, ప్రజల్ని బట్టి, ఆచరించే విధానంలో మార్పులున్నా గ్రామదేవతల ఆవిర్భావ లక్ష్యం ఒకటే కాబట్టి ఆచరించే విషయాలలో, ఆచారాలలో సామ్యం కనిపిస్తుంది.

గ్రామదేవతలు విగ్రహ రూపంలో ఉండాలని గాని, వారికి గుళ్ళు ఉండాలని గాని నియమం లేదు. చిన్న చిన్న రాళ్ళకు పసుపు కుంకుమలు పూసి, వాటిని గ్రామదేవతలుగా తలచి గ్రామ పొలిమేరల్లో చెట్టు కిందనో, చెరువు కట్ట మీదనో తూర్పు ముఖంగా నెల కొల్పబడి ఉంటారు. వీటికి

8. The Village Gods of South India; Henry Whitehead, Page-49.

మూడు వైపుల పెద్ద పెద్ద బండలను నిలబెట్టి, దానిపైన పెద్ద బండరాయిని కప్పుగా పెడ్తారు. దీనినే గుడి అంటారు. గ్రామదేవతల గుడులు సామాన్యంగా వేప చెట్ల కిందే ఉంటాయి. " సాధారణముగా గ్రామదేవతల గుడి, చిహ్నము, ప్రతిమ, వృక్షముల క్రిందనే నెలకొని యుండును. ఆదిమ మానవునకు వృక్షమే ఆశ్రయమిచ్చెను. ఆత్మారాధన దశలో ఆత్మ వృక్షములను ఆశ్రయించునని నమ్మబడి అవి పూజ్యనీయమను భావన ప్రాచీన మానవునిలో ఏర్పడెను. వృక్షముల క్రింద దేవతలను నెలకొల్పుట సింధు నాగరికత కాలపు నాటికే కలదని త్రవ్వకముల వలన ఋజువగు చున్నది. చెట్టు క్రింద కొమ్ములున్న దేవతయు, ఆమె ముందు మోకాళ్ళ పైన వంగి నమస్కారము చేయుచున్న భక్తుని చిత్రము, హరప్పా, మొహెంజోదారోలో లభించిన ఫలకములపై కలదు. మరియొక చిత్రములో గుర్తు తెలియని చెట్టుపైన జంతువు తల కలిగిన రూపములు కలవు." [9] గ్రామదేవతల ఆలయాలు కొన్ని చోట్ల పెద్ద కట్టడాలతో ఉంటాయి. కొన్ని ప్రాంతాలలో మట్టి కుండలను ఉంచి వాటిని గ్రామదేవతలుగా భావిస్తారు. కొన్ని ఆలయాల్లో రాతితో చెక్కబడిన విగ్రహాలను అమర్చి వాటికి చీరలను ధరింపజేసి, నగలను కూడ అలంకరిస్తారు. ఉదా:- తిరుపతి గంగమ్మ, కొల్లేరులోని పెద్దింట్లమ్మ ఆలయాలు. కొన్ని గ్రామదేవతలకు ఎటువంటి గుళ్ళు కట్టకూడదనే నియమాలు కూడా కొన్ని గ్రామాల్లో వున్నాయి. వానల కోసం కప్పాలమ్మ అనే గ్రామదేవతను పూజిస్తారు. కప్పాలమ్మకు ఎండకు ఎండి, వానకు తడవడం ఆచారమని ప్రజల నమ్మకం. గ్రామ పొలిమేరలోని పొలంలో ఒక రాతి రూపంలో దిబ్బపై కప్పాలమ్మ ఉంటుంది.

వైదిక మత దేవతలకు పూజారులుగా బ్రాహ్మణ కులస్థులే అర్హులు. కాని గ్రామదేవత లకు హరిజనులు, చాకలి, మంగలి, పంబల, కుమ్మరి, గొల్ల వంటి కులాల వారు పూజారులుగా ఉంటారు. ఒక్క తంజావూరు ప్రాంతంలోగల మరియమ్మ ఆలయంలోనే బ్రాహ్మణ పూజారులున్నారు. " About three miles from Tanjore, too, there is a temple of mariamma served by Brahman priests. But no animal sacrifices are offered at the central shrine where Brahmans minister. In one corner of the temple area there is a separate shrine with an image of Mariamma where animals are regularly sacrificed; but at this shrine no Brahmans officiate. I believe that it is the only temple or shrine of Mariamma in south India

9 తెలుగు జానపద సాహిత్యము -పురాగాథలు; రావి ప్రేమలత, పుట-172.

where there are Brahman priests."[10] గ్రామదేవతలపై ఉండే భయ భక్తుల వల్ల గ్రామస్థులు తమ పిల్లలకు గ్రామదేవతల పేర్లను పెట్టడం ఆచారంలో ఉంది. ఉదా :- మారమ్మ, మారయ్య, గంగమ్మ, గంగయ్య, ఎల్లమ్మ, ఎల్లయ్య, చౌడమ్మ, చౌడయ్య.

గ్రామదేవతలు మొదట ఒక ప్రాంతానికి, ఒక కులానికి పరిమితమై తరువాత ప్రాచుర్యం పొంది అన్ని ప్రాంతాల వారికి, అన్ని కులాల వారికి పూజనీయులైనారు. " జానపద మాతృదేవతలను పరిశీలించిన యెడల, ఒక్కొక్క దేవత ఒక్కొక్క ప్రదేశమునకో, కులమునకో సంబంధించినదై వెలసి, తదుపరి ప్రాచుర్యమునంది దేశము నలుమూలల నుండి యేతెంచెడి వ్యక్తులచే పూజింపబడుట కాన్పించును. బెజవాడ కనకదుర్గ, శ్రీశైల భ్రమరాంబ, కొల్హాపుర లక్ష్మి, మాహురమ్మ మొదలగు శక్తులు ఆయా స్థలముల యందు నెలకొన్న మాతృదేవతలు. మారమ్మ, ఎల్లమ్మ, మాహురమ్మ యని పిలువబడు రేణుక మాదిగ వారి కులదైవము కాగా, గంగ గొల్లవారి దేవత. ఈదెమ్మ గౌండ్ల వారి దేవత." [11] గ్రామ దేవతలను శాంతింప జేయడానికి జాతరలను జరిపిస్తుంటారు. ఒక్కో గ్రామ దేవత ఒక్కో స్వభావం కలదిగా భావిస్తారు. కొన్ని గ్రామదేవతలు ఒకే స్వభావాన్ని కలిగి ఉండొచ్చు. అనేక ప్రాంతాలలో గ్రామదేవతలు సప్త సంతానమని భావిస్తారు. అంటే ఏడుగురు అక్క దేవతలని అంటారు. అన్ని చోట్లా ఈ ఏడుగురు అక్కదేవతల పేర్లు ఒకేలాగా ఉండవు. ఒక్కో చోట ఒక్కో రకమైన పేర్లుంటాయి. వీరికి తోడు పోతురాజు అనే మగ గ్రామ దేవతను సృష్టించారు మన పల్లీయులు. ఈ పోతురాజును గ్రామ దేవతలకు తమ్ముడుగాను, మరికొన్ని ప్రాంతాలలో భర్తగాను వ్యవహరిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రధాన గ్రామ దేవతలు ఎల్లమ్మ, పోచమ్మ, పోలేరమ్మ, అంకమ్మ, ఈదెమ్మ, మైసమ్మ, చౌడమ్మ, ముత్యాలమ్మ, గంగమ్మలు.

1.1.1 ఎల్లమ్మ:- ఎల్లమ్మ అనే గ్రామదేవతను మాతమ్మ, మాహురమ్మ, రేణుకమ్మ, అక్కలిదేవమ్మ, ఏకవీరమ్మ అనే పేర్లతో కూడ వ్యవహరిస్తారు. ఎల్లమ్మ కథలు ఒక్కో ప్రాంతంలో ఒక్కో రకంగా ఉన్నాయి. జమదగ్ని భార్య అయిన మారెమ్మ ఆకాశంలో విహరిస్తున్న గంధర్వుల అందచందాలను చూసి మనసులో మెచ్చు

[10] The village gods of south India; Henry Whitehead page-19.

[11]. తెలుగు జానపద గేయ గాథలు; డా. నాయని కృష్ణకుమారి, పుట-192.

కుంటుంది. జమదగ్ని మారెమ్మ మనసులోని విషయాన్ని దివ్య దృష్టితో గ్రహించి తన కుమారుడైన పరశురాముని పిలిచి మారెమ్మను వధించమంటాడు. ఈ విషయం తెలిసిన ఒక మాదిగ స్త్రీ మారెమ్మను కౌగిలించుకొని దుఃఖిస్తుంటుంది. తండ్రి ఆజ్ఞను తోసెయ్యలేక పరశురాముడు తన తల్లిని ఖండిస్తాడు. మారెమ్మతో పాటు మాదిగ స్త్రీ తల కూడ ఖండించబడుతుంది. జమదగ్ని తన ఆజ్ఞను శిరసావహించిన కుమారుణ్ణి చూసి ఏదైనా వరం కోరుకోమంటాడు. పరశురాముడు తన తల్లిని మళ్లీ బ్రతికించ మంటాడు. అందుకు జమదగ్ని ఒప్పుకుంటాడు. పరశురాముడు తొందర పాటుతో తన తల్లి మారెమ్మ తలను మాదిగ స్త్రీ మొండానికి, మాదిగ స్త్రీ తలను తన తల్లి మొండానికి జత చేస్తాడు. పరశురాముని తల్లి మొండెము, మాదిగ స్త్రీ తల కలసి ఎల్లమ్మగా, పరుశురాముని తల్లి తల, మాదిగ స్త్రీ మొండెము కలసి మారెమ్మగా పునరుజ్జీవింపబడతారు. ఎల్లమ్మకు దున్నపోతులును, మారెమ్మకు మేకపోతుల్ని, కోళ్ళను బలులుగా సమర్పిస్తారు. మారెమ్మనే ప[illegible]మ్మ అని కూడా వ్యవహరిస్తారు.

'క్రీడాభిరామం' లోని కింది పద్యంలో ఎల్లమ్మ అనే ఏకవీర ప్రసక్తి ఉంది. అలాగే బవనీండ్లు, వీరినే బైనూరోళ్ళు లేదా బైండ్లవాళ్ళు అని కూడా అంటారు. వీరు జమిడికలను వాయిస్తూ ఎల్లమ్మ, పరశురాముని కథలను చెప్పడాన్ని కూడా కింది పద్యంలో ప్రస్తావించబడి ఉంది.

" కక్షనిక్షిప్త వికస్వర స్వర విలా
 స శ్రీనివాసంబు జవని కందుఁ
గట్టిన తంత్రికిఁగంఠ శ్రుతికిఁగూడఁ
 జొక్కంబుగా నారి సొబగు మీఱ
నాలాపములు శుద్ధ సాళవ సంకీర్ణ
 వివిధ రాగంబుల చవులు చూపి
డమడమ ధ్వనులఁబొటారించి యెడనెడఁ
 గత్తెర మార్గంబు బిత్తరిల్ల

వాద్య వైఖరిఁగడు నెఱవాది యనఁగ
నేక వీరా మహాదేవి యెదుట నిల్చి
పరశురాముని కథలెల్లఁబ్రౌడి బాడె
జారుతర కీర్తి బవనీల చక్రవర్తి" [12]

పైగ్రంథంలోనే 'కాకతమ్మకు సైదోడు ఏకవీర ' అని ప్రస్తావించబడిన పద్యాన్ని గమనించండి -

"పద్మలోచన భృగు బ్రహ్మ సంయమి వంశ
పరిపాటి కభినవాభరణ మయ్యె
రమణి త్రేతా ద్వాపరముల సంధ్యావేళ
మగనితోఁబెక్కేండ్లు మనువు మనియె
నెలత కానక కన్న నెయ్యుంపుఁగొడుకుచేఁ
జంపించె ముయ్యేడు సారె నరులఁ
దరుణి హైహయ రాజ దంతాస్థి పటలంబు
గవడ పేరుగఁజేసి కట్టెనయుత

మండపాకను, బెనుఁబాక, మాహురమున
నాగవరమునఁబోలాసననిచె నింతి
యోరుఁగంట వసించె నీలోత్పలాక్షి
కాకతమ్మకు సైదోడ యేకవీర" [13]

అలంపూర్‌లోని బ్రహ్మేశ్వరాలయంలో తలలేని నగ్న దేవత విగ్రహం ఉంది. ఈమెను స్థానికులు ఎల్లమ్మ, రేణుకమ్మ అని అంటారు. పరశురాముడు తన తండ్రి ఆజ్ఞను శిరసా వహించి తల్లి అయిన రేణుక తలను ఖండించగా ఆమె తల మాదిగ వాడలో పడిందని మొండెం అక్కడ ఉందని జనం వ్యవహరిస్తుంటారు. ఎల్లమ్మ మాహూర్ అనే గ్రామంలో నెలకొనడం వల్ల ఈమెను మాహూరమ్మ అని అంటారు.

---

12. క్రీడాభిరామం. శ్రీనాథుడు (వినుకొండ వల్లభరాయుడు) పద్యం-130.
13. Ibid, పద్యం-128.

ఎల్లమ్మ గ్రామాన్ని రక్షించడమే కాకుండా సంతానాన్ని ప్రసాదిస్తుందని, చర్మ వ్యాధుల్ని, కండ్ల కలకల్ని నివారిస్తుందని ప్రతీతి. కలలో పాములు కనిపిస్తే కూడా ఈ దేవతకు పూజలు చేస్తారు.

1.1.2. పోచమ్మ:- గ్రామాన్ని, ప్రజల్ని పోషించు అమ్మనే 'పోచమ్మ' అని అంటారు. ఈమెనే కాళి అని కూడ అంటారు. పోచమ్మ ఆగ్రహిస్తే స్ఫోటకం వస్తుందని విశ్వసిస్తారు. స్ఫోటకం వచ్చినప్పుడు అమ్మవారు, ఆట పాటలమ్మ, అమ్మతల్లి, తట్టుతల్లి వచ్చిందని అంటుంటారు. ' పోచమ్మ పోసింది' అని కూడ జన వ్యవహారంలో ఉంది. ఇలా స్ఫోటకము వ్యాపించినపుడు పోచమ్మను శాంతింప జేయడానికి బలులను సమర్పించి ఆమెను ఆరాధిస్తారు. అమ్మవారు వ్యాపించినపుడు భయపడి గ్రామాన్ని వదలి పోతే పోచమ్మ వెంటాడుతుందని ప్రజల నమ్మకం. ఒకానొకప్పుడు ఒక గ్రామంలో స్ఫోటకం వ్యాధి వల్ల అనేకులు మరణించారు. ఈ అమ్మవారి ప్రభావం నుండి తప్పించుకోవడానికి ఒకామె తన ఒక్కగానొక్క కుమారుణ్ణి తీసుకొని గ్రామాన్ని వదిలి పెట్టి పోయింది. అలా చాలా దూరం పోయాక ఒక అడవిలో ఒక ముసలామె ఎదురై వాళ్ళను ఎక్కడకు పోతున్నారని ప్రశ్నిస్తుంది. అందుకు ఆమె అమ్మవారి చూపు తమ మీద పడకుండా ఉండాలని, గ్రామాన్ని వదలి పోతున్నామని సమాధానం చెబుతుంది. అది విని ముసలామె తన తల్లో పేలు చాలా ఇబ్బంది కరంగా ఉన్నాయని కాస్త పేళ్ళను కుక్కి వెళ్ళమని కోరుతుంది. అప్పుడు పేళ్ళను కుక్కడానికి ముసలమ్మ కొప్పు విప్పగానే తలనిండా కండ్లు కనిపిస్తాయి. ఆ ముసలామే పోచమ్మని తెలుసుకొని మన్నించమని ప్రాధేయపడి తిరిగి తమ గ్రామాన్ని చేరుకుంటారు. ఇలా పోచమ్మకు సంబంధించి అనేక రకాలైన కథలు జన వ్యవహారంలో ఉన్నాయి.

1.1.3. పోలేరమ్మ :- గ్రామ పొలిమేరలో ఉండి గ్రామాన్ని రక్షించే దేవతనే 'పోలేరమ్మ' అని అంటారు. ఈ దేవత దుష్ట శక్తుల్ని గ్రామంలోకి అడుగు పెట్ట నీయకుండా అడ్డు కుంటుందని ప్రజల విశ్వాసం. శంకరుడు రాక్షసులతో యుద్ధం చేయడానికి బయలు దేరుతాడు. మార్గమధ్యంలో శంకరుని చెమట బిందువులు కిందపడడం వల్ల, చెమట నుండి ఒక బాలిక ఉద్భవించి, ఏడవడం ప్రారంభిస్తుంది. యుద్ధానికి అంతరాయం కలుగుతుందని, శివుడు ఆబాలికను ఒక గోతిలో పూడ్చి వెళ్తాడు. ఆబాలికను తినడానికి నక్క వచ్చి గోతిని తవ్వుతుంది. అందులో వేయికళ్ళుగల ఏడేళ్ళ బాలికను చూసి శరణు వేడుతుంది. అప్పుడు ఆ బాలిక, నక్క కలసి శంకరునితో యుద్ధభూమికెళ్తారు. యుద్ధంలో రాక్షసుల రక్త బిందువుల నుండి అనేక మంది రాక్షసులు ఉద్భవించ

సాగారు. శివునికి రాక్షసులను జయించలేని పరిస్థితి ఎదురవుతుంది. అప్పుడు బాలిక అయిన పోలేరమ్మ రాక్షసుల రక్తం కిందపడకుండా ఉండడానికి తన నాలుకను యుద్ధ భూమి నిండా పరుస్తుంది. దాంతో శివుడు రాక్షసులందరినీ సంహరిస్తాడు. నక్క రాక్షసుల శవాలను తినేస్తుంది. ఇలా పోలేరమ్మ కథలు ఎన్నో రకాలుగా జన వ్యవహారంలో ఉన్నాయి.

1.1.4. అంకమ్మ:- కలరా వంటి అంటు రోగాలను వ్యాపింప జేసే దేవతే అంకమ్మ. ఈమె అనుగ్రహం ఉంటే పశువులను, గ్రామ ప్రజలను రక్షిస్తుందని ప్రజల విశ్వాసం. అంకమ్మకు సంబంధించి కూడా అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. ఒక కథలో అంకమ్మ వల్ల బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులు జన్మిస్తారు. ముగ్గురూ పెరిగి పెద్దవుతారు. అంకమ్మ ముగ్గురికి మూడు నగరాలను నిర్మిస్తుంది. తనకొక నగరాన్ని నిర్మించుకొని కుమ్మరి, మంగలి, చాకలి వాళ్ళను కాపలాగ నియమిస్తుంది. త్రిమూర్తులు అంకమ్మకు పూజలు చేయక ఆమెను నిర్లక్ష్యం చేస్తారు. అందుకు అంకమ్మ ఆగ్రహించి బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులను, వారితో పాటు ఏడుగురు రాజుల తలలను ఖండించి ఆ తరువాత మళ్ళీ బ్రతికిస్తుంది. ఇలా అంకమ్మపై అనేక ప్రాంతాల్లో అనేక కథలున్నాయి.

1.1.5. ఈదెమ్మ:- గ్రామదేవత అయిన ఈదెమ్మ ఆగ్రహిస్తే గ్రామాన్ని, గ్రామస్థులను ఇబ్బందుల పాలు చేస్తుందని ప్రజల నమ్మకం. అందుకే ఈమె అనుగ్రహం పొందడానికి పూజలు చేస్తారు. ఈదెమ్మ తెలంగాణాలో ప్రధాన గ్రామదేవత. ఈదెమ్మకు సంబంధించి ప్రచారంలో ఉన్న కథ-- రాజ్యాధికారానికి వచ్చిన మాంధాత ఈదెమ్మ మహిమల్ని కించ పరచి అవమానిస్తాడు. ఈదెమ్మ మారు వేషంలో రాజు దగ్గరికెళ్ళి జూదంలో రాజును ఓడించి, రాజు కుటుంబాన్ని అడవుల పాలు చేస్తుంది. అడవుల్లో రాజు తిండి కోసం వ్యవసాయం చేయదలచి, కొడవలిని పట్టాడు. తిండి గింజలు తెచ్చేటప్పుడు ఈదెమ్మ వాటిని మాయం చేస్తుంది. రాజకుమారులు ఆకలికి అలమటిస్తున్నప్పుడు తనను శరణు వేడమని రాజును అడుగుతుంది. రాజు స్త్రీ దేవతలకు మొక్కనంటాడు. మళ్ళీ అష్టకష్టాలను పెట్టి, రాజును వాళ్ళ కుటుంబాన్ని వేరు చేస్తుంది. చివరలో శివుడు తన భక్తుడైన రాజును, అతని కుటుంబాన్ని ఒకటి చేస్తాడు.

1.1.6. మైసమ్మ:- మహిష అమ్మనే మైసమ్మ అంటారు. మైసమ్మ ప్రధానంగా పశువుల దేవత. పశువ్యాధులు సోకకుండా ఉండడానికి మైసమ్మను పూజిస్తారు. సంతానం కోసం కూడ మైసమ్మను పూజిస్తారు. మైసమ్మకు దున్నపోతులను

బలి చేస్తారు. మైసమ్మ తెలంగాణాలో ప్రధాన గ్రామదేవత.

1.1.7. చౌడమ్మ:- చౌడమ్మను చాముండేశ్వరి, చౌడేశ్వరి, చండి, భగళాముఖి, చాముండి, మహిషాసుర మర్ధిని, దుర్గేశ్వరి అనే పేర్లతో కూడ వ్యవహరిస్తుంటారు. తొగట కులస్థులు చౌడమ్మను ప్రధానంగా పూజిస్తుంటారు. మహిషాసురుని కుమార్తె అయిన ఆదిశక్తి పితృ గండం వల్ల రాతి పెట్టెలో భూస్థాపితం చేయబడుతుంది. శివుడు రాక్షసులతో యుద్ధం చేసేటప్పుడు అతని చెమట బిందువులు భూస్థాపితం చేయబడిన రాతి పెట్టెను తాకి అందులో నుండి భయంకర రూపిణి అయిన చౌడేశ్వరి ఉద్భవిస్తుంది. శివుడు ఆమెకు వివిధ ఆయుధాలను ప్రసాదిస్తాడు. చౌడేశ్వరి తర్వాత అంధకాసురుడు, మహిషాసురుడు వంటి రాక్షసులను సంహరిస్తుంది. చౌడమ్మకు ప్రతి ఏటా జాతరలను జరిపిస్తుంటారు.

1.1.8. ముత్యాలమ్మ:- ఈమె కూడ ప్రసిద్ధ గ్రామదేవతే. ముత్యాలమ్మ 'అమ్మవారు' పోస్తే వొళ్ళంతా ముత్యాల్లా ఉంటుందని, ఈమెకు మైల తగిలితే ఒళ్ళంతా పొంగి పోతుందని అంటారు.

1.1.9. గంగమ్మ:- గంగమ్మ రాయలసీమలో ప్రసిద్ధ గ్రామ దేవత. గంగమ్మ గుడులు ఊరి పొలిమేరలో గాని, ఊరు మధ్యలోగాని, చెరువు కట్ట మీదగాని, చెట్టు కింద గాని ఉంటాయి. గంగమ్మ అనే పేరును బట్టి ఈమె జలదేవతని తెలుసుకోవచ్చు. వ్యవసాయం లేకపోతే గ్రామాలు లేనట్లే, గంగ (నీరు) లేకపోతే వ్యవసాయం కూడా ఉండదు. మానవులకే కాదు సమస్త జీవరాశికి గంగ (నీరు) ప్రధానం. నీటినుండే జీవరాశులు ఏర్పడ్డాయి. అదే నీరు కలుషితం అవడం వల్ల అనేక రోగాలు ప్రబలి జన నాశనం, పశునాశనం జరుగుతోంది. సకాలంలో వర్షాలు పడక పోతే పంటలు పండవు. ఇలా నీటికున్న ప్రాధాన్యం వల్లే గంగమ్మ అనే గ్రామదేవత అవతరించిందని చెప్పవచ్చు.

గంగమ్మను వివిధ ప్రాంతాలలో వివిధ పేర్లతో కూడా వ్యవహరిస్తుంటారు. పాచికాల్వ గంగమ్మ, బాట గంగమ్మ, గంగానమ్మ, పెద్దగంగమ్మ, చిన్నగంగమ్మ అని, అలాగే ఊర్ల పేర్లు, చెరువుల పేర్లు ముందు పెట్టి ఎర్రదొడ్డి గంగమ్మ, తాళ్లపాక గంగమ్మ, తాతయ్య గుంట గంగమ్మ అని కూడా అంటారు. కొన్ని ప్రాంతాల్లో కొందరు గంగమ్మలు గొల్ల కులస్థులకు కుల దైవాలు. కాటమరాజు కథల్లోని కంసుని కథలో గంగావతరం గూర్చి వివరించబడి ఉంది. శ్రీ కృష్ణుడు దేవకి అష్టమ గర్భంలో జన్మిస్తాడు. వసుదేవుడు శ్రీ కృష్ణుణ్ణి రేపల్లెకు తీసుకొని వచ్చి యశోద ప్రక్కన పడుకోబెడతాడు. యశోద పక్కన

బాలికగా ఉన్న యోగమాయ కృష్ణుణ్ణి చూసి నవ్వి తర్వాత ఏడుస్తుంది. శ్రీ కృష్ణుడు యోగమాయతో కంసుణ్ణి ఎదిరించమని, మరుజన్మలో గంగాదేవిగా అవతారమెత్తి యాదవులకు మహిమను చూపించమని చెప్తాడు. గంగ పేరును, శివుని పేరును పృథ్విపై శాశ్వతంగా నిలచి పోయేటట్లు చేస్తానని శ్రీకృష్ణుడు అంటాడు. గంగాదేవి తన అన్న శ్రీ కృష్ణుడు చెప్పిన మాటలకు ఉప్పొంగి పోతుంది.[14]

అందరు గ్రామదేవతల్లా గంగమ్మ ఆగ్రహిస్తే కూడా మశూచి, కలరా వంటి అంటురోగాలు, కరువు కాటకాలు, పశువుల వ్యాధులు వస్తాయని, గ్రామానికి అరిష్టం కలుగుతుందని ప్రజల విశ్వాసం. గంగమ్మ అనుగ్రహిస్తే అన్నీ సవ్యంగా ఉంటాయని భావిస్తారు. గంగమ్మను శాంతింప జేయడానికి సంవత్సరానికొక్కమారు జాతరలు, పరసలు, తిరునాళ్ళను జరిపిస్తారు. 'అమ్మవారు' పోస్తే బాగా నయమైన తరువాత పూజలు చేస్తుంటారు. అన్ని చోట్ల ఆరాధింపబడే గ్రామదేవతలు అరుదు. అందులో గంగమ్మ రాయలసీమ అంతటా, సర్కారు ప్రాంతంలోను, తెలంగాణాలో అక్కడక్కడా ఆరాధింపబడుతోంది. ఇలా ఆవిర్భవించిన గ్రామదేవతలలో గంగమ్మ ప్రాధాన్యం అధికంగా ఉంది.

14. వీరగాథలు (రెండవ సంపుటం) తంగిరాల సుబ్బారావు, డా. చవ్వాప్రగడ తిరుపతి రావు, పుట: 802-805.

# 2. తిరుపతి గంగమ్మ

తిరుపతి ప్రపంచంలోనే ప్రసిద్ధ పుణ్య క్షేత్రం. భారతదేశం నలు-మూలల నుండి ఎందరో యాత్రికులు తిరుపతికి వచ్చి శ్రీవేంకటేశ్వర స్వామిని దర్శించి, తరించి పోతుంటారు. తిరుపతిలో శ్రీవేంకటేశ్వర స్వామితో పాటు ఇక్కడ అనాది నుండి గ్రామదేవతలు కూడా నెలకొని ఉండడం గమనించదగిన విషయం. తిరుపతి పరిసర ప్రాంతాల వారు, స్థానికులు శ్రీవేంకటేశ్వరుణ్ణి ఎంతగా ఆరాధిస్తారో, తిరుపతి గ్రామదేవతైన గంగమ్మను కూడా అంతే భయభక్తులతో పూజిస్తారు. వెంకన్నకు ప్రతి సంవత్సరం జరిగే బ్రహ్మోత్సవం ఎంత ప్రసిద్ధమో, తిరుపతిలో ఏటా జరిగే గంగజాతర కూడా స్థానికంగా అంతే ప్రసిద్ధం.

రాయలసీమలో ప్రసిద్ధ గ్రామదేవత గంగమ్మ. ముఖ్యంగా చిత్తూరు జిల్లాలో ప్రధాన గ్రామదేవత గంగమ్మ. చిత్తూరు జిల్లా అంతటా వ్యాపించి ఉన్న గంగమ్మకు ప్రతి సంవత్సరం జాతరలు జరిపిస్తూండడం పేర్కొనదగింది.

2.1. చిత్తూరు జిల్లాలో గంగమ్మ ఉన్న ఊర్లు:- చిత్తూరు జిల్లాలో కుప్పం తాలూకాకు చెందిన కంచి బందార్ల పల్లి, చీకటి పల్లి, యామగాని పల్లి,రాళ్ళ బుదుగూరు; చంద్రగిరి తాలూకాలోని అక్కారంపల్లి, అగరాల, అవిలాల, ఆరేపల్లి, ఐతేపల్లి, కరకంబాడి, కావేటి గారి పల్లి, కొండిరెడ్డి కండ్రిగ, కొటాల, గాజుల మండ్యం, గురవరాజు పల్లి, గొల్ల పల్లి, చిగురువాడ, జక్కిదోన, తండ్లం, తొండ-వాడ, దుర్గసముద్రం, నరసింగాపురం, పుదిపట్ల, పుల్లయ్యగారి పల్లి, భీమవరం, మల్లవరం, మిట్టపాళ్యం, రంగంపేట, రెడ్డివారి పల్లి, రేణిగుంట, శానంబట్ల, శెట్టిపల్లి; చిత్తూరు తాలుకాకు చెందిన అంగళ్ళు, అనంత్ పురం, కమ్మపల్లి, కుక్కల పల్లి, చిట్టపర, చిత్తూరు, తిమ్మపల్లి, తూంగుండ్రం, బండపల్లె, భాకర నరసింగరాయని పేట, మహాదేవ మంగళం, మాధవరం, రామాపురం; చిన్న గొట్టిగల్లు తాలూకా లోని చిన్న గొట్టిగల్లు, తిప్పిరెడ్డి గారి పల్లి, బద్దల వారి పల్లి, కుమ్మరి పల్లి, చట్టి వారి పాళెం; తంబళ్ళపల్లి తాలూకాకు చెందిన గోపిదిన్నె గ్రామం, ఉప్పలూరి వారి పల్లె; తొట్టంబేడు తాలూకా లోని మహంకాళిదేవి పుత్తూరు,వికృతమాల, ముసిలిపేడు, కందాడ; నగరి తాలూకాకు చెందిన ముడిపల్లి, తెరణి, సత్రవాడ; పలమనేరు తాలూకాలోని కీలపల్లి, నెల్లిపట్ల, పడిగల కుప్పం, పలమనేరు, సెట్టిపల్లి; పుంగనూరు తాలూకాకు చెందిన కంభం వారి పల్లి, కందూరు, కొప్పల్లె, పుంగనూరు; పుత్తూరు తాలూకా లోని

అంబరమహారాజుపురం, అగరం, ఎర్రమరాజుపల్లి, కుప్పం, బాదూరు, గుండ్రాజు కుప్పం, చిన్నతయ్యూరు, చుట్టుగుంట రామాపురం, నడవలూరు, పూడి, మాంగాడు; బంగారు పాళ్యం తాలూకాకు చెందిన కామినాయని పల్లి, గొల్లపల్లి, దిగువతడకర, పుత్తూరు, పుల్లూరు, మట్టపల్లి; మదనపల్లి తాలూకా లోని ముస్తూరు; వాయల్పాడు తాలూకాకు చెందిన మంచూరు, మేడికుర్తి, చింతపర్తి; సత్యవేదు తాలూకాలోని కీలపూడి, కొత్తూరు, చిలమత్తూరు, సిండ్ర, సీర్వాయి, పిచ్చాటూరు, సత్యవేదు; శ్రీకాళహస్తి తాలూకాకు చెందిన చిన్న సింగమల, చిట్టత్తూరు, జంగాల పల్లి, పునుబాక వంటి ఎన్నో గ్రామాలలో గ్రామదేవతగా గంగమ్మ ఆరాధింపబడుతోంది.

2.2. చిత్తూరు జిల్లాలో గంగమ్మకున్న పేర్లు :- కుప్పం తాలూకాలోని కెంచన బలియ గ్రామంలో తిరుపతి గంగమ్మ, కుప్పంలోని శ్రీ ప్రసన్న తిరుపతి గంగమాంబ, వొంటి పల్లిలో శ్రీ రాళ్ళ గంగమాంబ, కమతమూరులో దండు గంగమ్మ; చంద్రగిరి తాలూకా లోని అవిలాలలో అవిలాల గంగమ్మ, తిరుపతి లో తాతయ్యగుంట గంగమ్మ, తాళ్ళపాక గంగమ్మ, కరకమాని గంగమ్మ, ధనకొండ గంగమ్మ, నడీధి గంగమ్మ, వేమూరులో ధనకొండ గంగమ్మ, చంద్రగిరిలో మిట్ట గంగమ్మ, అగరాలలో అరిమేని గంగమ్మ; చిత్తూరు తాలూకా అంబోధర పల్లిలో మరానా గంగమ్మ, ముక్కంటిట్టూరులో ముక్కమారి గంగమ్మ, అనంత్‌పురం, అరతాలలో అరతాల గంగమ్మ; పలమనేరు తాలూకాలోని బైపగారి పల్లిలో పెద్దపులి గంగమ్మ; పుంగనూరు తాలూకా కందూరులో కందూరు గంగమ్మ, అమ్మగారి పల్లిలో శక్తి గంగమ్మ, కొత్తపల్లిలో బురుజుగంగమ్మ, కొప్పర్లెలో బండి గంగమ్మ, పుంగనూరులో సుగుటూరు గంగమ్మ; పుత్తూరు తాలూకాలోని మాకుల పల్లిలో అరిమాను గంగమ్మ, కేశవ రాజు పుర అగ్రహారంలో ఎంతల గుంట గంగమ్మ; మదన పల్లి తాలూకా ముది వేడులో బురుజు గంగమ్మ, బాట గంగమ్మ; తంబళ్ళ పల్లి తాలూకా గోపిదిన్నె గ్రామం, ఉప్పలూరి వారి పల్లిలో గిండి గంగమ్మ; వాయల్పాడు తాలూకా చింత పర్తిలో కుంటి గంగమ్మ; శ్రీ కాళహస్తి తాలూకా ముసిలి పేడులో నల్ల గంగమ్మ, శ్రీ కాళహస్తిలో ఏడుగురుగంగమ్మలు, పిడసగంగమ్మ, సరస్వతి కండ్రిగలో శాంతాళిగంగ వంటి ఎన్నో పేర్లతో గంగమ్మ వ్యవహరింపబడుతూ ఆరాధించబడుతోంది.

2.3. తిరుపతి గంగమ్మ చారిత్రిక విశేషాలు :- గంగమ్మ ఆంధ్రదేశంలో ప్రత్యేకించి రాయల సీమలో ఎంతో ప్రసిద్ధి చెందినా, ఆమెకు తిరుపతిలో ఉన్నంత ప్రాధాన్యం, ప్రాశస్త్యం, వైవిధ్యం, మరెక్కడా లేదు. గంగ జాతర

తిరుపతిలో జరిగినంత వైభవంగా ఎక్కడా జరగదు. 'తిరుపతిలో ప్రధాన గ్రామదేవతగా పూజలందుకుంటున్న ఈ గంగమ్మ ఎంతో చరిత్రను కలిగి ఉంది. తిరుపతిలో గంగమ్మ రెండు పేర్లతో వ్యవహరింపబడుతూ పూజలందుకుంటూ ఉంది. ఒకరిని తాళ్ళపాక గంగమ్మ, మరొకరిని తాతయ్య గుంట గంగమ్మ అని అంటారు. తాళ్ళపాక గంగమ్మను పెద్ద గంగమ్మఅని, తాతయ్య గుంట గంగమ్మను చిన్న గంగమ్మ అని కూడా అంటారు.తాళ్ళపాక గంగమ్మ గుడి తాళ్ళపాక చెరువు గట్టు మీద ఉంది. ప్రస్తుతం ఈ తాళ్లపాక చెరువులోనే ఆర్.టి.సి. బస్టాండు నిర్మించబడి ఉంది. బస్టాండుకు ముందున్న ప్రధాన రహదారి కూడలిలో ఈ తాళ్లపాక గంగమ్మ (పెద్దగంగమ్మ) ఆలయం ఉంది. తాతయ్యగుంట గంగమ్మ గుడి మహావీర్ టాకీసుకు వెనుక పక్క, తుడ (తిరుపతి పట్టణాభివృద్ధిసంస్థ) ఆఫీసుకు ముందు వైపు ఉంది. అంటే మల్లయ్య గుంట కట్టకు, తాతయ్య గుంట కట్టకు మధ్యలో తాతయ్య గుంట గంగమ్మ (చిన్నగంగమ్మ) ఆలయం ఉంది. ప్రజలు తాతయ్య గుంట గంగమ్మకే అధిక ప్రాధాన్య మిచ్చి ఆరాధిస్తారు.

చారిత్రక ఆధారాలను పరిశీలిస్తే పదకవితా పితామహుడైన అన్నమాచార్యుడు క్రీ.శ. 15వ శతాబ్దంలో కడప జిల్లా రాజంపేట సమీపంలోని తాళ్లపాక గ్రామం నుండి తిరుపతికి వచ్చి శ్రీవేంకటేశ్వరుణ్ణి తన సంకీర్తనలతో కీర్తిస్తూ పరమ భక్తుడయ్యాడు. ఆనాడు అన్నమయ్యను మెచ్చుకొని పాలకులో, భక్తులో, దేవాలయాధికారులో ఒక పెద్ద చెరువును, దాని కిందవున్న భూములను, తోటలను భగవంతుని కైంకర్యం కోసం అన్నమాచార్యునికి యినాంగా ఇచ్చారు. అప్పటినుండి ఆ చెరువుకు తాళ్లపాక చెరువనే పేరు వచ్చింది. అప్పటికే ఆ చెరువు గట్టు మీద ఉన్న పెద్ద గంగమ్మ,'తాళ్లపాక గంగమ్మ'గా వ్యవహరింప బడుతూ వచ్చింది. అదే విధంగా వైష్ణవ మహాచార్యుడైన తాతాచారికి కైంకర్యార్థం లభించిన చెరువుకు తాతయ్యగుంట అనే పేరు ఏర్పడింది. తాతయ్యగుంటను ఆనుకొని ఉన్న చిన్న గంగమ్మకు 'తాతయ్యగుంట గంగమ్మ' అనే పేరు వచ్చింది. కానీ తాళ్లపాక గంగమ్మే తిరుపతికి మొదటి గంగమ్మ అని తెలుస్తోంది.

ఇదే విషయాన్ని వేటూరి ప్రభాకర శాస్త్రి 'అన్నమాచార్య చరిత్రము' " దిగువ తిరుపతి క్షేత్రము పొలిమేరలో తాళ్లపాక గంగమ్మయను గ్రామ దేవత గలదు. తాతాయ గుంట గంగమ్మ అంకాళమ్మ ఇత్యాది నామముల గ్రామ సీమా దేవతలింకను గలరు. అందరకంటెఁదాళ్లపాక గంగమ్మ ప్రాచీన దేవతయట. ఇప్పటికి నాదేవి తిరుపతి పొలిమేరలోనే కలదు. పూర్వము

తిరుపతి యాత్రకు వచ్చు యాత్రికులా క్షేత్ర దేవతనర్చించి క్షేత్ర ప్రవేశము చేయుచుండెడి వారట. అన్నమయు యా దేవతకు మ్రొక్కు చెల్లించెను. తొలుత నా దేవతను తాళ్లపాక యన్నమయ యర్చించుట చేతనేమో యామెకు తాళ్లపాక గంగమ్మ యని పేరయ్యెను. తిరుపతిలో నేఁటేట జరుగు గంగమ్మ జాతర ఈ గంగా నమ్మలకై యేర్పడినదే "[1] అని పేర్కొన్నాడు. దీనిని బట్టి 500 సంవత్సరాలకు పూర్వం నుండే తాళ్ళపాక గంగమ్మ ఆరాధింపబడు తోందని తెలుస్తోంది.

తాళ్లపాక అన్నమయ్య మనుమడైన చిన తిరు వెంగళనాథుడు (చిన్నన్న) రచించిన 'తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము' అనే గ్రంథంలో తిరుపతి ఊరి పొలిమేరలో ఉన్న ఈ గ్రామ దేవతను గూర్చి ఇలా పేర్కొన్నాడు-

"...... వేంకటగిరి యొద్ద నున్నట్టి

పల్లెలో గొల్లల పాలింటి శక్తి

యుల్లారునని మునులని శంబుఁబొగడ

గను పట్టునట్టి యా గ్రామంపు శక్తిఁ

గనుగొని బహు నమస్కారముల్ జేసి"[2]

దీనిని బట్టి పూర్వం భక్తులు తిరుపతి యాత్రకు వచ్చినపుడు ముందు ఈ గ్రామ దేవతైన గంగమ్మను మొక్కి తరువాత తిరుమల కొండ ఎక్కేవారని తెలుస్తోంది. చిన్నన్న చెప్పిన విధంగానే నేడు కూడ తాళ్లపాక గంగమ్మకు గొల్ల కులస్థులు అర్చకత్వం వహిస్తున్నారు.

ఇక తాతయ్య గుంట గంగమ్మ ఏర్పడడం గూర్చి తెలుసు కుందాం -

పూర్వం తిరుమల కొండమీద వేంకటేశ్వరస్వామి చేత ఒక వైష్ణవ భక్తుడు 'తాతా..తాతా..' అని పిలిపించు కొనేవాడట. అప్పటి నుండి ఆ వైష్ణవ భక్తునికి 'తిరుమల తాతాచార్యులు' అనే పేరు ప్రచారంలోకి వచ్చింది. ఆ తరువాత అతని వంశీకులందరికి కూడ 'తాతాచార్యులు' అనే పేరు వాడుకలోకి వచ్చింది. క్రీ.శ. 16 వ శతాబ్దంలో ఒక తాతాచార్యులు తిరుపతి నుండి శిష్య

---

1. అన్నమాచార్య చరిత్రము - వేటూరి ప్రభాకర శాస్త్రి, పుటలు - 6 - 7
2. తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము - తాళ్ళపాక చిన తిరువెంగళనాథుడు ; పుట - 14

సమేతంగా సంచారం చేస్తూ కడప ప్రాంతంలోని ఒక ఊరికి వెళ్లాడట. ఆ ఊరిలో ఒకప్పుడు గంగానమ్మ భయంకరమైన వ్యాధులచే ప్రతి సంత్సరం అనేక మంది ప్రజలను ఆహుతి చేసుకొనేది. ఆమె ఒకసారి జాతర జరుగుతున్నప్పుడు ప్రజలపై జాలిపడి, యేడాది కొకసారి నరబలి యిస్తే ఈ మారణహోమాన్ని ఆపేస్తానని చెప్పిందట. అందుకు ఆ గ్రామస్థులందరూ అంగీకరించడం జరిగింది. అప్పట్నుంచి ఏటేటా ఆ ఊరిలో జాతర జరిగే రోజుల్లో పరాయి ఊరు వాడు ఎవరైనా బాటసారిగా వస్తే వాడిని బలి చేసే వారు. అలా జాతర జరిగే రోజుల్లోనే తాతాచార్యులు ఆ ఊరిక్కి రావడం, గ్రామస్థులకు చిక్కడం జరిగింది. ఆ ఊరి వాళ్ళు గురువుగారిని కోల్పోవడం ఎలాగా అని తటపటాయించారు. ఆ విషయం తెలిసిన తాతాచార్యులు భీమునిలాగా బలి కావడానికి వెళతానని ఆవూరివారికి ధైర్యం చెబుతాడు. బలి కావలిసిన రోజు జాతర జరిగే చోట అష్టాక్షరీ నారాయణ కవచాదులను అనుసంధిస్తూ, కణ కణ నిప్పును రగిలించి శంఖ చక్ర ముద్రలను ఎర్రగా కాల్చి ఉంచాడు. జాతరలో అమ్మవారి పూనకంతో ఒకడు బలి బలి అంటూ వారి మీదికి దూకాడు. ఆచార్యుల వారు పట్టుకార్లతో శంఖ చక్ర ముద్రలను పూనకం వచ్చిన వాని రెండు భుజాల మీద గట్టిగా అంటించ బోయాడు. శివశక్తి పారిపోవడానికి వెనుదిరుగుతుంది. కానీ మంత్ర ప్రభావం వల్ల ఒక్క అడుగు కూడ ముందుకు వేయలేక నిలిచి పోతుంది. ముద్ర వీపుమీదపడుతుంది. 'తాతాచార్యుల ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు' అనే సామెత అప్పట్నుంచి ప్రచారంలోకి వచ్చింది.[3] గంగానమ్మ తాతాచార్యుల వారి కాళ్లపై పడి శరణాగతురాలౌతుంది. ఆమెకు శిష్యతను అనుగ్రహించి ఆచార్యుల వారు తిరుపతికి తీసుకు వచ్చి ఊరి వెలుపల అప్పటికే తను అధీనంలో ఉన్న చెరువు కట్టపై నెలకొల్పుతాడు. ఆ రోజుతో కడప ప్రాంతానికి చెందిన గ్రామస్థులకు ఆమె వల్ల పీడ తొలగి పోయింది. ఆనాటి నుండి తిరుపతిలో తాతాచార్యుల వారి అనుమతి వల్ల ఆమెకు ఏటేటా జంతు బలులతోను, మద్యపు చూఱలతోను జాతర చేయడం ప్రారంభమయింది.[4] తాతాచార్యులు గంగమ్మను కడపనుండి తీసుకొని వచ్చి తన చెరువు కట్ట మీద ప్రతిష్ఠించడం వల్ల ఆమెకు 'తాతయ్య గుంట గంగమ్మ ' అనే పేరు వచ్చిందని చెబుతారు.

---

[3] 'తాతాచార్యుల ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు' అనే సామెత కేవలం గంగమ్మకు సంబంధించి ఏర్పడిందని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే పూర్వం తాతా- చార్యులు వైష్ణవ మత ప్రాముఖ్యం కోసం తిరుపతికి వచ్చే యాత్రికులకు శంఖు, చక్రాల ముద్రలు వేసి వైష్ణవులుగా మార్చేవాడట. దీని వల్ల కూడా పై సామెత ఏర్పడి ఉండొచ్చు.

[4] అన్నమాచార్య చరిత్రము, వేటూరి ప్రభాకర శాస్త్రి ; పుటలు - 6 - 7

18వ శతాబ్దానికి చెందిన ప్రముఖ కవయిత్రి తరిగొండ వెంకమాంబ 'జలక్రీడావిలాసం' అనే యక్షగానంలో తాళ్లపాక గంగమ్మను, తాతయ్యగుంట గంగమ్మను ప్రస్తావించింది. శ్రీ కృష్ణుడు తేళ్లను పట్టుకొని గోపికలకు కుట్టిస్తాడు. దాంతో వాళ్ళకు విషం ఎక్కి చిందు లేస్తుంటే, గోపికల అత్త తేలు మంత్రాన్ని వేయడానికి విభూతిని చేత బట్టి --

" ధూ మాయల మల్లి మళయాళ భగవతీ ! నందవర చౌడేశ్వరీ ! నారాయణ వనం ఆమ్నాయాక్షి ! పరమేశ్వరీ ! శివకంచి యేకామ్రేశ్వరీ ! జంబుకేశ్వరాఖిలాండేశ్వరీ ! అరుణాచలేశ్వర వున్నామలేశ్వరీ ! కాళహస్తీశ్వరాజ్ఞానాంబ ! భక్తజనావలంబ ! సద్గుణ కదంబ ! మదంబ ! చిదంబరేశ్వర శివశంకరీ ! శ్రీశైలభ్రమరాంబ కాలభైరవ ! గణేశ్వరా ! కోళాలమ్మా ! కొల్లాపురెమ్మా ! తాళపాక గంగమ్మ ! తాతయ్యగుంట గంగమ్మా ! మీకు మ్రొక్కేద. యీ కులుకులాడు(ల) సళుకు దించుడు. తరిగొండ నారసింహుని తోడే! నాకు జెప్పిన గురుపాదమానే ! దిగు,దిగూ !"[5]

దీనిని బట్టి తాళ్లపాక గంగమ్మ, తాతయ్యగుంట గంగమ్మలు ఎంత ప్రాశస్త్యం చెందారో అర్థమౌతుంది. ప్రముఖ శక్తి దేవతలతో పాటు ఈ గంగమ్మలను పేర్కొనడం గమనించదగిన విషయం. తాళ్లపాక గంగమ్మ పేరు ముందుగా ప్రస్తావించడం వల్ల తాళ్లపాక గంగమ్మే పూర్వురాలని చెప్పవచ్చు.

ఇంత వరకు ప్రస్తావించిన ఇరువురి గంగమ్మల విషయాలను, తిరుపతిలో ఈ గంగమ్మలుండే పరిసర ప్రాంతాల ప్రభావాలను పరిశీలించి చూస్తే మరి కొన్ని విషయాలు ద్యోతకమవుతాయి.

తిరుపతి మొట్టమొదట చిన్నఊరు. ఈ ఊరిలో గోవిందరాజ స్వామి గుడికి దిగువనున్న బండ్లవీధి, పెద్దకాపువీధి, చిన్న కాపు వీధులలో రైతులు, పసుల కాపరులు కలసి జీవించేవారు. కాపు (రెడ్డి) కులస్థులు రైతులు గాను, గొల్ల కులస్థులు పశుల కాపరులుగాను నేటికీ ఉన్నారు. ఊరికి పొలిమేరలోని ఒక చెరువు కట్ట ( తాళ్లపాక చెరువు) మీద గొల్లలు తమ కులదేవతైన గంగమ్మను ప్రతిష్ఠించి ఆరాధిస్తూ ఉండచ్చు. ఇప్పటికీ కొన్ని ప్రదేశాలలో గంగమ్మకు పూజారులుగా గొల్ల కులస్థులే వ్యవహరిస్తుంటారు. కాటమరాజు కథల్లోని 'గంగావతారం' కథే ఇందుకు నిదర్శనం.[6] యశోద గర్భంలో పుట్టిన

5. జలక్రీడా విలాసము, తరిగొండ వెంగమాంబ; పుట - 83
6. మొదటి అధ్యాయంలో ' గంగమ్మ ' ఉప శీర్షికలో చూడండి.

యోగమాయే తన అన్న శ్రీకృష్ణుని కోర్కెపై మరుజన్మ లో గంగాదేవిగా అవతరిస్తుంది. కాటమరాజు కథలో శ్రీ కృష్ణుడు తన చెల్లెలైన యోగ మాయతో పల్కిన పల్కులు ఇక్కడ పేర్కొనడం సమంజసం --

"శక్తివై యాదవులకు శివశక్తివై నిలచి

..................................................

అమ్మ! నీపేరు గంగాదేవి యనిపింతు

నమ్ము నాపేరు కృష్ణానది యనిపింతు

శక్తి పేర శివశక్తి యనిపింతు

భుక్తి ముక్తులు గలుగు ఈ లోకమందు

కృష్ణవేణి యన్నను కీర్తి లోకముల

బాపుదు ముగ్గురిపేర పాప పరిహారంబౌను

వుప్పొంగి చెల్లెలు వుబ్బుచు నవ్వె"[7]

పై కథలో గమనించ దగిన అంశాలు రెండు ఒకటి - గంగ శ్రీకృష్ణునికి చెల్లెలు. రెండు - యాదవులకు కులదైవం కావడం. ఇలా యాదవుల చేత ఆరాధింపబడుతూ గంగమ్మ తిన్నగా తిరుపతి గ్రామదేవతగా మారి మిగిలిన కులాల వారికి కూడా పూజనీయుమై ఉండొచ్చు. ఈ గంగమ్మకు ఏటేటా జరిగే జాతరలో యాదవుల ప్రాధాన్యాన్ని, ప్రాముఖ్యాన్ని చూసి, గుడి పక్కనే ఉన్న కాపువీధి, బండ్లవీధుల్లోని మోతుబరి, అధిక సంఖ్యాకులైన కాపుల (రెడ్ల)కు చిన్నతనంగా, వెలితిగా తోచి ఉండొచ్చు. లేదా భేదాభిప్రాయాలు, ద్వేషాలు వచ్చి ఉండొచ్చు. సాధారణంగా ఒక్కో ఊరిలో కులాల, వర్గాల పోటీల వల్ల, భేధాభిప్రాయాలవల్ల ఒకే దేవుని పేరు మీద రెండు, మూడు గుడులు కట్టబడి, పూజలు చేస్తుండడం మనం గమనించ వచ్చు. అలాగే తిరుపతిలో కూడా తాతయ్యగుంట కట్ట పక్కనే ఇంకో గంగమ్మను ప్రతిష్టించి ఉండొచ్చు. తాతాచార్యుల' స్థలం కాబట్టి తాతాచార్యుల అనుమతిని, సహకారాన్ని పొంది ఉండొచ్చు. తాతాచార్యుల భూములను పైరు చేసేది అక్కడి కాపులే కాబట్టి అందుకు ఆచార్యులే ముందుండి విగ్రహ ప్రతిష్టాపన చేసి ఉండొచ్చు.

---

7. కాటమరాజు కథలు, (సం) తంగిరాల వెంకటసుబ్బారావు ; పుటలు - 803 - 805



తాతయ్యగుంట గంగమ్మ 'పాతగుడి'



తాతయ్యగుంట గంగమ్మ 'కొత్తగుడి'

కాపువీధికి కుడివైపున తాళ్లపాక గంగమ్మ, ఎడమ వైపున తాతయ్య గుంట గంగమ్మలు చోటు చేసుకోవడం గమనార్హం. అలా పురాతనమైన తాళ్లపాక గంగమ్మ పెద్ద గంగమ్మగాను, తాతయ్యగుంట గంగమ్మ చిన్న గంగమ్మ గాను ఆరాధింపబడసాగారని చెప్పవచ్చు. పెద్దగంగమ్మ, చిన్నగంగమ్మ అనిఅనడాన్ని బట్టి కూడా ఎవరు ముందు వచ్చారో, ఎవరు వెనుక వచ్చారో అర్థం చేసు-కోవచ్చు. ఏడాది కొక్కమారు ఒక వారం రోజుల పాటు జరిగే జాతరలు ఇద్దరు గంగమ్మలకు ఒకే రోజున ప్రారంభమై ఒకే రోజుతో ముగుస్తాయి. తాళ్లపాక గంగమ్మ ప్రధాన కూడలిలో, యాత్రికులు వచ్చే రహదారిలో ఉండడం వల్ల ఎక్కువ మంది జనం వచ్చి పొంగళ్ళు పెట్టుకోవడానికి, జంతు బలులకు, వినోద ప్రదర్శనలకు, ఆటంకాలు కలిగేవి. అందుకని జనం విశాల స్థలం కలిగిన తాతయ్య గుంట గంగమ్మ గుడి ముందర పొంగళ్ళను పెట్టుకొని, జంతు బలులను సమర్పిస్తూ ఉండొచ్చు. అక్కడ వినోద ప్రదర్శనలకు కావలిసినంత స్థలం అనువుగా ఉండేది. పైగా డబ్బున్న మోతుబరి కాపులు గుడి ప్రాంగణాన్ని, పరిసరాలను ఆకర్షవంతంగా తీర్చిదిద్దేవారు. ఇన్ని సదుపాయాలు, ఆకర్షణలు ఉండడం వల్ల తాతయ్య గుంట గంగమ్మ కే ప్రాధాన్యం హెచ్చి ఉండొచ్చు. పూజలు, మొక్కుబళ్ళు, జాతర, జనం అంతా తాతయ్య గుంట గంగమ్మ చుట్టే కేంద్రీకరింపబడింది. క్రమంగా తాళ్లపాక గంగమ్మ ప్రాముఖ్యం పూర్తిగా తగ్గి పోయి ఉండొచ్చు. కానీ నేటికీ తాళ్లపాక గంగమ్మకు పూజలు, జాతర సాంప్రదాయకంగా జరుగుతున్నా అది కేవలం నామ మాత్రంగానే మిగిలింది. తాళ్లపాక గంగమ్మకు కనీసం ఇప్పుడున్న విధంగానైనా పూజా పునస్కారాలు, జాతరలు జరగాలన్నా అక్కడ రైతులను కలగలుపుకొని పోవాల్సిన అవసరం ఏర్పడింది. తిన్నగా తాళ్లపాక గంగమ్మ గుడిలో అర్చకత్వం నెరపడానికి రెడ్డి కులస్థులకు కూడా స్థానమిచ్చారు. ప్రస్తుతం తాళ్లపాక గంగమ్మకు అర్చకత్వాన్ని గొల్ల, కైకల, రెడ్డి కులస్థులు కలసి నెరపుతున్నారు. ఇలా చివరికి చిన్న గంగమ్మే అసలు సిసలు గంగమ్మగా వ్యవహరింపబడుతోంది.

తిరుపతి గంగమ్మ శ్రీవేంకటేశ్వరస్వామి చెల్లెలుగా అనాది నుండి భావింపబడుతోంది. నేటికీ ప్రతి సంవత్సరం తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయం నుండి గంగమ్మ గుడికి, గంప, చేట పట్టుశేష వస్త్రం, పసుపు కుంకుమలు వస్తున్నాయి.

విష్ణు అవతారమైన శ్రీ వేంకటేశ్వర స్వామి ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు. తిరుమల శ్రీవారి ఆలయంలో శ్రీ కృష్ణుని విగ్రహం కూడా ఉంది. శ్రీ కృష్ణ జయంతి రోజు శ్రీ వేంకటేశ్వరునికి తిరుచ్చిన ఊర్ ఉడయన్

క్రీ. శ. 1488 లో నైవేద్యాలు ఏర్పాటు చేసినట్లు శాసనం ఉంది. అలాగే బ్రహ్మోత్సవాల్లో ఐదవ రోజు శ్రీకృష్ణునికి నైవేద్యం ఏర్పాటు చేశారు. తిరుమలలో జరిగే తెప్పోత్సవాల్లో ఒక రోజు శ్రీ కృష్ణుడు కూడా పూజలందుకుంటాడు. ధనుర్మాసంలో నెలరోజులు ఏకాంత సేవలో శ్రీవారికి బదులు శ్రీకృష్ణుడు పవళిస్తాడు. తిరుమల శ్రీవారి ఉత్సవాల్లో ఏకాదశి, శ్రావణం, రోహిణీ నక్షత్రంలో కృష్ణుని ఉత్సవం జరుపుతారు కూడా. కాటమ రాజు కథల ప్రకారం గంగమ్మ శ్రీ కృష్ణుని చెల్లెలు. బహుశా అందుకేనేమో శ్రీవారి ఆలయం నుండి ఆమెకు ప్రతి సంవత్సరం చేట, గంప, శేషవస్త్రం, పసుపు కుంకుమలను పంపుతున్నారు. అలాగే తిరుచానూరులో ప్రతి సంవత్సరం పద్మావతీ దేవి అమ్మవారికి పంచమి చక్ర తీర్థం జరుగుతుంది. ఆరోజు తిరుమల శ్రీవారి ఆలయం నుండి ఏనుగుపై పసుపుముద్దను తిరుచానూరుకు పంపుతారు. పసుపు ముద్ద తిరుమల నుండి తిరుచానూరు చేరుకున్నాకే అమ్మవారి చక్రస్నానం జరుగుతుంది. పసుపు ముద్ద తిరుచానూరు వెళ్ళేటప్పుడు, మార్గమధ్యంలో తాళ్లపాక గంగమ్మ గుడి ముందు ఆపి పూజారులు, దేవస్థానం అధికారులు తాళ్లపాక గంగమ్మకు కొబ్బరి కాయ కొట్టి హారతిచ్చి తర్వాత వెళ్ళడం గమనార్హం.

తిరుమలేశుని ఆలయం నుండి గంగమ్మకు చేట, గంప, శేషవస్త్రం, పసుపు కుంకుమలు రావడానికి కారణం ఇంకో రకంగా కూడా భావించ వచ్చు. పూర్వం యాదవులు తిరుపతి నుండి పశువులను మేపు కోవడానికి తిరుమల కొండకు వెళ్ళి, అక్కడ వాళ్ళు సరస్సు పక్కనున్నచింత చెట్టు కింద నల్లని రాతి విగ్రహాన్ని ఉంచుకొని పూజించే వారట. బహుశా ఆదేవత శక్తి స్వరూపిణి కావచ్చు. ఈ శక్తి స్వరూపిణి తిరుపతి గ్రామ దేవతైన గంగమ్మకు తోబుట్టువుగా వారు భావించి ఉండొచ్చు. అందుకే తిరుమల శ్రీవారి ఆలయంలో ప్రతి గురువారం తెల్లవారు జామున తిరుప్పావడ ఉత్సవంలో శక్తి దేవతలకు వేసినట్లు కుంభాన్ని వేయడాన్ని మనం నేటికీ చూడొచ్చు. ఈ" ఉత్సవంలోని కుంభం - పావడ, శక్తి పూజను గంగ జాతరను గుర్తుకు తెస్తాయట".[8] కొందరు శ్రీ వేంకటేశ్వర స్వామిని బాలా త్రిపుర సుందరి అని అంటారు. శక్తి స్వరూపం కాబట్టే బాలాజీ అనే పేరు కూడా వచ్చిందంటారు. క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దానికి చెందిన ' తొల్ కాప్పియమ్ ' అనే తమిళ భాషా లక్షణ గ్రంథంలోను, సంగం సాహిత్యంలోను తిరుపతి కొండల్ని 'వేంగడమ్'అని ప్రస్తావించడం వల్ల అప్పటికే తిరుపతి కొండలు చాలా ప్రాశస్త్యం చెందినట్లుగా భావించవచ్చు. కానీ

---

8. శ్రీనివాస మంగాపురం మరియు మన ఆలయముల చరిత్ర, గోపికృష్ణ ;పుట-273



గంగమ్మ మూల విగ్రహానికి అటు,ఇటు పదహారు మంది బిడ్డలున్న దృశ్యం



కైకలవాళ్ళ ఇంట్లోని గంగమ్మ, పోతురాజు, పాళెగాడు ప్రతిమలు

అక్కడ వెలసిన దేవుని పేరు మాత్రం చెప్పబడలేదు. అయితే 7వ శతాబ్దం నుండి వెంకటాచలం ప్రసిద్ధి చెందుతూ వచ్చింది. "తిరుమల శ్రీవారి ఆలయములోని మూర్తి బుద్ధ విగ్రహమని కొందరి అభిప్రాయము. జన విగ్రహము అనగా జైన తీర్థంకరులలో నొకరి విగ్రహమని మరికొందరి అభిప్రాయము. క్రీస్తు పూర్వము వైష్ణవము వ్యాపింపలేదన్న సంగతి ఈ అభిప్రాయమునకు తావొసగు చున్నది. ఇంతకూ, ఆదేవదేవునికి విష్ణువని, కుమార స్వామియని, శ్రీరాముడని, మహాదేవుడని, శ్రీ బాలా త్రిపుర సుందరియని "[9] అంటుంటారు. పైగా శ్రీవారి విగ్రహం ఆగమ శాస్త్రానికి అనుగుణంగా లేదు.

తాళ్లపాక అన్నమయ్య కూడా తన సంకీర్తనలో తిరుమల వాసుని గూర్చి ఎలా వర్ణించాడో గమనించండి-

" ఎంత మాత్రమున నెవ్వరు దలఁచిన అంతమాత్రమె నీవూ

అంతరాంతరము లెంచి చూడఁబిండంతె నిప్పటి యన్నట్లూ ॥ ప ॥

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని

పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మ మనుచు

తలఁతురు మిము శైవులు తగిన భక్తులను శివుడనుచు

అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవుఁడనుచు ॥ఎంత ॥

సరి నెన్నుదురు శాక్తేయులు శక్తి రూపు నీ వనుచు

దరిసెనముల మిము నానా విధులను తలఁపుల కొలఁదుల భజింతురు"[10].

తిరుమల దైవం ఎన్ని విధాలుగా మారినా, చివరకు వేంకటేశ్వర స్వామిగా స్థిర పడినా, ఆరాధనాక్రమంలో మార్పు రాలేదు. ఇందుకు నిదర్శనం నేడు కూడా శ్రీవారి గుడి తలుపులను తెరచేది, మూసేది గొల్ల కులస్థుడే. శ్రీవారి పార్వేట సమయంలో గొల్లవాడే విల్లంబులను పడ్తాడు. ఆరోజు స్వామి వారికి నైవేద్యాన్ని కూడా వండి పెడతాడు. ఆను వంశికంగా ఈ పనిని నిర్వహించే వానిని 'గొల్లసుద్ద' అని అంటారు.

---

9. శ్రీనివాస మంగాపురం మరియు మన ఆలయముల చరిత్ర , గోపికృష్ణ ; పుట-17

10. అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తనలు, రేకు - 179

దీనిని బట్టి గొల్ల కులస్థులచే మొట్ట మొదట పూజింపబడిన తిరుమలేశుడు, గంగమ్మ తోబుట్టువులుగా భావించడం వల్ల వేంకటేశ్వరస్వామికి చెల్లెలుగా తిరుపతి గంగమ్మ వ్యవహరింపబడుతూ ఉండొచ్చు.

జానపదగేయాలను పరిశీలించి కూడా వేంకటేశ్వరుడు, గంగమ్మల అనుబంధాన్ని తెలుసుకోవచ్చు. ఒక జానపద గేయంలో-

పేరూరమ్మకు, శేషాచలపతికి ఏడుగురు కొడుకులు. వాళ్ళు పెద్ద ఓబులన్న, చిన్న ఓబులన్న, మద్దిలేటన్న, పెంచల నరసింహ, కదిరి నరసింహ, గోవిందరాజు, వేంకటేశ్వరుడు. అన్నలు ఆరుమందికీ తగిన చోటు దొరుకుతుంది. అందరికన్నా చిన్న వాడైన వేంకటేశ్వరుడు తాను నివసించడానికి తగిన స్థలం వెదుక్కోవడానికని తన తల్లి పేరూరమ్మ దగ్గర శెలవు పుచ్చుకొని బయలు దేరుతాడు. ఎంత వెదికినా తనకు తగిన స్థలం దొరకదు. అలా వెదుక్కొంటూ 'మూడిగుంట'[11] గంగమ్మ దగ్గర కొచ్చి తనకు తగిన స్థలం ఎక్కడుందో చెప్పమంటాడు. తనకు తగిన చోటు చూపిస్తే-

> " నా పాదానికి గెట్టి సోటు నాకు జూపిస్తేను
>
> నీకు సమ్వత్సానికి ఒక్క దినము జాతర జేపిస్తూ
>
> నీకు దున్నపోతులు గండబియ్యాలు ఆహారామిస్తూ"[12]

అని వెంకన్న గంగమ్మతో అంటాడు.

అలాగే మరో గేయంలో వేంకటేశ్వరుడు గంగమ్మకు ఏడేళ్ళ పిల్లవాడుగా ఎదురవుతాడు. ఆపిల్లవాడిని చూసిన గంగమ్మ ఎవరని నిలదీస్తుంది. కొత్త మనిషి ఊరిలోకొస్తే ప్రశ్నించడం మామూలే. కింది గేయ భాగాన్ని గమనించండి-

> "(నా) సూలాలయో సీర కట్టి కత్తుల రైకేసి
>
> (నా) ఏడేళ్ళ పిల్లోడయ్యా ఎదురయ్యా నాడే
>
> (నా) యే వూరు ఏ పల్లి గాదా ఏ పిల్లావాడా

---

[11] బహుశా ' మూడు గుంట'లనే 'మూడిగుంట' అని ఉండొచ్చు. అవి తాళ్ళపాక చెరువు, తాతయ్యగుంట, మల్లయ్య గుంటలు. అవి మూడు ఒక దాని పక్కన ఒకటున్నాయి. ఈ మూడు గుంటల వొడ్డునే గంగమ్మలు వెలకొని ఉన్నారు.

[12] లక్ష్మమ్మ, సరోజమ్మ, రాజమ్మ; శానంబట్ల, చంద్రగిరి మండలం



తాతయ్యగుంట గంగమ్మ మూల విగ్రహం
ముక్కు నోక్కు పోయివున్న దృశ్యం



గంగమ్మ గుళ్ళో 50 ఏళ్ళ నుండి పూజలు చేస్తున్న
తిరుమల శెట్టి రామయ్య (కుడివైపు),
ఎండోమెంట్ వారి బ్రాహ్మణ పూజారి

నేను పిల్లవాడినే గాదే గంగా సేంతాళ్ళాగంగా

(నా) యేదు కొండల పయ్యన్నేను ఎయ్యంకాటేశు"

అని వేంకటేశ్వరుడు గంగమ్మతో చెబుతాడు. తిరుపతి గ్రామ రక్షకు-రాలైన గంగమ్మను ప్రసన్నం చేసుకోవడానికి కాబోలు వెంకన్న ఇలా వాగ్దానం చేస్తాడు.

" (నా) తాతాయ్ గుంటా కట్టా మిందా గుళ్ళే గట్టించీ

(నా) సమ్మత్రానికి ఒక్కొ దినము జాతర జేపిచ్చి

(నా) అవిస్యాకుయో ఆరిక్కూళ్ళే వడ్లారాశిలో

(నా) మాటలాడలా వెంకాటేశు మాయామైనాదే"[13]

ఇలా జానపద గేయాల్లో వేంకటేశ్వర స్వామి గంగమ్మకు జాతర జరిపిస్తానని మాట ఇచ్చినట్లు పేర్కొనబడి ఉంది. ఏది ఏమైనా తిరుమలేశుని ఆలయం నుండి ప్రతి సంవత్సరం తిరుపతి గంగమ్మకు పసుపు కుంకుమలు వస్తున్నాయి. దీనికి పైన పేర్కొన్న అంశాలే కారణాలని చెప్పవచ్చు.

2.4. తాతయ్య గుంట (చిన్న) గంగమ్మ ఆలయ విశేషాలు:- ఎన్నో వందల సంవత్సరాల నుండి తిరుపతి ప్రజల పూజలందుకుంటున్న తాతయ్య గుంట గంగమ్మకు మొదట ఆలయం లేదట పూర్వం చిన్న గంగమ్మ రాతి విగ్రహం వేప చెట్టుకింద ఉండేదని చెప్తుంటారు. తర్వాత చాలా కాలానికి చిన్న గంగమ్మకు నాలుగుకాళ్ళ రాతిమండపాన్ని కట్టించారు. మూడు పక్కలా గోడను కట్టి, తూర్పు దిశగా ఆలయం నిర్మించారు. ఆ తర్వాత కొంత కాలానికి మరో నాలుగుకాళ్ళ రాతి మంటపాన్ని ముందున్న మండపానికి ఆనించి కట్టి గుడిని పెద్దది చేశారు. ఆలయం ముందు వైపు మైదానంలో మరో నాలుగ్గాళ్ళ రాతి మండపాన్ని నిర్మించారు. వీటిని ఎవరు నిర్మించారో ఇదమిత్థంగా తెలియదు . గంగమ్మ గుడి ముందున్న ఖాళీ ప్రదేశమంతా పేరేడు మాన్లతో వేపచెట్లతో నిండి ఉండేది. ముందు, వెనుక తాతయ్య గుంట, మల్లయ్య గుంటలుండేవని తెలిసిందే. గంగమ్మ రాతి విగ్రహం తల, చెవులు కంఠం వరకే వుంటుంది. కొంతకాలం క్రితం కిరీటం, పెద్ద చెవులను వెండి కిరీటం (వెండి తొడుగు) కోసం సిమెంట్‌తో చేశారు. గంగమ్మకు కోరలున్నాయి. గంగమ్మ విగ్రహం

13. వెంకటమ్మ, శావంబట్ల (చంద్రగిరి మండలం).

కుడి, ఎడమల వైపున్న రెండు రాతి విగ్రహాలు గంగమ్మను పోలే ఉన్నాయి. వీటితో పాటు గంగమ్మ పక్కన అటు,ఇటు చిన్న చిన్న రాతి బొమ్మ తలలు, నాగపడగల శిల్పాలు వంటి విగ్రహాలున్నాయి. గంగమ్మ పక్కనుండే విగ్రహాలను గంగమ్మ (పెద్దగంగమ్మ) బిడ్డలు అంటారు. గంగమ్మ విగ్రహం పక్కన మొత్తం పదహారు విగ్రహాలున్నాయి. ఒక పక్క ఎనిమిది విగ్రహాలు, మరోపక్క ఎనిమిది విగ్రహాలున్నాయి. గంగమ్మ గుడి ముందున్న తాతయ్య గుంటలోనికి వెళ్ళడానికి రాతి మెట్లు గుంటకు మూడు వైపులా ఉండేవి. తాతయ్య గుంట కట్ట మీద, దక్షిణం వైపు రాతిమండపం ఉండేది, ఇప్పటికీ రాతిమండపం అలాగే ఉంది.

ఏభై సంవత్సరాలకు ముందు రత్నవేలుశెట్టి మొదలియారు అనే భక్తుడు, కంసాలిల నుండి గుడి పూజా కార్యక్రమాల బాధ్యతను స్వీకరించి, గంగమ్మకు పూజలు చేయడం మొదలు పెట్టాడు. ఆయనతో పాటు మరో భక్తుడు, తిరుమలశెట్టి రామయ్య అనే బలిజ కులస్థుడు కూడా పూజా కార్యక్ర-మాల్లో పాల్గొని మొదలియారుకు సహకరించేవాడు. రోజూ గంగమ్మకు పూజలు చేసేవారు. రత్నవేలు ఉన్నప్పుడు మంగళ, శుక్రవారాల్లో పాలతో గంగమ్మను అభిషేకించేవారు. ప్రతిరోజు మధ్యాహ్నం పూట ఇంటినుంచి కొంత అన్నం తెచ్చి నైవేద్యం పెట్టి వెళ్ళేవారు. సాయంత్రం గుడి నుంచి వెళ్ళేటప్పుడు గంగమ్మకు కట్టిన చీరను, వెండి కళ్ళను, పూజా సామగ్రిని ఇంటికి తీసుకెళ్ళేవారు. ఇనుప గేటు ఉన్నా దాన్ని లాగేసి ఇతరులు లోనికెళ్ళేవారు. ప్రస్తుతం ఆ భయం లేదు.

ముప్పై సంవత్సరాలకు ముందు గంగమ్మ గుడికి ఇనుప గేట్లు ఉండేవి కావు. పెద్ద కాపు వీధిలో నొచ్చిలి (శెట్టిగిరి) కుప్పిరెడ్డి అనే తాగుబోతు భక్తుడుండేవాడు.[14] ఆయన రోజూ పీకల వరకు తాగి సరాసరి గంగమ్మగుడి కెళ్ళేవాడు. వెళ్తూ వెళ్తూ లడ్డో, మైసూరుపాకో ఏదో ఒక దానిని తీసుకొనివెళ్ళి గంగమ్మ విగ్రహం ముందుంచి గుడి చుట్టూ ప్రదక్షిణాలు చేసేవాడు. గుడి వెనుక వైపున గుడిసెలుండేవి. అక్కడుండే పిల్లలు ఆ తినుబండారాలను తినేసేవారు. తినుబండారాలను నిజంగా గంగమ్మే ఆరగించేదని తాగుబోతు కుప్పిరెడ్డి నమ్మకం. ఒక రోజు బాగా వర్షం పడుతోంటే కుప్పిరెడ్డి యధాలాపంగా గుడికెళ్ళి, గంగమ్మ విగ్రహం ముందు తినుబండారాలను ఉంచి తినమన్నాడు. వర్షం వల్ల పిల్లలు రాలేక పోయారు. తినమని బతిమాలాడు. తాను పెట్టిన తినుబండారాలు ఎంతకూ అలాగే ఉండేసరికి కుప్పిరెడ్డికి కోపం వచ్చేసింది.

---

[14] కుప్పిరెడ్డి మా ( రచయిత) నాన్నకు స్వయానా మేనమామ. మా పూర్వీకుడు చేసిన తప్పుకు, నేను గంగమ్మకు పుస్తకం రాసి పెట్టి సరిదిద్దుకుంటున్నానేమో?



తాతయ్యగుంట గంగమ్మ గుడి ఆవరణ
(20 ఏళ్ళకు ముందు ఫోటో)



కొత్తగుడి విస్తరించక ముందు జాతరకు
పందిళ్ళతో గుడిని ముస్తాబు చేస్తున్న దృశ్యం

దగ్గరగా అరుస్తూ, "లంజా! రోజూ తింటా వుండ్నావే, ఈ రోజు ఏమొచ్చిందే నీకు?" అని తిడ్తూ, బండరాయితో గంగమ్మ ముక్కుపై కొట్టాడు. దాంతో గంగమ్మ ముక్కు నొక్కు పోయింది. తర్వాత చేసేది లేక రత్నవేలుమొదలియారు సిమెంట్‌తో చాకచక్యంగా గంగమ్మ విగ్రహం ముక్కును అతికించి పెట్టాడు.[15] గంగమ్మను అభిషేకించేటప్పుడు సిమెంట్ అతికిన కొన ముక్కును చూడవచ్చు. ఆ తర్వాత కొంత కాలానికి గంగమ్మ గుడికి ఇనుప గేట్లు పెట్టారు.

గంగమ్మ గర్భగుడి ముందు రాతి సింహం బొమ్మ, చిన్న బలిపీఠం, అమ్మ వారి పాదాలున్నాయి. ఇంకాసింత ముందు శూలాలను పెట్టి ఉంటారు. గుడి ఆవరణ ముందు పెద్ద రాతిపై చెక్కిన అమ్మవారి పాదాలుంటాయి. ఈ పాదాలను కొందరు వేంకటేశ్వరుని పాదాలంటారు. గంగమ్మ గుళ్ళో గంగమ్మ విగ్రహంతో పాటు ఇత్తడి త్రిశూలం ఉంటుంది. గంగమ్మ విగ్రహం వెనుక మకర తోరణంలా ఉండే శూలాల తోరణం ఉంటుంది. ఇటీవల రెండేళ్ళ క్రితం గంగమ్మకు ఉత్సవ విగ్రహాన్ని జంగం గంగాధరం అనే వ్యక్తి బహూకరించాడు. మూడేళ్ళ ముందు వరకు రత్నవేలు శెట్టి కుటుంబీకులు గంగమ్మ విగ్రహానికి పెద్ద వెండి తొడుగును తొడిగే వారు. ప్రస్తుతం రత్నవేలు శెట్టి కుటుంబీకులు గుడి దగ్గరకు పూజలకు రావడం లేదు.

గంగమ్మ గుడిని ఎండోమెంట్ వాళ్ళు పదేళ్ళకు ముందు తమ అధీనంలోకి తెచ్చుకున్నారు. కానీ ఆరేళ్ళ నుంచి అంటే 1987 నుంచి గుడిని అభివృద్ధి చేయడానికి పూనుకున్నారు. ఎండోమెంట్‌వాళ్ళు 'శ్రీ తాతయ్యగుంట గంగమ్మ దేవస్థానం' ఏర్పాటు చేశారు. ఒక కార్య నిర్వహణాధికారి, దేవస్థానం బోర్డుకు ఛైర్మెన్‌ను, మెంబర్లను నియమించి పాలనా బాధ్యతల్ని అప్పగించారు. తత్ఫలితంగా గంగమ్మ గుడి చాలా బాగా అభివృద్ధి చెందింది. గర్భగుడి గోడలకు పాలరాతి బండల్ని జోడించారు. ఇంతవరకూ ఉన్న ఆలయాన్ని అలాగే ఉంచి, దానిచుట్టూ పెద్ద ఆలయాన్ని విస్తరింపజేశారు. గుడి చుట్టూ ప్రహరీ గోడను కట్టించారు. ముందున్న ఖాళీ ప్రదేశంలో బండరాళ్ళను పరుస్తున్నారు. ఆలయంపైన చుట్టూ శక్తిబొమ్మలను సిమెంటుతో చేయించారు.ఆలయం ముందు రాజగోపురాన్ని నిర్మిస్తున్నారు. ప్రస్తుతం ఆలయంలో పూజారులుగా బ్రాహ్మణులను నియమించారు. బలిజ కులస్థుడైన తిరుమలశెట్టి రామయ్య కూడా వీరితో పాటు ఉంటాడు. నిత్య నైవేద్యంతో,

---

15. పై సంఘటనను ప్రస్తుతం గుడిలో పూజలు చేస్తున్న తిరుమల శెట్టి రామయ్యతో పాటు,పెద్దకాపువీధి, చిన్నకాపువీధి,బండ్లవీధుల్లోని వారంతా ఇప్పటికి చెప్పుకుంటున్నారు.

అర్చనలతో గుడి మూడు పువ్వులు, ఆరుకాయలుగా విరాజిల్లుతోంది. ఇటీవల దసరా పండుగ రోజుల్లో గంగమ్మకు నవరాత్రి ఉత్సవాలను కూడ ప్రారంభించారు. గంగమ్మ గుడికి మొదటి నుంచి ధర్మ కర్తల హోదాలో పి.యస్. గురవారెడ్డి కుటుంబీకులుండేవారు. పెద్ద కాపు వీధి, చిన్న కాపువీధి రెడ్లకు తెలియుందే గుడి తరపు వాళ్ళు ఏ పని చేసేవారు కారు.

ప్రస్తుతం గంగమ్మ గుడి అధునాతనంగా తీర్చి దిద్దబడి ఉంది. తాతయ్య గుంట గంగమ్మ గుడికి నిత్యం భక్తులు వచ్చి పూజలు చేస్తుంటారు. కాబట్టి ఆదాయం ఎక్కువగా వస్తుంది. గంగమ్మ గుడి చుట్టూ ఇళ్ళు కట్టేసినందువల్ల గుడి స్థలం చాలావరకు తగ్గింది. పైగా గుడిముందుండే తాతయ్యగుంటను ఆక్రమించుకొని ఇళ్ళు కట్టేశారు. ఆఫీసులు వెలిశాయి. మల్లయ్య గుంటలో కూరగాయల మార్కెట్ వెలిసింది. గంగమ్మ గుడి పక్కనే రావిచెట్టు కింద వినాయకుని గుడి ఉంది. ఈ గుడిని మునెప్పగారి చిన మునస్వామి రెడ్డి కట్టించాడు. ఇవీ తాతయ్య గుంట గంగమ్మ గుడి విశేషాలు.

2.5. తాళ్లపాక (పెద్ద) గంగమ్మ గుడి విశేషాలు:- తాళ్లపాక గంగమ్మ గుడిలో గంగమ్మ విగ్రహం తలవరకు ఉంటుంది. దాని వెనుక వైపు ముప్పై ఏళ్ళకు ముందు (తల, కాళ్ళు, చేతులుండే) మొత్తం విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. గంగమ్మకు కుడివైపున ఐదు రాతి విగ్రహాలు ఉన్నాయి. ఎడమ పక్క ఒక రాతి విగ్రహం ఉంది. వీళ్ళను గంగమ్మ బిడ్డలుగా భావిస్తారు. ఎడమవైపున పోతురాజుబొమ్మ ఉంటుంది. ప్రతి మంగళవారం గంగమ్మ విగ్రహానికి ఇత్తడి కవచం తొడుగుతారు. శుక్రవారం పసుపుతో అలంకరిస్తారు. మంగళ, శుక్రవారాల్లో పాలు, పన్నీరు, పెరుగు, ఎలనీళ్ళు (లేత టెంకాయనీళ్ళు) తేనెతో అభిషేకం చేసి, నూనె, శీకాయతో కడుగుతారు. ఈ గంగమ్మ గుడికి రాబడి తక్కువ కాబట్టి కైకాల రెడ్లు ప్రతి రోజు ఉదయాన్నే ఇడ్లీ, మధ్యాహ్నం అన్నం, కోడి గుడ్లు, సాయంత్రం పూట లోటా పాలు, రెండు అరటి పళ్ళను నైవేద్యంగా పెడ్తారు.

తాళ్లపాక గంగమ్మ గుడి చుట్టూ రోడ్డు ఉండడం వల్ల గుడి 'ట్రాఫిక్ ఐలాండ్' లా ఉంటుంది. గుడికొచ్చే ఆదాయం తక్కువ. గుడి కూడా చాలా చిన్నది. తాళ్లపాక గంగమ్మ గుడిలో పూజారులుగా మొన్నటి వరకు గొల్ల కులస్థులు కూడా ఉండేవారు. ప్రస్తుతం కైకలవాళ్ళే పూజలు చేస్తున్నారు. కైకల వాళ్ళకు తాళ్ళపాక వంశీకులు పూజలు చేసుకోమని గుడిని అప్పగించినట్లు కైకల వాళ్ళు చెప్పుకుంటారు. తాళ్లపాక గంగమ్మ గుడికి కూడా కాపు వీధి

రెడ్లే ధర్మకర్తల హోదాలో ఉంటారు. జాతరలో గంగమ్మ బొమ్మ దగ్గర రెడ్డి కులస్థుడు కొంతసేపు కూర్చొని ఉంటాడు. ఈ రెడ్లు తాము మిరాశిదారులమని చెప్పుంటారు.

2.6. తిరుపతి గంగమ్మ కథలు:-

తిరుపతి గంగమ్మ పుట్టు పూర్వోత్తరాలను గూర్చి స్థానిక ప్రజలలో, పరిసర ప్రాంతాలలో ఎన్నో కథలు వ్యవహారంలో ఉన్నాయి.

తిరుపతి గంగమ్మ జాతర వాటింపుల్లోను, వివిధ పూజా కార్యక్రమాల్లో పాలు పంచుకునే పంబల వాళ్ళు గంగమ్మ కథను పంబలు వాయిస్తూ, అభినయిస్తూ, గానం చేస్తూ చెబుతారు. ఆ కథను గమనించండి-

'అమ్మా' అని పిలిస్తే పలికే ఆ గంగమ్మ శక్తి 'ఓం' అనే బీజాక్షరిలో అంటే ఓంకార శబ్దంలో పుట్టింది. మృదువైన చిన్న బిడ్డ ఆ గంగమ్మ త్రినేత్రం కలిగి, చతుర్ముఖంతో జన్మించింది. గంగమ్మ దుత్తైదు రెట్టల్ని, పట్టైదు ముఖాన్ని, చీమ తలలు వంటి కన్నుల్ని, శిరస్సున జడల్ని, ఆరచేతిలో 'పల్లికల్ని', జక్కోలను, ముష్టి పాదాలను, ఒక చేతిలో కత్తి, ఒక చేతిలో గజంబు, ఒక చేతిలో చెక్క, ఇంకో చేతిలో డమరుకం, అలాగే రాయిబంపం, బండేరు కొడవలి, శూలం, గాలం వంటి వాటిని కూడా కలిగి ఉందట. అలాగే ఏడు మాబువుల గన్నే రాకుల గజన్నార శూలాన్ని ఎడమ స్థానంలో ఉంచుకొని ఉంది. ఆమె పన్నెండు హస్తాల్ని కలిగిన అపర భాగవతు రాలట. గంగమ్మకు ముందుజూస్తే మూడు వందల కన్నులు, వెనుక జూస్తే ఏడువందల కన్నులు, వెల్లకులకల్లోజూస్తే వే లక్షల కన్నులు, పాపట సందులో చూస్తే పది లక్షల కన్నులు కనిపిస్తాయట. అమ్మవారు కత్తుల చీరను, తొమ్మిది ముడుల దంతాల రవికను తొడిగి, నిప్పుల పెడవార ముసుగును వేసుకొని ఉంది. అమ్మవారికి పైన ఆకాశం, కింద భూదేవి, లోపల నాలుకను కలిగి ఉందట. క్రమక్రమంగా పెరిగి అమ్మవారికి పధ్నాలుగు సంవత్సరాల వయస్సు వచ్చి పుష్పవతి అయింది. అమ్మవారికి యవ్వనం వచ్చి కోరిక కలగడంతో పురుషుడు అవసరమయ్యాడు. అప్పటికి, మహావిష్ణు, ఈశ్వరుడు, బ్రహ్మ ఎవ్వరూ లేరు. కొండలు, వృక్షాలు, సప్త సముద్రాలు ఏవీ లేవు. అప్పుడు అమ్మవారు మిన్నుకు, చన్నుకు మెడ ఆను దగ్గర, ఒక పక్క కోసి, చేతిలో నేత్రాలను పెట్టుకొని కుంచెలోకి 'కుడేపెమ్' జేర్చి, ఆకాశ తీర్థాన్ని, విబూదిని, బండారాన్ని ఝల్లన మీటుతుంది. అపుడు మహా విష్ణువు ప్రత్యక్ష మవుతాడు. అపుడు అమ్మవారు 'ఓ విష్ణూ' అంటుంది. దానికి విష్ణువు 'ఏమి తల్లీ' అని అంటాడు. ఆ మాట విన్న

గంగమ్మ, విష్ణువు తన యవ్వనపు కోర్కెను తీర్చడని దూరంగా ఉంచేస్తుంది. ఆ తర్వాత నాలుగు శిరస్సులు కలిగిన బ్రహ్మను సృష్టించి 'ఓ బ్రహ్మదేవా 'అని పిలుస్తుంది గంగమ్మ. అందుకు బ్రహ్మదేవుడు 'ఏమి తల్లీ' అని అంటాడు. ఆ మాటతో గంగమ్మ బ్రహ్మ దేవుని కూడా దూరంగా పెట్టేస్తుంది. మళ్ళీ 'కుంచెలేకి కుడేసిం జేర్చి ' ఆకాశం తీర్థం, విబూదీ, బండారును తీసుకొని మంతరించి ఝుల్లన మీటు తుంది అమ్మవారు. అపుడు ఈశ్వరుడు వొళ్ళంతా విబూది, వాలారి గోళ్ళు, పడతూల కక్షబాల, పిందుకున్న జడలు, జంధ్యాలు, కంఠంలో రుద్రాక్షలు, కాయ వస్త్రాలు, పేము బెత్తం, గజన్నారశూలం, బంగారు పావు కోళ్ళు, సన్న రుద్రాక్ష దండలు, జపమాలికలు, దేవదత్తం వంటి వాటిని కలిగి, పులి తోలును వస్త్రంలా తొడిగి, ఒక చేతిలో డెక్కను, మరో చేతిలో శూలాన్ని ఉంచుకొని, జింకతోలు ఆసనంతో గంగమ్మకు ప్రత్యక్షమవుతాడు. అపుడు అమ్మవారు 'ఈశ్వరా నా కోర్కెను తీర్చాలి' అని అంటూ తనలో వున్న కామ, లోభ, క్రోధ, మద, యౌవనాలను కూడా తీర్చాలని అంటుంది. అందుకు ఈశ్వరుడు చిరునవ్వు నవ్వి 'నీవు చూస్తే ఆది శక్తిలా, అకాల శక్తిలా ఉన్నావు.' నీకు పైన ఆకాశం, కింద భూదేవి, నీ లోపల నాలుక, నీ చుట్టూ సూర్య చంద్రులు, ముక్కోటి దేవతలు, మునులు, మునేంద్రులు , యోగీశ్వరులు, సకల సంపన్నులు, సాధువులు,సిద్ధులు,నంబులు, వైష్ణులు,మునికన్యలు, మునేంద్ర కన్యలు, దేవకన్యలు, దేవేంద్రకన్యలు, దేవాతి దేవతలంతా అమరి ఉన్నారని ఈశ్వరుడు అంటాడు. ఆ మాటలు విన్న అమ్మవారు ఈశ్వరునికి ఏంకావాలో కోరుకోమంటుంది. అందుకు ఈశ్వరుడు అమ్మవారి మూడో కన్నునిస్తే ఆమె యౌవన కోర్కెను తీరుస్తానంటాడు. దానితో గంగమ్మ ఉప్పొంగి సంతోషించి, తన ఎడమ చేతి బొటన వేలితో ఆ మూడో కన్నును తీసి ఈశ్వరునికి ఇచ్చేస్తుంది. ఆ మూడో కన్నును ఈశ్వరుడు నొసట దాల్చుకొని గంగమ్మను పాలిస్తాడు. అమ్మవారిని అలా పాలించడం వల్ల ఆమె ఒళ్ళు, తెల్లని చీర రక్త మండలమై పోతుంది. ఆ మంటకు, ఆ బాధకు అమ్మవారు తట్టుకోలేక ఆకాశ తీర్థాన్ని, బండారుని తీసుకొని మంత్రించి ఝుల్లని మీటుతుంది. అపుడు ఆ వాయు దేవుడు (గాలి) ని ఏర్పాటు చేసుకొని ఆ సుడిగాలిలో అమ్మవారు గగన మార్గాన సూర్య మండలం, చంద్రమండలం,సప్తసముద్రాల పైకి ఎగిరి పోతుంది. అమ్మవారు సముద్రాలను పట్టుకొచ్చి, ఆ సముద్రాల వొడ్డున ఒక డేరా కట్టుకొని ఒక 'జీలిభ రథాన్ని' తయారు చేసుకుంటుంది.

ఆ రథంలో అమ్మవారు ఒక తెప్పను తయారు చేసి వేపాకుతో తడికలను నాలుగు పక్కల ఏర్పాటు చేసుకొని, ఆసముద్రం ఈవిరికి, ఆచల్లని



45 ఏళ్ళకు ముందు తాళ్ళపాక గంగమ్మ గుడి



45 ఏళ్ళకు ముందు
తాళ్ళపాక గంగమ్మ మూల విగ్రహం

గాలికీ చల్లగా తూలుతూ నిద్రపోతుంటుంది.

గంగమ్మ గగన మార్గాన సముద్రాల వొడ్డుకి పోవడాన్ని మహావిష్ణు, ఈశ్వరుడు, బ్రహ్మదేవులు చూస్తారు. ఇక రాబోయే కలియుగంలో మానవులు జన్మిస్తారని,ఆ కలి యుగంలో తామే దేవుళ్ళు, సృష్టి కర్తలు, లయ కర్తలని, తమకు మించిన దేవుళ్ళు ఒకరు కూడా ఉండబోరని, అందుకోసం విష్ణు, ఈశ్వరుడు, బ్రహ్మ దేవుళ్ళు శ్రీగంధం చెక్కలు, నెయ్యితో హోమ గుండాన్ని వేసి హోమం చేస్తుంటారు. గంగమ్మ వెళ్ళి పోయినందుకుగాను యతీశ్వరులు, మునీశ్వరులు, నారద, కిన్నెర, కింపురుషులు, ముని కన్యలు, మునేంద్ర కన్యలు, దేవకన్నలు, దేవేంద్రకన్యలు వంటి ఈ దేవాది దేవతలంతా మంగళ హారతులు తీసుకొని ఆమె దగ్గరకు పోతుంటారు. వాళ్ళు పోవడాన్ని గమనించిన విష్ణువు, ఈశ్వరుడు, బ్రహ్మ దేవుళ్ళు హోమాన్ని చాలించి, వీళ్ళు కూడ గంగమ్మ దగ్గరకు వెళ్తారు. సముద్రాల వొడ్డున చల్లగా నిద్రిస్తున్న గంగమ్మకు త్రిమూర్తులు 'శరణు' అంటూ సాష్టాంగం పడి దణ్ణాలు పెడతారు. అపుడు గంగమ్మ ఈశ్వరుడు తన కోర్కెను తీర్చకపోగా, తన మూడో కన్నును కూడా తనకు తిరిగి ఇవ్వలేదనే కోపంతో త్రిమ్మూర్తులను తన మహిమతో ముగ్గురు స్త్రీలుగా మార్చేస్తుంది. అప్పట్నుంచి ఆ స్త్రీలు గంగమ్మకు సపరిచర్యలు చేయనారంభిస్తారు. మళ్ళీ గంగమ్మ మనసు మార్చుకొని తాను సృష్టించిన పురుషుల్ని స్త్రీలగా మార్చడం ధర్మం కాదని వారిని తిరిగి పురుషులుగా మార్చేస్తుంది. అపుడు ఈశ్వరుడు గంగమ్మతో రాబోయే కలియుగంలో నరులు జన్మిస్తారని, ఆ యుగంలో గంగమ్మే నూట మహా శక్తులని, ఆమే చోటు గంగ, చాటుగంగ, నడీధిగంగ, దొడ్డిగంగ, దొరసాని గంగలుగా ఊరికొక శక్తిగా ఉద్భవించాలని అంటాడు. గంగమ్మకు ఏడు మణువుల గన్నేరాకుల గజన్నార శూలం ఉంటుందని, త్రిమూర్తులకు రామచక్రం ఉంటుందని, ఆచక్రాన్ని ఆ శూలాన్ని కలియుగంలో ప్రయోగించాలంటాడు ఈశ్వరుడు. అలాగే గంగమ్మతో గ్రామాలకు వేదులు, ఏనుగకు పెద్ద గజ్జి, శరీరాలకు వ్యాధులు, పోటులు, గుఱ్ఱానికి కడుపు నొప్పి, గొఱ్ఱెలకు మిడస రోగాలు, మేకలకు గాలెమ్మ, కోళ్ళకు కొక్కర తెగులు, చంక బిడ్డలకు సందులు, దగ్గులు, పడిశాలు, తీటలు, తిమర్లు, తట్టమ్మ, ముత్తమ్మ, ఆట్లాటమ్మ, నల్లమ్మ, పెద్దమ్మ వంటి రోగాలను కలిగించాలని ఈశ్వరుడు చెపుతాడు. అప్పడే మానవులు ఆ పోరుకు, మంటలకు, గాలికి తట్టుకోలేక గంగమ్మను చూసి భయభక్తులతో ఆరాధిస్తారని ఈశ్వరుడు అంటాడు. భక్తులు గంగమ్మకు వేపాకుతోను, మామిడాకులతోను తోరణాలను కట్టిస్తారని, పెద్ద గంగాళాలకు అంబళ్ళు పెడ్తారని, చలువ పందిర్లు వేయిస్తారని, ఆరుకూటు

(అరకెకూడు) కుంభాలను, వరికూడు కుంభాల్ని సమర్పిస్తారని, దున్న పోతుల్ని, బలి పిల్లల్ని, పెద్ద గొర్రెల్ని, పొట్టేళ్ళను బలిస్తారని ఈశ్వరుడు అంటాడు. అలాగే ప్రతి సంవత్సరం చిత్రి నెలలో (తమిళ నెల, అంటే మే నెలలో) గంగమ్మకు జాగరణ చేస్తారని, జాతరలను జరిపిస్తారని, ఆమెకు లాలిపాటల్ని, జోల, పాటల్ని, బండ కూతలు కలిగిన ఏల పాటల్ని, బండ కూత మాటల్ని, బూతు మాటల్ని పాడతారని ఈశ్వరుడు చెబుతాడు. అలా భక్తులు బూతు పాటలు పాడి గంగమ్మ కామ, లోభ, యౌవనాన్ని తీర్చి, ఆమెకు ఎంతో ఉల్లాసాన్ని, సంతోషాన్ని కలుగజేస్తారని ఈశ్వరుడు అంటాడు. గంగమ్మ తన భక్తులు ఏ రూపంతో కోరినా వరప్రసాదినిగా వాళ్ళను చల్లగా కాపాడుతూ, సకల సంపదలను కలుగుజేయమని ఈశ్వరుడు గంగమ్మను కోరుతాడు. అందుకు గంగమ్మ సంతోషించి ఇసుకను నాలుగు భాగాలుగా చేయమని ఈశ్వరుడికి చెబుతుంది. ఈశ్వరుడు అలాగే చేస్తాడు. ఒక భాగం మహా విష్ణువు భార్య లక్ష్మిగాను, ఇంకొక భాగం ఈశ్వరుడి భార్య పార్వతి గాను, ఇంకొక భాగం బ్రహ్మభార్య సరస్వతిగాను చేసి త్రిమూర్తులను తీసుకోమంటుంది. నాలుగో భాగాన్ని భూభాగం మీద చల్లమంటుంది గంగమ్మ. అదే విధంగా చల్లుతారు. అపుడు అమ్మవారునూట మహాశక్తులుగా మారుతుంది. అలాంటి నూట మహా శక్తుల్లోని వారే వేషాలమ్మ, తాతయ్యగుంట గంగమ్మ, తాళ్లపాక గంగమ్మ, నేరేళమ్మ, ముత్యాలమ్మ, అంకమ్మ, రాజరాజేశ్వరి. అలా ఊరికొక్క శక్తిగా ఉద్భవించి ప్రతి సంవత్సరం జాగరణను, జాతరలను జరిపించుకొంటూ, భక్తులను, సేవకులను, బాలలను చల్లగా, లక్షణంగా కాపాడుతుందట గంగమ్మ అమ్మవారు.[16]

తిరుపతి గంగమ్మను గూర్చి స్థానికులలో బహుళ ప్రచారంలో ఉన్న కథను గమనించండి.-

చిన్న గంగమ్మ పెళ్లికాని కన్నెపిల్ల. తిరుపతిని ఏలే పాళెగాడు ఆమెను మోహిస్తాడు. ఆమె పొందుకోసం పరితపించి ఒకనాడు బలాత్కరించ బోతాడు. మహిమోన్నతురాలైన ఆమె ఆ పాళెగాడిని వారం లోపల హతమారుస్తానని ప్రతిజ్ఞ చేస్తుంది. ఆమె మహిమలను తెలుసుకొని పాళెగాడు ప్రాణభీతితో ఆమెకు కనిపించకుండా దాక్కుంటాడు. ఆమె పాళెగాడి కోసం వేట ప్రారంభిస్తుంది. ఏదైనా వేషం వేసుకొని తిరిగితే తనను గుర్తు పట్టలేడని, ఎక్కడైనా ఎదురు పడ్డప్పుడు చంపొచ్చని గంగమ్మ భావిస్తుంది. మొదటి రోజైన బుధవారం ఉదయం బైరాగి వేషం, సాయంత్రం పాములోళ్ల వేషం వేస్తుంది. గురువారం

16. చెంగల్రాయులు, దాసరిమఠం, తిరుపతి

ఉదయం గొల్లవాని వేషం, సాయంత్రం బండవేషం వేస్తుంది గంగమ్మ. అయినా పాళెగాడు కనిపించడు.శుక్రవారం ఉదయం కోమటి వేషం, సాయంత్రం తోటి వేషం వేసుకొని ఆ పాళెగాడి కోసం వెదుకుతూ, బండ బూతులు తిడుతూ తిరుగుతుంది. పాళెగాడు బయటకురాడు. ఇక లాభం లేదనుకుని శనివారం ఉదయం దొర వేషం వేసుకొని గంగమ్మ వస్తుంది. దొరకు పాళెగాడు సామం-తుడవటం వల్ల తన ప్రభువొచ్చాడని భ్రమించి బయటకు వస్తాడు. పాళెగాడు బయటకు రావడం తోటే గంగమ్మ వాడి తలను నరికి హతమారుస్తుంది. ఆదివారం మాతంగి వేషం వేసుకొని వచ్చి పాళెగాడి భార్యకు ఊరట కల్గించి శాంతిస్తుంది. సోమవారం ఉదయం జంగం వేషం తోను, సాయంత్రం సున్నపు కుండలతోను వచ్చి మంగళవారం రాత్రి విశ్వరూపం చూపిస్తుంది గంగమ్మ. ఇది బహుళ ప్రచారంలో ఉన్న కథ.

ఈ కథనే కొంతమంది ఇంకో రకంగా చెబుతారు. దీనిని కూడా చూడండి-

పూర్వం తిరుపతిని, పరిసరప్రాంతాలను ఒక పాళెగాడు పరిపాలిం-చేవాడు. అతని పాలనలో ఎవరైనా అమ్మాయిలు పెళ్లి చేసుకుంటే వాళ్ళు మొదటిరాత్రి ఆ పాళెగాడితో గడపాలి. ఆ సమయంలోనే తిరుపతికి పక్కనుండే అవిలాల గ్రామంలో పుట్టి, పెరిగిన గంగమ్మకు పెళ్లి అవుతుంది. శక్తి స్వరూపిణి అయిన గంగమ్మను కూడా మొదటి రాత్రి పాళెగాడితో గడపాలని చెప్తారు. దానికి గంగమ్మ ఇష్టపడదు. కానీ తల్లి దండ్రులను సంతృప్తి పరచడానికీ, పాళెగాడి నుండి తన తల్లి దండ్రులను రక్షించుకోవడానికి గంగమ్మ పాళెగాడి పడక గదికి వెళ్తుంది. అక్కడ గంగమ్మ పాళెగాడికి విశ్వరూపం చూపిస్తుంది. పాళెగాడు గంగమ్మ విశ్వరూపాన్ని చూసి పారిపోతాడు. అయినా ఆమె వాడిని పట్టుకోవడం కోసం రోజుకో వేషం వేసి వెదుకుతుంది. చివరకు ఆమె దొరవేషం వేసుకొని పాళెగాడిని తాతయ్య గుంట దగ్గర పట్టుకొని చంపేస్తుంది. ఆ రోజుతో పెళ్ళి కూతుర్లను మొదటి రాత్రి పాళెగాడితో పంపే అనాచారం అంతమై పోతుంది.

పై కథలాగే కొంత తేడాతో మరో కథ ప్రచారంలో ఉంది గమనించండి-

తాళ్లపాక గంగమ్మ కడప జిల్లాలోని తాళ్లపాక గ్రామంలో ఒక మర్రి-చెట్టును ఆశ్రయించుకొని రాక్షస రూపంలో ఉండేది. ఎద్దుల బేరానికని రామానుజాచార్యులు వెళ్తూ, చీకటి పడిందని తాళ్ళపాక గ్రామంలో ఒక అరుగు మీద పడుకుంటాడు. తాళ్ళపాక గంగమ్మ రామానుజాచార్యులను మింగనొస్తుంది. ఆయన మంత్రించిన అక్షింతలు చల్లి తాళ్లపాక గంగమ్మను

చిన్నబిడ్డను చేసి తిరుపతికి తీసుకొని వచ్చి బేరివీధిలోని 'చాటుమండపం' దగ్గర వదలి వెళ్తాడు. ఈమె తిన్నగా అటు పక్కనే ఉన్న అవిలాలలోని ఓ రెడ్డి ఇంటికి పోతుంది. ఆరెడ్డి కుటుంబం ఆమె గంగమ్మని తెలియకపెంచి పెద్ద చేస్తారు. ప్రాయానికి వచ్చిన గంగమ్మ ఒకరోజు తలస్నానం చేసి బావి దగ్గర నీళ్ళు చేదుతుంటుంది. ఆ సమయంలో అవిలాల పాళెగాడు గుర్రం మీద వెళ్తూ ఆమెను చూసి మోహిస్తాడు. ఈ పాళెగాడు తిరుపతిని ఏలేవాడు, 76 మంది పాళెగాళ్లకు పెద్ద. తిరుపతిలో 'పుష్పవతి ' (ప్రాయం) అయిన ఆడవాళ్ళను మొదట పాళెగాడికి దాసోహం చెయ్యాలి. ఈ పాళెగాడిని గురించి గంగమ్మ అన్ని విషయాలు తెలుసుకొని వాడిపై పగ పడ్తుంది. వాడు గంగమ్మ 'శక్తి' అని తెలుసుకొని దాక్కుంటాడు. గంగమ్మ రోజుకో వేషం వేసుకొని వాడిని వేటాడుతుంది. చివరకు దొరవేషం లో వాడ్ని సంహరిస్తుంది. గంగమ్మ రెడ్డి కుటుంబంలో పెరిగింది కాబట్టేనేమో నేడు కూడా తిరుపతి జాతర చాటింపు సమయంలో అవిలాల పెద్దరెడ్డికి పంచ, సవకం, పూలమాల ఇస్తారు. అలాగే గంగమ్మను తిరుపతికి తీసుకెళ్ళేటప్పుడు పెద్దరెడ్డి చీర, పసుపు కుంకుమలు, గాజులు తిరుపతి వాళ్ళకు ఇస్తాడు.

గంగమ్మను గురించి అవిలాలలోని 'పెద్దరెడ్డి' చెప్పిన కథను చూడండి-

కొన్ని శతాబ్దాలకు ముందు పరాశక్తి అయిన గంగమ్మ అయోధ్యలో పూజలందుకొంటూ ఉండేది. నవాబులు హిందూ దేవాలయాల్ని పడగొడ్తుం-డడం వల్ల పరాశక్తి అయోధ్యను వదలి గగన మార్గాన బయలుదేరి తిరుపతి సమీపంలోని గాజుల మండ్యంలో దిగింది. అక్కడ్నుంచి ఆమె అవిలాల గ్రామం పొలిమేరలకు బయలుదేరేటప్పుడు ఉరుములు, మెరుపులతో పెద్దగాలివాన వచ్చింది. వాటిని పట్టించుకోకుండా ఆమె రథంపై అవిలాలకు వస్తుండగా, రావిచెట్టు సమీపంలో వాన ఉధృతమైంది. అప్పుడు రథం భూలోకం నుండి నాగలోకం, నాగలోకం నుండి పాతాళలోకం వరకు దిగబడింది. గంగమ్మ రథసారధిగా ఉన్న తన తమ్ముడు పోతురాజును అవిలాలకు పంపుతుంది. అక్కడ తన చెమటకు జన్మించిన 'సావుమాలోడు' (ఆసాదివాడు) భార్యలలో తొమ్మిది నెలల గర్భిణిగా ఉండే తొమ్మిదవ భార్యను తీసుకొని వచ్చి, ఆమె చేత పొంగలి పొంగించి, అమృత పళ్ళెం వేసి, ఆమె దణ్ణం పెట్టేటప్పుడు శిరస్సు నరికి, బొడ్డుకోసి, కొవ్వు పేగుల్ని తీసి, కనులకు కప్పి; కుడికాలు నరికి, నోట్లోపెట్టి; ఆమె శిరస్సుపై దీపం పెట్టమంటుంది. తర్వాత ఆమె గర్భంలోని పిండాన్ని సమానంగా కోసి, ఆ రక్తాన్ని, కుంభాన్ని కలిపి కొత్త చేటలో ఉంచుకొని,

తన కుమారుడైన ఆసాదివాడు కంకణం కట్టిన చేత్తో చేటను పట్టుకొని, మెళ్ళో పేగుల జంధ్యం వేసుకొని 'నరబలి, కోబలి' అంటూ రథం చుట్టూ తిరిగితే రథం భూలోకానికి వస్తుందని గంగమ్మ చెప్తుంది. గంగమ్మ కోరిన విధంగానే జరుగుతుంది. తర్వాత ఆసాదివాడు జరిగిన విషయాన్నంతా అవిలాల ఊరి పెద్దలకు చెప్తాడు. అప్పట్నుంచి ప్రతి సంవత్సరం గంగజాతరను ఊరి పెద్దలైన ఇద్దరన్నదమ్ములు చేసేవారు. వారిలో పెద్దరెడ్డి బిడ్డలులేక బాధ పడ్తున్నా, జాతరను మాత్రం యధావిధిగా జరిపించేవాడు. ఒక రోజు గంగమ్మ చిన్నబిడ్డ రూపంలో పాలు పితికేందుకు వెళ్తున్న పెద్దరెడ్డి దంపతులకు దొరుకుతుంది. వారు ఆబిడ్డను అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేశారు. ఆమె పదహారు సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు గ్రామ (భూమి) శిస్తులు వసూలు చేయడానికి నవాబులు అవిలాలకు వస్తారు. అప్పుడు తలస్నానం చేసి కురులారబోసుకుంటున్న గంగమ్మ అందచందాలకు ముగ్ధుడైన నవాబు ఆమెను తనకిచ్చి పెళ్ళిచేయమని పెద్దరెడ్డిని కోరుతాడు. పెద్దరెడ్డి తప్పని సరై మాటిచ్చి ఇంటికొచ్చి బాధను భరించలేక నిద్రాహారాలు మానేస్తాడు. శక్తి స్వరూపిణి అయిన గంగమ్మ విషయం తెలుసుకొని నవాబు వాళ్ళను మంగళ,బుధ వారాల్లో రమ్మని చెప్తుంది. పెద్దరెడ్డి వూరంతటికీ విషయం చెప్పి,'అమ్మతల్లి'ని సంతోషంతో పెళ్ళికూతుర్ని చేసి ఊరి బయటకు తీసుకొస్తారు. నవాబు కూడా తన ఏనుగులు,గుఱ్ఱాలు,జనాల్ని వెంటబెట్టుకొని ఎంతో వైభవంగా వస్తాడు. అందరికళ్ళకు పెళ్ళి కూతురుగా కనిపించే గంగమ్మ, నవాబుకు మాత్రం భూమి, ఆకాశం ఒకే రూపంగా కనిపిస్తుంది. నవాబు భయంతో ఎంతమంది పట్టుకున్నా విదిలించుకొని పారిపోతుంటాడు. అప్పుడు మంగళ వాద్యాల మధ్య వస్తున్న గంగమ్మ బండి దూకి నవాబును వెంబడిస్తుంది. ఆ బండి దూకినప్పటి అడుగుల గుర్తే చక్రంతో నిర్మించబడిన రాతిస్థంభం. (ఊరికి వెలుపలున్న గంగశిలపై చక్రాకారం గుర్తు చెక్కబడి వుంది.) నవాబు పారిపోయి తిరుపతి పూలతోటకు అవతలుండే కైకల వారి ఇళ్ళకు సమీపంలో ఉండే ముసలామె గుడిసెలోకి దూరుతాడు. విషయం తెలుసుకున్న అవ్వ నవాబును దాచేసి ఆవేశంతో వచ్చిన గంగమ్మకు నవాబు గురించి తాను ఎరుగనంటుంది. అప్పుడు గంగమ్మ తన నిజ స్వరూపంలో ఉంటే అంతా భయపడ్తారని, రోజుకొక వేషం వేసుకొని నవాబును వెతుకుతుంది. చివర్లో సున్నపుకుండలు వేషం వేసుకొని ఇళ్ళిళ్ళు తిరిగి చివరకు తిరుపతి బయట నవాబును చంపి, గంగమ్మ తొమ్మిది రూపాలుగా మారి నేలమట్టమై పోతుంది. అవిలాల ప్రజలు గంగమ్మ కోసం వెదికి జరిగిన సంగతి తెలుసుకొని, నవాబుకు దహనక్రియలు చేసి గుంటలో స్నానం చేసి తిరిగి వెళ్తారు. గంగమ్మ పెళ్ళికూతురుగా **తిరుపతికి** వచ్చినందువల్ల ప్రతి

ఏటా ఆమెకు చీర, రవిక, పసుపు కుంకుమలు సాంగ్యంగా తిరుపతి వాళ్ళకు, తిరుపతి వాళ్ళు నవాబు తరపున పంచె, సవకం అవిలాల వాళ్ళ సాంగ్యంగా అవిలాల బయట గంగశిల దగ్గరిస్తారు.

ఈ కథనే పంబల వాళ్ళు ఇంకోరకంగా కూడా చెబుతారు. చూడండి-

కృతయుగంలో పాళెగాడు నాలుగుకాళ్ళు తెలుపు, నడినెత్తిన చుక్క, పూవులాంటి తోకను కలిగిన పంచ కళ్యాణి దేవలైన అశ్వాన్ని అధిరోహించి, అవిలాల మీదుగా పోతుంటాడు. ఆ రోజు శుక్రవారం కాబట్టి శక్తులైన గంగమ్మలిద్దరు స్నానంచేసి అవిలాల వీధిలో కురులార్పుకుంటూ ఉంటారు. పాళెగాడు ఆ శక్తులను చూపి వాళ్ళను కోరుతాడు. దానితో శక్తి అయిన (చిన్న) గంగమ్మకు కోపం వచ్చి వాడిని చంపడానికని బుధవారం నుండి వివిధ వేషాలను వేసుకొని పాళెగాడు కోసం వెదుకుతుంది. చివరకు దొరవేషం వేసుకొని గంగమ్మ వచ్చినపుడు పాళెగాడు దొరను కలవడాని కని వస్తాడు. అపుడు గంగమ్మ పాళెగాడితో 'రేయ్ ! నువ్ నన్ను స్త్రీ అని కోరినావు, నేను స్త్రీని కాదురా, నేనే శక్తిని, నేనే తాతాయుగుంట గంగమ్మను, నేను తాళ్లపాక గంగమ్మను' అని శూలం తీసుకొని నాలుక మీద పొడుచుకొని పాళెగాడికి చూపించి, పాళెగాడి శిరస్సును ఖండించేస్తుంది. ఆ పాళెగాడి తలను గంగమ్మ చేతిలో బట్టుకొని తిరుపతంతా క్షేత్రయాత్రలాగా తిరుగుతుంది. తర్వాత పాళెగాడి శరీరాన్ని తీసుకెళ్ళి వాడి రక్తం, కనుగుడ్లను తీసుకొని, శరీరాన్ని కాల్చి బూడిద చేసి, వాడి బూడిద రక్తం, కనుగుడ్లలో కాటుక చేసుకొని నొసట పెట్టుకుంటుందంట గంగమ్మ.

ఇలాగే తిరుపతి ప్రజలలో గంగమ్మను గూర్చి, మరికొన్ని కథలు కూడా ప్రచారంలో ఉన్నాయి. వాటిని కూడా తెలుసుకుందాం-

పూర్వం తిరుపతిలో ఒక బ్రాహ్మణుడు పశువుల వ్యాపారం చేసేవాడు. ఒకసారి బ్రాహ్మణుడు, అతని అనుచరుడైన హరిజనుడితో కలసి పశువులను కొనడానికి ఒంగోలు జిల్లాలోని అద్దంకికి వెళ్తాడు. వాళ్ళు ఒక జత ఎద్దులను బేరమాడుతారు. సాయంత్రం బాగా ఆలస్యమైన కారణంగా వాళ్ళు ఉదయాన్నే వచ్చి డబ్బు చెల్లించి ఎద్దులను తీసుకొని వెళ్తామని వాళ్ళకు మాట ఇస్తారు. ఇదంతా గమనించిన కొందరు దొంగలు వీళ్ళను చంపి, వీళ్ళ దగ్గరుండే సొమ్మును కాజేయడానికి కుట్ర పన్నుతారు. తరువాత వాళ్ళు బ్రాహ్మణుడు బస చేస్తున్న ఇంటి యజమానుల దగ్గర కెళ్లి తమ దోపిడీ వివరాలను తెలిపి తమకు అడ్డు రావొద్దంటారు. అది అర్ధరాత్రి. బ్రాహ్మణుడు నిద్రలో ఒక కల

కంటాడు. ఆ స్వప్నంలో అతనికి బాగా అలంకరించుకొనిన స్త్రీ (గంగమ్మ) కనిపించి, జరుగబోయే కష్టాన్ని వివరించి వెంటనే బ్రాహ్మణుని ఆ స్థలం నుండి వెళ్ళి పొమ్మని చెబుతుంది. మొదట బ్రాహ్మణుడు నమ్మడు. మళ్ళీ రెండవ సారి ఆమె హెచ్చరించే సరికి బ్రాహ్మణుడు లేచి తన అనుచరుని సంప్రదిస్తాడు. అయితే అనుచరుడు అది కేవలం ఒక కలే నని తిరస్కరిస్తాడు. అప్పుడు అతని చెంప మీద చెళ్ళుమని దెబ్బపడుతుంది. దానితో అనుచరుడు కూడా ఆ స్థలాన్ని వదలి పోవడానికి అంగీకరిస్తాడు. వాళ్ళు తిరుపతికి వచ్చేస్తారు. గంగమ్మ కూడా వాళ్ళను అనుసరిస్తూ గాలిలోనే వచ్చేస్తుంది. అప్పుడు గంగమ్మ బ్రాహ్మణుడితో తన గురించి చెబుతూ తనకు విగ్రహ ప్రతిష్ఠాపన చేయుమని కోరుతుంది. ఆ బ్రాహ్మణుడు జరిగినదంతా తన కుటుంబ సభ్యులతో చెప్పుతాడు. అయితే వాళ్ళు అతని మాటల్ని నమ్మక తిడ్తారు. దానితో అకస్మాత్తుగా ఆ కుటుంబ సభ్యులంతా అనారోగ్యానికి గురి అవుతారు. తరువాత వాళ్ళు పశ్చాత్తాపంతో గంగమ్మను పూజిస్తారు. అప్పట్నుంచి గంగమ్మకు బ్రాహ్మణేతరులు, శూద్రులు పూజలు చేయు నారంభించారు.

మరో కథను పరిశీలించండి-

పూర్వం భూలోకంలోని ప్రజలు కరువు కాటకాలతో సతమతమవుతుం-టారు. వారు ఈ కష్టాల నుండి బయట పడడానికని ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తారు. వారి ప్రార్థనను ఆలకించి ఈశ్వరుడు గంగను పంపుతాడు. ఈ గంగ తిరుపతి కపిల తీర్థంలో చిన్న బిడ్డగా మారి నీళ్ళపై తేలుతుంటుంది. అది చూసిన ఒక బ్రాహ్మణుడు ఆ చిన్నబిడ్డను తీసుకొని వచ్చి పెంచ సాగాడు. ఆ గంగ మశూచికం, కలరా వంటి అంటు వ్యాధుల్ని వ్యాపింప జేయునారంభించింది. తరువాత తిరుపతి ప్రజలు ఈ గంగను ఆరాధిస్తూ, ఆమెను శాంత పరచడానికని జాతరను ఏర్పాటు చేశారట.

అలాగే తిరుపతి ప్రజల్లో ఇద్దరు గంగమ్మలను గూర్చి ఒక కథ ప్రచారంలో ఉంది. దానిని పరిశీలిస్తే చిన్న గంగమ్మకు ఎందుకింత ప్రాధాన్యమొచ్చిందో తెలుస్తుంది, చూడండి-

పెద్ద గంగమ్మ, చిన్న గంగమ్మ అక్కాచెల్లెళ్ళు. చిన్న గంగమ్మ ఒకసారి తన అక్క పెద్ద గంగమ్మ ఇంటికి పిల్లలను చూడడానికని తినుబండారాలను తీసుకొని వెళ్తుంది. గ్రోడాలైన చెల్లి తన పిల్లలను చూస్తే దిష్టి తగులుతుందని పిల్లలను గంప కింద దాచి పెడ్తుంది పెద్ద గంగమ్మ. చిన్న గంగమ్మ గంప మీద కూర్చొని పిల్లలు ఎక్కడికి పోయారని అడుగుతుంది. అందుకు పెద్ద

గంగమ్మ చెట్టుకొకరు, పుట్టకొకరు పోయారని అబద్ధం చెబుతుంది. ఎంతో ఆశతో తన అక్క బిడ్డలను చూడడానికి పోయిన చిన్న గంగమ్మకు ఆ మాటలు ఆగ్రహాన్ని కలిగిస్తాయి. కోపంతో చిన్న గంగమ్మ గంప కింద పిల్లలను మాయం చేసేసి అక్క ఇంటి నుంచి వచ్చేస్తుంది. పిల్లలు కనిపించక పోయేసరికి పెద్ద గంగమ్మ తన చెల్లి దగ్గరకొచ్చి చేసిన తప్పుకు క్షమించమని ప్రాధేయపడుతుంది. తన పిల్లల్ని తిరిగి తనకు అప్పగిస్తే ముందు పూజలు చిన్న గంగమ్మ కని, తరువాతి పూజలు తనకని, అలాగే ప్రజలు సమర్పించే ఆహారం అంతా చిన్న గంగమ్మకేనని, తనకు ఒక్కదున్నపోతు బలి చాలని పెద్ద గంగమ్మ అంటుంది. తరువాత చిన్న గంగమ్మ, పెద్ద గంగమ్మకు పిల్లలను అప్పగిస్తుంది. అప్పట్నుంచి చిన్న గంగమ్మకు లెక్కలేనన్ని దున్నపోతులను బలిస్తున్నారు. పెద్ద గంగమ్మకు మాత్రం ఒకే ఒక దున్న పోతును బలిస్తున్నారు.

తిరుపతి చుట్టు పక్కల ప్రాంతాలలో గంగమ్మను గూర్చి మరికొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. వాటిలో ప్రధానమైన కథలను గమనించండి-

ఒకానొకప్పుడు ఒక హరిజనుడు తాను బ్రాహ్మణుడని చెప్పుకొని ఒక పండితుని దగ్గర పురాణాలు, శాస్త్రాలను అభ్యసిస్తాడు. తరువాత బ్రాహ్మణుడైన ఆ పండితుడు తన కుమార్తెను ఇచ్చి ఆ హరిజనుడితో వివాహం జరిపిస్తాడు. అలా వారి దాంపత్యం సాఫీగా సాగిపోతుంటుంది. ఒక పండుగరోజు బ్రాహ్మణస్త్రీ పోళీలను చేసి కొడుకులకు వడ్డిస్తుంది. పోళీలను చూసిన కొడుకులు ఎనుబోతు నాలుకల్లా ఉన్నాయంటారు. ఆమె అనుమానించి, నిజం తెలుసుకొని తన భర్తను ఎనుబోతుగాను, కొడుకులను పొట్టేలు, మేక, కోడిగా అయిపొమ్మని శపిస్తుంది. ఎను బోతుగా మారిన ఆమె భర్త ఆగ్రహంతో ఆమెను తరుముకుంటాడు. ఆమె పుట్టలో దాక్కుంటుంది. అయినా ఎనుబోతు రూపంలోని వాడు ఆమెను వదలక, కాళ్ళతో పుట్టను తవ్వుతూ, కొమ్ములతో పొడవ సాగాడు. అందుకు ఆగ్రహంతో ఆ బ్రాహ్మణస్త్రీ "నీ తలను నరికించి, కుడి కాలును నరికి నీ నోటిలో పెట్టి, నీ రక్తాన్ని తిలకంగా నా నుదుట దిద్దుకుంటా " నని శపథం చేస్తుంది. ఆ బ్రాహ్మణ స్త్రీయే తరువాత 'గంగమ్మ' అయింది.

ఈ కథనే మరోరకంగా కూడా చెబుతారు-

ఒక బ్రాహ్మణ ఉపాధ్యాయునికి గంగమ్మ అనే కూతురుంటుంది. ఒక మాదిగ కులం విద్యార్థి తాను బ్రాహ్మణుడని చెప్పి అతని దగ్గర విద్యాభ్యాసం చేస్తూ, ఎంతో అణకువగా ఉండేవాడు. ఉపాధ్యాయుడు తన కూతురు గంగ-

మ్మను ఆ మాదిగ కులం విద్యార్థి మంచి తనం చూసి అతని కిచ్చి వివాహం చేస్తాడు. కొన్నాళ్ళకు ఆ విద్యార్థి తల్లి తన కొడుకు దగ్గర కొస్తుంది. తన తల్లిని ఎక్కడ మామ, భార్యలు గుర్తిస్తారోనని, ఆమెకు గుండు కొట్టి, ఎర్రచీరను ధరింపజేసి, నుదుట విభూదిని పెట్టి, మూగదానిగా నటించ మంటాడు. తన తల్లి మాటల్ని వింటే తాను పట్టుబడి పోతాడనే భయంతో. అందుకు ఆమె వొప్పుకొని మూగదానిగా నటిస్తూ ఉంటుంది. బ్రాహ్మణ వంటకాలు ఆమెకు రుచించేది కాదు. ఒక రోజు ఆ వంటకాలు తినలేక, అందరూ భోంచేసేటప్పుడు తన కొడుకును ' ఒరేయ్ కదిరిగా! ఈ తిండి నేను తినలేను'అని ఆవేశంతో అంటుంది. అది విన్న ఆ బ్రాహ్మణ ఉపాధ్యాయుని కూతురు అనుమానించి తన తండ్రితో 'కుక్క ముట్టిన కుండనేమి చేయాలి' అని అడుగుతుంది. ఆ మాటల సారాంశాన్ని అర్థం చేసుకొన్న ఆమె తండ్రి సహించలేక తన కూతుర్ని ఇంట్లో ఉంచి, తాళంవేసి ఇంటిని కాల్చేస్తాడు. ఆ మంటల్లో గంగమ్మ కూడా కాలి పోతుంది. చనిపోయిన గంగమ్మ తన భర్తకోసం అదృశ్యరూపంలో వేప చెట్టుపై కూర్చొని ఎదురు చూస్తుంటుంది. ఆ విషయం తెలియని గంగమ్మ భర్త వేప చెట్టును నరికిస్తాడు. దానితో గంగమ్మకు ఎక్కడలేని ఆగ్రహం వచ్చి తన భర్తను దున్నపోతుగాను, అతని తల్లిని గొర్రెగా మారి, వాళ్ళు ప్రతి సంవత్సరం తనకు జరిగే జాతరులో బలి అవుదురు గాక! అని శపిస్తుంది. అప్పట్నుంచి ఆమే గంగమ్మగా పూజలందుకుంటోంది.

తిరుపతి గంగమ్మ కథలు కొన్ని తాతాచార్యుల వారితో ముడిపడి ఉన్నాయి-

తాతాచార్యులు పని మీద కడపకు వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు, చీకటి పడేసరికి మార్గ మధ్యంలో గల తాళ్ళపాక గ్రామాన్ని చేరుకుంటాడు. ఆ గ్రామస్థులు తాతాచార్యుల వారికి వంట వండు కోవడానికి కుండలు, కట్టెలు, నీళ్ళు, వంట సామగ్రిని ఇస్తారు. ఆయన తానే స్వయంగా వంట చేసుకొని తిని, పక్కనే ఉన్న రచ్చ బండ మీద పడుకో బోయాడు. కానీ గ్రామ ప్రజలు అక్కడ ఒక శక్తి ఉందని, దానివల్ల అపాయం జరుగుతుందని తాతాచారికి చెబుతారు. తాతాచారి వారి మాటలను లెక్కచేయక, రచ్చబండ చుట్టూ మంత్రించిన అక్షింతలు చల్లి రచ్చ మధ్యలో పడుకుంటాడు. అర్ధరాత్రి శక్తివచ్చి తాతాచారిని మింగబోతుంది. కానీ అతని మంత్ర శక్తి వల్ల ఆగి పోతుంది. అలికిడికి తాతాచారి లేచి తన మంత్ర ప్రభావంతో ఆ శక్తిని చిన్న పాపగా చేసి తన పక్కన పడుకో బెట్టు కుంటాడు. తెల్లవారగానే ఆ ఊరి ప్రజలు రచ్చబండ దగ్గరకు వచ్చి తాతాచారి పక్కనున్న పాప రూపంలోని శక్తిని చూచి, ఆమె నిజస్వరూపాన్ని చూపమని తాతాచారిని కోరుతారు. అందుకు తాతాచారి

శక్తికి జాతర చేయాలంటాడు. అందుకు గ్రామస్థులు సరేనని జాతరచేస్తారు. అప్పుడు ఆశక్తి భయంకరమైన తన రూపాన్ని చూపిస్తుంది. ఆ శక్తి నిజ స్వరూపాన్ని చూచి గ్రామస్థులు భయపడి పోతారు. తాతాచారి ఆ శక్తిని తిరిగి చిన్నపాపగా మార్చేస్తాడు. తాళ్లపాక గ్రామస్థులు ఆ శక్తిని ఎక్కడికైనా తీసుకొని పొమ్మని తాతాచారికి కొంత డబ్బును ఖర్చుల నిమిత్తం ఇస్తారు. తాతాచారి పాపరూపంలో గల ఆ శక్తిని తిరుపతికి తీసుకొని వచ్చి, ఆ పాపని ఒక చోట కూర్చోబెట్టి స్నానానికి వెళ్తాడు. తాతాచారి స్నానానికి పోగానే దారిలో పోతున్న గాజుల శెట్టిని పిలిపించుకొని ఆ శక్తి గాజులను వేసుకోగా అవి మాయమై పోతాయి. గాజుల శెట్టి భయపడ్డాడు. తాతాచారి గాజుల శెట్టికి డబ్బులిచ్చేసి, పాప రూపంలోని శక్తిని తన ఇంటికి తీసుకొని వచ్చి పెంచి పెద్ద చేస్తాడు. శక్తికి యౌవనం వస్తుంది. తాతాచారి అవిలాల గ్రామంలో వుండే పాళెగాడికిచ్చి ఆమెకు వివాహము చేస్తాడు. మొదటి రాత్రి శోభనం గదిలో పాళెగాడు ఆ శక్తి భయంకర స్వరూపాన్ని చూసి పారిపోయి తిరుపతిలో దాక్కుంటాడు. అప్పుడా శక్తి తన తండ్రి తాతాచారిని పాలేగాడి కోసం వెతకను పంపిస్తుంది. కానీ పాళెగాడు కనిపించడు. చివరకు ఆ శక్తే వివిధ రకాల వేషాలను వేసుకొని పాళెగాడి కోసం ఒక వారం పాటు వెతుకుతుంది. చివరి రోజు సున్నపుకుండ వేషం వేసి వెతుకు తుండగా ఒక వీధిలో దాగుకొని ఉండే పాళెగాడిని సంహరిస్తుంది. పాళెగాడు తనకు 'ఆగతి'కి (ఆహుతికి) సరిపోయాడని, తన కామ కోరికను ఎవరు తీరుస్తారో తాతాచారిని చెప్పమంటుంది. ఇక ఆ శక్తిని భరించడం కష్టమని తాతాచారి ఊరి పెద్దలతో సంప్రదించి తిరుపతికి తూర్పున ఉండే చెరువు దగ్గర తూర్పుదిశగా ముఖం పెట్టి, శక్తి శాంతి కోసం దున్న పోతుల్ని, పొట్టేళ్ళను, మేకలను, కోళ్ళను బలిచేసి జాతరను జరిపిస్తాడు. అప్పట్నుంచి ఆ శక్తే గంగమ్మగా పిలువబడుతోంది. ఆమె వేసిన వేషాలు జాతర జరిగే ఏడు రోజుల్లో వేస్తారని, మొక్కుబళ్ళతో చప్రాలు కుట్టుకుంటారని, అలా కుట్టేటప్పుడు శరీరం నుంచి కారే కొంచెం రక్తం గంగమ్మకు ఆగతి అని, జనం తిట్టే బండబూతులే ఆమె కామ వాంఛను తీరుస్తాయని తాతాచారి చెబుతాడు[17].

అలాగే తిరుపతి గంగమ్మను గూర్చి తాతాచార్యులతో సంబంధం వున్న మరో కథ కూడా ప్రచారంలో ఉంది. అది-

పూర్వం తిరుపతిలో క్షుద్ర దేవత ప్రభావం ఎక్కువగా ఉండడం వల్ల ప్రజలకు పెద్ద అమ్మవారు, కలరా వంటి వ్యాధులు సోకి అధికంగా

---

[17] పైడాల సుభాన్ సాహెబ్, నరసింగాపురం గ్రామం; (చంద్రగిరి మండలం)

చనిపోతుండేవారు. క్షుద్ర దేవతను అదుపులో ఉంచి, ప్రజలను కాపాడడానికి, కుమార తాతాచార్యులు ఒకరోజు పగలంతా సుదర్శన హోమాన్ని చేస్తాడు. ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలకు క్షుద్ర దేవత ఆలయం వదలి ఊరిలో పర్యటించడానికి పోతూనే, ఆ గుడిలో తాతాచార్యులు ప్రవేశించి అక్కడ కూడా నారసింహ సుదర్శన హోమాలు చేస్తుంటాడు. తెల్లవారు జామునే క్షుద్ర దేవత తిరిగి తన గుడికి వచ్చి తలుపు తడుతుంది. లోపల తాతాచార్యులు తలుపు తీయక భయపడకుండా సుదర్శన మంత్రాలను ఉచ్చరిస్తూ ఉంటాడు. హోమం పూర్తి కాగానే, హోమంలో బాగా కాల్చి ఉన్న శంఖ చక్రాల ముద్రలను చేత బట్టుకొని తటాలున తలుపు తీసి క్షుద్ర దేవత భుజాన వేస్తాడు. ఆ దేవత కుయ్యో, మొర్రో అని అరుస్తుంది. పాంచజన్య స్పర్శ జ్ఞానం వల్ల తాతాచార్యుల పాదాలపై పడి శరణు వేడి, ఆచార్యుల ఆజ్ఞానుసారంగా నడుచుకుంటానని చెప్తుంది. అందుకు తాతాచార్యులు ఆ క్షుద్ర దేవతను ఊరు బయట గల గుంట దగ్గర ఉంటూ తన శిష్యులైన తిరుపతి ప్రజలకు ఏ కష్టం కలుగుండా కాపాడమని ఆజ్ఞాపిస్తాడు. అప్పట్నుంచి ఆక్షుద్ర దేవత 'గంగమ్మ' అనే పేరుతో తాతాయగుంట దగ్గర పూజలందు కుంటోంది.

తిరుపతి గంగమ్మ తిరుపతికి మూడుమైళ్ళ దూరంలోని అవిలాల గ్రామం (రాజీవ్‌నగర్ సమీపం)లో పుట్టిందట. ఈ పుట్టుక విషయంలో మాత్రం ప్రజలందరూ ఏకాభిప్రాయాన్నే వ్యక్త పరుస్తారు. అయితే గంగమ్మ తోబుట్టువుల విషయంలో కొన్ని భిన్నాభిప్రాయాలున్నాయి. గంగమ్మ ఏడు-గురు అక్కచెల్లెళ్లలో ఒకరు. వారు- పెద్ద గంగమ్మ (తాళ్ళపాక గంగమ్మ), అంకాళమ్మ, ముత్యాలమ్మ, వేషాలమ్మ, పోలేరమ్మ, నేరేళమ్మ, చిన్న గంగమ్మ (తాతయ్యగుంట గంగమ్మ). ఈ గ్రామ దేవతలందరికీ తిరుపతి పొలిమేరల్లో గుడులున్నాయి. ఇంకొందరు గంగమ్మ ఒకరేనని ఆమె తోబుట్టువులలో పొన్నాలమ్మ, వేమాలమ్మలు కూడా ఉన్నారంటారు. అంకాళమ్మకు పూర్వం ఆమె గుడిలో, ఆమె స్థానంలో 'తిరుపతమ్మ' అనే గ్రామదేవత ఉండేది. ఎవరైతేనేం వీళ్ళు ఏడుమంది అక్కాచెల్లెళ్ళు. వీరికి తిరుమలలోని శ్రీ వేంకటేశ్వర స్వామి సోదరుడని అనూహానంగా భావింపబడుతోంది.

ఇలా తిరుపతి గంగమ్మ పుట్టు పూర్వోత్తరాలను గూర్చి ఎన్నో కథలు జన వ్యవహారంలోఉన్నాయి.

తిరుపతి గంగమ్మ కథలను పరిశీలిస్తే కొన్ని కథలు ఇతర గ్రామ దేవతల కథల్లాగే ఉంటాయి. పేర్లు వేరైనా గ్రామదేవతలు మీద ప్రజల

కుండే భయభక్తులు, నమ్మకాలు ఒక్కటే. గ్రామ దేవతలకు ఆగ్రహం వస్తే మశూచి, కలరా వంటి అంటువ్యాధులు ప్రబలుతాయని భావిస్తారు. కాబట్టి అన్ని గ్రామదేవతలు చేసే మంచి చెడ్డలు ఒకే విధంగా ఉండడం వల్ల, వారి మీదుండే కొన్ని కథలు కూడా ఒకే విధంగా ఉన్నాయని చెప్పొచ్చు. కానీ ఇతర ప్రాంతాల్లో లేని కొన్ని కథలు ప్రత్యేకించి తిరుపతి గంగమ్మకు ఉండడం విశేషం. ఇందులో ప్రధానమైనవి 'తాతాచార్యులు-గంగమ్మ ' కు సంబంధించిన కథలు, అలాగే 'పాళెగాడు - గంగమ్మ 'కు సంబందించిన కథలు. వీటిలో అతి ప్రధానమైనవి 'పాళెగాడు -' గంగమ్మ ' కథలే. ' పాళెగాడు - గంగమ్మ 'కథను ఆధారం చేసుకొనే తిరుపతి గంగ జాతరలో వివిధ వేషాలు వేస్తారు. కాబట్టి ఈ కథకు ఓ ప్రత్యేకత ఉంది. పంబలవారు చెప్పే గంగమ్మకథ 'సృష్టికి సంబంధించిన శక్తి కథ' ను పోలి ఉండడం గమనార్హం.

# 3. తిరుపతి గంగ జాతర

3.0. ప్రపంచంలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన తిరుపతిలో గ్రామదేవతైన గంగమ్మకు అత్యంత వైభవంగా, కన్నుల పండుగగా జాతర జరగడం ఎంతో గమనించదగిన విషయం. ఇంత వైవిధ్యంగల జాతరను భారత దేశంలో ఎక్కడా చూడలేం.

జాతర 'యాత్ర' అనే శబ్దం నుండి ఉద్భవించింది. అంటే చుట్టుపక్కల ఉండేవారంతా ఒకచోటకు యాత్రలాగ వెళ్ళి ఉత్సవాన్ని జరుపు కోవడమే జాతర అని చెప్పుకోవచ్చు. జాతరనే కొన్ని ప్రదేశాలలో తిరునాళ్ళు, పరస అని కూడా అంటారు.

ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క దేవతకు జాతరను జరిపిస్తుంటారు. గ్రామదేవతలు వేరైనా వారిని ఆరాధించే విధానంలో కొంత తేడా కన్పించినా బలులు ఇచ్చే విధానం దేశంలోని అన్ని ప్రాంతాల్లో ఇంచు మించు ఒకేవిధంగా వుంటుంది.

శాసనాలను, సాహిత్యాన్ని పరిశీలిస్తే, అందులో గ్రామదేవతల తిరునా-ళ్ళకన్నా శిష్టదేవతల ఉత్సవాలే అధికంగా పేర్కొనబడి ఉన్నాయి. రాజాశ్రయం లభించిన మతాలను, దేవుళ్ళను గూర్చి శిష్టులైన పండితులు చరిత్రకారులు, తమ రచనల్లో పేర్కోవడం జరిగిందే కానీ జానపద దేవతలను గూర్చి, వారి జాతరలను గూర్చి శాసనాల్లో, సాహిత్యంలో అంతగా ఎవరూ పట్టించుకోలేదు. అంతమాత్రాన వాటి ఆవశ్యకత తక్కువని చెప్పటానికి వీలులేదు. జానపద దేవతలకు రాజాశ్రయం ఉండకపోవచ్చు, శిష్టులు పట్టించుకోక పోవచ్చు. కానీ గ్రామాలలో అనాదిగా ప్రతి వ్యక్తీ భయభక్తులతో కొలిచేది, జాతర్లను జరిపించేది గ్రామదేవతలకే. సాహిత్యంలో గ్రామ దేవతలను గూర్చి జాతర్లను గూర్చి ప్రస్తావనలు కనిపిస్తాయి. అయితే వారికి జరిగే తిరునాళ్ళను గూర్చి ఎక్కువగా పేర్కొనబడలేదు.

ఆంధ్ర మహాభారతం లో జాతరను గూర్చి చాటించే విధానం గూర్చి విపులంగా పేర్కొనబడింది. కింది పద్యాన్ని గమనించండి-

"జాతర సేయఁగా వలయు సర్వజనంబులు నంబురాశికిన్

బ్రాతిగ భక్తితోడ నని బంధుల కెల్లను జెప్పి వీటవి

ఖ్యాతిగా నప్డు సాటుటకు నర్థునిఁబంచిన ఘంటి కాస్వనో

పేటము గాఁగ వాఁడెలమి బెద్ద యెలుంగునఁజాటే నెల్లడన్"[1]

అలాగే పాండురంగ మాహాత్మ్యంలో 'గాలిగంగల ' జాతర చాటింపు గురించి ప్రస్తావించబడి ఉంది-

"ఆతఁడి నన్నగరీ పతి

జాతర సాటించెఁబశు విసరమనితర సా

ధ్యాతత వాతామయుని

ర్ఘాతాహతిఁద్రూల గాలి గంగం కెల్లన్"[2]

ఇలా జాతరలను గురించి గ్రామదేవతల గురించి తెలుగు సాహిత్యంలో అక్కడక్కడ ప్రస్తావించబడి ఉంది.

జాతరల, గ్రామ దేవతల ప్రస్తావనను బట్టి ఆ దేవతలకు ప్రతి సంవత్సరం లేదా రెండు మూడేళ్ళ కొక సారైనా జాతరలు, తిరునాళ్ళు జరిగి తీరు తాయని మాత్రం ఊహించ వచ్చు. కాబట్టి సాహిత్యంలో కన్పిస్తున్న గ్రామదేవతల ప్రస్తావనలు గమనిస్తే వారికి జరిగే తిరునాళ్ళను మనం ఊహించవచ్చు. గ్రామదేవతలులేని ఊరును మనమెక్కడా చూడలేం. జానపదులు ఈ దేవతలకు కనీసం సంవత్సరానికి ఒకసారైనా పూజలు, తిరునాళ్ళు, జాతరలను జరిపిస్తుంటారు.

తిరుపతి గంగజాతరను గూర్చి పరిశీలించబోయే ముందు చిత్తూరు జిల్లాలో జరిగే జాతరలను గూర్చి కొంత తెలుసుకుందాం.

చిత్తూరు జిల్లాలో గంగ జాతరలు సర్వసాధారణంగా వేసవి రోజుల్లోనే జరుగుతాయి. ఊరిపెద్ద లేదా ఆ ఊరి ప్రముఖులు ఒకరోజును ( ఏదో ఒక మంగళవారం ) జాతర జరుగుతుందని వారం ముందే నిశ్చయిస్తారు. ఆ విషయాన్ని ఊరి వారందరికీ తెలియజేయడానికని తోటోడి (హరిజనుని) చేత దండోరా వేయిస్తారు. ఈ దండోరానే 'చాటు' అంటారు. అంటే ఊరంతటికీ విషయాన్ని చాటించడం వల్ల 'చాటింపు' అని కూడా అంటుంటారు. అప్పట్నుంచి ఆ ఊరి వాళ్ళు బయట ఊర్లకు వెళ్ళరు. ఒకానొకప్పుడు బయట ఊరి వాళ్ళను తమ ఊర్లోకి రానిచ్చేవారుకారు. ఈ జాతర రెండు లేదా మూడు రోజుల పాటు జరుగుతుంది. ఒక్క తిరుపతి పట్టణంలో మాత్రమే

---

1 ఆంధ్ర మహాభారతం - మౌసల పర్వం; ఏకాశ్వాసం, పద్యం - 24.

2. పాండురంగ మాహాత్మ్యం, తెనాలి రామకృష్ణుడు; ఆ.3 - ప. 73.

వారం రోజుల పాటు గంగజాతర జరుగుతుంది.

గంగ జాతరను చాటించాక ఊరంతటినీ శుభ్రపరుస్తారు. ఊరిలో వేపాకు తోరణాలను అలంకరిస్తారు. గంగమ్మకు ఆలయాలు చిత్తూరు జిల్లాలో చాలా తక్కువ. పట్టణాలలో, పెద్ద ఊర్లలో తప్ప చిన్న చిన్న గ్రామాలలో గుళ్ళుండవు. గంగమ్మ ఆలయాలున్న చోట జాతరను ఆలయాల ముందే జరుపుతారు. ఆలయాలు లేని చోట జాతరను ఊరి మధ్యలోగాని, లేదా ఊరి పొలిమేరలోగాని చేస్తారు. గంగమ్మను ప్రతిష్టించే చోటును బాగా శుద్ధిపరచి, కళ్ళాపుజల్లి, బాగా పేడతో అలికి, ముగ్గులేసి, చిన్న పందిరి వేసి దాని చుట్టూ గుడ్డలతో (చీరలతో) మూడువైపులా మరుగు చేసి ముందరివైపు దర్శనార్థం ఉంచుతారు. గంగమ్మను పిండితోగాని, దుత్త (చిన్నకుండ) తో గాని, మట్టితోగాని తీర్చి దిద్దుతారు. చాకలి కులస్థులుగాని, కుమ్మరి కులస్థులుగాని ఈ పనిలో పాల్గొంటారు. ఇలా తయారు చేసిన గంగమ్మకు చీర, రవిక తొడిగి, పసుపుకుంకుమలను తీర్చిదిద్దుతారు. ఆభరణాలతోను, పూలతోను అలంకరిస్తారు. గంగమ్మ పూజకు కర్పూరం, అగరువత్తులు, టెంకాయ, పూలు, అరటిపళ్ళు, సాంబ్రాణి, పసుపుకుంకుమలు, చిన్న నల్లగాజులు, చవాకులు, కదుంపొడి, వేపాకు, చలిబిండి, నెయ్యి, నూనె, దూదివత్తులు వంటి వస్తువులను వినియోగిస్తారు. మొక్కుబళ్ళు వున్నా లేకున్నా గంగమ్మను శాంతపరచడానికి, ఆమె కరుణా కటాక్షాలను పొందడానికి వూరులోని ప్రతి కుటుంబం గంగమ్మకు అంబళ్ళను పోయడం, పొంగళ్ళను పెట్టడం, కరవాడు (ఎండుచేప) పులుసుతో తళిగలు వేయడం జరుగుతుంటుంది. మొక్కుబళ్ళు ఉన్న వాళ్ళు గుగ్గిళ్ళను చెరగడం, అడుగడుగు దండాలు పెట్టడం, అంగప్రదక్షిణ చేయడం, చప్పరాలను కుట్టుకోవడం, జంతువులను బలివ్వడం వంటివి చేస్తారు. పొంగలి చేసి గంగమ్మకు నైవేద్యం పెట్టి తర్వాత ఇంటికి తీసికొని వచ్చిగాని లేదా అక్కడేగాని ఆరగిస్తారు. జంతువులను వారి వారి తాహతు మేరకు, మొక్కుబడి మేరకు బలిస్తుంటారు. కొందరు దున్నపోతుల్ని బలిస్తే, మరికొందరు పొట్టేళ్ళను, మేకపోతులను, మరికొందరు కోళ్ళను బలిస్తుంటారు. పోతును నరికిన తరువాత దాని రక్తాన్ని పట్టి అన్నంలో కలిపి, గ్రామ పొలిమేరల్లో, పొలాలపైన చల్లుతారు. దీనినే 'పొలి' అంటారు. దున్నపోతును, పొట్టేలును, మేకపోతులతో పాటు గొర్రెను కూడా నరికి దాని పేగుల్ని మెళ్ళో హారంలా వేసుకుంటారు. గొర్రె రక్తాన్ని తీసుకొని అన్నంలో కలిపి, దాన్నిచేటలో వేసుకొని పలకలు, కొమ్ముల వాయిద్యాలతో వూరంతా తిరుగుతూ చల్లుతారు. దీనినే "బలిచేట ఎత్తడం" అని "బలి అన్నం" అని అంటారు. బలిచేటను హరిజనుడు ఎత్తుకుంటాడు.

ఊరిలోని స్త్రీలు అంబళ్ళను తెచ్చి గంగమ్మ ముందు ఉంచిన పెద్ద పెద్ద గంగాళాలకు నింపుతారు. ఆ తరువాత దానిని బీదసాదలకు పోస్తారు. అలాగే స్త్రీలు అంబళ్ళను పెద్ద పాత్రలో ఉంచి ఆ పాత్ర చుట్టూ వేపాకును కట్టి , నట్టింటిలో గంగమ్మను పూజించాక, వీధిలోనికి తెచ్చి అంబళ్ళను దారిన వచ్చి పోయే వాళ్ళకు పోస్తుంటారు. ఇలా పోయడం వల్ల పుణ్యం వస్తుందని, ఆ అంబలిని ఎంతో పవిత్రంగా తాగడం వల్ల శరీరం శాంతపడుతుందని, మంచి జరుగుతుందని ప్రజలు భావిస్తారు. అంబలిని ఎలా చేస్తారంటే, అన్నం వండే-టప్పుడు పొంగువచ్చిన తరువాత రాగిపిండిని కలిపి సంగటిలా తయారుచేస్తారు. ఆ తర్వాత అందులో ఎర్రగడ్డలను చిన్నగా తరిగి తగు మోతాదులో గడ్డపెరుగు, ఉప్పు, నీళ్ళను కలిపి ద్రవపదార్థంలా తయారుచేస్తారు. దీనినే అంబలి అంటారు. అంబలిని దోసిట్లోగాని లేదా గిన్నెలు, గ్లాసులతో గాని తాగుతారు. చిన్నపిల్లలకు అమ్మవారు పోసినపుడు, అంటువ్యాధులు వచ్చినపుడు అంబలి పోస్తామని కూడా మొక్కు కుంటారు. అలా రోగాలు నయమైనపుడు కూడా అంబలిని గంగజాతర జరిగే బుధవారం ఉదయం పూట వీధుల్లో వచ్చే పోయే వారికి తాగడానికి పోస్తుంటారు.

మొక్కుబళ్లు ఉన్నవాళ్లు చప్పరాలను కట్టుకొని ఊరంతా తిరుగుతూ గంగమ్మను దర్శించుకుంటారు. అలాగే కొందరు ఇంటి నుండి గంగమ్మ గుడివరకు అభ్యంగన స్నానం చేసి అడుగడుగు దండాలు పెడ్తూ పోతుంటారు. మరికొందరు గుడిచుట్టూ పొర్లుదండాలు (అంగప్రదక్షిణం) పెడ్తుంటారు. అక్కడక్కడా గంగమ్మకు తల నీలాలు సమర్పించడం కూడా వుంది. ఇక వేయికళ్ళ దుత్తను మహిళలు తీసుకొని వెళ్ళి గుడిదగ్గర పగులగొడ్తుంటారు. అలాగే అక్కడక్కడ కొన్ని ఊర్లలో తిరుపతి గంగజాతర ప్రభావం వల్ల వేషాలు వెయ్యడం కూడా కనిపిస్తుంటుంది. చివరిరోజు మంగళవారం రాత్రి గంగమ్మను వస్త్రాభరణాలతో బాగా అలంకరించి ఊరేగిస్తారు. ఊరేగింపులో 'పోతురాజు'ను కూడా పల్లకిలో ఊరేగిస్తారు. గ్రామ ప్రజల చేత పూజలు, హారతులు అయ్యాక గంగమ్మను పరిశుభ్రమైన నీటిలో నిమజ్జనం చేస్తారు. దీనితో గంగజాతర ముగుస్తుంది.

ఇక తిరుపతిలో జరిగే గంగజాతరను గమనించండి.

తిరుపతి గంగజాతర ప్రతిసంవత్సరం వైశాఖ మాసంలో (మే నెలలో వస్తుంది.) తమిళ మాసమైన చిత్రినెల అంటే ఏప్రిల్ 13 వతేదీ నుండి గంగజాతర తొలి వారం ప్రారంభమౌతుంది. నాల్గోవారంలో అంటే చిత్రినెల చివరి మంగళ వారంలో గంగజాతర జరుపుతారు. మొదటి మంగళ వారం



అవిలాలలో ఊరి మధ్యలో నెలకొని ఉన్న గంగమ్మ



అవిలాల ఊరి వెలుపలున్న గంగశిల వద్ద
జాగీరు పెట్టెతో ఉన్న పెద్దరెడ్డి



నుండి నాల్గో మంగళవారం వరకు అంటే నాలుగు మంగళవారాలు స్థానికులైన చిన్న పిల్లలు, పెద్దలు, మొక్కుబడి వున్నవాళ్ళు చిన్న చెంబును తీసుకొని దానికి పసుపుపూసి కుంకుమ పెట్టి, వేపాకు మండలను చుట్టి కొంత వేపాకు చేత బట్టి ప్రతి ఇంటిముందు ఆగి వేపాకుతో చెంబుపై మంత్రిస్తూ-

"మంగళారం
మడి బిచ్చం
ఒక పొద్దు
ఒడి కొండ"

అని అంటూ భిక్షమెత్తుతారు. ఈ భిక్షాటనలో ధనికులు కూడా పాల్గొనేవారు. ఇలా తిరుపతిలో గంగజాతరకు శ్రీకారం చుట్టబడుతుంది. కాలక్రమేణా ఈ భిక్షాటన పద్ధతి అంతరించిపోయింది. ఇరవై ఏళ్లకు ముందు కనీసం పిల్లలైనా భిక్షాటనకు వెళ్ళేవారు. ఆ భిక్షంలో వచ్చిన ఓయ్యం, డబ్బుతో గంగజాతర రోజున పొంగళ్ళు పెట్టేవారు. ఇప్పుడు ఈ పద్ధతి పూర్తిగా అంతరించి పోయింది. పై విధంగా జాతర కోలాహలం మొదలయ్యేది.

3.1. జాతర చాటింపు విధానం :- తిరుపతికి మూడు కిలోమీటర్ల దూరంలోని అవిలాల గ్రామం గంగమ్మ స్వస్థలమని మనమిది వరకే తెలుసుకొని ఉన్నాం. అక్కడ జాతరకు, తిరుపతి జాతరకు అవినాభావ సంబంధముంది. కాబట్టి అవిలాల జాతరను గురించి కూడా కొంత తెలుసుకోవడం అవసరం. అవిలాలలో వారం ముందే జాతరను చాటిస్తారు. తిరుపతిలో జాతర చాటించడానికి ముందు ఇక్కడ జాతర ప్రారంభమౌతుంది. అంటే మంగళవారం రోజు సాయంత్రం అవిలాలలోని 'పెద్దరెడ్డి' (ముళ్ళపూడి సుబ్బరామి రెడ్డి) ఇంట్లో నట్టింట పళ్ళు, పూలు, చీర, రవిక, పసుపు కుంకుమలు, గాజులు పెట్టి గంగమ్మను పూజిస్తారు. తర్వాత సాయంత్రం 5.30 గంటల పైన 'జాగీరు పెట్టె' లో చీర, రవిక, గాజులు, పసుపు కుంకుమలు, దువ్వెన, ఖర్జూరకాయలు, కలకండ, ఎండు కొబ్బెర, పళ్ళు, పూల హారాలను ఉంచుకొని ఊరి మొదట వ్యవసాయభూమిలో ఉన్న 'గంగశిల' దగ్గరకు 'పెద్దరెడ్డి', అవిలాల ప్రజలు వెళ్తారు. అక్కడకు తిరుపతి నుండి పెద్దగంగమ్మ మిరాశిదారులైన కైకలవాళ్లు, ఇతర మిరాశిదార్లు పంబలవాళ్ళను వెంటబెట్టుకొని గంగమ్మను అక్కడ నుండి తీసుకొని రావడానికి లేదా గంగమ్మకు అక్కడనుంచి పసుపు కుంకుమలు తేవడానికి వెళ్తారు. వీరు వెళ్ళేటప్పుడు పంచె, సవకం, పూలమాల, టెంకాయ, కర్పూరం వంటి వాటిని తీసుకొని అవిలాల ముందున్న 'గంగశిల' దగ్గర

కెళ్తారు. అప్పటికే గంగశిల దగ్గర పరిశుభ్రపరచి పందిరి వేసుంటారు కూడా. అవిలాల గ్రామస్థులు 'సాంగ్యం'ను 'జాగీరు' (దీర్ఘ చతురస్రాకార మూత బుట్ట) లో ఉంచుకొని పలకల (డప్పు) వాయిద్యాలతో 'గంగశిల' దగ్గరున్న తిరుపతి వాళ్ళ దగ్గరకొస్తారు. గంగశిలను అవిలాల వాళ్ళు నూనె, శీకాయ, పన్నీరు, పాలు వంటి వాటితో మొదట కడుగుతారు. తర్వాత పసుపు కుంకుమలు పెట్టి పూల హారాలు వేస్తారు. అవిలాల వాళ్ళు బుట్టలో తెచ్చిన చీర, రవిక వంటి వస్తువులన్నింటినీ ఒక తాంబూల తట్టలో పెడ్తారు. అలాగే తిరుపతి వాళ్ళు తెచ్చిన పంచె, సవకం వంటి వస్తువులన్నింటినీ మరో తాంబూల తట్టలో వుంచి గంగశిల ముందు పెడ్తారు. మొదట తిరుపతి వాళ్ళు టెంకాయ కొట్టి హారతిస్తారు. తరువాత అవిలాల వాళ్ళు కూడా టెంకాయకొట్టి హారతిస్తారు. ఇలా పూజించాక 'సాంగ్యం' పళ్ళాలను మార్చుకుంటారు. అంటే అవిలాల వాళ్ళ చీర, రవిక, పసుపుకుంకుమలు తిరుపతి వాళ్ళ పళ్ళెంలోకి, తిరుపతి వాళ్ళ పంచె, సవకం అవిలాలవాళ్ళ బుట్టలోకి మార్చుకొని తిరిగి చూడకుండా అవిలాలవాళ్ళు అవిలాలకు, తిరుపతివాళ్ళు తిరుపతికి వెళ్ళిపోతారు. ఈ తంతు జరగడానికి మాత్రమే గంగశిల ప్రతిష్ఠింపబడిందని చెప్పొచ్చు. అవిలాల గ్రామస్థులు పూజలు చేసి, జాతర జరిపించేది ఊరి మధ్యలో వీధిలో ఉన్న గంగమ్మ రాతి శిలకే.

తిరుపతి వారికి సాంగ్యం పెట్టి సాయంత్రం 7.30 గంటలకు గంగశిల దగ్గర్నుంచి అవిలాల గ్రామంలోకి వచ్చి జాతరకు శ్రీకారం చుడ్తారు. చాకలి వాళ్ళు అర్రాత్రి గంగమ్మను ఊరి బయట, ఈశ్వరుడి గుడి దగ్గర మట్టితో చేస్తారు. తర్వాత గంగమ్మ బొమ్మను బాగా అలంకరిస్తారు. గంగమ్మను ఊర్లోకి తేవడానికి ముందు ఊరి పెద్దలు, ప్రజలు ఊరి మొదటుండే పెరుమాళ్‌స్వామి గుడి సమీపానికెళ్ళి అక్కడ 'గాలిగంగ' 'ఏట'(గొర్రె)ను నరుకుతారు. తర్వాత చాకలి ఇంటికి వెళ్ళి 'అమృత పళ్ళెం' తెస్తారు. ఊరి మధ్యలో ఉండే గంగమ్మ శిల దగ్గర తడికలతో మూడు వైపులా కట్టి, చీరలు చుట్టి గుడిలా చేస్తారు. ఊరి బయట చాకలి వాళ్ళు మట్టితో చేసిన అలంకరించిన గంగమ్మకు దిష్టి చుక్కను పెట్టి బుధవారం తెల్లవారుజామున ఊర్లోకి తీసుకొస్తారు. ఊరికి తూర్పున (ముత్యాలమ్మ గుడి సమీపంలో) గంగమ్మను తెచ్చి నిలుపుతారు. అక్కడకు ఊరివారంతా వచ్చి 'చీకటి కుంభాలు' (విస్తరాకు కుంభాలు) వేసి, మేకపోతులు, గొర్రెలు, కోళ్ళను బలిస్తారు. అలా ఆరాధించిన తర్వాత ఆ గంగమ్మ ప్రతిమను అక్కడ్నుంచి తీసుకొని వచ్చి గంగమ్మ శిల ఉండే తడికెలతో, చీరలతో చేసిన గుళ్ళో ఉంచుతారు. అప్పుడు అక్కడ 'గండదీపాలు'( పిండిదీపాలు) పెట్టి మొక్కుబడి ఉండేవాళ్ళు దున్నపోతుల్ని బలిస్తారు. దున్నపోతు బలులు



తిరుపతి వాళ్ళు, అవిలాల వాళ్ళు సాంగ్యం పళ్ళాలను మార్చుకొంటున్న దృశ్యం



తిరుపతిలో 'చాటుపూజ'

బుధవారం ఉదయం పదకొండు గంటలపైన జరుగుతాయి. మొదట నరికిన దున్నపోతు కుడికాలును నరికి దున్నపోతు నోట్లో ఉంచి, దాని తలపై దీపం పెడ్తారు. అవిలాలలో దాదాపు 5 లేదా 6 దున్నపోతుల్ని నరుకుతుంటారు. బుధవారం సాయంత్రం పానకం దుత్తలు, నెయ్యి కళ్ళు దుత్తలు గంగమ్మకు సమర్పిస్తారు. బుధవారం అర్ధరాత్రి కుంభం వేసి బలిపిల్ల (పొట్టేలు) ను నరుకుతారు. ఆ నెత్తురు, అన్నాన్ని చేటలో కలుపుకొని తోటోడు ఊరంతా తిరుగుతూ పొలి చల్లుతాడు. ఈ తతంగం అయ్యే సరికి గురువారం తెల్లవారు జాము అవుతుంది. తర్వాత గంగమ్మను జలధికి పంపేస్తారు. అంటే గంగమ్మను నీళ్ళలో నిమజ్జనం చేయాలి. కాని అలా జరగడం లేదు. గంగమ్మ మట్టిని తలా కొంచెం తీసికొని వెళ్తారు. ఇలా అవిలాల గంగజాతర జరుగుతుంది. ఈ జాతరలో గంగమ్మకు పూజారులుగా చాకలి కులస్థులుంటారు. మిగిలిన బలిజ, గొల్ల, జంగమ కులస్థులు కూడా పాలు పంచుకుంటారు. 'పెద్దరెడ్డి' తన సొంత డబ్బులు (దాదాపు పదివేల రూపాయలు) సాంగ్యం కోసం ఖర్చు పెడ్తాడు.

తిరుపతి వాళ్ళు అవిలాల నుంచి తెచ్చిన చీరను పెద్ద గంగమ్మకు కట్టి టెంకాయ కొట్టి హారతిస్తారు.

అవిలాలలో జాతర జరిపించుకొనిన గంగమ్మను తిరుపతికి తీసుకొని వచ్చినట్లు లేదా పసుపు కుంకుమలు అమ్మ గారింటి నుండి తెచ్చినట్లు భావించి ఇక్కడ జాతర చేయడానికి పూనుకుంటారు. మంగళవారం రాత్రి జాతర చాటింపు వేసే ముందు పెద్దకాపు వీధి కొచ్చి పదిమంది రెడ్లకు చాటు విషయాన్ని కైకలోళ్ళు తెలియజేసి 'చాటుపూజకు' ఆహ్వానిస్తారు.

మంగళవారం రాత్రి బేరివీధి, కర్నాలవీధి మలుపులోగల పురాతన రాతి మండప ఆలయం ముందు చాటు పూజచేస్తారు. ఈ రాతి మండపాన్నే "చాటుమండపం" అని స్థానికులు అంటారు. ఈ ఆలయంలో రాతి విగ్రహాలు లేవు. రెండు అడుగుల నిలువున్న రుబ్బురాయి లాంటి నల్లని శిలను గర్భాలయంలో ఉంచి ఉంటారు. దీనినే "పోతురాజు" అంటారు. దీనితో పాటు ఇంకొన్ని శిలలుంటాయి. ఈ 'పోతురాజు' శిలను చాటు మండపం నుండి మంగళవారం రాత్రి వెలుపలికి తెచ్చి పసుపు పూసి, కుంకుమ బొట్లు పెట్టి, మల్లెపూలుచుట్టి, రోడ్డు పక్కగా నిలబెడతారు. పోతురాజు శిలకుముందు మట్టితో పది అడుగులు చుట్టు కొలతతో చిన్న సరిహద్దులా ఏర్పాటుచేస్తారు. ఈ హద్దు మీద లోపల నీళ్ళు చల్లి ముగ్గులేస్తారు. తర్వాత కైకల వాళ్ళు ఒక కొత్త కుండను, ఒక బిందెను పక్కపక్కనే ఉంచి, వాటి మధ్య బుడిగెను

కూడా ఉంచుతారు. కుండకు, బిందెకు, బుడిగెకు పసుపుముద్దను అతికిస్తారు. వీటి పైన పూలు చుడ్తారు. అంటే కుండను, బిందెను, పెద్దగంగమ్మ, చిన్న గంగమ్మలుగా బుడిగెను పోతురాజుగా భావిస్తారు. తర్వాత కుండ, బిందె, బుడిగె లలో నీళ్ళు నింపి, బెల్లం వేసి పానకం కలుపుతారు. చుట్టు పక్కల నివసించే భక్తులు గంగమ్మ పూజ కోసం, పళ్ళాలలో కొబ్బరి కాయ, పూలు, పళ్ళు, మొక్కుబడి వుంటె చీరలను తెచ్చి, గంగమ్మల ముందు వరుసగా పళ్ళాలను ఉంచుతారు. చీరలను మడత విప్పి వాటిని పెనవేసి కుండ బిందెలకు ఒక దానిపై ఒకటి ఆనించి పెడ్తారు! తర్వాత ముందరున్న పళ్లాలలోని కొబ్బరి కాయలను కొట్టి అన్ని పళ్లాలతోను హారతిస్తారు. ఈ తతంగమంతా జరిగేంత వరకు పంబల వాళ్ళు, పంబను వాయిస్తూ గంగమ్మ కథను పాడుతారు. ఇలా చేయడాన్ని 'చాటు పూజ' అంటారు. అంటే గంగ జాతర 'చాటింపు'కు ముందు గంగమ్మలకు పూజ చేయడం. ఈ విధంగా పూజ చేశాక బెల్లం కలిపిన నానబియ్యం , అరటిపళ్ళు అందరికీ పంచుతారు. తర్వాత భక్తులు ఎవరి పళ్ళాలను వారు తీసుకొని వెళ్ళిపోతారు.

గంగమ్మ జాతర ప్రారంభమైందని చాటించడాన్నే 'చాటు' అంటారు. చాటు పూజానంతరం పంబల వాళ్ళు పంబ వాయిస్తూ మిరాశిదారులైన శెట్టివారితో చాటింపుకు వెళ్తారు. దీనినే 'శెట్టి వారి చాటు' అని అంటారు. లేదా 'తాతయ్యగుంట గంగమ్మ చాటు' అని అంటారు. ఈ చాటింపు తర్వాత కైకలవాళ్ళు తాళ్ళపాక గంగమ్మ తరపున చాటింపుకు వెళ్తారు. దీనినే 'కైకలోళ్ళ చాటు' అని, లేదా 'తాళ్ళపాక గంగమ్మ చాటు' అని అంటారు. ఈ చాటింపుల్లోనే తిరుపతిని అష్టదిగ్బంధనం చేస్తారు. తిరుపతి చుట్టూ ఉన్న పొలిమేరల్లో ముగ్గులేసి కొబ్బరి కాయల్ని కొట్టి కుంకుమ కలిపిన నిమ్మకాయల్ని కోసి నలువైపులా పిండి హారతిస్తారు. ఈ తతంగం అంతా మంగళవారం అర్ధరాత్రి పూట జరుగుతుంది. తాతయ్యగుంట గంగమ్మ గుడి దగ్గర (ప్రస్తుత హెడ్ పోస్టాఫీసువీధి చివర్లో), చింతకాయల వీధి, కర్నాలవీధి (మూడు దోవలు), బేరి వీధి, గాలివీధి ముందు కూడలిలో (మూడుకుళాయిలున్న చోట) వంటి వీధులు నాటి తిరుపతి సరిహద్దులు. ఇప్పుడు కూడా అదే సరిహద్దులలో దిగ్బంధనం చేస్తారు. ప్రస్తుతం తిరుపతి సరిహద్దులను పోలిస్తే ఇరవై రెట్లు పెరిగిందని చెప్పొచ్చు. ఇలా తిరుపతిని అష్టదిగ్బంధనం చేశాక తిరుపతి ప్రజలు జాతర పూర్తి అయ్యేవరకు వూరు విడిచి వెళ్ళరు. ఈ విధంగా తిరుపతి గంగజాతర చాటింపు జరుగుతుంది.

3.2. తిరుపతి గంగ జాతర వేషాలు:- బుధవారం నుండి వేషాలు ప్రారం-



చాటుపూజ తర్వాత తిరుపతిని అష్ట దిగ్బంధనం చేస్తున్న దృశ్యం



చాటు మండపం ముందు మల్లెపూలతో అలంకరించబడి ఉన్న పోతురాజు శిల

భమౌతాయి. ఈ వేషాలు రెండు రకాలు. గంగమ్మ కథతో సంబంధం వున్నవి, గంగమ్మ కథతో సంబంధం లేనివి. గంగమ్మ కథ తో పంబంధం లేనివి మొక్కుబడి కోసం, వినోదం కోసం వేస్తారు. ఈ వేషాలతో పాటు ప్రజల వినోదం కోసం కొన్ని ప్రదర్శన కళల్ని కూడా ప్రదర్శిస్తుంటారు. వీటన్నింటిని గురించి కూలంకషంగా తెలుసుకోవడం ఎంతో అవసరం. గంగజాతర వేషాలను మిగిలిన ప్రదర్శన కళలను ఏఏ రోజుల్లో ఏ విధంగా ప్రదర్శిస్తారో పరిశీలిద్దాం.

జాతర వేషాలను, పట్టణ ప్రజలే కాకుండా గంగమ్మ గుడి తరపున వంశపారంపర్యంగా కైకల కులస్థులు (కైకాల రెడ్లు), చాకలి కులస్థులు వేస్తారు. వీరినే మిరాశిదార్లు అని కూడా అంటారు. వీళ్ళు గంగమ్మ కథతో సంబంధం వున్న వేషాలను సాంప్రదాయ బద్ధంగా వేస్తారు. పురప్రజలు గంగమ్మ కథతో సంబంధం వున్న వేషాలను, సంబంధం లేని వేషాలను కూడా వేస్తారు.

3.2.1. బైరాగి వేషం:- దీనినే 'చాటు వేషం' అని కూడా అంటారు. బైరాగి వేషంతోనే తిరుపతి గంగజాతర ప్రారంభమవుతుంది. ఈ వేషాన్ని గుడి తరుపు వాళ్ళు (మిరాశిదార్లు), తిరుపతి ప్రాంత ప్రజలు వేస్తారు. గుడి తరపున వంశపారంపర్యంగా ఈ వేషాన్ని చాకలి కులస్థుడు వేస్తాడు. బుధవారం తెల్లవారుజామున బైరాగి వేషాన్ని వేస్తారు. ఈ వేషంలో కైకలవాళ్ళు పాల్గొ-నరు. ఈ వేషాన్ని కర్నాల వీధిలోని కైకల కులస్థుని ఇంటిలో ఉండే గంగమ్మ, పోతురాజు ప్రతిమల ముందు అలంకరించుకొని, విగ్రహాలకు హారతిచ్చి, నేరుగా పల్లి వీధిలోని వేషాలమ్మ గుడికెళ్తారు. ఆ గుళ్ళో హారతి తీసుకొని పంబల వాయిద్యాలతో చాటు మండపం ముందున్న పోతురాజు శిలచుట్టూ ప్రదక్షిణం చేసిన తర్వాత అక్కడ్నుంచి బేరివీధిలోని బేరి శెట్టి ఇంటి కొచ్చి ప్రథమ పూజలు అందుకుంటాడు. ఆ తర్వాత తోటోళ్ళు, పంబలవాళ్ళు వెంట రాగా వూరంతా తిరుగుతూ అందరి ఇళ్ళకెళ్ళి పూజలందుకుంటూ ఇలా పాడుతుంటాడు-

"జే బాలాజీ కి జే

జే అంబాల గుంటాకు జే

జే మురికి నీళ్ళ గుంటాకు జే

ఈత పట్టాకు దేకో

తాటి మొక్కాకు దేకో

జే బాలాజీ కి జే"

బైరాగి వేషధారి ఒళ్ళంతా విబూదిని గాని, లేదా గంధం గాని పూసుకుంటాడు. మోకాలు వరకు కీపాస్ పంచను కట్టుకుంటాడు. నడుముకు ఎఱ్ఱని దట్టీని చుట్టుకుంటాడు. మెళ్ళో పూలహారం వేసుకొని, చేతిలో గొడుగు పట్టుకొని, భుజానికి మూటను వేలాడదీసుకొని తలపాగ చుట్టుకుంటాడు.

బైరాగి వేషాన్ని బుధవారం ఉదయాన్నే తిరుపతి ప్రజలు ముఖ్యంగా చిన్నపిల్లలు (3 నెలల బిడ్డనుంచి 15 ఏళ్ళలోపు వాళ్ళే) ఎక్కువగా వేస్తారు. బైరాగులు విబూదిని ఒళ్ళంతా పూసుకునే వాళ్ళు. అందుకొని ఆ వేషం వేసే వారు నామం కొమ్ములను నానబెట్టిగాని లేదా విబూదినిగాని ఒంటినిండా పూసుకుంటారు. కనుబొమలపైన సన్నటి చుక్కల్ని వివిధ రంగుల్తో పెట్టుకొని ఎదపైన, వీపుపైన వరుస నెంబర్లు వేసుకుంటారు. మెడలో హారాలుగా రేలకాయల బిళ్ళలను కుట్టి వేసుకుంటారు. వీటినే చేతులకు వంకీలుగా, కడియాలుగా, గజ్జలుగా కట్టుకుంటారు. కొందరు బంకమట్టితో గోలీలను చేసి వాటిని కూడా హారాలుగా వేసుకుంటారు. వీరు చుట్టు పక్కల వారితో కలిసి గుంపులు గుంపులుగా బయలుదేరి దారిపొడవునా రాగయుక్తంగా బూతులు పాడుతుంటారు. తమకు ఎదురు పడ్డవారిని బూతులు తిడుతూ పోతుంటారు. బైరాగి వేషంలో పాడే బూతుల్ని గమనించండి-

"నా మొ - సరే వాడు పొయ్యేదీ సరే

నా మొ - సరే వాడు చూసేది సరే

నా మొ - సరే వాడు నవ్వేదీ సరే

నా మొ - సరే వాడు తిట్టేది సరే"

ఈ విధంగా బూతులు పాడుకుంటూ మొదట వేషాలమ్మని దర్శించుకుని తర్వాత గంగమ్మ గుడికి చేరుకుంటారు. ఈ సందర్భంలో ప్రయోగించే తిట్లకు సాధారణంగా ఎవరూ కోపగించుకోరు. కొందరు కావాలనే తమను తిట్టించుకొని మరీ పోతుంటారు. తర్వాత గుడి ముందర ఉండే రాతి గంగమ్మ పాదాల దగ్గర అందరూ గుమికూడి తమ మెడల్లో , చేతుల్లోవున్న హారాల్ని తెంచి గంగమ్మ' పాదాల మీద కొడ్తూ-

"ఓ గంగమ్మా నువ్ టెంకాయలు తే

నే వంకాయలు తెస్తా



గుడి తరపు వారి బైరాగి వేషం



బైరాగి వేషధారులు కర్రలతో గంగమ్మ పాదాలను
కొడ్తూ బూతులు తిడ్తున్న దృశ్యం

నువు బాగా వండి పెట్టు

నేను బాగా దెం- దెం- దెం- తినిపోతా"

అని బూతులు తిట్టి, గంగమ్మను దర్శించుకొని ఎదురుగా వుండే తాతయ్య గుంటలో స్నానం చేసి ఇళ్ళకు వెళ్తారు. ఇప్పుడు తాతయ్య గుంటను ఆక్రమించుకొని ఇళ్ళను, ఆఫీసులను కట్టేశారు. కాబట్టి ప్రస్తుతం ఇళ్ళకు వెళ్ళి స్నానం చేస్తున్నారు.

3.2.2. గారడి వేషం :- బుధవారం మధ్యాహ్నం గారడి వేషం వేస్తారు. దీనినే 'పాములోళ్ళ వేషం' అని కూడా అంటారు. ఈ వేషాన్ని అనువంశికంగా కైకాలరెడ్లు, చాకలివాళ్ళు వేస్తారు. కైకాల కులస్థుడు ఆడవేషాన్ని, చాకలి కులస్థుడు మగవేషాన్ని వేస్తారు. మనం ఇంతకు ముందు తెలుసుకున్నట్లే వీరు కర్నాల వీధిలోని కైకలవాళ్ళ ఇంట్లో గంగమ్మ, పోతురాజు విగ్రహాల ముందు వేషాలను వేసుకొని, పల్లి వీధిలోని వేషాలమ్మను దర్శించి, బేరివీధిలోని చాటుమండపం ముదుండే పోతురాజు శిలను ప్రదక్షిణం చేసి బేరివీధిలోని బేరి శెట్టిఇంటికి వెళ్ళి ప్రథమ పూజలందుకొని తిరుపతిలోని ఇంటింటికెళ్ళి పూజలందుకుంటారు. వీరు ప్రతి ఇంటి ముందు ఆగగానే వీళ్ళ కాళ్ళను కడిగి పసుపు కుంకుమలను పాదాలకు పూసి , కొబ్బరి కాయను కొట్టి పళ్ళుపూలతో హారతులిచ్చి పూజిస్తారు. వేషధారుల కాళ్ళపైబడి దండాలు పెడ్తారు. దీనికి కారణం గంగమ్మ దుష్టుడైన పాలేగాడిని చంపడానికి ఈ వేషాలను వేసిందనే నమ్మకం ప్రజల్లో పురాగాథల రూపంలో ఉండడమే. ఈ గారడి వేషాన్ని వీరు తప్ప తిరుపతిలో ఇంకెవ్వరూ వేయరు. గారడి వేషం ఇంటింటికీ తిరుగుతూ-

"బలె బలె గారడి - బాహోరి గారడి

కట్టుబోతు విద్దెలకు - దిట్టమైన గారడి

సందులోన గారడి - సాకలోళ్ళ గారడి"

అని పాడుతుంటారు. గారడి వేషంలో స్త్రీ వేషధారి తలకు ఆభరణాలు జడ బిళ్ళలను అలంకరించి మల్లెలు, కనకాంబరాలను జడగా కుడ్తారు. కంఠాభరణాలు వేసుకుంటారు. కళ్ళకు కాటుక, నుదుట తిలకం దిద్దుకుంటారు. పైట, పావడ, రవిక ధరిస్తారు. మగవేషధారి నుదుట తిలకం దిద్దుకొని, బుగ్గ మీద దిష్టి చుక్క పెట్టుకుంటాడు. నెత్తిన రంగుల గుడ్డను చుట్టుకొని పొడవాటి తెల్లని చొక్కాను ధరిస్తాడు. ఈ చొక్కా కాళ్ళవరకు ఉంటుంది. నడుముకు

తెల్లగుడ్డను బిగించి కట్టు కుంటాడు. మగవేషధారి భుజంపై త్రాసులా ఒక కర్రకు ఇరువైపులా చిన్న బుట్టలను వేలాడకట్టి ఉండే దాన్ని ఉంచుకుంటాడు. వీరితో పాటు పంబలవాడు, దివిటీవాడు, హుండీవాడు బయలుదేరుతారు.

3.2.3. గొల్లవేషం :- గొల్ల వేషాన్నే 'మందడి వేషం' అని కూడా అంటారు. ఈ వేషాన్ని రెండవరోజైన గురువారం ఉదయం వేస్తారు. ఈ గొల్ల వేషంలో కైకల, చాకలి కులస్థులు మాత్రమే పాల్గొంటారు. ఈ వేషాన్ని పురప్రజలు వేయరు. గొల్లవేషంలో ఆడవేషాన్ని కైకల వారు, మగవేషాన్ని చాకలివారు వేస్తారు. వీరు యథాప్రకారంగా కర్నాలవీధిలోని కైకల వాళ్ళ ఇంటిలో గంగమ్మ పోతురాజుల ప్రతిమల ముందువేసుకొని, వేషాలమ్మ గుడిని ప్రదక్షిణం చేసి ఆమెను దర్శించుకొని చాటు మండపం ముందుండే పోతురాజు శిలను ప్రదక్షిణచేసి బేరివీధిలోని బేరిశెట్టి ఇంటి దగ్గరకొచ్చి ప్రథమ పూజలందుకుంటారు. తర్వాత పురప్రజల ఇళ్ళకువెళ్ళి పూజలందుకుంటారు. గొల్లవేషంలోని గంగమ్మ వేషధారి నెత్తిన మజ్జిగ బిందెను పెట్టుకొని అడిగిన వారందరికీ పోసుకుంటూ వెళ్తారు. బిందెలోని మజ్జిగను కూడా పురప్రజ లే నింపుతుంటారు. కాబట్టి బిందెలో మజ్జిగ అయిపోదు. గొల్లవేషంలో మగ వేషధారి ఇలా పాడుతుంటాడు-

"అయ్యోడయ్యోడు గండాలు కాదండి దండాలు

ఎరిగొల్ల మాట ఎక్కు పెట్టదండి

తెల్చొక మాట తెలీకొకమాట

తూరపు రాజ్యం నుంచి రారాని సోమరొచ్చింది

ఏదారి పాయ్‌నా ఎర్రదారేకాని, తెల్లదారిలేదు

మా ఎర్రనాగి నేను కాళేత్తి తిరనాళ్ళకి పోతిని

కాళేత్తి తిరనాళ్ళ అమ్మ కోయిలోనుంచి

అయ్యగారి కోయిలో కొస్తిని

అయ్యగారి కోయిల్లో నుంచి

అమ్మగారి కోయిలో కొస్తిని"

గొల్ల వేషంలో స్త్రీ వేషం (గొల్లవనిత) వేసేటప్పుడు నెత్తిన నల్లని గుడ్డను జడలా కడ్తారు. ముఖానికి పసుపు పూస్తారు. తలలో మల్లెపూలు



గారడి వేషం



గొల్ల వేషం

ముడుస్తారు. రవికను తొడిగి, గళ్ళచీరను కడ్తారు. కళ్ళకు కాటుక, నుదుట తిలకం దిద్దుతారు. బుగ్గన నల్ల చుక్క పెడ్తారు. కర్ణాభరణాలు, కంఠాభరణాలు అలంకరించి గొల్లవనితలా చేస్తారు. మజ్జిగ బిందెను నెత్తిన పెట్టుకోవడానికి వీలుగా నెత్తిన చీర కొంగును చుట్టముడిలా పెడ్తారు. పురుష వేషధారికి పంచను కీపాసులా మోకాలి వరకు కడ్తారు. తలగుడ్డ చుడ్తారు. ఎడమ కన్ను చుట్టూ కంటి అద్దంలా నామం కొమ్ముతో తెల్లగా దిద్దుతారు. నుదుట తిలకం పెడ్తారు. ఎడమ భుజాన కంబళి వేసుకొని గొడ్డలిని తగిలించుకుంటాడు. నడుముకు సవకం చుట్టుకొని మొలకు ఒక గంటను వేలాడ దీసుకుంటాడు.

3.2.4. బండ వేషం :- గురువారం మధ్యాహ్నం నుండి బండ వేషాన్ని వేస్తారు. బండవేషాన్ని గుడి తరపునవాళ్ళు (మిరాశిదార్లు), పురజనులు వేస్తారు.

బండ వేషంలో కైకలవారు బండోళ్ళచిన్నది (స్త్రీ వేషాన్ని), చాకలివారు బండోడు (పురుష వేషాన్ని) వేస్తారు. వీరు ఈ వేషాన్ని ఇంతకు మునుపు వేషాల లాగానే కైకలవాళ్ళ ఇంటి దగ్గరుండే గంగమ్మ, పోతురాజు విగ్రహాల ముందు వేసుకొని, వేషాలమ్మను దర్శించుకొని, చాటు మండపం ముందున్న పోతురాజు శిలను ప్రదక్షిణంవేసి బేరిశెట్టి ఇంటిదగ్గర కొచ్చి తొలి పూజలందుకొని, మిగిలిని ఇళ్ళకు వెళ్తారు. వీరితో పంబల వాళ్ళు పంబ వాయిస్తూ వెళ్తుంటారు. ఈ వేషంలో పురుష వేషధారి ఇలా పాడు తుంటాడు-

"అన్నన్నా పాయ్ పాయ్, ఏం పాయ్?

నాలంజా పానం దీని కనతావెల్లిపాయ్

అది పోతే ఇదే మంటివా

ఇది మొండోళ్ళ చిన్నది

నేను బండోళ్ళ చిన్నోడ్ని

ఇది వున్నింది ఏడు దుర్గాల కాగట

అడ్డ రేగి రేకు పోగిటి దెచ్చినా

పట్టు మంచం దెచ్చినా

పల్లె సేరా గాడికిచ్చినా

ముట్టు కోలు దెచ్చినా

ముసిల్ రెడ్డికిచ్చినా
తంపటి దెచ్చినా - గొల్ల సేరాగోడికిచ్చినా
ఈ మూడు సానికులు ఏ మనిస్తునో
దీని మొగుడు మంచి అరీపుగాడు
అడ్డ రేగి రేకు పోవిటి దెచ్చినా
దీని ముక్కు తెగ్గొట్టా
నా చెయ్యి తెగ్గొట్టా
మూడోళ్తో పోయ్‌నోళ్ళకిదే గుర్తు"

బండ వేషంలో స్త్రీ వేషధారి తెల్లచీర, తెల్ల రవికను ధరిస్తారు. కర్ణాభరణాలను, కంఠాభరణాలను అలంకరించుకుంటారు. నెత్తిన జడబిళ్ళను ఉంచుకొని, సూర్యచంద్రులను తలమీద పెట్టుకుంటారు. తలకు పూలజడ కుట్టుకుంటారు. ముక్కులేనట్లు ముక్కుదగ్గర తెల్లగా పూసుకుంటారు. పురుష వేషధారి నిలువు గీరల పైజామా తొడుక్కొని దానిపైన లంగోటాను కట్టుకుంటాడు. తలకు ఎర్రపట్టీ కట్టుకుంటాడు. శరీరానికి ఎర్ర కుంకుమ పూసుకుంటాడు. మణికట్టుకు గుడ్డను చుట్టుకుంటాడు. చేటను మధ్యలో చెయ్యి పట్టేటట్లు కోసి దానిలో చేతిని దూర్చుకుంటాడు చూడడానికి డాలులాగా. మణికట్టువద్ద ఎర్రగా నెత్తురు గడ్డ కట్టినట్లు జిగురులా పూస్తారు. అంటే ఎడమ చేతిని కోల్పోయి దాని స్థానంలో చేటను ఉంచుకున్నట్లు చెప్తారు.[3]

భుజాలకు బండపూలను కట్టుకుంటాడు. మెళ్ళో మల్లెపూల హారం వేసుకుంటాడు.

స్థానికులు వేసే బండ వేషంలో చిన్న పిల్లలు, పెద్ద పిల్లలు బాగా పాల్గొంటారు. వీళ్ళు గురువారం మధ్యాహ్నం ఎర్రటికుంకుమను వొళ్ళంతా

---

[3] బండ వేషం గురించి చిన్న కథ చెప్తుంటారు. ఇది ప్రధాన కథకు విరుద్ధమైంది. తిరుపతిలోని పల్లెవీధిని రాజులాగా 'పల్లె సేరాకోడు' పాలిస్తుంటాడు. తాళ్ళపాక గంగమ్మ సేరాకోడితో తప్పుచేస్తుంది. బండోడు దాన్ని చూసినందువల్ల సేరాకోడు బండోడి చెయ్యి నరికేస్తాడు. బండోడు గంగమ్మ ముక్కు కోసేస్తాడు. అందుకని ఈ బండ వేషంలో బండోడు చేటను చేతికి కట్టుకుంటాడు. గంగమ్మ వేషధారి ముక్కు దగ్గర బెండును పెట్టుకుంటుంది. లేదా తెల్లరంగును పూసు కుంటుంది.



పురప్రజలు వేసే బైరాగి వేషం



పురప్రజలు వేసే బండ వేషం

పూసుకొని, బొరుగుల దండల్ని, అడవిలో దొరికే బందపూల దండల్ని మెళ్లోవేసుకొని, వాటినే తలచుట్టూ చుట్టుకొని, చేతులకు కాళ్ళకు కూడా కట్టుకుంటారు. కొంతమంది కుంకుమను పూసుకొన్నాక అలంకార ప్రాయంగా మక్కాపొట్లను కూడా కనుబొమలపైన పెట్టుకుంటారు. పిల్లలు బొగ్గును పొడిగానీ లేదా రంగులోగాని మీసాలను పెట్టుకుంటారు. విస్తరోకలిని భుజంపై పెట్టుకొని, ఏన్ను కర్రతో దాన్ని లయబద్ధంగా కొడుతూ రాగయుక్తంగా బూతుపాటలు పాడుతూ గంగమ్మ గుడి దగ్గరకెళ్ళి యుధారావంగా దండల్ని తెంపి గంగమ్మను తిట్టి వచ్చేస్తుంటారు.

ఈ వేషంలో పాడే పాటలు ఇలా వుంటాయి-

"ఎన్నెన్ని దెం -నా -- డ్డంగి లేదురా
పొయ్యే వాళ్ళని దెం -తే --డ్డంగిరా"

"ఎన్నెన్ని దెం -నా -- డ్డంగి లేదురా
మూసే వాళ్ళని దెం -తే -- డ్డంగిరా"

"కాడి మడకా కడగా పెట్టి
కప్పును దెం - కాపోడా"

"సోడా కలరు తాగాలిరా
మంచి సోకైన లంజను దెం -లిరా"

"బాదం పప్పు తినాలిరా
మంచిబాపనోడక్కను దెం -లిరా"

"పోలీల్ ఆప్పిల్ తినాలిరా
మంచి పోలీసోడక్కను దెం -లిరా"

"సాయిబూ సాయిబూ సలామయా
నీ సానిక లోనా -- డ్డయ్యా"

"గంగమ్మ -- కు గంపంతా
దాన్ని దెం - ను పోతే చీమంతా"

"సాయిబూ సాయిబూ సలామయా
ఏ కూతుళ్ళు నాకు గులామయా"

"సోదిస్తానే భామ సోదిస్తానే
నీపూ -- లోన -- ల్లి మొగ్గ సోదిస్తానే"

"కొత్త గుడ్డలు కట్టాలిరా
కొత్త పోడక్కను దెం -లిరా"

"చెరకులు గిరకులు తినాలిరా
మంచి చెరకులోడక్కని దెం -లిరా"

"మల్లి పూలు పెట్టాలిరా
మంచి మల్లి శెట్టోడక్కని దెం -లిరా"

ఎవరైనా ఈ బూతులు విని కోపగించుకుంటే వాళ్ళను చూసి మళ్ళీ ఇలా తిడతారు-

"వీడ్ని దెం -- వీడమ్మని దెం --
వీడి కేమిరా ఇంత రోషమూ"

3.2.5. కోమటి వేషం :- మూడవ రోజైన శుక్రవారం ఉదయం కోమటి వేషాన్ని మిరాశిదారులైన కైకల, చాకలి కులస్థులు వేస్తారు. ఈ వేషాన్ని ఆ రోజు ఇతరులు వేయరు. కోమటి వేషంలో కూడా ఆడవేషాన్ని కైకలవారు, మగవేషాన్ని చాకలి వారు వేస్తారు. ఇంతకు ముందు క్రితం వేషంలాగే వీరుకూడా కైకలవారి ఇంట్లో గంగమ్మ, పోతురాజు ప్రతిమల ముందు వేషాలను వేసుకొని వేషాలమ్మను దర్శించుకొని పోతురాజు శిలను ప్రదక్షిణం చేసి బేరిశెట్టి



కోమటి వేషం



గుడి తరపు వారి తోటి వేషం
(తిరుమల శ్రీవారి ఆలయం నుండి
వచ్చిన గంప చేటను చిత్రంలో చూడొచ్చు)

ఇంటి దగ్గర కొచ్చి తొలి పూజలందుకొని అక్కడ్నుంచి అందరి ఇళ్ళకు వెళ్ళి పూజలందుకుంటారు. ఈ వేషాలకు ప్రజలు కాళ్ళపై నీళ్ళు పోసి, పసుపు, కుంకుమలు రాసి, టెంకాయ కొట్టి పళ్ళు పూలతో హారతులిస్తారు. కోమటి వేషంలోని స్త్రీ వేషధారి చేతిలో గంధం గిన్నెను పట్టుకొని, అందులో అక్షింతలు, తమలపాకులు, మల్లెపూలు ఉంచుకొని భక్తులకు పంచిపెడుతూ వెళ్తారు. వాళ్ళను పంబల వాళ్ళు అనుసరిస్తూ పంబ వాయిస్తూ వుంటారు. కోమటి వేషంలోని పురుష వేషధారి ఇలా పాడుతుంటాడు-

"కచ్చి కరవాడు కచ్చి కరవాడు

తీపు మూడీసులు కారం ఐదీసులు

పులుపు ఏడీసులు

కచ్చి కరవాడు కచ్చి కరవాడు"

కోమటి వేషంలో స్త్రీ వేషం వేసేటపుడు ముఖానికి పసుపు పూస్తారు. నెత్తిన సూర్య చంద్రుల ఆభరణాలను ఉంచుతారు. కర్ణాభరణాలు, కంఠాభరణాలతో అలంకరిస్తారు. కళ్ళకు కాటుక, నుదుట తిలకం దిద్దుతారు. ముక్కుపుడక పెట్టుకుంటారు. తలకు పూలు ముడ్తారు. మెళ్ళో పూలహారాలను వేస్తారు. నీలిరవిక పచ్చచీర ధరిస్తారు. చేతికి గాజులను వేసుకుంటారు. పురుష వేషధారికి కీపాసు పంచను కడ్తారు. నల్లకోటును వేసుకుంటాడు. తలగుడ్డ చుట్టుకుంటాడు. నుదుట నామం, కళ్ళకు కాటుక, బుగ్గకు చుక్క పెట్టుకుంటాడు. కోటుపైన ఎర్రటి అడ్డపట్టీని కట్టుకుంటాడు. దానిపైన దారంతో కుట్టబడిన వంకాయలు, బెండకాయలు, ఎరగడ్డల హారాన్ని వేసుకుంటాడు. భుజాన త్రాసును వేలాడదీసుకుంటాడు. చేత గొడుగు పట్టుకుంటాడు.

3.2.6. తోటి వేషం :- శుక్రవారం మధ్యాహ్నం నుండి తోటి వేషాన్ని గుడి తరపు వాళ్ళు (మిరాశిదార్లు), తిరుపతి వాసులు వేస్తారు.

తోటి వేషంలో కైకల కులస్థుడు స్త్రీ వేషాన్ని, చాకలి కులస్థుడు పురుష వేషాన్ని వేస్తారు. వీరు ఈ వేషాన్ని అన్ని వేషాలు లాగే కైకల వాళ్ళ ఇంట్లోనే వేసుకొని, వేషాలమ్మ గుడి వెలుపల, లోపల ప్రదక్షిణంచేసి, కొబ్బరికాయకొట్టి హారతి తీసుకుంటారు. చాకలి వాని చేతిలో ఉండే పాడవాటి కత్తిని వేషాలమ్మ పాదాల చెంత ఉంచి పూజిస్తారు. తర్వాత యథాప్రకారం పోతురాజు శిలకు ప్రదక్షిణం చేసి, బేరిశెట్టి ఇంటి దగ్గరకొచ్చి తొలిపూజను అందుకొని తర్వాత అందరి ఇళ్ళకు వెళ్తారు. స్త్రీ వేషధారి ఒక చేతిలో కొత్త గంపను ఉంచుకొని,

మరో చేతిలో కొత్త చేటను పట్టుకొని భక్తులందరి నెత్తిన చేటతో మెల్లగా కొడ్తూ వెళ్తుంటారు.[4]

ఈ చేటను 'శరగోపం ' లా నెత్తిన పెట్టుకోవడానికి (తగలడానికి) ప్రజలు ముందుకొస్తుంటారు. వీరితో పాటు తోటివాడు మంగలి దగ్గర్నుంచి తెచ్చిన డోలును వాయిస్తూ వెంటవెళ్తుంటాడు. తోటి వేషంలోని మగ వేషధారి చేత పొడవాటి కత్తిని ఉంచుకొని ఇలా పాడుతుంటాడు-

"యిద్దాల గురువా వీరనాయకా

చెట్టీ గురూ నీకు దండామయా

దండామయా స్వామి దండామయా

చూసేటి రాజులకు దండామయా

చుట్టేడు సముద్రాల నట్టానడమ

దామరాకు మీదనా కొలువయా

దామరాకు మీద దయా మందుకొని

చూసేటి ఒకరిది కొలువయా

చిన్ని కత్తి నూరుకొని

పెద్ద కత్తి నూరుకొని

సిందే పల్లికి నేన్పోతినీ

సిందే పల్లీలో లంజాలజూసి

చిన్నా కత్తిని చిందొత్తునయా

కత్తి చేసిన కంసాల బిడ్డకు

4. తోటీ వేషంలో ఉపయోగించే 'గంప ', 'చేట', రెండు శేషవస్త్రాలు తిరుమల శ్రీవారి ఆలయం నుంచి తిరుపతి గోవిందరాజస్వామి గుడికి వస్తాయి. అంటే వెంకటేశ్వర స్వామి తన చెల్లెలైన గంగమ్మకు వీటిని ఆయుధాలుగా పంపిస్తాడని భావిస్తారు. గోవిందరాజ స్వామి గుడికి వచ్చిన కొత్త గంప, చేట, రెండు శేషవస్త్రాలను కైకలవాళ్ళు వెళ్ళితీసుకొని వచ్చి తమ ఇంటిలో వుండే గంగమ్మ పోతురాజు ప్రతిమల ముందు ఉంచుతారు. వేషం వేసుకొని హారతులందుకొని 'గంప ' ' చేట ' ను చేత పట్టుకొని వెళ్తారు.



తిరుమల వెంకన్న దగ్గర నుండి వచ్చిన చేటతో
భక్తులను ఆశీర్వదిస్తున్న దృశ్యం

పుర ప్రజల 'తోటివేషం'

నిత్యం చెయ్యెత్తి మొక్కేనయ్యా

దండామయ్యా స్వామి దండామయ్యా

మాపేటి రాజులకు దండామయ్యా"

తోటి వేషంలో స్త్రీవేషం వేసేటపుడు తలకు జడలాగ నల్లని గుడ్డతో కట్టి కొప్పుముడి వేస్తారు. దీనికి పూలు ముడ్తారు. కర్ణాభరణాలు, కంఠాభరణాలు వేస్తారు. ముఖానికి, శరీరానికి బొగ్గును దంచి నల్లగా పూస్తారు. నుదుట తిలకం పెడ్తారు. చేతికి కడియాల వంటి గాజుల్ని వేస్తారు. నల్లని గుడ్డతో చేసిన రొమ్ములను కడ్తారు. రవికను తొడగరు. నల్లరంగు పై తెల్లగీరలు, ఎర్ర అంచు ఉండే చీరను కడ్తారు. పైట వేసుకోకుండా చీరకొంగును నడుముకే చుట్టేస్తారు. మెళ్ళో పూల హారం వేస్తారు. తిరుమల నుంచి వచ్చిన గంప, చేటకు పసుపు కుంకుమ బొట్లు పెడ్తారు. పురుష వేషధారి నిలువు గీరల షరాయి (పైజామా) ని తొడుక్కుంటాడు. దానిపై లంగోటా కట్టుకుంటాడు. ఒళ్ళంతా నల్లని మసితో పట్టీలు పెట్టుకుంటాడు. మెళ్ళో మల్లెపూల దండను వేసుకుంటాడు. కుడిచేత పొడవాటి కత్తిని పట్టుకుంటాడు.

స్థానికులు వేసే తోటి వేషంలో మామూలుగానే పిల్లలు బాగా పాల్గొం-టారు. వీళ్ళు శుక్రవారం మధ్యాహ్నాం బొగ్గు పొడిని గాని కందెన గాని ఒళ్ళంతా పూసుకొని తెల్లనామం సాది కనుబొమలపైన చుక్కబొట్లు పెట్టు కుంటారు. పిల్లలు మీసాలనుకూడా పెట్టుకుంటారు. నడుంచుట్టూ, తలకు వేపాకు మండలను కట్టుకుంటారు. పాత పొరకను, చేటను చేతబట్టుకొని ఎదురు పడ్డవారిని తిన్నగా మోదుతుంటారు. బూతుపాటలు పాడుకుంటూ వేషాలమ్మ గుడికెళ్ళి, అక్కడ్నుంచి గంగమ్మ గుడి కొస్తారు. [5] గంగమ్మ గుడి ముందర వేపాకును చేట పొరక్కట్ట (చీపురు) లను పడేసి గంగమ్మను బూతులు తిట్టి వచ్చేస్తారు. ఈ వేషంలో పాడే బూతులు ఇలా వుంటాయి–

"ముసలి దాని పూ -- లో ముల్లిరిగింది
సోది కట్టి ఎత్తకరారా సోదిస్తామూ"

[5] గంగమ్మ గుడికి దూరంగా వుండే వాళ్ళు కొంతమంది వారి వారి వీధులకు దగ్గరగా వుండే ఇతర గంగమ్మలను దర్శించుకొని వెళ్ళి పోతుంటారు. ఉదా : ధవికొండ గంగమ్మ, కరకమాని గంగమ్మ గుళ్ళకు దగ్గరగా ఉండే వాళ్ళు అక్కడికే వేషాలను వేసుకొని వెళ్ళి వచ్చేస్తుంటారు.

"ఆకు పావ్వాకు అలమేలమ్మ పూ-
టెంకాయ తోపు దెం -- ది రేపు
దుగ్రు సూదే, సూదే సూదే"

"సూది మీద సూది మూసేదాన్నిదెం --
పాయ్‌మీద పాయ్ పోయెదాన్ని దెం -- "

"దాని పూ -- దీని పూ -- ద్వార బంగ్రదం
కోనేట్లో నా మొ -- కోడిపందెం "

"ఆడిస్తానే బొమ్మ ఆడిస్తానే
నీపూ -- మీద గా -- మొ - ఆడిస్తానే "

"మూడు పూ --లు మడేసి కొడితే
ముసలి దాని పూ -- బేర్ మనే "

"పైన పొయ్యేదేందిరా పందు జిల్లేడాకురా

దానిపేరేందిరా బాపనోడి గా - రా"

వేషాన్ని వేసుకొని పోతున్న గుంపు వెళ్తూ వెళ్తూ నాలుగు వీధులు కలిసే చోట ఆగి వేలం పాటలను పాడ్తారు-

గుంపు నాయకుడు :- ముసలి దాని పూ --

గుంపు :- మూడు అణాలు

గుంపు నాయకుడు :- నల్లదాని పూ -

గుంపు :- నాలుగు అణాలు

గుంపు నాయకుడు :- ఎర్రదాని పూ -

గుంపు :- ఏడు అణాలు

ఇలా వేలం పాటలు ముగ్గుస్తాయి. ఇంకా దారిలో పోతూ పోతూ -

"దుగ్రు సూది సూదే సూది
సూది మీద సూది



దొరవేషం　　　　మిరాశిదార్ల బండవేషం



గుడితరపు మాతంగి వేషం

మూసే వాళ్ళని దెం -
రాతి మీద రంగు
రాక పోతె దెం --
పొయ్యి మీద పొంగు
పొయ్యే వాళ్ళని దెం -
దుర్రు సూది సూదే సూది "

తిరుపతి గంగ జాతరలో వంశపారంపర్యంగా వేషాలు వేసేవాళ్ళు కైకలరెడ్లు, చాకలి వాళ్ళు. వీరితో పాటు తోటివాళ్ళు కూడా వెన్నంటే ఉంటారు. వీరుకూడా మిరాశిదార్లే. అదేవిధంగా పంబలవాళ్ళు పంబలు వాయిస్తూ అనుసరిస్తారని కూడా తెలుసుకున్నాం. ఈ మూడు రోజులు వేసే ఆరు వేషాల్లో తిరుపతి వాసులు, పిల్లలు వేసే మూడు వేషాలే అత్యంత ప్రాశస్త్యం పొందాయి. అవి - బైరాగి, బండ, తోటి వేషాలు. ఈ వేషాలను మొక్కుబడి వున్నా లేకున్నా అందరూ వేస్తుంటారు. బైరాగి, బండ, తోటి వేషాలకు మాత్రమే బూతుపాటలు పాడుతారు. మిగిలిన వేషాలకు బూతుపాటలు పాడరు. అంటే జాతర మొదటి మూడు రోజులే బూతులు విన్పిస్తాయి. తర్వాత వినిపించవు. గుడి తరపున వేషాలు వేసే కైకల, చాకలి వంటి వారు ఏ వేషానికి కూడా బూతు పాటలు పాడరు.

3.2.7. దొరవేషం :- శనివారం మధ్యాహ్నం దొర వేషాన్ని కైకల, చాకలి కులస్థులు ఆనువంశికంగా వేస్తారు. ఈ వేషాన్ని ఇతరులెవరూ వేయరు. దొర వేషంలో స్త్రీ వేషధారణ ఉండదు. కైకల కులస్థుదు దొరవేషాన్ని, చాకలి కులస్థుదు మంత్రి వేషాన్ని వేస్తారు. పక్కనే తోటివాడు పాళెగాడి కొయ్య శిరస్సును చేతబట్టుకుని ఉంటాడు. క్రితం వేషాలలాగే కైకల వారి ఇంట్లో గంగమ్మ, పోతురాజు ప్రతిమల ముందు వేసుకొని, అక్కడ హారతిని అందుకున్నాక, బయటకు వచ్చి కైకలవాళ్ళ ఇంటి ముందు నిలబడ్తారు. కైకల వాళ్ళు ఆ వేషధారుల కాళ్ళు కడిగి, దిష్టి తీసి టెంకాయను కొట్టి హారతిస్తారు. ఆ తర్వాత వేషాలమ్మ గుడి దగ్గరకు వెళ్తారు. కానీ గుడిలోకి వెళ్ళి వేషాలమ్మను దర్శించరు. ఎందుకంటే గంగమ్మ దొర వేషంలోనే పాళెగాడ్ని చంపుతుంది. అందుకని ఆమె ఎంతో ఆగ్రహంతో ఉంటుంది. కాబట్టి గంగమ్మ చూపులకు ఎక్కడ వేషాలమ్మ భస్మమై పోతుందోనన్న భయంతో గుడిలోనికి దొరవేషం వెళ్ళదు అని అంటారు. గుడి సమీపం నుండి బయలుదేరిన దొరవేషం నేరుగా చాటు మండపం ముందున్న పోతురాజు శిలను ప్రదక్షిణం చేసి, బేరిశెట్టి ఇంటి ముందుకు వచ్చి ప్రథమ హారతులు అందుకొని, అక్కడ్నుంచి వూరంతా

తిరిగి పూజలందుకుంటాడు. పలకల (డప్పు) వాళ్ళు పలకలను వాయిస్తూ వీరిని అనుసరిస్తుంటారు. పూర్వం తిరుమల, తిరుపతి ఆలయపాలకులైన మహంతులు వీరికి గుర్రాలను సమకూర్చేవారు. ప్రస్తుతం దొరవేషగాళ్ళు నడచి వెళ్తుంటారు. తోటివాళ్ళు భటులులాగా రాజచిహ్నాలు కలిగిన 'సురటి' లను పట్టుకొని ఉంటారు. దొరవేషానికి భక్తులు కొత్త పంచలు, సవకాలను కానుకలుగా కప్పుతారు. వీరికి సకల మర్యాదలు చేస్తారు. దొర వేషంలో, మంత్రి వేషంలో ఉండే చాకలి కులస్థుడు ఇలా పాడుతుంటాడు-

"డోల్ భజే నా పేరు పాలేగాడు
ఎగవసావిట్లో మా అన్న పగడ్సాలాడ్తా వుంటే
దిగవ సావిట్లో నేను పగడ్సాలాడతాను
నాకు తెలియకుండా మాఅన్న తలకాయ్ నరుక్కొని పోయినారు
పచ్చి దబ్బల్తో బంధించినా
పొట్ట చించినా రాళ్ళు గొట్టినా
వట్ట దించినా నోటికి కరిపించినా
నెత్తురు కోకిలో అచ్చారు పంపించినా
అచ్చారు నుంచి ఏ మాత్రం ముసిల్ దీవులు వస్తే
సంధికి మాత్రం ఏమాత్రం వొప్పుకునే వాన్నికాదు
రాయి రప్పా నీ చేతిలో పెట్టుకో
సొత్తు సంబంధం నా చెయ్యిరు
పగలు పోతే యిచ్చే వాన్ని కాదు
రేయి పోతే అచ్చుకుండే వాన్ని కాదు
డెబ్బై ఆరు పాలే గాళ్ళకు
డోల్ భజే నా పేరు పాలే గాడు"

ఇలా దొర వేషగాళ్ళు ఊరంతా తిరిగి మరుసటి రోజైన ఆదివారం తెల్లవారు జామున లేదా ఉదయం 6 గంటల ప్రాంతంలో వేషాలమ్మ గుడి వెనుక, అంటే కోర్టు ముందునుంచి ప్రకాశం రోడ్డులోకి కలిసే వీధికి వీరావేశంతో వెళ్ళి అక్కడ పాళెగాడ్ని చంపే కార్యాన్ని నిర్వహిస్తారు.[6] తోటివాడు పాళెగాడి కొయ్యబొమ్మ తలను చేత పట్టుకొని నిల్చుకుంటాడు. దొరవేషంలోని దొర,

---

6. పాళెగాడు తనను గంగమ్మ చంపుతుందనే భయంతో ఆ ప్రదేశంలోని చింత చెట్టు తొర్రలో దాక్కున్నాడట. దొర వచ్చాడని తెలుస్తూనే చెట్టు తొర్రలో నుంచి తలబైట పెడ్తాడు. అప్పుడు గంగమ్మ పాళెగాడి తలను నరికేస్తుందని గంగమ్మ కథలో చెప్పబడివుంది.

మంత్రి తమ చేతుల్లో ఉండే పొడవాటి కత్తులతో పాళెగాడి తలమీద తాకిస్తూ, మూడు సార్లు ప్రదక్షిణం చేస్తారు. వీరు మూడు సార్లు తాకిస్తూ ప్రదక్షిణం చేసేటప్పుడు చుట్టూ ఉన్న పరివారమంతా నోర్లు కొట్టుకుంటూ వికృతంగా అరుస్తారు. పాళెగాడిని చంపిన కార్యక్రమం పూర్తి అయిన తర్వాత తోటివాడు పాలేగాడి బొమ్మ తలపై సవకం కప్పి అక్కడ్నుంచి తీసుకొని పరుగున వెళ్ళి-పోతాడు. తర్వాత దొర వేషంలో ఉండే పరివారం సంతోషంతో ఈలలు, కేకలు వేస్తూ, ఆనందంతో పలకల వాద్యాలకు అనుగుణంగా చిందులు వేస్తారు. దొర వేషంలోని వేషగాళ్ళు సంతోషంగా ఉంటారు. అక్కడ్నుంచి దొరవేషం నేరుగా రైల్వేస్టేషన్ ముందున్న కూడలిలోకి వచ్చి, తర్వాత కైకల వారింటికి వెళ్ళి వేషాల్ని విప్పేస్తారు. తోటివాళ్ళు పాళెగాడి బొమ్మ తలను చూపిస్తూ తెలిసిన వారి వద్ద నుండి డబ్బులు ఇనాంలు అడిగి తీసుకుంటుంటారు. ఆ తర్వాత పాళెగాడి తలను తీసుకొని వెళ్ళి తాళ్ళపాక గంగమ్మ గుళ్ళో పెట్టేస్తారు.

దొర వేషంలో కైకల కులస్థుడు రాజులాగా అలంకరించుకుంటాడు. నెత్తిన కిరీటం పెట్టుకుంటాడు. చెవులకు కమ్మలను ధరిస్తాడు. నుదుట మూడు నామాలు పెట్టుకుంటాడు. కళ్ళకు కాటుకను దిద్దుకుంటాడు. చేతులకు. మల్లెపూలు చుట్టుకుంటాడు. రాజులు ధరించే విధంగా ఉండే పొడవాటి తెల్ల లాల్చీని ధరిస్తాడు. దీనినే ' అంగరక '(అంగరఖా) అని అంటారు. నడుముకు ఎర్రని గుడ్డతో బిగియకడ్తాడు. నీలిగుడ్డతో జంధ్యం లాగా అడ్డు పట్టీని కట్టు-కుంటాడు. ఈ పట్టీని 'డవాల్ ' అంటారు. చేతులకు వంకీలు లాంటి నగలను ధరిస్తాడు. మెళ్ళో ఆభరణాలను, పూలహారాలను వేసుకుంటాడు. పొడవాటి కత్తిని చేతబట్టుకుంటాడు. కత్తికి పసుపు పూసి, కుంకుమ బొట్లు పెట్టి వుంటారు. కత్తి మొనకు నిమ్మకాయను గుచ్చి వుంచుతారు. ఇక మంత్రి వేషంలో ఉండే చాకలి కులస్థుడు కూడా దొరలాగే అలంకరించుకుంటాడు. కానీ పట్టు గుడ్డతో చుట్టిన అడ్డంగా ఉండే కిరీటాన్ని ధరిస్తాడు. దొరతో సమానంగా ఆభరణాలను మంత్రి వేషధారి ధరించడు. మెళ్లో పూలహారాలు వేసుకుంటాడు. చేతపొడవాటి కత్తిని పట్టుకొంటాడు. వారితోపాటు తోటివాడు పట్టుకొని ఉండే పాళెగాడి బొమ్మ తలకు మల్లెపూలను చుడ్తారు. ఇక దొరవేషానికి అటు ఇటు తోటివాళ్ళు సురటీలను పట్టుకొని ఉంటారు. ఈ సురటీలకు ఒక పక్క సూర్యుడు, చంద్రుడు, మరోపక్కనామాలు వుంటాయి. ఈ వేషానికి హారతులివ్వడానికి ఒక పూజారిలాంటి వాడుంటాడు.

3.2.8. మాతంగి వేషం :- ఆదివారం తెల్లవారు జామునుంచి మాతంగి వేషాన్ని గుడి తరపు మిరాశిదార్లు, మొక్కుబడి ఉన్న స్థానికులు వేస్తారు.

మాతంగి వేషాన్ని కైకల కులస్థుడు మాత్రమే వేస్తాడు. ఈ వేషాన్ని ఒకరే వేస్తారు. ఈ వేషంలో చాకలి కులస్థుడు పాల్గొనడు. మాతంగి వేషాన్ని గంగమ్మ విశ్వరూపంగా భావిస్తారు. మాతంగి వేషాన్ని తెల్లవారుజామున 3గం॥లకు కైకల వారి ఇంట్లోనే వేసుకొని అక్కడున్న గంగమ్మ, పోతురాజు ప్రతిమలకు హారతిచ్చి, వేషాన్ని బయటివారు చూడకుండా ఉండడానికి నెత్తిన సవకం కప్పుకొని నేరుగా వేషాలమ్మ గుడికి వెళ్తారు. మాతంగి వేషాన్ని ఒకరే వేస్తారు కాబట్టి, గంగమ్మకు తోడు కోసమని వేషాలమ్మ గుడి వరకు పోతురాజు ప్రతిమను కూడా తీసుకొని వెళ్తారు.[7] పోతురాజును కూడా పూలతో బాగా అలంకరించి ఉంటారు. వేషాలమ్మ గుడి వెలుపల లోపల ప్రదక్షిణం చేశాక పోతురాజు ప్రతిమను వేషాలమ్మ విగ్రహం ముందు కుడివైపున ఉంచుతారు. తర్వాత మాతంగి వేషధారి వేషాలమ్మకు, పోతురాజులకు హారతిచ్చి అక్కడ్నుంచి సరాసరి పంబల వాయిద్యాలతో చాటు మండపం ముందున్న పోతురాజు రాతిశిలను ప్రదక్షిణం చేసి అక్కడికి సమీపంలోనే ఉన్న బేరిశెట్టి ఇంటికొచ్చి ప్రథమ హారతుల్ని అందుకుంటాడు. అప్పటికి తెల్లవారుతుంది. మాతంగి వేషధారి తన ఒడిబాలులో ఉండే అక్షింతలను,వేపాకును అందరికీ పంచి పెడ్తూ తిరుపతిలోని అందరి ఇళ్ళకు వెళ్ళి పూజలందుకుంటాడు. అదీ తరతరాలుగా వెళ్ళే ఇళ్ళకే వెళ్తారు. పట్టణంలోని మారు మూల ఇళ్ళకు, దూరంగా వుండే ఇళ్ళకు వెళ్ళరు. మాతంగి వేషం అందరి ఇళ్ళు తిరుగుతూ మధ్యాహ్నం 12గం॥లకు కైకల వాళ్ళ ఇంటిని మళ్ళీ చేరుకుంటుంది. అపుడు కైకల వాళ్ళ ఇంట్లో గంగమ్మ, పోతురాజుల ప్రతిమల ముందు ' అలుగు సేవ ' చేస్తారు. అంటే మాతంగి వేషం నాలుకపై జానెడు పొడవున్న శూలాన్ని గుచ్చుతారు. కైకల వారింట్లో ఉన్న గంగమ్మ ముందు అంబలిని ఒక పాత్రలో ఉంచి, ఆ పాత్ర చుట్టూ వేపాకును కట్టి పసుపు కుంకుమల్ని పెడ్తారు. అలాగే వివిధ పూజావస్తువులు, మజ్జిగ, పాలు వంటి వాటిని ఉంచుతారు. ' అలుగు సేవ ' చేసేటప్పుడు మాతంగి వేషధారి పక్కన పంబలోడు పంబను వాయిస్తూ గంగమ్మ కథను పాడుతూ వీరావేశంతో వాయిస్తాడు.[8] అప్పుడు మాతంగి వేషధారి కుర్చీలో కూర్చొని తన గజ్జలకాళ్ళతో లయబద్ధంగా నేలపై తడ్తూ ఉగ్రరూపాన్ని దాలుస్తాడు. గంగమ్మ పోతురాజు ప్రతిమలకు హారతిచ్చి వచ్చి మళ్ళీ కుర్చీలో కూర్చొని ఆవేశంతో కాళ్ళను యథాప్రకారం నేలపై తడ్తుంటాడు. ఒకదశలో

---

7. పోతురాజును కొందరు గంగమ్మకు ఇతర గ్రామదేవతలకు సోదరుడంటారు. కొంత మంది భర్త అంటారు.

8. చూడు :- గంగమ్మ కథ - అనుబంధం - 1.

మాతంగి వేషం ఉగ్రరూపం పతాకస్థాయికి చేరుకోగానే చెంగుచెంగున ముందుకు ఉరుకుతూ గంగమ్మ పోతురాజు ప్రతిమల ముందు కొచ్చి మోకాళ్ళపై నిల్చుంటుంది. అప్పుడు అక్కడ ఉన్నవ్యక్తి జానెడు పొడవున్న త్రిశూలాన్ని చేతపట్టి మాతంగి వేషం నాలుకపై గుచ్చి తీసేస్తాడు.[9] గుచ్చేటప్పుడు నాలుకపై తమలపాకును ఉంచి గుచ్చుతారు. గుచ్చిన తరువాత నోట్లో తినుబండారం వేస్తారు. 'అలుగుసేవ'ను హాతీరాంజీ మఠం (పూలమఠం) లోను, కరణం ఇంటి దగ్గర, బండ్ల వీధిలోను చేస్తారు. అలుగుసేవ చేసేటప్పుడు పోతురాజు ప్రతిమ కూడా పక్కనే వుంటుంది. మాతంగి వేషం శాంతించిన తర్వాత అక్కడున్న వారు ఆ వేషధారి ఒంటినొప్పులు తగ్గించడానికి చేతులను పిసుకుతారు. అతని చేత పాలను తాగిస్తారు. తర్వాత వేపాకు నీళ్ళతో, మజ్జిగతో మాతంగివేషం కాళ్ళను పళ్ళెంలో ఉంచి కడుగుతారు. ఆ నీళ్ళను గిన్నెలో పోసుకొని వేపాకు మండల్తో ముంచి అక్కడున్న వారందరి పైన చల్లుతారు. మాతంగి వేషానికి టెంకాయలు కొట్టి హారతులిచ్చాక, వేషధారి కైకలవాళ్ళ ఇంట్లోనే భోజనం చేసుకొని మళ్ళీ పూజలందుకోవడానికి వీధుల్లోకి వెళ్తాడు. మాతంగి వేషాన్ని 'గంగమ్మ విశ్వరూప'మని భావించడం వల్ల ఆమెను శాంతింప జేయడానికి పురప్రజలు మాతంగి వేషానికి టెంకాయలు కొట్టి, హారతులిచ్చాక 'అంబళ్ళు 'పోస్తారు. అంబలి చల్లదనానికి ప్రతీతి.[10] ఈ మాతంగి వేషం ఊరంతా తిరిగి వేషం విప్పడానికి మరుసటిరోజు అంటే సోమవారం మధ్యాహ్నం అవుతుంది.

మాతంగి వేషం వేసేటప్పుడు పక్కన కైకల స్త్రీలు ఉండి అలంకారాలు చేస్తారు. మాతంగి వేషధారి ముఖానికి పసుపు పూస్తారు. కళ్ళకు కాటుకను పెడ్తారు. గడ్డం కింద చిన్న పట్టీలాంటి గుడ్డను ఉంచి ఎర్రని తిలకాన్ని దిద్దుతారు. నుదుట పైభాగంలో ఎర్రని కుంకుమను అడ్డంగా దిద్దుతారు. చిన్న తెల్లబొట్టు పెడ్తారు. తలకు నల్లని గుడ్డ కట్టి కొప్పు ముడి వేస్తారు.

---

9. కాలం ఎంతమారినా కొన్ని సంప్రదాయాలు అలాగే ఉంటాయనడానికి నేపాలి 'థిమీ ' ఉత్సవమే నిదర్శనం. నేపాల్‌లో ఖాట్మండు దగ్గరున్న 'బోడ్ ' గ్రామంలో జరిగే ఈ 'థిమీ 'ఉత్సవంలో ప్రదర్శకులు తొమ్మిది అంగుళాల సూదిని నాలుక బయటికి చాచి గుచ్చుకుంటారు. దీనినే సూదులు గుచ్చుకొనే పండుగగా చెప్పొచ్చు. ఉత్సవం ముగిసే వరకు అలాగే వుంటారు. ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ప్రాంతాల్లో గంగజాతరకు, తమిళనాడులో 'కావడి ' పండక్కు ఇలా నాలుకపైన దవడలకు గుచ్చుకొనే అలవాటుంది.

10. అంబలి అంటే అన్నం వండినట్లే వండి గంజిని వార్చకుండా అందులోనే తగినంత రాగిపిండిని వేసి కలబెట్టి వండితే సంగటిలా వుంటుంది. దాన్ని పొయ్యిదించి చల్లారాక అందులో మజ్జిగ ఎర్రగడ్డ ముక్కలు వేసి బాగా ద్రవపదార్థంలా చేస్తారు. దీన్ని గ్లాసుల్లోను దోసిట్లోను పోసుకుని తాగుతారు.

కొప్పులో పూలు ముడుస్తారు. జడబిళ్ళలను పెడ్తారు. గడ్డానికి తెల్లని ముక్క పెట్టుకుంటాడు. మెళ్ళో ఆభరణాలను వేస్తారు. చేతులకు వంకీలాగా వుండే నెలవంక బిళ్ళల పట్టీని కడ్తారు. కర్ణాభరణాలను, తలకు ఇరువైపులా సూర్య చంద్రుల బిళ్ళలను పెడ్తారు. తలకు మల్లెపూలు, కనకాంబరాల్ని ముడ్తారు. చేతులకు కడియాల వంటి గాజులను వేస్తారు. పసుపురవిక, ఎర్రగళ్ళచీరను తొడుగుతారు. తెల్లని బట్టతో ఒడిబాలు కట్టి అందులో వేపాకును, అక్షింతలను ఉంచుతారు. మెళ్ళో పూలహారాలను ఎక్కువగా వేస్తారు. చేతిలో డమరుకం లాంటి చిన్న అద్దంను వేపాకును పట్టుకుంటాడు. కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటాడు.

స్థానికులు, చుట్టు పక్కల ప్రాంతాల వారు మొక్కుబడి కోసం మాతంగి వేషాన్ని వేస్తారు. ఈ వేషం వేసేవాళ్ళు తలకు పసుపు గుడ్డను జడలాకట్టి కొప్పుముడి వేసి, దానికి మల్లెపూలను చుట్టుకుంటారు. తెల్ల గళ్ళ చీర లేదా పసుపుచీర కట్టుకొని, రవిక తొడుక్కొంటారు. మెడలో పూలహారం వేసుకుంటారు. ఒడిబాలు కట్టుకొని అందులో అక్షింతలు, దువ్వెన, భరిణె, రవికగుడ్డ, పసుపు, కుంకుమలు పెట్టుకుంటారు. 'మాతంగి' వెయ్యికళ్ళ దేవతని ముఖానికి, వొళ్ళంతా నల్లని, ఎర్రనిబొట్లు పెట్టుకుంటారు. పలకలు వాయిస్తూ, కొమ్ములు వూదుతూ ఉంటే మాతంగి వేషగాళ్ళు లయబద్ధంగా చిందులు వేస్తూ వేషాలమ్మను, గంగమ్మను, మాతమ్మను, వివిధ గ్రామదేవతల్ని దర్శించుకుంటారు. మాతంగి వేషం వేసినవారి వెంట బంధుమిత్రులు కూడా ఉంటారు. చిందులు రాని మాతంగి వేషగాళ్ళ బదులు వెంటవచ్చే బంధుమిత్రులే చిందులు వేస్తుంటారు. పలకలు వాళ్ళు చిందులకు ముందు, తర్వాత ఏల పాటలను పాడి తర్వాత వివిధ వరుసల్లోని దరువులను వాయిస్తుంటారు. పలకల వాళ్ళు పాడే ఏలపాటలు ఈ విధంగా ఉంటాయి-

"ఏ ... తిరిగిసూస్తే తిరపతి పట్నమే ఏసాలమ్మ

మళ్ళిజూస్తే మంగాపురమే

ఆ రాయి రప్పొలే నీ కనమే

తాతాయి గుంట సివగంగే ఏసాలమ్మ

రాజులెక్కేదే చంద్రగిరి కోటే "[11]

11. వెంకటనాగులు - శేషాపురం ( రంగంపేట దగ్గర ) చంద్రగిరి మండలం



పురప్రజల మాతంగి వేషం



పలకల వాద్యాలకు చిందులేస్తున్న పురప్రజల మాతంగి వేషం

" ఓ ... ఏ కొండల వెయ్యంకటేశ్వడే
తాతాయి గుంట చినగంగే
బా(బూ) బు కూతిర్ని పెండ్లాడినాడే
అట వయిదు రూపాయులు జుడ్డు బుడ్డియే
తాతాయి గుంట చినగంగే
లంజా కొంపకే తగిలేసినాడే "[12]

" ఏ ... నా... రాతిరా నువ్ వస్తావని తాతాయిగుంట పినగంగే
నా.... రాతి గందమే తీపి పెట్టినే
అట రాత్రికే రాకపోతే తాతాయిగుంట పినగంగే
నా.. రాతి గందమే న్రిరీటి కొచ్చెనే " [13]

" ఏ ... నా కట్ల కట్ల కడవెత్తుకోని నడీది చినగంగే ఒపే
నీ యబ్బిడాల
నేను మెట్ల బాయికే నీళ్ళకు బోతే
నాకు మెట్టు జారీ ముట్టు విలిచెనె గంగమ్మో
నాకు ముత్యమంటీ కొడుకు బుట్టా"[14]

" ఏ ... ఎర్రాటి దాన్నే దెం -- వలెనే తాతాయిగుంట పినగంగే
దాని ఏడికంతా మాడవలెనే
నల్లాటి దాన్ని పెయ్యవలెనే తాతాయిగుంట పినగంగే
దాని నాన్నెమంతా మాడవలెనే "[15]

---

12. వెంకటనాగులు - శేషాపురం ( రంగంపేట దగ్గర ) చంద్రగిరి మండలం
13. చెంగయ్య - ముళ్ళపూడి ( తిరుపతి రూరల్ మండలం)
14. నాగభూషణం - ముళ్ళపూడి
15. చెంగయ్య - ముళ్ళపూడి

తిరుపతి గంగ జాతర

" ఓ ... ఆ పొల్లి దొల్లి నిద్రపోతా వుండెనే ఏసాలమ్మా

నల్లి వచ్చి దాని గొ -- కొరికెనే

ఆ నల్లి కేమో నల్లల దండే ఏసాలమ్మా

దానిగొ -- కేమో గొలకాల దండ "* [16]

3.2.9. సున్నపుకుండలు :- సోమవారం మధ్యాహ్నం నుండి సున్నపుకుండలు వేషాన్ని కైకల వాళ్ళ ఇంట్లో వేస్తారు. ఈ వేషంలో ఇద్దరు కైకల కులస్థులు పాల్గొంటారు. చాకలి కులస్థులు పాల్గొనరు. పెద్ద గంగమ్మ, చిన్నగంగమ్మలకు ప్రతీకలుగా ఈ వేషాన్ని ఇద్దరు వేస్తారు. కైకల వాళ్ళ ఇంట్లో ఉండే గంగమ్మ పోతురాజుల ప్రతిమల ముందు ఉంచబడి ఉన్న సున్నపు కుండల్ని తీసుకొని అక్కడ హారతినందుకొని వేషాలమ్మ గుడికి బయలుదేరుతారు. సున్నపు కుండల్ని గంగమ్మ ప్రతిమ ముందు, ఒక రోజు ముందు నుంచే ఉంచుతారు. కైకల వాళ్ళ ఇంట్లో ఈ వేషం వేసుకొన్నా సున్నపుకుండల్ని మాత్రం వేషాలమ్మ గుళ్ళోనే కడ్తారు. ఈ కార్యక్రమం చాలా ప్రధానమైంది. సున్నపుకుండల వేషం కైకల వాళ్ళ ఇంటినుంచి పంబల వాయిద్యాలతో వేషాలమ్మ గుడిని చేరుకొని, గుడివెలుపల ప్రదక్షిణం చేసి లోపలకెళ్ళి గుళ్ళోకూర్చొని సున్నపుకుండల్ని తలపై పెట్టుకొని కట్టుకుంటారు. ఈ తంతును చూడ్డానికి భక్తులు కిక్కిరిసి ఉంటారు. సున్నపు కుండలంటే రెండు కొత్త కుండలకు సున్నం పూసి ఉంటారు. కాబట్టి సున్నపు కుండలంటారు. వీటికి కుంకుమబొట్లు పెట్టి ఉంటారు. కుండ కింద భాగం మధ్యలో చిన్నరంధ్రం చేసి ఉంటారు. సున్నపు కుండల అంచుల (మూతి) దగ్గర మూరెడు పొడవుండే నాలుగు వెదురు పుల్లలను కట్టి వాటికి ఆధారంగా అడ్డ పుల్లలను చుట్టి కడ్తారు . సున్నపు కుండలకు పసుపు దారంతో కట్టిన పసుపుకొమ్మును కడ్తారు. ఈ సున్నపు కుండలను వేషధారుల తలపై కట్టేటప్పుడు కార్యక్రమం పూర్తయ్యేంత వరకు సాంబ్రాణి పొగ వేస్తారు. వేషం ముందు పంబల వాళ్ళు పంబలను వాయిస్తూ గంగమ్మ కథను చెప్తూ, అడుగులు వేస్తుంటారు.[17] వేషధారుల తల పై [illegible] మధ్యలో ఉచ్చి దగ్గరుండే కొన్ని వెంట్రుకలతో జానెడు చిన్న జడలా దారంతో పేడుతారు. అంతవరకు సున్నపు కుండల్ని వేషధార్ల ఒళ్ళో ఉంచుతారు. తర్వాత సున్నపుకుండల్ని తీసుకొని

---

16. వెంకటనాగులు - శేషాపురం

* చూడు :- ఏల పాటలు - అనుబంధం - 2.

17. చూడు :- గంగమ్మ కథ - అనుబంధం - 1.

నెత్తిన పెట్టి కుండ మధ్యలో ఉన్న రంధ్రంలోకి ఆ జానెడు పిలకలాంట జడను దూర్చి కుండ లోపల ముడి వేస్తారు. కుండ ఎలాంటి పరిస్థితుల్లోను కింద పడిపోకుండా ఉండడానికని అలా చేస్తారు. తర్వాత చిన్నగుడ్డను తీసుకొని చుట్టుకుదురులా కుండకు, తలకుమధ్య కడ్తారు. తర్వాత పసుపు రంగు అద్దిన చీరను బెత్తెడు వెడల్పు ఉండేటట్లు పట్టీలా మడుచుకొని తలకు, సున్నపు కుండలకు కలిపి తలపాగాలా కుండలు కనిపించకుండా చుడ్తారు. గుడ్డ వూడి పోకుండా ఉండడానికని దానిపైన పొడవాటి గట్టి దారంతో చుట్టి కడ్తారు. కుండ ఎలాంటి పరిస్థితుల్లోను కింద పడదు. సున్నపు కుండపైన ఉండే వెదురు పుల్లలకు మల్లెపూలను వేలాడ దీస్తారు. మల్లెలతో పాటు, కనకాంబరాలు బంతిపూలనుకూడా అడ్డంగా చుడ్తారు. ఇది చూడడానికి పూల కిరీటంలా ఉంటుంది. వేషాలమ్మ గుడిలో సున్నపు కుండలను వేషధారులపై కట్టాక టెంకాయల్ని కొట్టి హారతులిస్తారు. అక్కడ గుమిగూడిన జనంకూడా హారతులిచ్చి పూజిస్తారు. సున్నపుకుండల్లో హుండీలో వేసినట్లు డబ్బులు వేస్తాడు. వేషాలమ్మ గుడినుంచి బయలుదేరే ముందు కొల్ల (దిష్టి) టెంకాయను కొట్టి హారతిచ్చి బయలుదేరి చాటు మండపం ముందున్న పోతురాజు శిలను ప్రదక్షిణంచేసి నేరుగా బేరిశెట్టి ఇంటికొచ్చి ప్రథమ పూజల్ని అందుకొంటారు. సున్నపుకుండలు వేషం వెంట దివిటీని పట్టుకొని ఒకడు వెంబడే వుంటాడు. అలాగే ఎక్కువ మంది పంబల వాళ్ళు పంబలను, ఢమరుకాలను వాయిస్తూ గంగమ్మ కథను పాడుతూ అనుసరిస్తుంటారు. చాటు మండపంలో కాసేపు విశ్రాంతిగా కూర్చొని ఊడిపోయిన వాటిని సవరించుకుంటారు. సున్నపు కుండలు వేషం జతగా పట్టణంలోని ప్రతి ఇంటికీ వెళ్ళి హారతులందు కుంటారు. సున్నపు కుండల వేషధారులను భక్తులు కుర్చీలలో కూర్చోపెట్టి కాళ్ళు కడిగి, పసుపుకుంకుమలు పెట్టి పాదపూజ చేసి టెంకాయలు కొట్టి హారతులిచ్చి సున్న-పుకుండల్లో డబ్బులు వేస్తారు. వేషధారులు తాగడానికి పాలు, మజ్జిగ, చల్లని పానీయాలను ఇస్తుంటారు. కొందరు చీరలు, రవికలు, పంచెలు, పట్టుపంచెలు, పైవస్త్రాలను కూడా సున్నపుకుండల వేషధారులకు కప్పుతారు. కొందరు పుట్టిన బిడ్డల్ని సున్నపు కుండల వేషధారుల వొళ్ళో పడుకోబెడ్తారు. బియ్యం, టెంకాయ, భరిణె, అద్దం, దువ్వెన, కదుంపొడి, పసుపు, కుంకుమ, చవ్వాకు, నల్లగాజులు, నల్లపూసలు అమ్మవారి ప్రతిరూపమైన సున్నపు కుండలకు ఒడిబాలు పెట్టి చల్లగా చూడమని వేడుకుంటారు. సున్నపు కుండల వేషధారులు భక్తులకు తమ చేతులకు చుట్టుకొని ఉండే మల్లెపూలను తుంచి ఇస్తుంటారు. పంబలవాళ్ళు ప్రతి ఇంటి దగ్గర ఇనాం అడిగి తీసుకుంటుంటారు. సోమవారం మధ్యాహ్నం వేసిన సున్నపు కుండలు వేషం, ఆ రాత్రంతా పట్టణంలోని ప్రతి ఇంటికి వెళ్తారు.

ఊరు పెద్దదవడం వల్ల మంగళవారం ఉదయం, మంగళవారం రాత్రికూడా ఆ వేషంతోటే వూరంతా తిరుగుతూ ఇంటింటికెళ్ళి పూజలందుకోవడం వల్ల ఆలస్యం అవుతుంటుంది. ఈ వేషాన్ని బుధవారం ఉదయం వేషాలమ్మ గుడి పక్కనే ఉన్న కోర్టుదగ్గరకెళ్ళి సున్నపు కుండలను పగులకొట్టేస్తారు. అప్పుడా కుండ పెంకుల కోసం అక్కడున్న వారందరూ పోటీ పడ్తారు. ఎందుకంటే ఆ కుండలో హుండీలాగా ఎందరో డబ్బులేస్తుంటారు కాబట్టి ఆ కుండలు ఎంతో ధనాన్ని ఆర్జిస్తాయి. అందుకని ధనలక్ష్మిలాంటి ఆ కుండ పెంకుల్ని ఇంట్లో పెట్టుకుంటే ధనం చేకూరుతుందని ప్రజల విశ్వాసం. అలాగే పసిపిల్లలకు సంధి దోషంవస్తే ఆ పెంకును సాది పోస్తే పిల్లలకు జబ్బు నివారణ అవుతుందని నమ్ముతారు.

సున్నపు కుండలు వేషం వేసేటప్పుడు వేషధారుల ముఖానికి పసుపు పూస్తారు. నుదుటిపైన అడ్డంగా కుంకుమతో పట్టీని పెడ్తారు. నుదుట తెల్లబొట్టు, నల్లబొట్టును అడ్డంగా పెడ్తారు. నల్లని చుక్కబొట్టు కూడా పెడ్తారు. గడ్డం మీద నల్లని అడ్డబొట్టు దానికి కాసింత కింద కుంకుమతో ఎర్రని అడ్డుపట్టీ పెడ్తారు. గడ్డం కింద తెల్లని రంగు పూస్తారు. నల్లని చుక్క బొట్టును బుగ్గపై పెడ్తారు. పొడవాటి కర్ణాభరణాలు, కంఠాభరణాలు, చేతులకు నెలవంకలుండే వంకీలాంటి ఆభరణాన్ని కడ్తారు. కడియాల్లాంటి గాజులను తొడుగుతారు. చేతిలో డమరుకంలాంటి అద్దం పట్టుకుంటాడు. కాళ్ళకు గజ్జెలను కడ్తారు. ఇద్దరు వేషధార్లలో ఒకరికి పసుపుచీర ఇంకొకరికి వక్క రంగుచీరను కడ్తారు. పసుపు రవికల్ని తొడుగుతారు. చీరకొంగును పైటగా వేయకుండా వక్షస్థలం దగ్గర చుట్టుకుంటారు. మెళ్ళో పూలహారాలను వేసుకుంటారు.

3.2.10. చప్పరాలు:- దీనినే 'సప్పరాలు' అని అంటారు. జాతరలో చివరి రోజైన మంగళవారం చప్పరాలను ప్రజలు మొక్కుబడి కోసం వేస్తారు. తిరుపతి స్థానికులు, చుట్టుపక్కల ప్రాంతాలవాళ్ళు ఈ చప్పరాలను అధికంగా వేస్తుంటారు. చప్పరాలను వేసేవారు ఎంతో నియమనిష్ఠలతో ఉంటారు. వారు ముందురోజు అంటే సోమవారం సాయంత్రంనుండి ఒళ్ళంతా గంధం పూసుకొని, పట్టాపట్టీ గుడ్డతో షరాయి కుట్టుకొని, తెల్ల బనీను ధరించి తలకు తలపాగా చుట్టుకున్నట్లు మల్లెపూలు చుట్టుకొని, కాళ్ళకు గజ్జెలను కట్టుకుంటారు. మూరెడు పొడవుండే ' లాకల్ని ' (సన్నని వెదురు పుల్లల్ని) మేదర వాళ్ళ దగ్గర తీసుకొని, ఇంటికొచ్చి నట్టింట పెట్టి, కుంభాన్ని నైవేద్యంగా పెట్టి హారతులిచ్చి తర్వాత లాకల్ని తాడుతో కట్టి పసుపుగుడ్డను చుట్టి గాని లేదా అలాగేగాని కుడిచేతిలో పట్టుకొని పలకలు, కొమ్ములు, తాజాల వాయిద్యాలతో



వేషాలమ్మ మూల విగ్రహం



వేషాలమ్మ గుడి

చిందులు వేస్తూ వేషాలమ్మ గుడికి వచ్చి, అక్కడ్నుంచి బయలుదేరి గాంధీరోడ్, బండ్లవీధులగుండా వచ్చి గంగమ్మను దర్శించుకొని గుడి చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి తర్వాత చప్పరాలను కుట్టే ప్రదేశానికి వెళ్తారు. ఇది ఒక రకంగా దీక్షలాంటిది. చప్పరాలను వేషాలమ్మ గుడిదగ్గర కుట్టాలంటే చోటు చాలదు కాబట్టి పక్కనే ఉండే కోర్టు ఆవరణలోకెళ్ళి అక్కడ కుట్టు కుంటారు. చప్పరాలను కుట్టడానికి అక్కడ సుమారు ఇరవైమంది వరకు ఉంటారు. ఇలా కుట్టేవాళ్ళకు 25 రూ॥ల నుండి తమ శక్త్యానుసారం ఇస్తారు. చప్పరాలను కుట్టుకొని సిద్ధం కావడానికి కొంత సమయం పడ్తుంది. మొట్టమొదట ధూపం వాళ్ళ చప్పరాన్ని కుడ్తారు. ఈ ధూపం వాళ్ళు తిరుపతి బండ్లవీధి, చిన్నకాపువీధి వాస్తవ్యులు.[18] వీరికి ప్రత్యేక గౌరవం ఇస్తారు. ఈ ధూపం వాళ్ళ చప్పరం తర్వాత నగరి వాళ్ళ చప్పరం కుడ్తారు. వీళ్ళు ఏటా క్రమం తప్పకుండా చప్పరాలను కుట్టుకుంటారని తెలుస్తోంది. కానీ ప్రస్తుతం ధూపం వాళ్ళు నగరి వాళ్ళు చప్పరాల్ని కుట్టుకోవడం లేదు. అయినా ఇప్పుడు కూడా ధూపం వాళ్ళ చప్పరం కోసం, నగరి వాళ్ళ చప్పరంకోసం అదో సాంప్రదాయంలా వేచి ఉంటారు. అలా కొంత సేపు చూసి వాళ్ళు రాలేదని నిర్ధారించుకున్నాక ఇతరులకు కుట్టడం మొదలు పెడ్తారు.

మరుసటి రోజు మంగళవారం తెల్లవారు జాము నుండి చప్పరాలు అతి కోలాహలంగా, కన్నులపండుగగా ప్రారంభమవుతాయి. చప్పరాన్ని గోపురం ఆకారంలో వెదురు దబ్బలతో తయారుచేసి రంగు కాగితాల్ని అతికిస్తారు. వెదురు దబ్బల్ని కట్టడానికి దారాన్ని, కాగితాలని అతికించడానికి 'బందన' (మైదా) ను ఉపయోగిస్తారు. గోపురం మీది బొమ్మల్లాగే చప్పరాలకు కూడా బెండుతో [19] బొమ్మలు తయారు చేసి, వాటికి రంగులు పూసి, ఎంతో కళాత్మకంగా అమర్చుతారు. చిలకల బొమ్మలు, ఆడా మగా బొమ్మలు, గుర్రాలు, ఏనుగులు, నెమళ్ళు వంటివి తయారు చేస్తారు. వీటికి నిగ, నిగ లాడే పరిగ కాగితాలను, పన్నని చిన్న చీలలను ఉపయోగిస్తారు. పూసల హారాలను కూడా వేలాడదీస్తారు. చప్పరాలను తయారుచేసేవాళ్ళు పల్లెవీధిలో కొన్ని కుటుంబాల వారున్నారు. వీళ్ళు పల్లెరెడ్లు. చప్పరాలను తయారు చేసే పొన్నవాడ సుబ్రమణ్యంరెడ్డి దాదాపు తమ పూర్వీకులు వంద సంవత్సరాల

---

[18] ప్రస్తుతం ధూపం వాళ్ళు రెండు కుటుంబాలు మాత్రమే మిగిలి ఉన్నాయని 70 ఏళ్ళ ధూపం దొరస్వామి రెడ్డి చెప్పారు.

[19] బెండు :- జీలుగకర్ర అంటే నీళ్ళలో ఉండే వేరు ఎండి పోతే బెండు అవుతుంది. దీన్ని తిరుపతి సమీపంలోని మల్లెమడుగు నుండి తెస్తారు.

నుంచి చప్పరాలను చేస్తున్నట్లు చెప్తున్నాడు. పూర్వం చప్పరాలను చేసేవాళ్ళను 'బొమ్మరిల్లు' వాళ్ళు అని అనేవారట. ఒకప్పుడు వెయ్యి చప్పరాలను తయారు చేసేవాళ్ళు, నేడు క్రమక్రమంగా తగ్గిపోతూ నూటఏభైకి చేరుకున్నాయి. చప్పరానికి 100 రూ॥ ల నుండి 600 రూ॥ల వరకు తీసుకుంటారు. చప్పరాలను తయారు చేసేవాళ్ళు కూడా చిత్రి నెలనుంచి 'మైలు'(మైల) తగలకుండా ఎంతో నియమంతో తయారు చేస్తారు.

చప్పరానికి దిగువన నాలుగు పక్కల వెదురు దబ్బలను శరీరానికి అనుగుణంగా ఉండేటట్లు అమర్చుతారు. చప్పరాన్ని ధరించే వ్యక్తి నడుం వరకు చందనం పూసుకొని, షరాయి తొడుక్కొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటాడు. తర్వాత లాకల్ని సూదితో కుట్టారు. లాకలు చివరి భాగాన్ని సన్నని సూదిలా జివ్వుతారు.[20] చర్మాన్ని లాగి సూది ద్వారా లాకల్ని గుచ్చి సూదిని బయటకు లాగేస్తారు. దీని వల్లనే చప్పరం కుట్టు కోవడం అని పేరు వచ్చింది. (ఒకరికి బదులుగా మరొకరు చప్పరాలను కుట్టుకోవడం కూడా ఉంది.) చప్పరం కుట్టేటప్పుడు బంధు మిత్రులు వెంట ఉంటారు. ఆ తర్వాత చప్పరాన్ని నెత్తిన పెట్టుకొని, వెదురు దబ్బలను ' లాకలు ' పై ఆనించి నడుం చుట్టూ పంచతో గట్టిగా కట్టుకుంటారు. చప్పరానికి వేలాడుతున్న దారాన్ని ఒక చేత్తో పట్టుకుని పలకలు, తాజాలు, కొమ్ముల వాద్యాలకనుగుణంగా, లయబద్ధంగా చిందులు వేస్తూ ఆడుతూ వేషాలమ్మ గుడి దగ్గర నుండి బయలు దేరి చిన్నగంగమ్మ, పెద్ద గంగమ్మ, అంకాళమ్మ, మాతమ్మ ఇతర గ్రామదేవతల గుడులను దర్శించుకుంటారు. చప్పరాలను వేసిన వారి కుటుంబీకులు పొట్టేళ్ళను, మేకపోతులను బలిచ్చి, పొంగళ్ళు పెడ్తారు. చప్పరాలు వేసేవారి చిందులకు నడుం చర్మానికి కుట్టిన లాకలు ఊడిపోతాయి. బాధను భరించి నడుంకు ' లాకల్ని ' కుట్టు కోవడం ఒక ప్రత్యేకత. దీర్ఘకాల కడుపునొప్పి పోవడానికి, సంతానం కోసం, పశువులు తప్పిపోయి దొరికితే, పంటలు బాగా పండితే, చప్పరాలను వేస్తారు. చప్పరాల్ని రకరకాలుగా, వివిధ కొలతల్లో వ్యక్తులను బట్టి తయారు చేసుకుంటారు. చిన్నపిల్లలు బరువు తక్కువగా ఉండే వెదురుతో చేసిన మల్లెపూల చప్పరాల్ని ధరిస్తారు. చప్పరాలు ఎంతో అందంగా, కళాత్మకంగా, కళ్ళు మిరుమిట్లు గొల్పే విధంగా ఉంటాయి. చప్పరాలు కుట్టుకొని ఆడుతూ

---

[20]. పొట్ట పైభాగంలో కుడివైపు ఇరవై అయిదు, ఎడమవైపు ఇరవై అయిదు లాకల్ని గుచ్చుతారు. అలాగే వీపున కుడివైపు ఇరవై అయిదు, ఎడమ వైపున ఇరవై అయిదు లాకల్ని కుడ్తారు. అంటే మొత్తం నూరు లాకల్ని కుడ్తారు. కొంత మంది లాకల్ని కుట్టుకోవడం భరించలేకపోతే వాళ్ళు చాలు అనేంతవరకు కుడ్తారు. లాకల్ని కుట్టేంతవరకు మైల, ముట్టా తగలకుండా ఉండటానికి పసుపునీళ్ళు చల్లుతుంటారు.



చప్పరాలతో కిక్కిరిసి ఉన్న గంగమ్మ గుడి ఆవరణ
(20ఏళ్ళముందు ఫోటో)



చప్పరాన్ని కుట్టుకొని పలకల వాయిద్యాలకు
అనుగుణంగా నృత్యం చేస్తున్న దృశ్యం

చిందులు వేస్తూ  ఏల పాటలు కూడా పాడుతుంటారు. కొన్ని ఏలపాటలను గమనించండి -

" ఏ ... ఏహే, అదో సప్రమంటే సంతోషం ఆయె ఏసిగన్నా

నువ్ కుట్టుకుంటే కుసాల గున్నో

అదొ తట్టుకు పైన లాకలు దించగ

నువ్ ఎగిరి ఎగిరి ఆడేటప్పుడు

సక్కని సెలికోడ నా మన్నెదొర బుజాన రుమాలి గుడ్డా

యిక తట్టుకు పన్నిండూ నిలవ దెగునో "[21]

" ఏ ... అట సీమ చింత సెట్టుకింద సక్కాని సెలికోడా

దాన్ను తేలుగుట్టెనో పాము గుట్టెనో

అది తేలు గాదు పాము గాదు సక్కని సెలికోడా

దాని లంజకోడూ కొనగోరు దెబ్బా "[22].

" ఏ ... నే గుట్ట గుట్టా తిరగలేనే

గూని మేకలు మేపలేనే

పచ్చిపాలు తాగలేనే ఒసే నీ అబ్బుడాలా

నేను కింద బడితే దెం -- లేనే "[23].

" ఏ ... నా...పూ -- రెండు పూలు జుట్టె గంగమ్మా

మొ -- కు రెండూ గజ్జాలు గట్టీ

నే గల్లు గల్లని దెం -- తుంటే గంగమ్మా

---

21. తిరుపాలు - శ్రీకాళహస్తి.
22 I bid
23. రాజగోపాల్ - కొర్లగుంట,తిరుపతి.

నా...బల్లు బల్లనే తెల్లారి పోనూ "[24]

" ఏ ... పూ - లో మొ -- బెట్టికోని తాతాయి గుంట వినగంగే
ఎడమ చేత్తో బిగ బట్టికోనీ
ఆదమరచి నిద్రబోతే తాతాయి గుంట చినగంగే
పూ -- లో మొ -- రా కుక్క దెంక పోయే "[25]

" ఏ ... నువ్ వ్రమనీ సంతోష పడితివే ఒరబ్బే ఏపికన్నా
కుట్టాలనే కుశాల బడితివే
సోమవారం పొద్దు పొద్దుకాడా
వేషం ధరించుకోని నాలుగుళ్ళు తిరుక్కోని తిరుపతి ఏషాలమ్మా
వానకు పడమట తొట్టు ముక్కంలో గుడ్డేసుకోని
నాలుగు పక్కల లాకలు దించి
మిలాలు ఎత్తేటప్పుడ ఒరే నీయమ్మ కొడకా
నీకు తీరినాదిరా తిరనాల వోదే "* [26]

చప్పరాలను నెత్తిన పెట్టుకొని గ్రామదేవతల్ని దర్శించాక, తెలిసిన వాళ్ళ ఇళ్ళకు, బంధువుల ఇళ్ళకు వెళ్ళి నృత్యం చేస్తారు. వాళ్ళు చప్పరాలకు పంచలు, పైగుడ్డలు (సవకాలు) కప్పి, పానకం, అంబలి వంటి వాటిని తాగ-డానికిస్తారు. మరికొందరు బ్రాందీ, విస్కీలను లేదా సారా, కల్లును కూడా చప్పరాలు వేసే వారికిస్తుంటారు, చప్పరాలు కుట్టుకున్న బాధనుండి ఉపశమనం పొందడానికని. చప్పరాలను దించేటప్పుడు అంటే విప్పేటప్పుడు ఇంటి దగ్గర కూడా పొట్టేలునో, కోడినో బలిచ్చి దింపుతారు. తర్వాత చప్పరాలను కొందరు

24. తిరుప్పాలు - శ్రీకాళహస్తి.
25 నెల్లూరి నారయ్య - చెంగారెడ్డి పల్లి.
26. నెల్లూరి నారయ్య - చెంగారెడ్డి పల్లి.

* చూడు :- ఏలలు - అనుబంధం - 2.

తయారు చేసినోళ్ళకే ఉచితంగా ఇచ్చేస్తారు. మరికొందరు తమ ఇంటి దగ్గరుండే చెట్లపై భాగంలో పెట్టేస్తారు. చెట్లపైన పెట్టడం వల్ల దోషాలుండవని, శుభం జరుగుతుందని భావిస్తారు.

3.2.11. పేరంటాలు వేషం:- ఈ వేషాన్ని జాతర చివరి రోజైన మంగళవారం అర్ధరాత్రి ఆనువంశిక మిరాశిదారులలో ఒకడైన కైకల కులస్థుడు మాత్రమే వేస్తాడు. ఈ వేషాన్ని ఒక్కరే వేస్తారు. ఇది తిరుపతి గంగ జాతరలో వేసే చిట్ట చివరి వేషం. పేరంటాలు వేషాన్ని కైకల వాళ్ళ ఇంట్లో గంగమ్మ, పోతురాజు ప్రతిమల ముందు వేసుకొని, అక్కడ హారతిని అందుకున్నాక, నేరుగా వేషాలమ్మ గుడి ఉండే పల్లెవీధి మొదటికెళ్ళి నిలబడ్తాడు. అంటే బేరివీధి, పల్లివీధి కలిసే చోటు. వెంట వచ్చిన వాళ్ళు గడ్డితో చేసిన బొమ్మను తెస్తారు. దీన్నే 'బండి పీనుగ ' అంటారు.[27]

దీన్ని పాళెగాడి పీనుగగా భావిస్తారు. పేరంటాలు వేషధారి పక్కనే ఉన్న తోటోడి చేతిలోని దివిటీని తీసుకొని బండిపీనుగకు నిప్పంటిస్తాడు. చుట్టూ ఉన్నవారు' లబ లబ లబ ' మని నోరు కొట్టుకుంటారు. పేరంటాలు వేషధారి కాలే బండి పీనుగపై తన ఒడిలోని అక్షింతల్ని చల్లుతాడు. పేరంటాలు వేషాలమ్మ గుడికి వెళ్ళదు. పేరంటాలు వేషంలో ఇద్దరు గంగమ్మలు ఒకటవుతారని భావిస్తారు. పేరంటాలు వేషం పంబల వాయిద్యాలతో చాటు మండపం ముందున్న పోతురాజు శిలను ప్రదక్షిణం చేసి అక్కడికి సమీపంలో ఉండే బేరిశెట్టి ఇంటికి వెళ్ళి ప్రథమ పూజలందుకొంటుంది. అక్కడ్నుంచి పేరంటాలు వేషం కొన్ని వీధులు మాత్రమే తిరిగి పూజలందుకొని నేరుగా వెళ్ళి చిన్న గంగమ్మ చెంపను నరికి, తర్వాత పెద్దగంగమ్మ చెంపను నరికి జాతరను పరిసమాప్తి చేస్తుంది.

పేరంటాలు వేషాన్ని కైకల వాళ్ళే అలంకరిస్తారు. ఎర్రగళ్ళ చీరను కట్టి, ఎర్రని గుడ్డలో ఒడిబాలును కడ్తారు. అందులో అక్షింతలు, చవ్వాకు, దువ్వెన, అద్దం, నల్లగాజులు, పసుపు కుంకుమలు ఉంచుతారు. తలకు నల్లని గుడ్డను కట్టి కొప్పులా ముడేస్తారు. కొప్పులో పూలను ముడుస్తారు. తలపైన

---

[27] ముందు రెండెద్దుల బండి మీద కసువు(గడ్డి)పరచి బతికున్న మనిషిని పడుకోబెట్టి, తెల్లగుడ్డను కప్పి, నోరు కొట్టుకుంటూ బరబరా బండిని కాల్చే ప్రదేశానికి ఈడ్చుకెళ్ళేవారు. కసువును కాల్చి మనిషిని తరిమేసేవాళ్ళు. ఆ మనిషి మూడు నెలల వరకు బయట ఎవరికంటా పడకూడదు. ఆ తర్వాత కొంత కాలానికి బండిమీద మనిషికి బదులు గడ్డితో చేసిన బొమ్మను తీసుకెళ్ళి తగుల బెట్టేవారు. ప్రస్తుతం బండి కూడా లేదు. ఒట్టి గడ్డి (కసువు)ని మాత్రమే కాలుస్తున్నారు.

బంగారంలా కనిపించే అట్టతో చేసిన జడబిల్లలు, పట్టీలు వంటి ఆభరణాలను కడ్తారు. దానిపై పూలను చుడ్తారు. చెవులకు పెద్ద కర్ణాభరణాలను తగిలిస్తారు. చేతులకు కంకణాల గాజుల్ని వేస్తారు. కుడిచేయి రెట్టకు నెలవంక హారాన్ని కడ్తారు. మెళ్లో పూలహారాలను వేస్తారు. ముఖానికి పసుపు పూస్తారు. నుదుటిపై ఎర్రకుంకుమతో పట్టీగా పెడ్తారు. దానికింద విబూదితో అడ్డబొట్టు పెడ్తారు. గడ్డంపైన ఎర్రని కుంకుమతోనే మరోపట్టీని పెడ్తారు. దానిపైన కూడా విబూదితో అడ్డ పట్టీ పెడ్తారు.

ఇంతవరకు చెప్పిన వేషాలన్నీ ఆయారోజుల్లోనే క్రమం తప్పకుండా వేస్తారు. ఇతరత్రా వేషాలను, జనాలు తమ ముచ్చట కోసం వేసే వేషాలను జాతర నాలుగోరోజైన శనివారం నుండి వేస్తారు. ఇలా ప్రజలు తమ మొక్కుబడుల కోసమో, ఆనందం కోసమో, అభిరుచుల కోసమో ప్రదర్శించే వేషాలను గూర్చి తెలుసుకోవడం సమంజసం.

తిరుపతి గంగజాతరలో ప్రదర్శించే వేషాలలో కాశికావడి, సతారం సుంకరికొండడి వేషం, జల్లికొండమనాయని వారి వేషం, దాష్టీక పంతుల వారి వేషం, నూగోజీ పంతులవారి వేషం, గారడివిద్యల వేషం, నడీధివేషం, గెరిగాట, కీలుగుఱ్ఱాలాట, నెమలాట, ఎలుంగొడ్డు ఆట, పులివేషం, పోటువేషం, బొట్టబొమ్మలాట, మెరిగాళ్ళాట, గడకొయ్యాట, నక్కలోళ్ళ వేషం వంటి వివిధ వేషాలు చెప్పకోదగ్గవి.

3.2.12. కాశికావడి :- కాశి కావడికి రెండు పక్కల రెండు ఇత్తడి చెంబులు కడ్తారు. అంటే కాశి నుంచి గంగ తీర్థాన్ని తెస్తున్నట్లు కావడి రెండంచులను అర్ధచంద్రాకారంలా వెదురు పుల్లలతో పట్టీ కట్టు కుంటారు. దానికి రంగుకాగితాలు, సరిగ కాగితాలను అతికిస్తారు. కాశి కావడిని మోసే వ్యక్తి శరీరానికి చందనం పూసుకొని, కీపాసు పంచె కట్టుకొని, నడికట్టు కట్టుకొని మెడలో పూలహారం వేసుకుంటాడు. ఇతనితో పాటు మరోవ్యక్తి కూడా కాశి కావడి లేకపోయినా పైన చెప్పినట్లే అలంకరించుకొని చేతిలో తాటాకు విసన కర్రను పట్టుకొని కాశి కావడి మోసే వ్యక్తితో కలసి సంవాదాలు ఆడుతూ పాడుతూ ఉంటారు.

మొదటి వ్యక్తి :- "కాశి కావిడి మోసి రామాహరి
నా భుజము కాయులు కాసె రామాహరి

రెండవ :- కాశి కావడి కాదు రామాహరి



పేరంటాలు వేషం



పేరంటాలు వేషం 'బండి పీనుగ' ను కాలుస్తున్న దృశ్యం

తిరుపతి గంగ జాతర - పేటశ్రీ

అది చెంబడి బుట్లయ్య రామాహరి

మొదటి :- ఎక్కడికి పోయినా రామాహరి

వీడు దాయాది పోరండి రామాహరి

రెండవ :- నేను దాయాది కాదండి రామాహరి

నేను బామ్మర్ది కావాలి రామాహరి

మొదటి :- కాశీకి పోయాను రామాహరి

కాశి తీర్థాము తెచ్చాను రామాహరి

రెండవ :- అది కాశి తీర్థము కాదు రామాహరి

అది కాల్వలో తీర్థమండి రామాహరి

హర హర హర హర ......."[28]

ఇలా కాశి కావడి ఎంతో కళాత్మకంగా వినోదాత్మకంగా ఉంటుంది.

3.2.13. సతారాం :- సతారాంను 'తిల్లాలంగిడి ' అనికూడా అంటారు. సతారాం ఆటకు గురువుంటాడు. పది మందికి పైగా వ్యక్తులు ఈ ఆటను గంగజాతరకు ముందు నుంచే నేర్చుకుంటారు. ఈ ఆటలో ఆడ, మగవేషాలు వేసుకొని కానీ, లేదా పౌరాణిక వేషాలు వేసుకుని గానీ పాల్గొంటారు. ఈ ఆటకు తబలా, హార్మోనియం, గజ్జెలు, తాళాలు వంటి వాద్యాలను ఉపయోగిస్తారు. సతారాం ఆటలో తెలుగు పాటలతో పాటు, తమిళ పాటలు కూడా పాడ్తారు. ఈ ఆట ఆడేటప్పుడు కాలిబొటన వేళ్ళ మీద ఊతం నిలిపి అరచేతుల్ని నేల తాకిస్తూ గుండ్రంగా తిరుగుతారు. తెలిసిన వాళ్ళ ఇండ్లకు వచ్చి ఇనాంలు తీసుకుంటారు. ఈ ఆటలో పాటలు ఇలా ఉంటాయి -

"ఏ ... తిల్లాలంగిడి తిల్లాలంగిడి తిల్లాలకియలే

బలెమ్మా తిల్లాలకియలే జోగ్గ తిల్లాలకియలే

ఏ ... తిల్లాలంగిడి పాట్టుబాడి వందేన్ సబియలే

బలెమ్మా వందేన్ సబియలే

---

28. శ్రీమతి బి. పార్వతమ్మ (పాతవ్వ) తిరుపతి మునిసిపాలిటి మొదటి మహిళా కౌన్సిలర్,బండ్లవీధి, తిరుపతి.

ఏ ... నాన నాన నాన నన్నా నాన్ననా

నానే నాని నన్నాన

నన్నన్న నన్న నన్నాన

ఏ పొట్టా పోడి ఏ పొట్టా పోడి

పోడి వన్ననం పొడమేలె పైలే

దడుడివె సింగపూరు రైలే

ఎతుడివె కొత్తపేట పైలే

ఏ ...నాన నాన నాన నన్నా నాన్ననా

నానే నాని నన్నాన

నన్నన్న నన్న నన్ననా

ఏ అప్పలపళ ఏ అప్పలపళ

అయిపో మచ్చా డప్పాండోలో

తువ్వాంబ అయిహో అయిహో అయిహో

ఏ ఐంచి వయసులే ఏ ఐంచి వయసులే

కత్తిరెడితం చిల్లర తేడి పట్టు

పోలీస్ గజైల యంగ పట్టు

యంగళ్ళట్టు జైల పట్టివిడు ॥ఏ నాన్న నాన ॥[29]"

"రవే రావే పిల్లా - నీకు రగిస్యాము జేస్తాను

పొరా పోర బేకో - నీ పొగసాటి మాటలెల్లా

సుందరీ సొమ్ముల్లిస్తా - సొమ్మిస్తే వెంట వస్తా

కట్టుకోను సీరలిస్తా - తొడిగిస్తే వెంట వస్తా

[29] దుర్గం పెద చెంగా రెడ్డి - పెరుమాళ్ళ పల్లి, తిరుపతి రూరల్ మండలం.

తిరుపతి గంగ జాతర - పేటశ్రీ

పొడగాటి రైక విస్తా - తొడిగిస్తే వెంట వస్తా
రాకుంటే సస్తాను - నీ కాళ్‌కు మొక్తాను ॥రవే రావె ॥
అడవిలోన నిన్ను జూచి పిల్లా పిల్లా
నా మనసేమో నిల్వ లేదోయ్ రాజోళ్ పిల్లా ॥నా మనసేమో ॥
అడవిలోన నిన్ను జూచి అన్నా అన్నా
నన్ను ఆదరించ బోవు మయ్యా అన్నా అన్నా ॥ నన్ను ॥
అన్నగాదె అయ్యగాదె పిల్లా పిల్లా
నేను కొండలుండె దొంగనె 'తిల్' పిల్లా పిల్లా ॥ నేను ॥
కొండలుండే దొంగలైతే అయ్యా అయ్యా
నన్ను ఆదరించ బ్రోవుమయ్యా అయ్యా అయ్యా ॥ నన్ను ॥
అయ్య గాదె అన్నగాదె పిల్లా పిల్లా
నేను మేనమామ కొడుకునె 'తిల్ ' పిల్లా పిల్లా ॥ నేను ॥
మేనమామ కొడుకైతే దొంగ పిన్నోడా
నీ వెవ్వడవోయ్ మాట్లాడ్తావ్ దొంగ పిన్నోడా ॥ నీవెవ్వడవోయ్ ॥
ఎవడినా ...
నిన్ ఎత్కోన్ పోనొచ్చాన్ రాజోళ్ పిల్లా
నా కిప్పడేమి చెప్తావోయ్ రాజోళ్ పిల్లా ॥ నాకిప్ప ॥
నన్నెత్కో పోతేనోయ్ దొంగ పిన్నోడా
నీ దెబ్బగాడున్నాడోయ్ దొంగ పిన్నోడా ॥ నీదెబ్బ ॥
ఈ లోకములో ఎవడు లేదోయ్ రాజోళ్ పిల్లా
నా దెబ్బ గాడు ఎవరు లేదోయ్ రాజోళ్ పిల్లా ॥ నా దెబ్బ ॥ "*[30]

---

30 దుర్గం పెద చెంగా రెడ్డి - పెరుమాళ్ళ పల్లి

3.2.14. సుంకరి కొండడి వేషం :- ఈ వేషం కొన్ని ఏళ్ళకు ముందు బాగా ప్రచారంలో ఉండేది. గంగజాతర సమయంలో ప్రజల వినోదం కోసం ఈ వేషాన్ని వేస్తారు. ఈ వేషంలో కృష్ణుడి వేషంతో పాటు గొల్ల భామల వేషాలు కూడా ఉంటాయి. తాళాలు, హార్మోనియం, తబలా వంటి వాయిద్యాలుంటాయి. సుంకరి కొండడి వేషం కోసం తిరుపతి వాస్తవ్యుడైన కాశిరాములాల కొడుకు కన్నయ్యలాల ఒక కథను నవ రసాలంకార నాటకంగా రాశాడు. ఇది 'సుంకరి కొండడి వేషపు కథ ' గా ముద్రించబడి ఎంతో ప్రాశస్త్యం చెందింది. సుంకరి కొండడి వేషం వేసుకొనే వారికి గురువుంటాడు. జాతరకు కొన్ని రోజులు ముందునుంచే ఈ నాటకాన్ని అభ్యసిస్తారు. ఈ నాటకం చాలా చిన్నది గంటలోపే పూర్తి అవుతుంది. కాబట్టి తిరుపతి ప్రధాన కూడలుల్లో, గంగమ్మ గుడి ముందు, ప్రముఖుల ఇళ్ళ వద్ద ఈ నాటకాన్ని ప్రదర్శిస్తారు.

సుంకరి అంటే పన్ను వసూలు చేసేవాడు. కొండడు ఎవరో కాదు శ్రీకృష్ణుడు. సుంకరి వేషం వేసుకొన్న శ్రీకృష్ణుడికీ చల్లనమ్ముకోవడానికి పట్ట-ణంలోకి అడుగు పెడ్తున్న గోపికలకు జరిగే సరస సంభాషణే ఈ నాటకంలోని కథా విషయం. సుంకరి పన్నుకోసం కాకుండా గోపికల్ని పట్టాలని అటకా-యిస్తాడు. అందుచేత సంభాషణ శృంగార, హాస్యరస ప్రధానంగా సాగుతుంది. సుంకరి కొండడి వేషం కథ తిల్లానా బాణీలో రచింపబడిందని చెప్పొచ్చు. హరి ఆదిశేషువు ' సుంకరి కొండడి వేషం కథ ' ను గురించి ప్రస్తావిస్తూ ఆంధ్రరత్న

---

*"శృంగార రస ప్రధానమైన జానపద గేయాల్లో తిల్లాలె పాట ఒక రకము. తిల్లాలె అన్నపదం తిల్లానా యొక్క అపభ్రంశ రూపం. వీటిలోని కథావిషయము సామా-న్యంగా స్త్రీ పురుషుల మధ్య జరిగే ధ్వని ప్రధానాత్మకమైన సంభాషణ. కథ ప్రధానం కానేకాదు. సంభాషణ కూడా ఒక పథకాన్ననుసరించి వుండదు. ఒకే ఒక నాయిక, ఒక నాయకుడూ మాత్రం ఉండాలనే నియమం కూడా లేదు. నాయికా, నాయకుల బృందం యొక్క రసాత్మక సంభాషణలే తిల్లానాలు. రచనా విధానాన్నీ, చమత్కారాన్ని పరిశీలిస్తే గాథా సప్తశతిలోని గాథలు స్ఫురణకు వస్తాయి.... తిల్లానా అనే జానపదగేయ విశేషం తమిళనాడులో విశేష వ్యాప్తి గాంచింది. అది ఉత్సవ సమయాల్లో ప్రజా వినోద సాధనంగా శతాబ్దాల తరబడి వాడుకలో ఉంది .... లయానుగుణంగా ఉండే ఈ సంభాషణా రూపకం నృత్తవాద్య సహితమై యక్షగాన రూపములకు పూర్వ రూపమనిపిస్తుంది. ఈ రకపు గేయ రచనలు తెలుగులో అతి తక్కువ .. మొత్తం మీద ఈ తెలుగు తిల్లానా తెలుగు జానపదగేయ వాఙ్మయానికొక ముఖ్యాలంకారము. నృత్త గీత సహితమైన ఇలాంటి సంభాషణా రూపకములు తెలుగు కళాసంప్రదాయముల పునరుజ్జీవానికి తోడ్పడుతాయి."

జానపదగేయ వాఙ్మయ పరిచయం -- హరి ఆదిశేషువు, పుటలు - 15 & 20.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య తనను తాను ' సుంకరి కొండా ' అని చాటువుల్లో సంబోధించుకొన్నాడని పేర్కొన్నాడు.[31]

సుంకరి కొండడి వేషం కథలోని గేయ రూపంలో సాగే సాహిత్యాన్ని గమనించండి-

"సుంకరి : చిన్నపిల్లా నాచెంతకు వచ్చియు చేరీ ముద్దు బెట్టే చిన్నీ పిల్లా

గొల్లభామ:పిల్లా పిల్లాయని పిలువబోకు మా పెద్దాళ్ళినగ మాట వచ్చు కొండా

సుంకరి : పెద్దలందరు చేరి పెట్టిన పేరిదె - వద్ద కొచ్చియు ముద్దు పెట్టె పిల్లా

గొల్లభామ : హద్దు మీరియు మాటలాడితే నిన్నట్టు అంది జడలోన వేటు వైతు కొండా

సుం: దువ్వేన లేదని చింతేల జేసేవు రంపామిచ్చెద తలదువ్వుకోపిల్ల

గొ : నవ్వులాయర నీవంటి మొగవాని జేరగ దువ్వను రంపము దొరకూ కొండ

సుం: కాటుక లేదని చింతేల జేసేవు బండి కందెన కాటుక బెట్టుకోపిల్ల

గొ : బోటు లెల్లను నీ బోటి వారిని జేర కందెన గాక వేరె కద్దా కొండ

సుం: కోకలు లేదని కొరతేల గలిగెను - గోనె పట్టలు దెచ్చి చుట్టుకోపిల్ల

గొ : గోనె పట్టలు చుట్ట గొప్పావారికి తగు - గాని నాకేల చాలు పోరా కొండ

సుం: వడ్డాణం లేదని చింతేల జేసేవు- బండికట్లు చాల దెచ్చి వేసుకోపిల్ల

గొ : బండి కట్టుపై బండా పడను నాచెంత చేరక తొలగి పోరాకొండ

సుం: బులాకు లేదని చింతేల చేసెవు - పొందుగ తేలు తెచ్చి

---

31. జానపద గేయ వాఙ్మయ పరిచయం - హరి ఆదిశేషువు ; పుట - 20.

పెట్టుకోపిల్ల

గొ : తేలూ పెట్టిన మేలు చాలూర నీ వంటి మేలూకాండ్లను చూడాలేదూ కొండ

..........................................................................

.........................................................................."

"సుం: లాహిరే మేలాహిరీ, గంజాహిరీ మేలాహిరీ

చిన్నది యే మన్నది బలువన్నెది రమ్మన్నది

కంటికి ప్రియమైనది అది కర్ణగొల్ల చిన్నది

హంస నడతల చిన్నది అరిట్యాకు కంటె వన్నెది

కసువు వాముల కాడ నన్ను కౌగిలించి పాయరా

..........................................................................

వంటి వంటి వినుకు లాకు యుంటిరా దానింటి పంచన

దూడ లంజల మాటలు విని దుప్పటంతా తడిసెరా

..........................................................................

గొల్లదాని రోషము, దాని తల్లి జేసిన మోసమూ

కల్లుతాగిన దోషము నాకళ్ళ మాటల వేషము"[32]

ఇలా సుంకరి కొండడి వేషంలో సాహిత్యం చోటు చేసుకొని ఉంది.

3.2.15. జల్లి కొండమనాయని వారి వేషం :- ఈ వేషాన్నే 'దొర వేషం' 'బంట్రోతు వేషం ' అని కూడా అంటారు. ఈ వేషంలో ఒకడు దొరలాగ మరొకడు బంట్రోతులాగా వేషాలు వేసుకుంటారు. ఈ వేషం వేసే వారు ముందుగానే జల్లికొండమ నాయని వారి వేషపు కథను నేర్చుకొని జాతర సమయంలో వూరంతా తిరుగుతూ, తెలిసిన ఇళ్ళకు వెళ్తూ ఈ కథను ప్రదర్శిస్తారు. ఈ వేషంలో సవాలు, జవాబుల రూపంలో కథ సాగిపోతుంది. సంభాషణలు చమత్కారంగా ఎంతో హాస్యంతో కూడుకొని వుంటాయి. దీని రచయిత ఎవరో తెలియదు. 'గంగమ్మ జాతర వేషపు హాస్యములు' అనే పుస్తకంలో దీనితో పాటు

---

[32] సుంకరి కొండడి వేషపు కథ - లాల కన్నయ్య ; పుటలు : 17,18,19,29,30.

మరో మూడు వేషపు కథలు కూడా ప్రచురించి, పుస్తకంపైన 'చమత్కారమైన మాటలు గల కథలు' అని పేర్కొనబడి ఉంది. తిరుపతి వాస్తవ్యుడెవరో ఈ వేషాలకు చమత్కారమైన మాటల్ని చిన్న కథ రూపంలో రాసినట్లు తెలుస్తోంది. ఈ కథ అరగంట సేపు సాగుతుంది. జల్లి కొండమనాయని వారి వేషం కథలోని ఇద్దరు వ్యక్తులు చమత్కారమైన మాటలతో సంభాషించుకోవడమే ఇందులోని కథ. దీనిలో సవాలు, జవాబులను గమనించండి.

"సవాలు :- బంట్రోతా మీదేవూరోయి

జవాబు :- మాదా పట్టు కొండ

సవాలు :- పారిపోకుండాన యీ సందున దూరి వెళ్ళకుండాన

జవాబు :- కాదోయి పెద్దా మనిషి పడకుండా

సవాలు :- బోర్ల పడకుండాన యెగిరి పడకుండాన
దిగువ పడకుండాన కాకియై గద్దయై
పిశాచియై యెగిరి పోకుండాన

జవాబు :- కాదోయి పెద్దా మనిషి ఈ చూడవచ్చిన వారు
మనపై బడకుండా

ఈ విధంగా ఈ వేషంకథ ప్రారంభమై -

సవాలు :- వారనగా ఏ వారోయి తోలువారా దొంగవారా
పగవారా బంధావారా చాకలవారా మంగలవారా
కుమ్మరి వారా మీ వారా మావారా యే వారోయీ

జవాబు :- కాదోయి పెద్దా మనిషి జల్లి కొండమనాయని
వారని మాకు పేరు వచ్చినది

సవాలు :- మాకనగా యేమాకోయి మోటుమాకా
మొద్దుమాకా చింతమాకా జీడిమాకా వేపమాకా
వెలగమాకా యోమాకోయీ

జవాబు :- కాదోయి పెద్దా మనిషి నాకు పేరు వచ్చినది

సవాలు :- నాకనగా యేనాకోయి యెగనాకా దిగనాకా
నేలపడినాకా చంకనాకా యేనాకోయీా

జవాబు :- ఓయి నాపేరు

సవాలు :- ఓయి నీ పేరయితే అయినదిగాని నీబంట్రోతు
తనమేమోయీా

జవాబు :- బంట్రోతు తనము ముప్పైరెండు
ఆయుధములను ధరించేవాణ్ణి

........................................................

........................................................

సవాలు : భళాభళా యెంత మంచి బంట్రోతోయి నిన్ను వుప్పు పాత్రలో యెత్తి పెట్టితే వచ్చే గంగజాతరకు పనికి వస్తువు

............................................................"[33]

ఇలా చమత్కార మాటలతో ఈ జల్లి కొండమ నాయుని వారి వేషపు కథ సాగిపోతుంది.

3.2.16. ధాష్టీక పంతుల వారి వేషం :- ఈ వేషంలో కూడా ఇద్దరు వ్యక్తులుంటారు. ఒకడు కీపాసు పంచ, తెల్లచొక్కా, దానిపైన నల్లకోటు ధరించి పిలక జుట్టును పెట్టుకొని పంతులు లాగా వేషం వేసుకొంటాడు. మరొకడు ఆ అధికారి దగ్గర పనిచేసేవాడులాగ కీపాసుపంచ, చొక్కాను ధరించి వేషం వేసుకుంటాడు. ఈ వేషానికి కూడా కథను ముందుగా నేర్చుకొని ప్రదర్శిస్తారు. ఇది కూడా చమత్కార మాటలతో కూడిన కథ. దీనినే 'ధాష్టీక పంతుల వారి వేషం కథ' అంటారు. ఇది 'గంగమ్మ జాతర వేషపు హాస్యములు ' అనే పుస్తకంలోని మరో వేషం కథ. ఈ కథలో ధాష్టీక పంతులు తిరుపతి ప్రాంతానికి తాలుకా అధికారిగా వస్తాడు. పంతులుకు సహాయకుడుగా పనిచేయడానికి వెంకటపతి అనే వాడుంటాడు. పంతులు తాలూకాకు సంబంధించిన ఊర్లపేర్లను, చెరువుల పేర్లను, కరణాలు, రెడ్ల విషయాలను అడగి తెలుసు కుంటాడు. ఆదాయాలు, మాన్యాలు, పోరంబోకు వంటి విషయాలు కూడా అడిగి తెలుసుకుంటాడు. పంతులు సర్కారు భూముల్ని,

[33] గంగమ్మ జాతర వేషపు హాస్యములు ; పుటలు - 3,4,7,8,& 19

ఆదాయాన్ని రంగసాని అనే వేశ్యకు ధారపోస్తాడు. సర్కారుకు పైసాకూడా చెల్లించలేక పోతాడు. సర్కారువారు ధాష్టీక పంతుల్ని తొలిగించి నూగోజి పంతుల్ని తాలూకా అధికారిగా నియమించడం ఈ వేషంలోని కథ. ఈ వేషం కథ కూడా సవాలు జవాబులతో సాగిపోతూ హాస్యంతో కూడుకొని ఉంటుంది. ఈ వేషం కథలోని సంభాషణల్ని గమనించండి-

" ..................................................

సవాలు :- ఐతే వెంకటపతి మన రంగసానికి యెన్ని గుంటలోయి

జవాబు :- దేవరా మన రంగసానికి వొకటే గుంట చిన్నదిగానున్నది మహాప్రభో

సవాలు :- వెంకటపతీ మన రంగసానికి ఆగుంట యెప్పుడుపుట్టిన దోయి

జవాబు :- దేవరా మన రంగసాని పుట్టినప్పుడే పుట్టినది

సవాలు :- ఔనోయి వెంకటపతీ మన రంగసానికి చిప్పంటు నీరంటు కూడా లేకుండా వున్నది గదవోయి

జవాబు :- దేవరా మన రంగసానికి నంజగుంట వొకటి పుంజమిట్టలు రెండు కూడా గలిగి వున్నది.

సవాలు :- ఐతే వెంకటపతీ మన రంగసాని గుంట సాగుబడి చక్కగా జరుగుచున్నదట వోయి

జవాబు :- దేవరా యెల్ల వారు యేకరీతిగానె సాగుబడి చక్కగా జరిపిస్తూ వున్నారు

సవాలు :- వెంకటపతీ పంచాంగము వానికి 100 గుంటలేమి మేదర వానికి 100 గుంటలేమీ కుమ్మర వానికి 100 గుంటలేమి చాకలి వానికి 100 గుంటలేమి, మంగలవానికి 100 గుంటలేమి తోటివానికి 100 గుంటలేమి, తలారివానికి 100 గుంటలేమి మన రంగసానికి వొకటే గుంట యేమోయి

జవాబు :- దేవరా వాండ్ల మాన్యాదులు యావత్తు జప్తి చేయించవలెను

సవాలు :- వెంకటపతి వాండ్ల మాన్యాదులు యావత్తు జప్తీ చేయించి మన రంగసాని గుంటకు తోయించవోయి తోయించు

..................................................................

జవాబు : దేవరా మనవి చేస్తాను చిత్తగించ వలసినది దేవస్థానం ఖర్చు 400, సిబ్బంది ఖర్చు 600, మనవర్తి ఖర్చు 3400, దేవరా మన రంగసాని ఖర్చు 11000 అంతు 2400 వరహాలింటికి వారి వారి ఖర్చులు వారివారికి పోగా సర్కారుకు పెద్ద సున్నజుట్టినాను" [34]

ఇలా ధాష్టీక పంతుల వేషంలో సంభాషణలు ఎంతో హాస్య పూరితంగా వుంటాయి.

3.2.17. నూగోజీ పంతుల వారి వేషం :- ఈ వేషంలో కూడా ఇద్దరు వ్యక్తులుంటారు. ధాష్టీక పంతుల వారి వేషంలో లాగే దీనిలో కూడా ఒకడు కీపాసు పంచ, తెల్ల చొక్కా దానిపైన నల్ల కోటును ధరించి పిలక జుట్టును పెట్టుకొని పంతులులాగే వేషం వేసుకుంటాడు. మరొకడు అతని సేవకునిలా వేషం వేసుకుంటాడు. ఈ వేషానికి కూడా కథను ముందుగానే నేర్చుకొని ప్రదర్శిస్తారు. పై వేషం లాగే ఈ వేషం కూడా చమత్కార మాటలతో కూడిన కథ. దీనిని 'నూగోజీ పంతుల వారి వేషం కథ' అని అంటారు. ఇది 'గంగమ్మ జాతర వేషపు హాస్యములు' పుస్తకంలోని మూడోవేషం కథ. ధాష్టీక పంతులును తాలుకా అధికారిగా తొలిగించాక ఆ స్థానంలో నూగోజీ పంతులను తాలూకా అధికారిగా సర్కారు వారు నియమిస్తారు. తర్వాత నూగోజీ పంతులు రంగసాని ఆస్తులను జప్తుచేయిస్తాడు. రంగసాని సర్కారు వారి దగ్గరకు సరాసరి వెళ్ళి తనగోడును వెళ్ళబుచ్చుకొని, ఒకరాత్రి సర్కారు వారితో గడిపి సానుభూతిని సంపాదిస్తుంది. సర్కారు వారు నూగోజీ పంతులపై ఆగ్రహించి అతనికి 'తగైర్' పంపి అధికారం నుండి తొలగించి తిరిగి ధాష్టీక పంతులుకు అధికారం అప్పగిస్తారు. ఈ కథ కూడా సవాలు జవాబులతో సాగిపోతుంది.

3.2.18. గారడి విద్యల వేషం :- గారడి విద్యలు ప్రదర్శించే వారి వలె ఇద్దరు వేషాలను వేసుకుంటారు. తలకు గుడ్డను, మోకాలు వరకు అడ్డుపంచెను, మెళ్ళోతాయత్తును ధరించి చేతిలో పాముల బుట్టలను, నాగస్వరాన్ని పట్టుకొని ఉంటారు. గారడి విద్య వేషం వేసే వారు కథను ముందుగానే నేర్చుకొని ప్రదర్శిస్తారు. ఈ కథ ఇరవై నిముషాల పాటు సాగుతుంది. ముందు పేర్కొన్న వేషాలు లాగా వీనిలో కూడా చమత్కారమైన మాటలుంటాయి. ఈ 'గారడి విద్యల వేషం కథ ' కూడా 'గంగమ్మ జాతర వేషపు హాస్యములు 'అనే పుస్తకంలోని నాల్గవ కథ (చివరికథ) బయట పూరి నుంచి వచ్చిన 'సుడిగాలి' అనే ఒక గారడి వానితో తిరుపతికి చెందిన 'జడివాన' అనే గారడి వాడు

---

[34] గంగమ్మ జాతర వేషపు హాస్యములు ; పుటలు - 31, 42, 43.

వాదోప వాదాలకు దిగుతారు. ఎవరి గొప్పల గురించి వారు చెప్పుకో-వడమే ఇందులోని కథ. స్థానికుడు చెప్పే మాటలు హాస్యపూరితంగా ఉంటాయి. సుడిగాలి అనే గారడివాడు, కాశ్మీరం, కేరళ సింధు, పాండ్య వంటి దేశాలను చూశానంటే, జడివాన అనే గారడి వాడు రాయల చెరువు, రామాపురం వంటి దేశాలు, పంటీది, బేరీది, పల్లీది, బండ్లీది వంటి పట్టణాలను చూశానని చెప్తాడు. అలాగే సుడిగాలి గారడి వాడు కోడెనాగులు, పెంజరపాములు, కొండశిలలు, రక్త పెంజరాలను పట్టి బుట్టలో పెడ్తానంటే, జడివాన గారడి వాడు పిల్లులు, బల్లులు, దోమలు, ఎర్రచీమలు, వుడతలు, మిడతలు వంటి వాటిని వలలతో, వులుగులతో పట్టి కత్తి బోనులో జిగురులంటించి నానని చెప్తాడు.

గారడి విద్యల వేషం కథలో సవాలు జవాబులను గమనించండి.

"సవాలు :- వోరి నేను గగనంబున కెగిరి నక్షత్రములు ముళ్ళుగ

పేర్చగలరా

జవాబు :- వోరి నేను అటుకు మీదికి తిన్నగ యెక్కి పోయి కుండెడు

అట్లుత్రుంచి నీముఖమునందు కొట్టగలరా

సవాలు :- వుక్కు మొనలు నలచి పొడి చేతురా నొక్కచేత

జవాబు :- నేను బొగ్గు చూర్ణంబు దేతును పొనగనూరి

సవాలు :- వుక్కగుంటను యెర్రగా కాల్చి మ్రింగగలరా

జవాబు :- వోరి నేను వడిగండ్లను మ్రింగగలను ఒక్కటొక్కటి

సవాలు :- వోరి నేను విషగంట కాలు గరగర నమిలి మ్రింగగలరా

జవాబు :- వోరి నేను గసగసాలు కొబ్బరి నమలి మ్రింగగలరా "[35]

ఇలా తిరుపతి గంగజాతరలో పై నాలుగు వేషాలు ఎంతో చమత్కా-రమైన మాటల్తో హాస్యపూరితంగా ఉంటాయి.

3.2.19. నడీధి వేషాలు :- వీధి నాటకాలనే నడీధి వేషాలంటారు. జానపదులు గంగమ్మ గుడి ముందరగాని, లేదా ప్రధాన కూడలిలోగాని రాత్రి పూట నాటకాల్ని ప్రదర్శించే వారు. విద్యుత్ దీపాలు రాక ముందు కాగడాల్ని,

---

[35] గంగమ్మ జాతర వేషపు హాస్యములు; పుటలు - 69,70.

పెట్రొమాక్స్ లైట్లను ఉపయోగించేవారు. వీరు భక్త మార్కండేయ, హరిశ్చంద్ర వంటి పౌరాణిక నాటకాలను వేసేవారు. నాటకాలకు తగిన విధంగా వేష భూషణాలంకారాలుండేవి. స్థానికులు వేసేటట్లయితే ముందుగానే వీధి నాటకాలను అభ్యాసం చేసి ప్రదర్శించే వారు.

3.2.20. గెరిగాట :- గెరిగాటనే గెరిగ నృత్యం అనికూడా అంటారు. నిజానికిది ' కరగ నృత్యం '. కరగం అంటే అభిషేకానికి పనికి వచ్చే పవిత్ర జలంతో నిండిన కడవ అని అర్థం. దీన్ని కూడా మొక్కుబడి కోసం వేస్తారు. కొత్త దుత్తను తీసుకొని దానికి పసుపురాసి, కుంకుమబొట్లుపెట్టి, టెంకాయను తీసుకొని దానిక్కూడా పసుపుకుంకుమలు రాసి తమలపాకులను చెంబుపై నాలుగు పక్కల పెట్టి, దాని మీద టెంకాయను పెట్టి, టెంకాయపై నిమ్మకాయను నిలబెడ్తారు. దాన్ని పూలతో అలంకరిస్తారు. మగవారికి ఆడవేషం వేసి నుదుటిపై కుంకుమబొట్టు, దానికింద నల్ల చుక్కబొట్టును పెడ్తారు. పూర్ణకుంభంలా వుండే ఈ గెరిగెను నెత్తిన బెట్టుకొని డప్పులు కొమ్ములు వాయిద్యాలతో లయబద్ధంగా ఆడుతూ గంగమ్మ, వేషాలమ్మ గుడులకెళ్ళి తమ మొక్కును తీర్చుకొంటారు.

3.2.21. కీలు గుర్రాలాట:- ఈ ఆటలో కీలు గుర్రాలను తేలికపాటి కొయ్యతో, కాగితాలతో, గాజు ముక్కలతో తయారు చేస్తారు. గుర్రం కింది భాగం చుట్టూ గుడ్డతో కాళ్ళు కనిపించకుండా తెరలా కట్టేస్తారు. ఈ ఆటలో రాజు, రాణి వేషాలు వేసుకొని, కీలుగుర్రాలను అమర్చుకొని బ్యాండుమేళాల కనుగుణంగా నృత్యం చేస్తూ గ్రామదేవతల్ని దర్శించుకొంటారు.

3.2.22. నెమలాట :- నెమలి బొమ్మను అట్టలతో, రంగు కాగితాలతో నెమలీకలతో తయారుచేసి మడతలు పడే చోట, అవసరమైన చోట గుడ్డతో కుట్టి ఉంటుంది. నెమలి బొమ్మలో మనిషి కప్పలా కూర్చుంటాడు. తల పైభాగంలో నెమలి తలను అమర్చుకుంటాడు. వీపు చివరన దట్టమైన నెమలి ఈకలు పురి విప్పినట్లుంటాయి. నెమలి వేషం లోపల ఉన్న వ్యక్తి మేళ తాళాలకు అనుగుణంగా నెమలిలా ఆడుతుంటాడు.

3.2.23. ఎలుంగొడ్డు ఆట :- ఎలుంగొడ్డు ఆట ఆడేవ్యక్తి శరీరం కనిపించకుండా శరీరం చుట్టూ ఎలుంగొడ్డు బొచ్చువున్న చర్మాన్ని చుట్టుకుంటాడు. చేతులకు, కాళ్ళకు ఎలుంగొడ్డు గోర్లు కూడా ఉంటాయి. తలకు అట్టతో చేసిన ఎలుంగొడ్డు తలను అమర్చుకొని తప్పెటలకు అనుగుణంగా నృత్యం చేస్తూ, తిరుపతి ప్రధాన వీధుల గుండా సాగిపోతూ గంగమ్మను దర్శించు కుంటారు.

3.2.24. పులివేషం :- పులి వేషం వేసేవాళ్ళు తలకు బిగుతుగా గుడ్డను చుట్టి పులి తలలా చేస్తారు. ఇలా చేయడం వల్ల తల వేలను తాకుతున్నప్పుడు దెబ్బతగలకుండా ఉంటుంది. మొలకు లంగోటాను చుట్టి శరీరానికి పసుపు రంగు పూసి చారలు వేస్తారు. వెనుక వైపు తోకను కూడా అమర్చుతారు. పులిని కప్పించడానికి పెద్ద చెండును ఉపయోగిస్తారు. ఈ చెండు గడకొయ్యను తీసుకొని దానికి వెదురు బద్దలను అమర్చి రంగు పరిగ కాగితాలను అతికించి తయారు చేస్తారు. పలకలు, తాజాలు వాయిస్తూ ఉంటే పులి అడుగులు వేస్తూ వేషధారులు వెళ్తుంటారు. ప్రధానకూడలి ప్రాంతాల్లో, బంధువుల, స్నేహితుల ఇళ్ళముందు, గ్రామదేవతల గుళ్ళముందు పులి ఆటను పూర్తిగా ప్రదర్శిస్తారు. పులి ఆటను ఆడేటప్పుడు నేలపై నిమ్మకాయను ఉంచుతారు. ఆట చివరలో పులి వేషధారి నిమ్మకాయను వెల్లకిలా పడుకొని నోటితో ఎత్తుకొని విజయ సంకేతంగా చిందులు వేస్తూ అరుపులు అరుస్తూ ఆటను ముగిస్తాడు. నేడు పులి వేషానికి ఎనామిల్ రంగులను శరీరానికి పూసుకుంటున్నారు. ఇది ఎండి పోయి శరీరాన్ని బాధపెట్టున్నా లెక్కచేయరు.

3.2.25. పోటు వేషం :- కత్తిని మెడలో పొడుచుకున్నట్లు లేదా నడుములో పొడుచుకున్నట్లు భ్రాంతిని కలిగిస్తూ, జుట్టును విరబోసుకొని, తలపై అట్ట కిరీటాన్ని పెట్టుకొని, నోట్లో మేకపోతు నాలుకను పెట్టుకొని, అరనిక్కరు వేసుకొని, వొళ్ళంతా నల్లగా మసి పూసుకొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకొని చేతిలో పొడవాటి కత్తిని పట్టుకొని పలకలు వాయిస్తుంటే చిందులు వేస్తూ సాగిపోతుంటారు.

3.2.26. బొట్ట బొమ్మలాట :- ఆడ, మగ బొమ్మలను అట్టలతో తయారు చేస్తారు. ఈ బొమ్మలు సుమారు పది అడుగుల వరకుంటాయి. బొట్టబొమ్మల్ని ఆడించే వ్యక్తులు బొమ్మల లోపలికి దూరి నిల్చుంటారు. బొమ్మల నడుము దగ్గర వీరు చూడడానికి చిన్న కంతలుంటాయి. పలకలు వాయిస్తుంటే ఈ బొమ్మల్ని ఆడిస్తూ గంగమ్మలతో పాటు ఇతర గ్రామ దేవతల్ని కూడా దర్శించుకొనే వారు.

3.2.27. మెరిగాళ్ళాట :- కాళ్ళకు మూర పొడవుండే గుండ్రని కొయ్యలను కట్టుకొని, శరీరానికి నిమ్మకాయలను కుట్టుకొని, తప్పెటలకు అనుగుణంగా ఆడుతారు. ఈ ఆట ఆడడానికి ఎంతో నైపుణ్యం ఉండాలి. లేకపోతే కిందపడి గాయాలయ్యే ప్రమాదం వుంది. మెరిగాళ్ళాటను ప్రజలు మొక్కుబడి కోసం వేస్తారు. కింద పడేసిన చిల్లర డబ్బులను కూడా వీళ్ళు లాఘవంగా తీసుకుంటారు.

3.2.28. గడకొయ్యాట :- కొందరు గగ్గిరెట్లుకట్లు వేషం అని కూడా అంటారు. తిరుపతి గంగ జాతరకు దూరాబారాలు నుంచి వచ్చే ప్రజలు పదకొండు అడుగులుండే పొడవాటి బొంగుకర్రను తీసుకొని దానికి మధ్యలో అడ్డంగా ఒక అడుగు వుండే చిన్న కర్రను అమర్చి దానిపైన మనిషి నిలబడి పైభాగంలోని బొంగును పట్టుకొని ఎగిరెగిరి గెంతుతూ వీధుల్లో వెళ్తుంటారు. ఇది చాలా కష్టమైన పని . ఒక కొయ్య ఆధారంతో కొయ్యపైన నిలబడుకొని పడిపోకుండా( Balance) గా ఉండడానికి వారు ముందు నుంచే అభ్యాసం చేస్తారు. కొయ్యపైన నిలబడుకొన్న వ్యక్తి కాళ్ళకు గజ్జెలు కట్టుకొని ఉంటాడు. కొయ్యకు కూడా గజ్జెలు అమర్చి ఉంటారు. కొయ్య పైకెగిరి నేలను తాకేటప్పుడు ఘల్లు ఘల్లుమని శబ్దం వస్తుంటుంది. ఇది లయాత్మకంగా ఉండి చూపరులను ఆకర్షిస్తుంది. గడ కొయ్యకు పసుపు పూసి కుంకుమబొట్లు పెట్టి ఉంటారు. ఒక వ్యక్తి పడి పోకుండా కొయ్యమీదనే వీధుల వెంబడి వెళ్ళి గంగమ్మ గుడికెళ్ళి వస్తారు. పక్కన చూసేవారు అనుసరిస్తుంటారు.

3.2.29. నక్కలోళ్ళ వేషం :- నక్కలోళ్ళ వేషాన్నే గువ్వలోళ్ళ వేషం అని కూడా అంటారు. ఈ వేషాన్ని ఇద్దరు వ్యక్తులు వేస్తారు. ఒకరు గోచీపెట్టుకొని మెడలో పూసలు వేసుకొని, చేతిలో చిన్న చిన్న వలబుట్టల్ని, గువ్వల్ని పట్టుకుంటారు. గుండ్రటి డబ్బాను భుజానికి వేలాడగట్టుకుంటారు. మరొకరు ఆడవేషం వేసుకొని పూసల ఆభరణాలు అలంకరించుకొని గజ్జెలు కట్టుకొని పాటలు పాడుకుంటూ లయబద్ధంగా డబ్బాను కొడ్తూ ఆడుతుంటారు. వీరు పాడే పాటలు ఇలా ఉంటాయి-

" నక్కలోళ్ళ చిన్న దాన్నీ రాజ

నాణ్యమైన కుర్రదాన్నీ

నాని నానీ ననా నినీ

నాని నానీ ననా నిని

చిన్న చిన్న గువ్వల్పట్టి రాజ

బుట్టలోన వేసుకొని

చెన్న పట్నం పోరా మామో

తెల్ల పైకం తేరా రాజో



లవకుశ వేషధార్లు



భీమ, కృష్ణులు గంగమ్మను దర్శించుకుంటున్న దృశ్యం

తెల్ల పైకం తేరా మామో

చేతిలోనా పెట్రా రాజో

నక్కలోళ్ళ చిన్న దాన్ని

నాణ్యమైన కుర్రదాన్ని"

అంటూ నక్కలోళ్ళ వేషంలో పాటలు పాడుతూ ఆడుతుంటారు.

3.2.30. వివిధ వేషాలు :- ఈ వేషాలను ప్రజలు మొక్కుబడి కోసం, సరదాకోసం వేసుకొని, ఎద్ల బండ్లపై గాని, రిక్షాలపై గాని లేదా నడచిగానీ పోతుంటారు. వేషంతో పాటు కొందరు పలకల వాయిద్యాలను కూడా పెట్టుకుంటారు. ఈ వేషాలను మూడు రకాలుగా చెప్పవచ్చు. 1. పౌరాణిక వేషాలు 2. చారిత్రక వేషాలు 3. సాంఘిక వేషాలు.

3.2.30.1. పౌరాణిక వేషాలు :- ఈ వేషాలలో చెప్పుకోదగ్గవి రాముడు, కృష్ణుడు, పంచపాండవులు, ద్రౌపది, సీతారామ లక్ష్మణులు, విశ్వామిత్రుడు, అతని శిష్యులు, శివపార్వతులు, సుబ్రమణ్యస్వామి, గణపతి, ఆంజనేయుడు, ఋషులు, రాక్షసులు వంటివి.

3.2.30.2. చారిత్రక వేషాలు :- రాజు, రాణి, మంత్రి, భటుడు వంటివి.

3.2.30.3. సాంఘిక వేషాలు :- ఆడ, మగ వేషాలు, చందన వేషాలు, సోది, కొండజాతులు, పూజారి, మాంత్రికుడు, చిలక జోస్యం, వేదపండితుడు, జోతిష్కుడు, చాకలి, మంగలి, కుమ్మరి, పీనుగ ఊరేగింపు వంటి వేషాలు ఇంకా బడి పంతులు, డాక్టరు, తాగుబోతురౌడీ, దొంగ, పోలీసు వంటి సాంఘిక వేషాలను కూడా వేస్తారు.

ఈ వివిధ వేషాలను తిరుపతి గంగ జాతర నాలుగో రోజునుంచీ వేస్తారు.

గంగమ్మ కథతో సంబంధం వున్న కళారూపాలు మాత్రం ప్రజలలో ఆనవాయితీగా నిలిచిపోయాయి. అందుకు కారణం ప్రజలకు గంగమ్మ మీద వున్న భయభక్తులే. గంగమ్మ కథతో సంబంధం లేని కళారూపాలు క్రమక్రమంగా అంతరించి పోతున్నాయి. ఇందులో కాశి కావడి, సుంకరి కొండడి వేషం, జల్లి కొండమనాయని వేషం, ధార్మిక పంతుల వారి వేషం, నూగోజీ పంతులు వారి వేషం, గారడి విద్యల వేషం, నడీధి వేషాలు, కీలుగుర్రాలాట, నెమలాట,

ఎలుంగొడ్డు ఆట, పోటువేషం, బొట్టబొమ్మలాట, పూర్తిగా నశించి పోయాయి. గడకొయ్యాట, సతారాం, గెరిగాట, మెరిగాళ్ళాట క్రమక్రమంగా తగ్గిపోతున్నాయి.

3.3. వినోదాలు :- తిరుపతి గంగ జాతర వినోదాలలో ప్రధామైనవి వేషాలేనని చెప్పుకోవచ్చు. కానీ ప్రత్యేకించి ప్రజల వినోదాల కోసం గుడిముందర మైదానంలోనో, తిరుపతి ప్రధాన కూడలిలోనో ఇతర గ్రామ దేవతల గుళ్ళ ముందో వివిధ ప్రదర్శనలు ఏర్పాటవుతుంటాయి. వీటిని ప్రదర్శించి డబ్బు సంపాదిస్తుంటారు.

3.3.1. తోలు బొమ్మలాట :- మందంగా ఉండే మేక, జింక తోలుతో ఈ బొమ్మల్ని తయారు చేస్తారు. కదలికలు గల ప్రదేశాలలో కీలును అమర్చుతారు. బొమ్మకు వెనుక శిలువాకారంలో కర్ర అమర్చబడి ఉంటుంది. బొమ్మ చేతులకు గల దారాలు ఈ కర్రకు కలపబడి ఉంటుంది. కర్రదారాల సహాయంతో బొమ్మను ఆడిస్తారు. పలుచటి తెల్లని చీరలను తెరగా కుట్టి, తెరవెనుక బొమ్మలను ఆడిస్తారు. తెరవెనుక వెలుతురు కోసం ఆముదం దీపాలను గాని, పెట్రొమాక్సు లైటుగాని వాడుతారు. తోలుబొమ్మలాటలో రామాయణం, భారతం వంటి కథలను ప్రదర్శిస్తుంటారు. తోలు బొమ్మ లాటలను తిరుపతి ప్రధాన కూడళ్లలో లేదా గంగమ్మ గుడివద్ద ప్రదర్శించేవారు. ఈ తోలు బొమ్మలను ప్రజల వినోదం కోసం బయటివారు ప్రదర్శించేవారు.

ప్రస్తుతం సినిమాలు, టి.వి.ల ప్రభావం వల్ల తోలుబొమ్మలను ప్రద-ర్శించడం లేదు.

3.3.2. బుర్ర కథలు :- తిరుపతి గంగ జాతర సమయంలో ప్రత్యేకించి మంగళవారం రాత్రి గుడిదగ్గర గాని ప్రత్యేక రహదారుల్లోగాని బుర్రకథలు చెప్తుంటారు. బుర్ర కథను చెప్పేటప్పుడు ప్రధాన కథకుడు అతనికి ఇద్దరు వంతగాళ్ళుంటారు. బుర్రకథలు చెప్పేవారు కావమ్మ కథ, సన్యాసమ్మ కథ, దేశింగు రాజు కథలను చెప్తారు. ప్రజల వినోదం కోసం కొందరు వూరు పెద్దలు గానీ, వీధి పెద్దలు గానీ వీటిని ఏర్పాటు చేస్తుంటారు.

3.3.3. హరికథలు :- తాతయ్య గుంట గంగమ్మ గుడి ఎండోమెంట్ వారి అధీనంలోకి వచ్చాక, వారు గంగ జాతరలో చివరి రోజైన మంగళవారం రాత్రి సుళ్ళో హరికథా కాలక్షేపాన్ని ఏర్పాటు చేస్తు న్నారు. గంగమ్మ చెంపను నరకడాన్ని చూడడానికొచ్చే ప్రజలు గంగమ్మ గుడి ముందున్న ఖాళీ ప్రదేశంలో నిరీక్షిస్తుంటారు. అలాగే గంగమ్మను దర్శించుకోవడానికి భక్తులు ఆ రాత్రంతా



వేషగాళ్ళు



సైకిల్ తొక్కుతున్న ఆడవేషం

వస్తుంటారు. కాబట్టి వాళ్ళ కోసం గంగమ్మ గుడి లోపల హరికథా కాలక్షేపాన్ని ఏర్పాటుచేసి గుడి బయట వినిపించేలా మైకులను అమర్చి ఉంటారు. హరికథను భాగవతార్ చిరుతలు పట్టుకొని అభినయిస్తూ వయోలిన్, తబలా వంటి వాద్యాల సహకారంతో చెప్తుంటాడు.

3.3.4. గుడుగుడు మోటరు :- గంగమ్మగుడి ముందున్న ఖాళీ ప్రదేశంలో కొయ్య చెక్కలతో గుండ్రంగా ఎత్తుగా నిర్మిస్తారు. దానిపై నుంచి జనం తిలకించడానికి ఏర్పాటు చేసి వుంటారు. దాని లోపల మోటారు సైకిల్‌ను ఒక వ్యక్తి అధిరోహించి గుండ్రంగా తిరుగుతూ పైకి, కిందకు వస్తుంటారు. ఇది ఒక రకంగా సర్కస్ లాంటింది. జనం టికెట్ తీసుకొని వెళ్ళి ఆ ప్రదర్శన చూసి సంభ్రమాశ్చర్యాలకు గురౌతుంటారు.

3.3.5. రెండుతలల మనిషి :- ఒక గుడారంలో వింత జంతువును పోలి ఉండేటట్లు పాము శరీరానికి ఇద్దరు మనుషుల తలలు ఉన్నట్లు భ్రమింప చేస్తారు. దీనికి కూడా జనం వద్ద నుండి టికెట్ వసూలు చేస్తారు. దీన్ని గుడి ముందున్న ఖాళీ స్థలంలో ఏర్పాటు చేస్తారు.

3.3.6. బైస్కోపు (జంతర్ మంతర్ పెట్టి ) :- ఇది ఒక డబ్బా ఆకారంలో ఉంటుంది. కొయ్య కాళ్ళ మీద దీన్ని ఉంచి ఇందులోని భూత అద్దాల గుండా వివిధ ప్రదేశాలను చూపుతుంటారు. దీన్ని చూపించే వ్యక్తి ఆ డబ్బాను లయబద్ధంగా తడుస్తూ 'కాశీపట్నం చూడరబాబు చూడరబాబూ' అంటూ పాడుతుంటాడు.

3.3.7. భూమిలో తల :- గంగమ్మ గుడికి వెళ్ళేదారిలో నేలను తవ్వి మన్నును పక్కకు తీసి తమ తలను నేంలో ఉంచి మన్నును పూడ్చి తలకిందులుగా నిలబడ్తాడు. ఇతను ఒక గోచీపంచను మాత్రమే ధరించి ఉంటాడు. ఇతని తల నేలలో పూడిపోయి ఉండి చూపరులను ఆకర్షిస్తుంది. దారిలో వెళ్ళే వాళ్ళు తమకు తోచిన చిల్లర డబ్బుల్ని వేస్తుంటారు.

3.3.8. ముళ్ళ మీద మనిషి :- ఈ ప్రదర్శన కూడా గంగమ్మ గుడికెళ్ళే రోడ్డు పక్కనే ప్రదర్శిస్తుంటారు. మోపెడు ముళ్ళమీద ఒక మనిషి చిన్న గోచీని పెట్టుకొని పరుపుమీద పడుకొని ఉన్నట్లు పడుకొని ఉంటాడు. దారినవెళ్ళే జనం ఆశ్చర్యంతో తమకు తోచిన చిల్లర డబ్బుల్ని వేస్తుంటారు.

3.3.9. దొమ్మరాటలు :- దొమ్మరి వాళ్ళు జాతర సందర్భంగా తిరుపతి పురవీధుల్లో దొమ్మరాటల ప్రదర్శనలు ఇస్తుంటారు. వీరు రకరకాల విన్యాసాలు

చేస్తుంటారు. వీరు రెండు క్రరలను దారిలో నిలబెట్టి దాని సహాయంతో పైకి కిందకి గుండ్రంగా గిరికీలు కొడ్తారు. సన్నని ఇనుప తీగమీద పడిపోకుండా నడుస్తారు. బొంగుపైన ఒక పాపను పడుకోబెట్టి ఆ బొంగును గుండెలపై ఉంచుకొని చేతులను వదలి పెట్టేస్తారు. తర్వాత జాటీతో తమను తాము పెద్ద శబ్దం వచ్చేటట్లు కొట్టుకుంటుంటారు. జనం గుంపుచేరి వీరి ప్రదర్శనలను తిలకించి తమకు తోచిన డబ్బును వారికిస్తుంటారు.

3.3.10. రంగుల రాట్నాలు :- తిరుపతి గంగ జాతరకు రంగుల రాట్నాలు గంగమ్మ గుడి ముందు, వేషాలమ్మ గుడి ముందు వెలుస్తాయి. పిల్లలు సరదాగా రంగుల రాట్నం ఎక్కి తిరుగుతుంటారు. అలాగే పెద్ద పెద్ద GAINT WHEELS ను కూడా ఏర్పాటు చేస్తుంటారు. దానిలో పెద్దలు కూడా ఎక్కి వినోదిస్తుంటారు. వీటికి టికెట్ కొనాల్సి ఉంటుంది.

3.3.11. గురి ప్రదర్శించడం :- గుడి ముందున్న ఖాళీ స్థలంలో జనం 'గురి' ని పరీక్షించడానికన్నట్లు తుపాకితో బెలూన్లని కాల్చే ప్రదర్శన శాలలుంటాయి. డబ్బిస్తే తుపాకితో పాటు కొన్ని గుండ్లు ఇస్తారు. వాటితో కాసింత దూరంలో ఉండే బెలూన్లని పగులగొట్టచ్చు. తర్వాత ఇదే విధంగా ఒక గుండ్రని కొయ్య రింగును చేతికిస్తారు. దూరంగా అనేక రకాలైన వస్తువులుంటాయి. చిల్లర డబ్బులిస్తే ఆ కొయ్య రింగును ఇస్తారు. దాన్ని ఏ వస్తువు మీద వేస్తే ఆ వస్తువును ఇచ్చేస్తారు.

3.3.12. శూలాలు గుచ్చుకోవడం, టెంకాయలు నిమ్మపండ్లు కుట్టుకోవడం :- కొందరు ఒంటి నిండా తెల్లరంగు పూసుకొని ఎర్రని అడ్డ పంచను కట్టుకొని నాలుకపై ఒకటిన్నర అడుగు శూలాన్ని పొడుమకొని దారి పక్కన నిలబడి ఉంటారు. అలాగే కొందరు టెంకాయలను నిమ్మపండ్లను దారానికి గుచ్చి వాటిని శరీరమంతా సూది సహాయంతో కుట్టుకొని దారి పక్కన వచ్చిపోయే జనాలు మాడ్డానికి నిలబడి ఉంటారు. కొందరు జనం ఇచ్చే చిల్లర డబ్బుల్ని తీసుకుంటుంటారు. వీరిని ఒక రకంగా బిచ్చగాళ్ళని చెప్పొచ్చు.

3.3.13. వాయిద్య నృత్యాలు :- కొందరు బ్యాండు మేళాలతో సినిమాపాటలు వాయిస్తుంటే కొందరు వాటికి అనుగుణంగా నృత్యం చేస్తుంటారు. ప్రధాన కూడలిలో వీరు చేసే నృత్యాన్ని ప్రజలు గుంపుగా చేరి వినోదిస్తుంటారు. కొందరు పలకల వాయిద్యాలకు అనుగుణంగా కూడా చిందులేస్తుంటారు. అలాగే సినిమా పాటల రికార్డులను పెట్టి కూడా నృత్యాలను చేస్తుంటారు.

3.3.14. సినిమా ప్రదర్శనలు :- తిరుపతి గంగ జాతర సందర్భంలో చివరి రోజున మంగళవారం తిరుపతిలోని అన్ని సినిమా థియేటర్‌లలో రాత్రి 1-30 గం॥లకు మూడవ ఆటను ప్రదర్శిస్తుంటారు. దూరాభారాల నుంచి వచ్చే ప్రజలు రాత్రి పూట సినిమా కాలక్షేపం చేసి గుడి దగ్గరకు చేరుకుని గంగమ్మ చెంప నరికే ముగింపు కార్యక్రమానికి హాజరవుతుంటారు. ఆ రోజు అన్ని సినిమా థియేటర్లు హౌస్‌ఫుల్ కలెక్షన్‌తో నడుస్తాయి.

ఇలా తిరుపతి గంగ జాతరలో అనేక రకాలైన వినోద ప్రదర్శనలుంటాయి. కొన్ని వినోదప్రదర్శనలు ప్రస్తుతం కొరవడుతున్నాయి. కారణం గుడిముందున్న మైదానంలో ఇండ్లు నిర్మించడం వల్ల స్థలాభావంతో గుడుగుడుమోటర్ వంటి వినోదప్రదర్శనలు ప్రదర్శించలేక పోతున్నారు.

3.4. వ్యాపారాలు :- తిరుపతి గంగజాతర సమయంలో గంగమ్మ, వేషాలమ్మ గుళ్ళముందు, తిరుపతి లోను కొన్ని వ్యాపారాలు బాగా జరుగుతాయి. గంగమ్మ గుడి ముందు టెంకాయలు, పూలు, పళ్ళు, గంగమ్మకు సమర్పించే వెండి అవయవాలైన కళ్ళు, కాళ్ళు, చేతులు, పసుపు, కుంకుమ, కదుంపొడి, చవ్వాకు (తాటాకు), గాజులు, నల్లగాజులు, వెయ్యికళ్ళ దుత్తలు వంటి పూజా-సామగ్రిని అమ్ముతుంటారు. అలాగే పూసలదండలు, గిల్టు ఉంగరాలు, గాజులు, నగలు, కమ్మలు, జడకుచ్చులు, పక్కపిన్నులు, జడపిన్నులు, చిన్నపిల్లలబొమ్మలు, బుడిగెలను అమ్ముతుంటారు. తినుబండారాలైన బొరుగులు, కర్జూరం వంటి వాటిని కూడా అమ్ముతుంటారు. వేసవి తాపాన్ని తీర్చే శీతల పానీయాలు కూడా బాగా అమ్ముడుబోతుంటాయి. వేషాలవల్ల తిరుపతిలో టోపాలు రాజుల వేషభూషణాలంకారాలను అద్దెకిచ్చే వ్యాపారాలు, మేకప్ వ్యాపారం బాగా జరుగుతాయి. అలాగే ఫోటో స్టూడియోలు కూడా చాలా సందడిగా ఉంటాయి. పచ్చబొట్లు పొడిచేవారు, సోదెలు చెప్పేవారు చిలకజోస్యం చేప్పేవారు. కూడా తీరిక లేకుండా ఉంటారు. ఇలా గంగ జాతర సమయంలో వివిధ వ్యాపారాలు బాగా జరుగుతుంటాయి.

3.5. పూజా విధానాలు :- తిరుపతి గంగ జాతరలో గంగమ్మను పూజించే విధానాలు ఎంతో వైవిధ్యంగా ఉంటాయి. పూజావిధానాలు మొక్కుబడితో ఉండొచ్చు. మొక్కుబడి లేకున్నా సాంప్రదాయానుసారం ఆచారవ్యవహారాలతో కూడుకొని ఉండొచ్చు.

తిరుపతి గంగ జాతర సందర్భంలో గంగమ్మను వివిధ రకాలుగా పూజిస్తారు. ఈ పూజా విధానాల్లో అడుగడుగు దండాలు, పొర్లుదండాలు,

వేపచీరలు, కోళ్ళువదలడం, పొంగళ్ళు-తళిగెలు, బలులు, వెయ్యికళ్ళ దుత్తలు, అభిషేకాలు, గంగమ్మ వెంప నరకడం వంటివి చెప్పుకోదగ్గవి.

తాతయ్య గుంట (చిన్న) గంగమ్మకు అనాది నుంచి బంగారు పనిచేసే ఆచార్యులు అంటే కంసాలి వాళ్ళు పూజ చేసేవారు. వీళ్ళ దగ్గరకు రత్నవేలు మొదలియారు అనే వ్యక్తి వస్తూ, పోతూ ఉండేవాడు. ఇతను గంగమ్మ భక్తుడు. బంగారు పని చేసే ఆచార్యులు అతని భక్తిని గమనించి మొదలియార్‌నే పూజలు చేసుకోమని చెప్పి గంగమ్మ గుడిని అప్పగించారు. అప్పట్నుంచి మొదలియారు, అతని తర్వాత వాళ్ళ కుటుంబ సభ్యులు గంగమ్మను పూజిస్తూ వచ్చారు. ప్రస్తుతం ఎండోమెంట్ వాళ్ళ చేతికి ఆలయం వచ్చింది. ఎండోమెంట్ వాళ్ళు పూజిస్తున్నారు.[36]

అదే విధంగా పెద్ద (తాళ్ళపాక) గంగమ్మను పూజించేది కైకల కులస్థులు, గొల్లలు. గంగజాతర సమయంలో మాత్రం ఎండోమెంట్ వాళ్ళు, రెడ్లు కొన్ని రోజులు పూజిస్తారు. ఈ గుడికి ఆదాయం తక్కువకాబట్టి కైకల వాళ్ళే ఆనువంశికంగా పూజిస్తున్నారు.

3.5.1. అడుగడుగు దండాలు :- తిరుపతి గంగజాతరలో చివరి రోజైన మంగళవారం తెల్లవారు జామున ప్రజలు అడుగడుగు దండాలకు వెళ్తుంటారు. అడుగడుగు దండాలకు వెళ్ళేవారు సోమవారం రాత్రే కొబ్బరి కాయ, వేపాకును తెచ్చుకొని ఇంట్లో ఉంచుకుంటారు. మంగళవారం తెల్లవారు జామున నిద్రలేచి కట్టు బట్టల్తో ఇంట్లోగాని, లేదా వీధుల్లోని బావు లవద్దగాని చన్నీటితో అభ్యంగన స్నానం చేస్తారు. తర్వాత తడి బట్టల్తోనే వేపాకును కొబ్బరికాయను చేత పట్టుకొని ఐదారు అడుగులకొకసారి గాని, లేదా పది అడుగులకొకసారి గాని రోడ్డుపైన బోర్లా పడుకొని సాష్టాంగ నమస్కారాలు చేస్తూ గంగమ్మ గుడి దగ్గరకెళ్తారు. ఇలా, అడుగు అడుగుకు దండాలు పెడ్తూ పోవడం వల్ల దీనికి ' అడుగడుగు దండాలు ' అనే పేరు వచ్చింది. గుడికెళ్ళేటప్పుడు నాలుగు వీధుల కూడళ్ళలో నాలుగు వైపులా పడుకొని దండాలు పెడ్తారు. అలాగే గంగమ్మ గుడికి చేరుకున్నాక గుడి చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేస్తూ అడుగడుగు దండాలు పెడ్తారు. తర్వాత ఆ మట్టి అంటుకున్న బట్టల్తోనే గుళ్ళోకెళ్ళి కొబ్బరికాయను కొట్టి గంగమ్మను పూజించి ఇళ్ళకు వచ్చి స్నానం చేస్తారు. కొందరు గుడిముందే కొబ్బరికాయను (కొల్ల టెంకాయను ) కొట్టి ఇళ్ళకు వెళ్ళి స్నానం చేసి తర్వాత మళ్ళీ గుడికొచ్చి దర్శనం

36. తిరుమలశెట్టి రామయ్య - 232,మురుగడు సందు ; తిరుపతి



టెంకాయలు, నిమ్మకాయలు ఒంటికి కుట్టుకున్న భక్తుడు



గుడిముందు వెయ్యికళ్ళ దుత్తలు, టెంకాయిలు,
పూలు, చవ్వాకు, కదుంపాడి అమ్ముతున్న దృశ్యం

చేసుకుంటుంటారు. అడుగడుగు దండాల్లో స్త్రీలే ఎక్కువగా పాల్గొంటుంటారు. అడుగడుగు దండాలకు కొందరు మొక్కుబడితో వెళ్ళినా చాలామంది అదో ఆచారంగా భావించి వెళ్తుంటారు.

3.5.2. పొర్లు దండాలు :- అడుగడుగు దండాలు పెట్టేరోజే పొర్లు దండాలు కూడా పెడ్తుంటారు. పొర్లుదండాలు పెట్టేవారు చన్నీటితో అభ్యంగన స్నానం చేసి తడిబట్టల్తో టెంకాయ, వేపాకును చేత బట్టుకొని గంగమ్మ గుడిచుట్టూ పొర్లుకుంటూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి తర్వాత గంగమ్మను దర్శించుకొని కొబ్బరికాయ కొట్టి పూజిస్తారు. పొర్లు దండాల్లో ఎక్కువగా పురుషులే పాల్గొంటారు. చాలా మంది పొర్లు దండాలను మొక్కుబడితో పెడ్తుంటారు.

3.5.3. వేప చీరలు :- తిరుపతి గంగ జాతర సందర్భంలో సోమవారం అర్ధరాత్రి సమయంలో లేదా మంగళవారం తెల్లవారుజామున స్త్రీలు తలస్నానాలు చేసి వేపచీరలతో గంగమ్మగుడికి వస్తారు. దారంతో కట్టిన వేపమండల్ని మోకాలు నుంచి ఎద వరకు ఒళ్ళు కనబడకుండా దట్టంగా చుట్టుకొని ఇంటినుంచి గుడికి బయలు దేరి వస్తారు. వీరి ఒంటి మీద బట్టలుండవు. వేపాకును మాత్రమే చుట్టుకొని ఉంటారు. వీరు గుడిచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి తర్వాత వెంట తెచ్చుకున్న బట్టల్ని గుడి పక్కనే కట్టుకొని గంగమ్మ గుళ్ళోకెళ్ళి టెంకా-యకొట్టి పూజించి వస్తారు. వేప చీరలను మొక్కుబడి కోసం కట్టుకుంటారు. సోమవారం అర్ధరాత్రి కట్టుకొని రావడానికి కారణం జనసంచారం కొంచెం తక్కువగా ఉంటుందనే ఉద్దేశ్యంతోనే. కాన్పు సుఖంగా అయినందుకు, జబ్బులు నయమైనందుకు, వేపచీరల్ని కట్టుకోవడానికి మొక్కుకొని వచ్చి గంగమ్మను పూజిస్తుంటారు. [37]

3.5.4. కోళ్ళు వదలడం :- కొందరు తాము అనుకొన్నది జరిగితే గుడిపైన కోళ్ళను వదలిపెడ్తామని మొక్కుకుంటారు. పూర్వం పొట్టేలు, మేక, దున్నపోతుల్ని గంగమ్మకు వదిలి పెడ్తామని కూడా మొక్కుకొనే వారు. గుడిపైన వదిలేసిన కోళ్ళన్నింటిని మిరాశిదారులైన తోటోళ్ళు తీసుకుంటారు. ఇలా తిరుపతి గంగ జాతరలో కోళ్ళను గుడిపైన వదలి పెడ్తుంటారు.

3.5.5. పొంగళ్ళు - తళిగెలు - అంబళ్ళు : - తిరుపతి గంగజాతర సమయంలో

---

[37]. తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ సరిహద్దులో ఊత్తుకోట సమీపాన ఉండే పెరియ-పాళెం లోని అమ్మవారి ఆలయంలో ఈ విధంగా పురుషులు, స్త్రీలు వేపాకు కట్టుకొని మొక్కులు తీర్చుకుంటుంటారు.

అన్ని రోజుల్లోను పొంగళ్ళు పెడ్తుంటారు. కానీ ప్రత్యేకించి సోమవారం రాత్రి 1-30 గంటల నుండి పొంగళ్ళు ఎక్కువగా ప్రారంభమౌతాయి. గుడి ముందున్న మైదానం, పక్కనుండే ఖాళీప్రదేశాలన్నీ పొంగళ్ళు పెట్టేవారితో కిటకిటలాడి పోతుంటాయి. పొంగళ్ళు పెట్టేది స్త్రీలే. వీరు తలస్నానాలు చేసి మంచి బట్టల్ని ధరించి పసుపు కుంకుమలు పెట్టిన గంపను నెత్తిన పెట్టుకొని బయలుదేరుతారు. ఒక్కోసారి చుట్టుపక్కల స్త్రీలతో కలసి గుంపులు గుంపు-లుగా బయలుదేరుతారు. పొంగళ్ళకు కావలసిన వస్తువులను పూజాసామగ్రిని గంపలో నింపి ఉంటారు. వంటకు కావలసిన కట్టెపుల్లలను పాత్రలను వెంట తీసుకెళ్తారు. బలి ఇచ్చే కోడిని చేత పట్టుకొని గుడి దగ్గరకెళ్తారు. ఖాళీగా ఉన్న ప్రదేశంలో గంపలు దించుకొని మూడుగుండ్రాళ్ళను పొయ్యిగా చేసుకొని కట్టెపుల్లల్తో వెలిగించి దానిపై పాత్రవుంచి నీళ్ళు పోసి ఎసరు పెడ్తారు.[38] తర్వాత నాన బెట్టిన బియ్యం వేసి అది ఉడికిన తర్వాత పాలు, నెయ్యి, కొబ్బరి ముక్కలు, బెల్లం వేసి బాగా కలబెట్టి వండుతారు. దీన్నే 'పొంగలి' అంటారు. చాలామంది పొంగళ్ళు చేయడం వల్ల గంగమ్మగుడి ప్రాంతమంతా దట్టమైన పొగ కమ్ముకొని ఉంటుంది. పొంగలి చేశాక గుడి ముందు విస్తరాకు వేసి అందులో కొంత పొంగలుంచి, గంగమ్మకు పూలు వేసి, అగరువత్తులు వెలిగించి, టెంకాయకొట్టి కర్పూర హారతిచ్చి పూజిస్తారు. కొందరు గంగమ్మకు చీర రవిక పెట్టి పూజిస్తారు. తర్వాత ఆ చీరను, రవికను తెచ్చి ధరిస్తుంటారు. మరికొందరు చీరల్ని, రవికల్ని గంగమ్మకే సమర్పించి వచ్చేస్తారు.

గంగమ్మ గుడి ముందున్న ఖాళీ ప్రదేశంలో ఒకచోట పసుపుతో గంగమ్మను చేసి ఉంచుతారు. గంగమ్మ ముందు విస్తరాకులు వేసి అందులో కొందరు పొంగళ్ళు పెడ్తే, మరికొందరు పొంగళ్ళతో పాటు పెరుగు కూడా పొంగలి మధ్య పోసి పెడ్తారు. ఇంకొందరు తెల్ల అన్నం, వంకాయపులుసు, కరవాడు (ఎండు చేపలు ) పులుసు, మాంసం పులుసు, అవిశాకు, కుడుములు వంటివి కూడా పెడ్తారు. దీన్నే 'తళిగె' అంటారు. ఐదేళ్ళకు పూర్వం గుడి ముందు 'తళిగె మంటపం ' ఉండేది. అందులో తళిగెలు పెట్టేవారు. తళిగెలో కొందరు నానబియ్యం నానపెసలు కలిపి పెడ్తుంటారు. అలాగే చలిబిండిలో దీపం పెట్టి 'తళిగెలు వేస్తారు. ఈ విధంగా తళిగెలు వేసిన తర్వాత గంగమ్మ పైన పసుపు కుంకుమలు, కదుంపొడి చల్లి, పూలు వేసి, అగరొత్తులు వెలిగించి,

---

[38] 1975 వరకు గుడి ఎదురుగా ఉండే తాతయ్య గుంటలోని నీళ్ళను పొంగళ్ళు పెట్టడానికి వాడేవారు. ప్రస్తుతం తాతయ్య గుంట ప్రదేశాన్ని ఆక్రమించుకొని ఇళ్ళు కట్టేశారు.



తాతయ్యగుంట గంగమ్మ గుడి ఆవరణలో పొంగళ్ళు వండుతున్న దృశ్యం



గంగమ్మ గుడి ముందు తళిగెలు



గుడి ముందున్న తలిగె మండపం (ప్రస్తుతం మండపం లేదు)



1967 లో గుడి ముందు జాతర కోలాహలం

టెంకాయకొట్టి హారతిచ్చి పూజిస్తారు. ఎన్నోరకాల తళిగెలతో నిండివున్న ఆ ప్రదేశం చూడ్డానికెంతో ఆసక్తికరంగా వుంటుంది. కొందరు పొంగలిని ఉదయం పెట్టాక సాయంత్రం ఇళ్ళ వద్ద నట్టింట్లో గంగమ్మకు తళిగెలు వేస్తారు. ఇంట్లో తెల్ల అన్నం వండి, కరవాడు పులుసు, కుడుములు, మాంసం వండి నట్టింట పెట్టి గంగమ్మను టెంకాయ, కర్పూరంతో పూజిస్తారు. మంగళవారం ఉదయం తిరుపతి ప్రజలు కొందరు అంబళ్ళుచేసి గంగమ్మకు నట్టింట పెట్టి హారతిచ్చి వీధుల్లో వచ్చే పోయే వారికి గ్లాసుల్లోను దోసిట్లోను అంబళ్ళు పోస్తుంటారు.

3.5.6. సారా -కల్లు :- తిరుపతి గంగ జాతరలో గంగమ్మకు నట్టింటిలోను, గుడిముందు, తళిగెలతో పాటు ఒక ముంతలో గాని మూకుడులోగాని సారా లేదా కల్లు గంగమ్మకు కొందరు నైవేద్యంగా పెట్టి పూజించడం కూడా ఉంది. అనేక ప్రాంతాల లోని జాతరల్లో కూడా గ్రామ దేవతలకు ఇలా మద్యాన్ని పెట్టడం ఆచారంగా ఉంది.

'పాండురంగ మాహాత్మ్యం' కావ్యంలో 'గాలిగంగల ' జాతరలో మద్యాన్ని సేవించిన స్త్రీల తలలకు 'కైపు' ఎక్కడం ప్రస్తావించబడి వుంది. ఈ కింది పద్యాన్ని గమనించండి.

"పెలుచఁగలు హొక్కు చెలువల తలకు నెక్కఁ
దోన దిక్కుల తల కెక్కఁ దొడ గె దమము
దేవి గుడిలోన నొక్కొక్క దివియదోఁపఁ
దోన యొక్కొక్క చుక్కయుఁదోఁచెమింట " 39.

దీనిని బట్టి 500 సంవత్సరాలకు పూర్వం స్త్రీలు జాతరలో అమ్మవారిని పూజించి తర్వాత మద్యాన్ని సేవించడం ఆచారంగా ఉన్నట్లు తెలుస్తోంది. ఇప్పుడు కూడా కొన్ని వర్గాలలోని స్త్రీలు మద్యాన్ని సేవించడం జరుగుతోంది.

3.5.7. బలులు :- వీటినే 'బలి ' 'బలి పూజ ' అని కూడా అంటారు. కొందరు ఇచ్చే బలిని బట్టి 'కోళ్ళు కోయడం ' , ' పొట్టేలు నరకడం' (ఏటను నరకడం) 'దున్నపోతుల్ని నరకడం ' 'జీవాల్ని బలివ్వడం '. అని అంటుంటారు.

గంగమ్మ జాతర సందర్భంలో జంతు బలులివ్వడం అనాదిగా వస్తున్న ఆచారం. జంతువుల్ని బహిరంగంగా బలివ్వడాన్ని చట్టాలు వ్యతిరేకిస్తున్నా,

[39] పాండురంగ మాహాత్మ్యం - తెనాలి రామకృష్ణుడు ; ఆ - 3, ప - 79.

గంగ జాతర సమయంలో అంతగా పట్టించుకోరు. కారణం గంగమ్మ మీదున్న భయభక్తులే. కానీ ఒకప్పుడు తిరుపతి గంగమ్మకు లెక్కలేనన్ని దున్న పోతుల్ని బలిచ్చేవారు. కనీసం పది లేదా పదిహేను దున్నపోతులనైనా నరికేవారు. తాళ్ళపాక (పెద్ద) గంగమ్మకు మాత్రం ఒకే ఒక దున్న పోతును నరికే వారు. ఈ దున్నపోతులో కూడా సగ భాగం తాతయ్యగుంట మిరాశిదారైన తోటి వారికే దక్కేది. దీనిక్కారణం గంగమ్మ కథేనంటారు.[40] దున్న పోతుల్ని నరికేది తోటోళ్ళే. క్రీ.శ. 1895లో అంటే వందేళ్ళకు పూర్వం 20 దున్నపోతుల్ని, 400 మేక పోతుల్ని, 700 కోళ్ళను గంగ జాతర చివరి రోజు గంగమ్మకు బలిచ్చేవారు. [41] క్రమంగా తిరుపతి పెద్ద పట్టణం కావడంతో మునిసిపాలిటీ వచ్చాక దున్నపోతుల్ని బలివ్వడాన్ని బలవంతంగా అరికట్టారు. కొన్నివేల మంది కళ్ళముందు దున్నపోతుల్ని బలివ్వడం వల్ల ప్రజలు భీతావహులు (భయభ్రాంతులు) అవుతున్నారని తిన్నగా ఈ దున్నపోతుల బలిని ఆపగలిగారు. ప్రస్తుతం తిరుపతి గంగమ్మకు జాతర సమయంలో దున్నపోతుల్ని బలి ఇవ్వడంలేదు. ఇప్పటికీ చిత్తూరు జిల్లాలో జరిగే గంగ జాతరన్నింటిలోనూ దున్నపోతుల బలి ఉంది . దున్నపోతు బలి లేకుండా జాతరను జరుపరు. దున్నపోతు తలను నరికి, దాని కుడికాలును దున్నపోతు నోటిలో ఉంచి, దాని నెత్తిమీద మూకుడులో దీపం ఉంచితేనే జాతరగా భావిస్తారు. పల్లెల్లో ఈ ఆచారాన్ని మాన్పించడం సాధ్య పడదు. తిరుపతికి రెండు కిలోమీటర్ల దూరంలోని అవిలాల గ్రామంలో జరిగే గంగ జాతరలో నేటికీ దున్నపోతుల్ని బలిస్తుంటారు. తిరుపతి చుట్టుపక్కల జరిగే జాతరలన్నింటిలో కూడా దున్నపోతుల బలి ప్రధానంగా ఉంటుంది.

'పాండురంగ మాహాత్మ్యం'లో 'గాలిగంగల' జాతరలో భక్తులు పశువులను బలిచ్చే ఆచారం ప్రస్తావించబడి ఉండడం కింది పద్యంలో చూడవచ్చు -

"బత్తులు నునువా కత్తుల
మొత్తిరి పశు సమజ ముండములు చండములౌ
నెత్తురు ధారలు దార వి
పత్తి మిరపవారుణ ప్రభలు ప్రబలంగన్ "[42]

---

40. చూడు :- గంగమ్మ కథ - రెండవ అధ్యాయం ; పుటలు - 41,42.
41 మద్రాసు నార్తార్కాటు డిస్ట్రిక్టు మాన్యువల్ - 1895 (సంవత్సరం)
42 పాండురంగ మాహాత్మ్యం - తెనాలి రామకృష్ణుడు ; ఆ - 3, ప - 78





గంగమ్మకు మేక పోతును బలిస్తున్న దృశ్యాలు



గుడిముందు కోడిని కోస్తున్న దృశ్యం



గుడిపక్కన వెయ్యికళ్ళ దుత్తలను పగుల గొడ్తున్న దృశ్యం

తిరుపతి గంగ జాతరలో ప్రస్తుతం దున్నపోతుల బలులు లేకున్నా కోళ్ళు, పొట్టేళ్ళు, మేకపోతులు వంటి వాటిని బలిస్తుంటారు. ఈ బలులు గురించి అధికారులు, పోలీసులు అంతగా పట్టించుకోరు. మరీ ఎక్కువగా ప్రజల ఆచార వ్యవహారాల్లో జోక్యం చేసుకుంటే వారి విశ్వాసాలు దెబ్బతిని, తిరగబడే ప్రమాదం వుంది. పైగా గంగమ్మ తమను ఏ విధంగా పీడిస్తుందోనని వీటి జోలికెళ్ళరు.

గంగ జాతరలో చివరి రోజైన మంగళవారం ఎక్కువ బలులు జరుగు-తాయి. పొంగళ్ళు పెట్టేవాళ్ళు పొంగళ్ళు పెట్టాక గంగమ్మముందు తళిగెలు వేస్తారు. తళిగెల ముందు కోళ్ళు కోస్తారు. అలాగే ఏటల్ని (వేటల్ని) అంటే పొట్టేళ్ళను, మేకల్ని నరుకుతారు. నరకడంలో కూడా ఒక పద్ధతిని పాటిస్తారు. ఒకే కత్తి వేటుకు తల తెగి పడిపోవాలి లేదా గంగమ్మ ఆగ్రహానికి గురి కావలసి వస్తుందని భయపడ్తారు. ఇలా తిరుపతి గంగజాతర చివరిరోజు ఎన్నో కోళ్ళను, పొట్టేళ్ళను, మేకల్ని బలులిస్తుంటారు. బలులను కొందరు మొక్కుబడితోను, మరికొందరు ఆచారంలో భాగంగాను ఇస్తుంటారు.

ఇలా తిరుపతి గంగ జాతరలో బలులు అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకొని ఉన్నాయి.

3.5.8. వెయ్యి కళ్ళ దుత్తలు :- తిరుపతి గంగజాతరలో చివరి రోజైన మంగళవారం సాయంత్రం స్త్రీలు తలస్నానాలు చేసి, బాగా అలంకరించుకొని, వెయ్యికళ్ళ దుత్తను చేతుల్లో ఉంచుకొని గంగమ్మ గుడికెళ్తారు. 'వెయ్యి కళ్ళ దుత్త ' అంటే ఒకచిన్న కుండకు సన్న సన్న రంధ్రాలు పెట్టబడి న దుత్త.[43] జాతర సమయంలో వెయ్యికళ్ళ దుత్తల్ని అమ్ముతుంటారు. వెయ్యికళ్ళ దుత్తను ఇంటికి తీసుకొని వచ్చి దానికి పసుపు పూసి, కుంకుమబొట్లు పెడ్తారు. దుత్త (మూతి) అంచు చుట్టూ దారంతో వేపాకును కడ్తారు. దుత్త లోపల వరిపిండితో చేసిన దీపాన్ని ఉంచి అందులో నెయ్యి గాని , నూనెగాని పోసి వత్తి పెట్టి వెలిగిస్తారు. కొందరు వెయ్యికళ్ళ దుత్తలో వెండికళ్ళు,

---

43. గంగమ్మను వెయ్యి కళ్ళు గల దేవతగా భావిస్తారు. అందుకని గంగమ్మకు ప్రతీకగా ఒక దుత్తకు వెయ్యి రంధ్రాలు చేసి ఉంటారు. ప్రస్తుతం వెయ్యి కళ్ళ దుత్తకు వెయ్యి రంధ్రాలను చూడలేం. కొన్ని రంధ్రాలు మాత్రమే ఉంటాయి.

చిన్న నల్లగాజుల్ని, చవ్వాకు,[44] కదుంపొడి,[45] పసుపు కుంకుమల్ని కూడా తీసుకెళ్తారు. మరి కొందరు కుడుముల్ని కూడా వేసి తీసుకెళ్తుంటారు. వెయ్యి కళ్ళ దుత్తను తీసుకెళ్ళేటప్పుడు స్త్రీలు నడుంకు వేపాకు రెమ్మల్ని కట్టుకొని, వెయ్యికళ్ళ దుత్తను అరచేతిలో పట్టుకొని తాతయ్యగుంట గంగమ్మ గుడికెళ్తారు. సాయంత్రం వేళలో వెయ్యికళ్ళ దుత్తను తీసుకెళ్ళేటప్పుడు చూడ్డానికి ఎంతో మనోహరంగా ఉంటుంది. కారణం దుత్తలో దీపం వెలుగుతుంటే రంధ్రాల్లోనుంచి ఆ దీప కాంతులు విరజిమ్ముతూ ఆకర్షణీయంగా ఉంటుంది. తాతయ్య గుంట గంగమ్మగుడి చుట్టూ వెయ్యి కళ్ళ దుత్తల్తో మూడుసార్లు ప్రదక్షిణం చేసి గుడి ఉత్తరం దిశలో వెయ్యికళ్ళ దుత్తను కిందేసి పగులగొడ్తారు. వెయ్యికళ్ళ దుత్తలో కొందరు తమ శక్త్యానుసారం 25 పైసల నుంచి ఇరవై రూపాయల దాకా చిల్లర డబ్బులు వేసుంటారు. వెయ్యికళ్ళ దుత్తల్ని పగులగొట్టే ప్రదేశంలో మిరాశిదారులైన తోటోళ్ళు ఉంటారు. వీరు వెయ్యికళ్ళ దుత్తల ద్వారా లభించే డబ్బుల్ని, చలిబిండిని, కుడుముల్ని సేకరించుకుంటుంటారు. వెయ్యికళ్ళ దుత్తల ద్వారా లభించే ఆదాయంపై వీరికే హక్కు ఉంటుంది. వీరు చలిబిండిని ఎండబెట్టి తింటారు. ఒకవేళ వాన వచ్చి పులిసి పోతే గొడ్లకు పెట్టేస్తారు. వెయ్యికళ్ళ దుత్తను కొందరు మొక్కుబడితోను, మరికొందరు అనాదిగా వస్తున్న ఆచారంలో భాగంగాను గుడి దగ్గర పగులగొడ్తుంటారు.

3.5.9. శూలాల సమర్పణ :- తిరుపతి గంగ జాతర సమయంలో కొందరు గంగమ్మకు శూలాలను సమర్పిస్తుంటారు. శూలాలను ఆచారుల వద్ద ఇనుముతో తయారు చేయించి, పూలమాలలు వేసి, శూలాల మొనలకు నిమ్మకాయల్ని గుచ్చి తెల్లని అడ్డు పట్టీలు పెట్టి, పసుపుకుంకుమ బొట్లు పెట్టి పలకలు, కొమ్ము వాయిద్యాలతో గంగమ్మ గుడికెళ్ళి గుడి ముందు ప్రతిష్ఠించి పొంగళ్ళు పెట్టి, కోళ్ళుకోసి టెంకాయలు కొట్టి, హారతిచ్చి పూజించి వస్తారు. శూలాలను మొక్కుబడితో సమర్పిస్తుంటారు. శూలాలను తయారు చేసేటప్పుడు మైల తగలకుండా ఎంతో మడితో (శుచితో) తయారు చేస్తారు. ఐదేళ్ళకు ముందు గుడికి ముందు అనేక శూలాలు ప్రతిష్ఠింపబడి ఉండేవి. నేడు గుడిని పెద్దదిగా విస్తరించాక శూలాలను సమర్పించేవాళ్ళు తగ్గారు.

3.5.10. అభిషేకాలు - అలంకరణలు :- గంగమ్మ గుడిని ఎండో మెంట్ వాళ్ళు

---

[44] చవ్వాకు :- రంగును పూసి కమ్మలాగా మడచబడ్డ తాటాకు. దీన్ని గంగమ్మకు కమ్మలుగా భావిస్తారు. నాడు తాటాకు కమ్మలే వాడుకలో ఉండేవి.

[45] కదుంపొడి :- అన్ని రకాల పొడులతో చేస్తారు.

తీసుకున్నాక గ్రామదేవతా పూజా విధానంలో శిష్టదేవతా పూజావిధానాలు తిన్నగా చోటు చేసుకున్నాయి. గంగమ్మకు అర్చనలు, అభిషేకాలు చేయడం వంటివి వచ్చాయి. సాధారణంగా గ్రామదేవతలకు అర్చనలు, అభిషేకాలు ఉండవు. అంతకు క్రితం ఆచార్యులు అభిషేకాలు చేసినా అవి విగ్రహాన్ని నీళ్ళతో కడిగి, పసుపుపూసి కుంకుమ పెట్టడం వరకే ఉండేది. క్రమేణా గంగమ్మకు భక్తులు అధికం అయ్యేసరికి పూజావిధానంలో కూడా మార్పులొచ్చాయి. ఆచార్యుల నుండి మొదలియారు గుడిని పూజల కోసం తీసుకున్నప్పుడు మంగళ, శుక్రవా-రాల్లో పాలతో అభిషేకించి, పూజించేవారు. తర్వాత కొంతకాలానికి ప్రతిరోజూ గుడిని తెరచి హారతిచ్చి పూజించేవారు. ఇప్పుడు గంగమ్మ దేవస్థానం అయింది కాబట్టి ప్రతిరోజూ పూజలు, అర్చనలు, నైవేద్యాలు వంటివి జరుగుతున్నాయి.

గంగ జాతర సమయంలో గంగమ్మకు శుక్రవారం, సోమవారం రాత్రి అభిషేకం చేస్తారు. మంగళవారం వేకువ జాము నుంచి వచ్చే భక్తుల కోసం సోమవారం రాత్రి 11గంటల పైన అభిషేకం చేసి గంగమ్మను ఎంతో అందంగా, ఆకర్షణీయంగా అలంకరిస్తారు. శుక్రవారం, సోమవారం రాత్రి చేసే అభిషేకాలు గ్రామదేవతలకు చేసే విధంగా కనిపించదు. ఎండోమెంట్ వారిచే నియమించబడిన బ్రాహ్మణ పూజారులు శిష్టదేవతలకు అభిషేకం చేసే పద్ధతుల్ని పాటిస్తారు. ఈ పూజారులతో పాటు గంగమ్మను ఎన్నో ఏళ్ళుగా పూజిస్తూ వచ్చిన శూద్ర కులస్థులు కూడా పూజారులతో అభిషేకం తదితర పూజల్లో పాల్గొంటుంటారు.

అభిషేకానికి కావలసిన వస్తు సామగ్రిని ముందే సమకూర్చుకుంటారు. కొందరు మొక్కుబడితో కొన్ని వస్తువులను అభిషేకానికి తెచ్చి ఇస్తారు. గంగ-మ్మకు అభిషేకం చేసేటప్పుడు పక్కనే బ్రాహ్మణులు శ్రీసూక్తం, మంత్రపుష్పం మంత్రాలను పఠిస్తుంటారు. గంగమ్మ ముందు పెద్ద పాత్రలో పాలు వుంచి చిన్న బిందెలతో ముంచి గంగమ్మ రాతి విగ్రహంపై పోస్తూ క్షీరాభిషేకం చేస్తారు. గంగమ్మ విగ్రహంతో పాటు, గంగమ్మ పక్కన అటు, ఇటు ఉన్న చిన్న విగ్రహాలకు, పంచలోహ త్రిశూలానికి, పంచలోహ విగ్రహానికి కూడా క్షీరాభిషేకం చేస్తారు. క్షీరాభిషేకానంతరం గంగమ్మ విగ్రహాన్ని కొబ్బరి పీచుతో బాగా రుద్ది కడుగుతారు. తర్వాత మంచినీళ్ళతో అభిషేకిస్తారు. వివిధ రకాల పండ్లను పెద్దపాత్రలో తరిగి పంచామృతాన్ని చేసి గంగమ్మ విగ్రహం, మిగిలిన విగ్రహాలపైన పోసి గంగమ్మకు పెద్ద గంధం బొట్టు దానిపై కుంకుమబొట్టు పెట్టి కర్పూర హారతిస్తారు. ఆ హారతిని భక్తులు కళ్ళకద్దుకున్నాక పండ్లు అన్నింటిని

తిరిగి పెద్దపాత్రలో వేసేస్తారు. ఆ తర్వాత కొబ్బరి నీళ్ళతో అభిషేకిస్తారు. కొబ్బరి బొండాలకు చిల్లులు పెట్టి కొబ్బరి నీళ్ళు పోసిన తర్వాత గంగమ్మ నుదుట మళ్ళీ గంధంబొట్టు దానిపై కుంకుమబొట్టు పెట్టాక విగ్రహంపై పూలు పెట్టి కర్పూర హారతిస్తారు. ఈ అభిషేకం అయ్యాక తేనెతోను పెరుగుతోను అభిషేకాలు చేస్తారు. తర్వాత బాగా కలిపిన గంధాన్ని తీసుకొని గంగమ్మ విగ్రహానికి మందంగా పట్టిస్తారు. ఆ తర్వాత నుదుట కుంకుమబొట్టు పెట్టి కర్పూర హారతిస్తారు. తర్వాత గంధాన్ని తీసేస్తారు ప్రతి అభిషేకం తర్వాత హారతిచ్చి తర్వాత విగ్రహంపై నీళ్ళుపోస్తారు.

గంగమ్మ విగ్రహానికంతా తడిపసుపు పూసి, ముఖానికి మాత్రం తడి-పసుపు పైన పసుపు పొడిని అద్దుతారు.[46] కుంకుమతో కుడి చెంపపైన ఒక బొట్టు, ఎడమ చెంపపై ఒకబొట్టు, గడ్డంపై ఒక బొట్టు పెడ్తారు. కంఠంపైన కిరీటంపైన చెవులపైన కూడా కుంకుమ బొట్లు పెడ్తారు. నుదుటి పైన పట్టీలా కుంకుమ పెట్టి పెదాలపైన కూడా కుంకుమను పూస్తారు. తర్వాత గంగమ్మవిగ్రహానికి పట్టుచీర కట్టి, పూలమాలలతోను మల్లెపూలు కనకాంబరాలతోను ఎంతో ఆకర్షణీయంగా అలంకరిస్తారు. గంగమ్మ కళ్ళకు బంగారు రేకు కళ్ళను పెట్టి, ఎర్రరాళ్ళు పొదిగిన ముక్కెర, తెల్లరాళ్ళు పొదిగిన నత్తును, ముక్కుపుడక అలంకరిస్తారు.

నుదుటిపై వెండి నామాలను, దానికింద తెల్ల రాళ్ళు పొదిగిన బొట్టును అమర్చుతారు. తలకు పాపటబిళ్ళ, హారాలను మాటీలను మెడలో ఆభరణాలను తగిలిస్తారు. గంగమ్మ ముఖం తప్ప, మిగతావిగ్రహం మొత్తం ఎంతో శోభాయమానంగా మనోహరంగా పూలతో అలంకరింపబడి ఉంటుంది.

గంగమ్మ విగ్రహం చెంతనే ఉన్న ఉత్సవ విగ్రహానికి కూడా బట్టలు తొడిగి మెళ్ళో పూలహారాలు, మంగళసూత్రాలను వేసి అలంకరిస్తారు. అదే విధంగా గంగమ్మ విగ్రహం పక్కనుండే చిన్న రాతి విగ్రహాలను కూడా పూలతో అలంకరిస్తారు.

ఇలా తిరుపతి గంగజాతరసమయంలో తాతయ్యగుంట గంగమ్మకు అభిషేకాలు అలంకరణలు చేస్తారు.

3.6. గంగమ్మ చెంప నరకడం :- గంగమ్మ గుడి ముందు ఏడునుంచి ఎనిమిది

---

[46] ముడి పసుపు కొమ్ములపై ఉండే చెక్కను తరిగేసి లోపలఉన్న దానిని ఎండ బెట్టి, కస్తూరి పసుపు, కిచ్చిలిగడ్డ వేసి నున్నగా పొడి చేస్తారు. ఈ పొడిని గంగమ్మ ముఖానికి అద్దడం వల్ల ఆమె ముఖం ఎంతో ప్రకాశవంతంగా మెరుస్తుంటుంది.

అడుగులు ఎత్తు ఉండే పెద్ద గంగమ్మ బొమ్మను, కొయ్యతో, పరిగడ్డి (కసువు) తో బంకమట్టితో, వివిధ అలంకరణలతో తయారుచేస్తారు. ఈ గంగమ్మ బొమ్మకు పూజలు చేశాక చెంపను పేరాంటాలువేషం వచ్చి నరికేస్తుంది. ఇది తిరుపతి గంగజాతరలో అత్యంత కీలకమైన పూజా కార్యక్రమం. ఈ పూజా కార్యక్రమాన్ని తిలకించడానికి కొన్ని వేలమంది భక్తులు గుడిముందు మైదానంలో కిక్కిరిసి ఉంటారు. గంగమ్మ చెంపను నరికిన తర్వాత ఆ బొమ్మ బంకమట్టి కోసం జనం తొక్కిసలాడు కొంటారు. జాతర చివరి రోజు గంగమ్మ గుడి ముందు జరిగే అత్యంత పెద్ద కార్యక్రమం ఇదే. తాతయ్య గుంట గంగమ్మ గుడి ముందు పెద్ద గంగమ్మ బొమ్మను తయారు చేస్తారు. ఈ బొమ్మకు అన్ని మెరుగులు దిద్దుతారు. ఈ బొమ్మ ఎంతో నాణ్యతతో కూడి వుంటుంది. తర్వాత తాళ్ళపాక గుడి ముందు కూడా ఇలాగే గంగమ్మ బొమ్మను తయారు చేస్తారు. ఈ బొమ్మనాలుగు 'అడుగులు ఎత్తువుండి చిన్నదిగా ఉంటుంది. అసలు జాతర అంతా తాతయ్యగుంట గంగమ్మకే జరుగుతుంది కాబట్టి ఆ బొమ్మనే గొప్పగా తీర్చిదిద్దుతారు. జనమంతా కూడా అక్కడే ఉంటారు.

గంగజాతర చివరి రోజైన మంగళవారం రాత్రి గంగమ్మబొమ్మను తయారుచేసి బుధవారం తెల్లవారు జామున గంగమ్మ బొమ్మ చెంప నరకడంతో గంగజాతర పరిసమాప్తమౌతుంది. కాబట్టి గంగమ్మ బొమ్మను తయారు చేయడం మొదలు గంగమ్మ చెంపనరికే వరకు జరిగే వివిధ దశలను గురించి తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

గంగమ్మబొమ్మను తయారు చేయడానికి ముందు రోజు మిరాశీదా-రులైన తోటోళ్ళు వేపమానును నరికి తేవడానికి వెళ్తారు. వీరు తిరుపతి సమీపం గ్రామాలైన ముత్యాలరెడ్డి పల్లి, తుమ్మల గుంట, చిగురువాడ కటువల (వంకగట్లు) దగ్గరకెళ్లి నిటారుగా వుండే ఒక మంచి వేపమానును ఎంపిక చేసుకొని, దానికి టెంకాయ, పూలు, పళ్ళుతో హారతిచ్చి నరుకుతారు. అలాగే ఆ వేపమానుకు పసుపు కుంకుమలు పెట్టి, కోళ్ళు కోసి మానును పూజిస్తారు. వేపమాను నుంచి కొమ్మల్ని వేరుచేసి, ఎద్దుల బండి పైన మానును ఉంచుకొని తిరుపతి ప్రధాన వీధుల గుండా వెళ్తూ 'కిల కిల కిల ' అని అరచుకుంటూ (కిలారింపు చేసుకుంటూ) గంగమ్మ గుడికి చేరుకుంటారు. మంగళవారం తెల్లవారే సరికల్లా మాను గంగమ్మ గుడిముందు ఉంటుంది. దీనికని వీళ్ళకు గుడి నుంచి 600 రూపాయలు ఇచ్చేవారు. అలాగే తోటోళ్ళు ముందుగానే అడవికి పోయి గంగమ్మ బొమ్మ కనుగుడ్లకని రెప్పాళ్ళ కొయ్యను ముడి కొమ్మ లేనిదిగా

చూసి తెస్తారు. గంగమ్మ బొమ్మ తయారీలో హరిజనులు, కుమ్మరి, కంసాలి, చాకలి, మంగలి, గొల్ల వంటి మిరాశిదార్లు పాల్గొంటారు

మంగళవారం సాయంత్రం 7గంటల నుండి గంగమ్మ బొమ్మను తయారు చేయడం మొదలు పెడ్తారు. గంగమ్మ బొమ్మను తయారు చేయ-డానికి రెండు వర్గాల కంసలి వాళ్ళు ఉంటారు. వీరినే ఆచార్యులు అంటారు. మొదటి వర్గం ఆచార్యులు బొమ్మకు సంబంధించిన కొయ్య (వడ్రంగి) పనిని చేస్తారు. రెండోవర్గం ఆచార్యులు గంగమ్మను బంకమట్టితో తీర్చి దిద్దుతారు. ఇక బంకమట్టిని పిసికేది కుమ్మరి వాళ్ళు. కసువు_వెంట్లు (వరిగడ్డి తాళ్ళు) పేడేది తోటోళ్ళు.

మొదటి వర్గం ఆచార్యులు గంగమ్మ గుడి ముందు వేపమానును స్తంభంలా నిలబెట్టి నీళ్ళతో కడిగి, పసుపు కుంకుమలు పూసి పూలహారాలు వేసి టెంకాయ కొట్టి హారతిచ్చి పూజిస్తారు. తగుమాత్రం ఉండి నిటారుగా ఉండే వేపమానును ప్రతి సంవత్సరం తేవాలంటే కష్టమైన పనే. అందుకని గుడి ముందు వేపమానుకు బదులు రాతిస్తంభాన్ని శాశ్వతంగా ఏర్పాటు చేశారు. స్తంభం ఎత్తు పది అడుగులుంటుంది. వేప మేకుల్ని దిగగొట్టడానికని రాతిస్తంభాన్ని కావలసిన చోట తొలచబడి ఉంది. వీళ్ళు స్తంభానికి పైభాగంలో మూడేసి వేప మేకుల్ని మూడు వైపులా అమర్చుతారు. అంటే వరిగడ్డి తాళ్ళు చుట్టడానికి అమవుగా ఉండేదానికని తర్వాత స్తంభానికి కింది భాగంలో వేపకొయ్యతోనే చేతులున్నట్లు అమర్చుతారు. తోటోళ్ళు తెచ్చిన రెప్పాళ్ళ కొయ్యను తరణి పట్టి, లక్కపూసి కనుగుడ్లను తయారుచేసి తెచ్చి ఉంచుతారు. అలాగే పళ్ళకు, కోరలకు వెదురు దబ్బలను చెక్కిఉంచుతారు.

రెండో వర్గం ఆచార్యులు గంగమ్మను తీర్చి దిద్దే ముందు పూజ చేసి స్తంభానికి ఐదడుగుల ఎత్తులో కర్రతో సేరవ కట్టి ఎక్కుతారు. తోటోళ్ళు పేడిచ్చిన కసువెంట్లు (వరిగడ్డి తాళ్ళ)తో స్తంభం పై భాగంలో తలకు కావలసిన రీతిలో చుట్టుతారు. పై భాగంలో ఉండే వేప మేకుల వల్ల కసువెంట్లు జారిపోకుండా ఉంటాయి. బొమ్మతలకు కావలసిన పరిమాణం వరకు వెదురు దబ్బలను నాటి వాటిపై కసువెంట్లను చుట్టి తర్వాత కుమ్మరి వాళ్ళు ఇచ్చే బంకమట్టి ముద్దల్తో బలంకొద్దీ కసువెంట్లపై విసరికొడ్తుంటారు. ఇలా కొట్టడం వల్ల బంకమట్టి బాగా అతుక్కుంటుంది. ఇలా కసువెంట్లను చుట్టి బంకమట్టిని



28 ఏళ్ళకు ముందు వెండి తొడుగుతో
అలంకరించబడ్డ గంగమ్మ



28 ఏళ్ళకు ముందు గంగమ్మ మట్టి బొమ్మ

కొట్టూ గంగమ్మ రూపాన్ని తీర్చి దిద్దుతున్నంత సేపూ తోటోళ్ళు 'కిల కిల కిల' మని కిలారింపులు చేస్తూనే వుంటారు. కిలారింపుల శబ్దాలు లేకుండా ఆచార్యులు బొమ్మను తయారుచేయలేరు. వేదమంత్ర పఠనంలా కిలారింపుల శబ్దం ఉండాల్సిందే. బొమ్మకు కావలసినంత బంకమట్టిని పక్కనే ఉన్న కుమ్మరి వాళ్ళు బాగా పిసికి పక్కనున్న ఆచార్యులకు అందిస్తుంటారు. ఇలా ఆచార్యులు బొమ్మ తలను తీర్చిదిద్ది, తడితో గంగమ్మ బొమ్మ ముఖాన్ని నున్నగా చేస్తారు. నీలిమందు,నూనెను రంగరించి గంగమ్మ ముఖానికి నీలి రంగును అద్దుతారు. గంగమ్మకు రేకుతోచేసి నల్లరంగు పూసిన ముక్కును అమర్చుతారు. బంగారు పూతపూసిన నత్తును కుంకుమ అతికించి తగిలిస్తారు. ముక్కుకు ఎడమ పక్క కూడా బంగారు పూతపూసిన చేప ఆకారంలో చెక్కబడిన ముక్కెరను వేస్తారు. అలాగే బంగారం రంగురేకుల చెవులను గంగమ్మ బొమ్మకు జోడిస్తారు. చెవులకు బంగారంలా మెరిసే సింగపూరు రేకుతో చేయబడిన కమ్మలు, జుంకీలను అలంకరిస్తారు. మంగలి వాళ్ళు గంగమ్మ బొమ్మ తలమీద, తలవెనుక తెల్ల వెంట్రుకలను దారాల్లాగా పేడి, పొడవుగా వేలాడదీస్తారు. బంగారంలా ధగ ధగ మెరిసే సింగపూరు రేకుతోనే చేయబడి నగిషీలు చెక్కబడిన కిరీటాన్ని ఉంచుతారు. కిరీటం కింద మల్లె పూలతోను, కనకాంబరాలతోను అలంకరిస్తారు. గంగమ్మ నుదురు భాగమంతా ఎర్రని కుంకుమను పట్టీలా పెడ్తారు. ఆ నుదురు భాగం మధ్యలో వెండితో చేసిన అడ్డ నామాలను అమర్చుతారు. కనుబొమల మధ్య గంధంతో పెద్ద బొట్టును పెడ్తారు. గంగమ్మ బొమ్మ నోరు తెరచుకొని ఉన్నట్లుగా చేస్తారు. నోటి నిండా ఎర్రకుంకుమను నింపుతారు. వెదురు దబ్బలతో చేసిన పళ్ళను పెడ్తారు. చాకలి వాళ్ళు తెచ్చిన చీరను గంగమ్మ బొమ్మకు చుట్తారు. గొల్లవాళ్ళు తెచ్చిచ్చిన మంగళసూత్రాలను గంగమ్మ మెళ్ళో వేస్తారు. మంగళసూత్రాల్లో ఒక పెద్ద ఇత్తడి తాళి, దానిపక్కన రెండు కొయ్యగుండ్లు, వాటికి అటు ఇటురెండు చిన్న గిన్నెబొట్లు (చిన్న తాళులు) ఉంటాయి. గంగమ్మ చీరకు ఒడిబాలును గొల్లవాళ్ళే తెచ్చి పెట్తారు. కొద్ది సేపు బంగారు తాళిబొట్లను గంగమ్మ బొమ్మకు కట్టి తీసేస్తారు. కనుబొమల కింద వెండితో చేసిన కన్నులను అమర్చుతారు. వెండి కన్నుల మధ్యలో నల్లని కనుగుడ్లు పెట్టడానికి ఖాళీ ప్రదేశం ఉంటుంది. కనుగుడ్లను మాత్రం చివరలో పెడ్తారు. నల్లగుడ్లను పెడితే గంగమ్మ బొమ్మకు ప్రాణం వచ్చినట్లు భావిస్తారు. గంగమ్మ బొమ్మ ముందున్న సేరవ కొయ్యలకు మధ్యలో చేంతాడు కట్టి దానికి పూలమాలల్ని అలంకరిస్తారు. పెద్ద చెవులు కాబట్టి పూలమాలల్ని తగిలిస్తారు. గంగమ్మ మెళ్ళో పెద్ద పెద్ద రోజా మాలల్ని అలంకరిస్తారు. గంగమ్మ బొమ్మ పూర్తి అయ్యేవరకు జనాలకు

కనబడకుండా చుట్టూ తెరకట్టి ఉంటారు. ఇక చివర్లో రెప్పాళ్ళ కొయ్యతో గుండ్రంగా తరణి పెట్టబడి, నల్లని లక్కపూయబడి ఉన్న కనుగుడ్లను తీసుకొని వానికి సాంబ్రాణి పొగను చూపి అతి భయభక్తులతో వెండి కన్నుల మధ్యలో అమర్చుతారు. గుమ్మడికాయ హారతిచ్చి వెంటనే తెరను తీసి గుమ్మడికాయను పగులగొట్టి పక్కకు తప్పుకుంటారు. అదే ముప్పై ఏళ్ళకు ముందు అయితే ఆ సమయంలో దున్నపోతుల్ని బలిచ్చేవారు. వంద ఏళ్ళకు పూర్వం క్రీ.శ.1895 లో తిరుపతి గంగజాతరలో 20 దున్నపోతుల్ని, 400 మేకపోతుల్ని, 700 కోళ్ళను బలిచ్చేవారని మనమిదివరకే తెలుసుకొని ఉన్నాం.[47] తెరను తీస్తుండగానే గంగమ్మకు ఆహారార్థమై ఎదురుగా నేలపై వేపాకును పరిచి దానిపైన తెల్ల పంచల్ని పరచి మూడుకుండల్లో వండిన కుంభాన్ని పోస్తారు. అంటే ఆమెకు ఆహారం ఎదురుగా వుండాలి. లేకపోతే మనుషుల్నే ఆహారంగా తీసుకుంటుందనే భయంతో ఉంటారు. అప్పుడు గంగమ్మకు నేరుగా జనాలెవ్వరూ నిలబడరు.[48] తర్వాత గంగమ్మ ముందు జనాలు కొన్ని వేల టెంకాయలను కొడ్తుంటారు. కొబ్బరి నీళ్ళతో ఆ ప్రాంతమంతా బురదైపోతుంది. జనం మూకుదులో వేసే కర్పూర హారతులు మంటలా మండుతుంటుంది.

గంగమ్మ చెంపను నరికేంత వరకు గంగమ్మను ప్రజలు దర్శనార్థమై ఉంచుతారు. గంగమ్మ బొమ్మకు కొయ్యపని చేసిన మొదటి వర్గం ఆచార్యులకు వంద రూపాయలిస్తారు. తర్వాత మట్టితో బొమ్మను తీర్చిన రెండో వర్గం ఆచార్యులు ఒక గంటసేపు గంగమ్మ బొమ్మ ముందు కూర్చొని భక్తుల ద్వారా వచ్చే ఆదాయాన్ని తీసుకుంటారు. వీరు బారులు తీరిన జనం దర్శనానికి వస్తుంటే బొమ్మ ముందు కూర్చొని పూలను, కుంకుమను ఇస్తుంటారు. ఒక గంట తర్వాత మిరాశీ దారులైన చాకలి వాళ్ళు గంగమ్మ బొమ్మ ముందు కూర్చొని గంగమ్మ చెంప నరికేంత వరకు భక్తుల నుంచి వచ్చే ఆదాయాన్ని తీసుకుంటారు. గంగమ్మ బొమ్మ ముందు పూనకాలు వచ్చి వూగిపోతుంటారు. వారికి కర్పూరహారతులిచ్చి శాంతింప జేస్తుంటారు. గంగమ్మను దర్శించుకొన్న భక్తులు, గంగమ్మ చెంపను నరికేది చూడ్డానికని చుట్టూ నిలబడి ఉంటారు. గుడి ముందున్న మైదానంలో ఇసుక వేస్తేరాలని జనం ఉంటారు.

---

[47] మద్రాసు నార్తార్కాటు డిస్ట్రిక్టు మాన్యువల్ - 1895సం॥

[48] పూర్వం గంగమ్మ గుడి ముందు నేరేడుమాన్లు విపరీతంగా ఉండేవి. గంగమ్మ బొమ్మ ముందున్న తెరను తొలగిస్తూనే ఎదురుగా ఉండే నేరేడు మాన్లు పెళపెళమని విరిగి పడేవట. గంగమ్మ చూపు అంత తీక్షణమని చెప్పుకుంటుంటారు.

తాళ్ళపాక (పెద్ద) గంగమ్మ గుడి ముందు కూడా ఇలాగే గంగమ్మ బొమ్మను తయారు చేస్తారు. కాకపోతే తాతయ్య గుంట గంగమ్మ బొమ్మ అంత నాణ్యత, అలంకరణలు వుండవు. తాతయ్యగుంట గంగమ్మ బొమ్మ కన్నా చిన్నదిగా ఉంటుంది. స్తంభం పొడవు 8 అడుగులుంటుంది. అందులో బొమ్మ 4 అడుగులుంటుంది. అట్టతో, రంగు కాగితాలతో కిరీటాన్ని, చెవుల్ని, ముక్కెరను చేసిపెడ్తారు. పూలహారాలు కూడా తక్కువే. పెద్ద గంగమ్మ బొమ్మ తయారీలో కూడా రెండు వర్గాల ఆచార్యులు, తోటోళ్ళు, కుమ్మరి, చాకలి, మంగలి, గొల్లవాళ్ళు పాలుపంచుకుంటారు. యాదవులిచ్చే తాళిని గంగమ్మ మెడలో కడ్తారు. తాళ్ళపాక గంగమ్మ గుడిముందు జనం కూడా పల్చగానే ఉంటారు. కారణం అసలు జాతరంతా తాతయ్యగుంట గంగమ్మ గుడి ముందే జరుగుతుంది కాబట్టి అక్కడ ఉన్నంత ప్రాధాన్యత ఇక్కడ ఉండదు.

మిరాశిదారైన కైకల వాడు వేసిన పేరంటాలు వేషం నాలుగు కాళ్ళ మండపం చేరేసరికి వేషం చుట్టూ యువకులు చేరుతారు. అక్కడ్నుంచి బండ్లవీధి గుండా పేరంటాలు వేషం ఎంతో ఆవేశంతో గంగమ్మ గుడిని చేరుకుంటుంది. గుడిని సమీపించే కొద్దీ పేరంటాలు వేషం పక్కన వచ్చేవారి అరుపులు, కేకలు, పంబల శబ్దాలు ఎక్కువౌతుంటాయి. తెల్లవారు జామున గాని, సూర్యోదయానికి ముందేగాని పేరంటాలు తాతయ్య గుంట గంగమ్మ గుడిని చేరుకోవాలి. గుడి ముందున్న గంగమ్మ బొమ్మను చూస్తూనే పేరంటాలు వేషానికి పూనకం వచ్చి చిందులేసి, చేత్తో హారతిస్తుంది. గంగమ్మ బొమ్మ దగ్గరుండే వారు పేరంటాలు వేషానికి హారతిచ్చి, గంగమ్మ పూలహారాన్ని తీసి పేరంటాలు వేషానికి వేస్తారు. తర్వాత చుట్టూ ఉన్న జనం, అరుపులు, కేకలు, కిలారింపులు అధికమౌతాయి. పంబలవాడు పంబను వాయిస్తుంటే పేరంటాలు వేషధారి పంబలకు అనుగుణంగా అడుగులేస్తూ, ఆవేశంతో, ఉద్రేకంతో గంగమ్మ బొమ్మ చెంప దగ్గరుండే మట్టిని చేత్తో లాగేస్తాడు. దీన్నే 'గంగమ్మ చెంప నరకడం' అంటారు. పేరంటాలు వేషం గంగమ్మ చెంప దగ్గరుండే మట్టిని లాగుతూనే సేరవలపై ఉండే వారు గబ గబ గంగమ్మ బొమ్మ మట్టిని పెరికి పెరికి ఉత్కంఠతో చూస్తున్న జనంపైకి విసురుతారు. కొన్ని వేలమంది జనం ఈ తంతును వీక్షిస్తుంటారు.[49] జనం ఆ మట్టి కోసం తొక్కిసలాడు

49. పదేళ్ళ ముందు గంగమ్మ చెంపను నరికే ఘట్టాన్ని లక్షమంది దాకా చూసే-వారు. అప్పుడు గుడి ముందు, పక్కన కావలసినంత మైదానం ఉండేది. గుడిముందు తాతయ్యగుంట కట్ట ఉండేది.కట్టపై నుంచి కూడా జనం చూసేవారు. ప్రస్తుతం తాతయ్య గుంట కట్ట లేదు సరికదా గుడికి అటు ఇటు ఉన్న స్థలంలో ఇళ్ళు కట్టేశారు. ప్రస్తుతం

తుంటారు. సేరవలపై ఉండేవారు ఆ మట్టిని పెరికేటప్పుడు గంగమ్మకు వేసిన ఆభరణాలను , వస్త్రవులను గబగబా తీసుకొని వెళ్ళి పోతారు. ఇక జనం ఆ గంగమ్మ బొమ్మకుండే మట్టిని అణుమాత్రం కూడా వదలి పెట్టరు. చివరికి కసువెంట్లకు అతుక్కొని ఉన్న మట్టిని కూడా గోక్కొని వెళ్తుంటారు. ఈ మట్టి ఇంట్లో ఉంటే మేలు జరుగుతుందని, కడుపునొప్పి వంటి రోగాలు వస్తే ఆ మట్టిని చప్పరిస్తే ఇట్టే పోతాయని నమ్ముతారు. కొన్ని నిముషాల్లోనే అంత పెద్ద గంగమ్మ బొమ్మ కనుమరుగై పోతుంది. గంగమ్మ చెంపను నరికిన తర్వాత జనం తిరుగు ముఖం పడ్తారు. గంగమ్మ గుడి చుట్టూ ఉన్న వీధులన్నీ జనంతో కిటకిటలాడి పోతాయి.

పేరంటాలు వేషం తాతయ్య గుంట గంగమ్మ చెంపను నరికేశాక, అక్కడ్నుంచి నేరుగా పెద్దకాపువీధి గుండా, తాళ్ళపాక గంగమ్మ గుడికి చేరుకొని అక్కడ కూడా పైవిధంగానే ఆవేశంతో ఉద్రేకంతో గంగమ్మ చెంప దగ్గరున్న మట్టిని పెరికేస్తాడు. తర్వాత బొమ్మ దగ్గరున్న వాళ్ళు మట్టిని జనంపైకి విసిరివేయడం, జనం మట్టికోసం ఎగబాకడం మామూలే. పేరంటాలు వేషం వెనక్కు వెళ్ళిపోతూ ఎదురు పడ్డ వారికి ఒడిబాలులోని అక్షింతల్ని ఇస్తుంటుంది. ఆ అక్షింతల కోసం కూడా జనం తోసుకుంటుంటారు.

ఇలా తిరుపతి గంగజాతర చాటింపుతో ప్రారంభమై వివిధ వేషాలతో, మొక్కులతో, వినోదాలతో, వ్యాపారాలతో, వివిధ పూజలతో సాగి చిట్ట చివర గంగమ్మ చెంప నరకడంతో పరిసమాప్తమవుతుంది.

---

ఉన్నగుడి స్థలంలో కొన్ని వేలమంది మాత్రమే పడ్తారు. అయినా చుట్టూ ఉన్న ఇళ్ళ మిద్దెల పైనిలబడుకొని కూడా జనం చూస్తుంటారు.



గంగమ్మ చెంపను నరకడాన్ని చూడడానికొచ్చిన జన సందోహం



జనాన్ని అదుపు చేస్తున్న పోలీసులు



తాళ్లపాక గంగమ్మ గుడి ముందు బంక మట్టితో చేసిన గంగమ్మ బొమ్మ



గంగమ్మ బొమ్మ చెంపను నరుకుతున్న పేరంటాలు వేషం

# 4. తిరుపతి గంగ జాతర - ప్రజల మనస్తత్వం

తిరుపతి గంగ జాతరను పరిశీలిస్తే వివిధ రకాలైన ప్రజల మనస్తత్వాలు మనకు గోచరమౌతాయి. ఈ అధ్యాయంలో ప్రజలు ఎందుకు వేషాలు వేస్తారు? బూతులు ఎందుకు తిడ్తారు? మొక్కుబడులు ఎందుకు చెల్లిస్తారు? బలులు ఎందికిస్తారు? పూజలెందుకు చేస్తారు? వివిధ నమ్మకాలు, నైవేద్యాలెందుకు పెడ్తారు? పూనకాలు, గంగమ్మంటే భయ భక్తులు, ఇతరులను ఆదరించడం, కులపట్టింపులు లేకపోవడం వంటి అనేక విషయాలను మనస్తత్వ పరంగా విశ్లేషించడం జరిగింది.

4.1. వేషాలు వేసే మనస్తత్వం:- ప్రజలు తమ మనస్సుల్లోని తీరని భావాలను, ఒత్తిడులను ప్రదర్శించుకోవడానికి సంఘం, సభ్యత అడ్డు వస్తుంటాయి. వారు తమ కోర్కెలను, ఇష్టాలను తీర్చుకోవడానికి ఇలాంటి జాతరలను ఒక అవకాశంగా చేసుకొని దానికి పవిత్రతను ఆపాదించి ఆచరిస్తున్నారు.

మనలో కొందరికి వేషాలు వెయ్యాలనే కోరిక, ఉబలాటం ఉంటుంది. అవి ఎప్పుడు, ఎలా వేయాలో తెలియదు. అందుకని ఏదో ఒక సందర్భాన్ని పురస్కరించుకొని వేషాలు వేసి తమ కోర్కెను తీర్చుకోవాలనుకుంటారు. అలాంటి కోర్కెలను తీర్చుకోవడానికి ప్రజలు ఈ జాతరలను ఆసరాగా తీసు-కున్నారు. కొందరు తాము ఆడ వేషంలో ఎలా ఉంటామో చూసుకోవాలని ఉవ్విళ్లూరుతుంటారు. మరి కొంత మంది రాముడు, కృష్ణుడు, శివుడు, బ్రహ్మ, హనుమంతుడు, గణపతి, దుర్యోధనుడు, భీముడు, అర్జునుడు, రాక్షసుడు, రాజు, మంత్రి, భటుడు వంటి వేషాల్లో తమను తాము చూసుకోవడానికి జాతర ఒక చక్కని అవకాశంగా ఉపయోగపడుతూ ఉంది. అలాగే కొంత మంది తల్లి దండ్రులు తమ పిల్లలు వివిధ వేషాల్లో ఎలా ఉంటారో చూసుకోవాలని ముచ్చట పడుతుంటారు. అలాంటి వాళ్ళు జాతరలో తమ పిల్లలకు వేషాలను వేసి ఆనందిస్తుంటారు.

4.2. బూతులు తిట్టే మనస్తత్వం :- తిరుపతి గంగ జాతరలో ప్రజలు మొదటి మూడు రోజులు వేసే బైరాగి, బండ, తోటి వేషాల్లో బూతు పాటలు పాడుతారు, బూతులు తిడ్తారు. దీనికి అనేక కారణాలను చెప్పొచ్చు.

తిరుపతి గంగమ్మ తన శత్రువైన పాలే గాడిని హతమార్చడం కోసం మూడు రోజుల పాటు వాడిని బూతులు తిడ్తూ కవ్విస్తుంది. అందుకని ప్రజలు

కూడా జాతరలో మొదటి మూడురోజులు బూతులు తిడ్తారు. ఇలా బూతులు తిడ్తే దైవానుగ్రహానికి పాత్రులౌతారని ప్రతీతి. ఇక్కడ ప్రజలకు దైవానుగ్రహం పొందాలనే మనస్తత్వం కొంత ఉంది.

అన్ని ఋతువుల్లోను సంభోగ వాంఛను కలిగిన జీవి మానవుడు. మానవ జీవితంలో శృంగారం ఒక భాగం. స్త్రీ, పురుషులు పరస్పర ఆకర్షణలకు లోనవుతుంటారు. అవకాశం వున్నప్పుడు రమించడం, అవకాశం దొరక్కపోతే మనసులో ఆ భావనల్ని, వాంఛల్ని నింపు కోవడం సహజం " ఒక సంవేదనను ఎంత శక్తితో అణచి వేస్తామో అంతే శక్తితో ఈ అంతర్హిత సంవేదన 'మారు రూపం ' (భీతి, అనియంత్రిత భావం, శారీరక రుగ్మత) లో బహిర్గత మవుతుంది "[1] అలా కోర్కెలను, మనసులోని భావాలను అణచుకోవడం వల్ల అవి రెట్టింపై వెర్రితలలు వేస్తాయని మనోశాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఇలాంటి తీరని వాంఛలను బయటకు చెప్పకోవడం వల్ల మానవులు తమ మానసిక ఒత్తిడులను తగ్గించుకోగలుగుతారు. అలా మానసిక ఒత్తిడులను తగ్గించుకోకపోతే మానసిక రోగాలతో పీడింపబడతారు. దమన(repression) సిద్ధాంతంలో సిగ్మండ్ ఫ్రాయిడ్ - " మనం కొన్ని కొన్ని అభ్యంతరకరమైన అసహ్యాకరమైన దుష్ట ఆలోచనలను అణచి వేస్తాం. ఇలా అణచి వేయడమే ఈ అనర్థాలన్నింటికి మూలం. అణచబడిన ఆలోచనలను 'దాంత' లేదా 'దమిత' స్మృతులు అంటారు. ఈ దాంత ఆలోచనలు అలా ఊరకనే గోళ్ళు గిల్లు కొంటూ కూర్చోవు. అవి బహిర్గతం కావాలని విశ్వ ప్రయత్నం చేస్తాయి. ఎంత ప్రయత్నంతో మనం వాటిని అణచామో అంత శక్తితోను అవి పైకి రావాలని చూస్తాయి. ఆ ప్రయత్నంలో అవి ఈ రోగ లక్షణాల రూపాన్ని దాలుస్తాయి. రోగ లక్షణాలు దాంత స్మృతులు వేరుగావు "[2] బూతు పనుల్లో చాలినంత తృప్తిని పొందలేని వాళ్ళు, బూతులు మాట్లాడి, పాడి, తిట్టి సంతృప్తిని పొందడానికి ప్రయత్నిస్తారు.

అట్టడుగు వర్గాల వాళ్ళు, ఉన్నత వర్గాల వారిని బూతులు తిట్టాలనే తపనను కలిగి ఉంటారు. ఉన్నత వర్గాల వారి అజమాయిషీలకు, దౌర్జన్యాలకు గురై అట్టడుగు వర్గాల వాళ్ళు మానసిక ఒత్తిడికి లోనవుతుంటారు. ఉన్నతవర్గాల వారిని బూతులు తిట్టడానికి అట్టడుగు వర్గాల వారికి ఈ గంగ జాతరలో ప్రజలు అవకాశం కల్పించారు. జాతరలో చిన్నవాళ్ళు పెద్దవాళ్ళను తిట్టినా, యజమానిని కూలివాడు తిట్టినా అది గంగమ్మకు ప్రీతి పాత్రమైందిగా

1 సిగ్మండ్ ఫ్రాయిడ్, అన్నపురెడ్డి వెంకటేశ్వర రెడ్డి; పుట - 46.

2. Ibid ; పుట - 55

భావించుకొని నవ్వుకుంటూ పోతారు. కక్షలు కార్పణ్యాలు ఉన్నవారు కూడా జాతరలో తమ ప్రత్యర్థుల్ని బూతులు తిట్టి తమ కసిని తీర్చుకుంటారు. కొంత మందికి బూతులు మాట్లాడాలనే ఆసక్తి ఉన్నా మాట్లాడితే సమాజంలో చులకనై పోతామన్న భయం ఉంటుంది. అలాంటి వాళ్ళు కూడా ఈ గంగ జాతరలో బూతులు మాట్లాడి, తిట్టి తమ నోటి దురదను తీర్చుకుంటుంటారు. కొందరికి తమ చుట్టుపక్కల కనిపించే అందమైన వాళ్ళను, ఇతర కులాల స్త్రీలను పొందాలనే ఆశ, తపన ఉంటుంది. " మనలో (అచేతనంలో ) అనేక అభ్యంతరకరమైన, జుగుప్సాకరమైన, అవమానకరమైన వాంఛలు ఉంటాయి. యథాతథంగా ఈ విషయాలు చేతనంలోకి ప్రవేశిస్తే మనం భరించలేం" [3] కాబట్టి తమకు సాధ్య పడని ఆ కోర్కెలను బూతుల్ని పాడ్తూ, తిడ్తూ తన్మయత్వం పొందుతారు. దీని వల్ల ప్రజలు తమ మనసుల్లోని వాంఛల ఒత్తిడిని చాలా వరకు తగ్గించు కుంటారు.

పూర్వం మన నాగరికతను పరిశీలిస్తే దేవాలయాల్లో సంభోగ పూజలు జరిగేవని, అనేక చోట్ల ' బూతు ఉత్సవాలు' జరిపించే వారని ఆధారాలున్నాయి. అవి వాస్తవాలన్నట్లు వాటి అవశేషాలు నేటికీ మిగిలే ఉన్నాయి . సంభోగ పూజలతో పాటు, తిట్లను కూడా తిడ్తూ తమ భక్తిని నిరూపించుకునేవారు నాటి మానవులు. ప్రతి చోట గ్రామ దేవతల ఉత్సవాలలో వేషాలవాళ్ళు బూతులు తిడ్తారని, రంకుల రాట్నం అదే నేటి రంగుల రాట్నం దగ్గర మహా ఆవేశంతో స్త్రీ, పురుషులు బూతులు తిట్టేవారని, ఇవి అనాదినుండి వచ్చే ఆచారాలని తాపీ ధర్మారావు తన "దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు ?" అనే గ్రంథంలో చెప్పారు. అలాగే నేడు కూడా ఒరిస్సాలోని పూరి జగన్నాథంలో రథం ఆగిపోయినప్పుడు జనం బండ బూతులు తిడ్తారు. తిట్టని వాడిని పాపాత్ముడుగా చూసేవారు. బూతు తిట్లు కూడా ఒక రకం పూజలుగా భావించేవారు. నాటి ఉత్సవాలు,కర్మకాండలు( RITUALS) బూతులతో నిండి ఉండేవి.

అశ్వమేధం ప్రాచీన రూపాల్ని పరిశీలిస్తే ఎన్నో ఆశ్చర్యకరమైన విష-యాలు తెలుస్తాయి. ప్రాచీనకాలంలో అశ్వమేధం రెండు ముఖ్యలక్షణాలను కలిగిఉంది. అవి (i) సాధారణంగా స్త్రీలు, ప్రత్యేకించి రాణులు అశ్వమేధంలో ప్రముఖమైన పాత్రను వహించేవారు. ఈ సమయంలో రాణులు గుర్రాన్ని బలిచ్చే భవనంలో లేదా చావడిలో తప్పనిసరిగా నివసించేవారు. రాణుల పరిచారికలైన

---

3. సిగ్మండ్ ఫ్రాయిడ్, అన్నప రెడ్డి వెంకటేశ్వర రెడ్డి ; పుట - 103

సమాజంలోని వివిధ తరగతులకు, అంతస్తులకు చెందిన స్త్రీలు ప్రతినిధులుగా ఉండేవారు. గుర్రం సంచారం చేసి బలిచ్చే భవంతికి తిరిగి వచ్చాక రాణులు అన్ని కార్యక్రమాల్ని నిర్వర్తించేవారు. గుర్రాన్ని బలిచ్చాక రాణులు గుర్రం చుట్టూ ప్రదక్షిణం చేసి దుఃఖంతో కర్మక్రియల్ని ఆచరిస్తారు. తర్వాత పట్టపురాణి మరణించిన గుర్రంతో సంభోగిస్తుంది. ఆ సమయంలో రాణులు వయసులో ఉన్న పరిచారికలతో, పూజారులతో కలసి బూతు, తిట్ల సంభాషణలు చేస్తారు. (ii) అలాగే అశ్వమేధంలో ఉచ్ఛరించే మంత్రాలన్నీ కూడా ఋగ్వేదం, తైత్తిరీయ సంహిత, వాజసనేయి సంహితలనుండి గ్రహించబడ్డాయి.

ఇది కర్మకాండ (RITUAL) తర్వాత స్వరూపం. కానీ అశ్వమేధం తొలి రూపాన్ని వాజసనేయి సంహితలోని మంత్రాలలో భాగమైన బూతుల, తిట్ల సంభాషణల నుండి పునర్నిర్మించుకోవచ్చు. ఇవి ప్రాచీన సంప్రదాయంలోని ఒక సంఘటనను వివరిస్తాయి. అశ్వాన్ని బలిచ్చేటప్పటి కర్మకాండ (RITUAL) లోని అనుకరణ అదే.వాజసనేయి సంహిత ఆధారాలను బట్టి, పట్టపు రాణి గుర్రంతో కలయిక అనేది ఒక పాత ఆచారం రూపాంతరమే. అంటే అశ్వానికి బదులుగా ఒక మగవాడు స్పష్టంగా చెప్పాలంటే పూజారి రాణితో సంభోగించేవాడు. ఈ కర్మకాండలో పూజారి రాణితో సంభోగించిన తర్వాత చంపబడేవాడు. రాణి తో పూజారి సంభోగం 'భూమిలో విత్తనాలు నాటడం' గా భావించేవారు.[4] దీనిని బట్టి పూర్వం పవిత్రమైన, స్వచ్ఛమైన సంతానం కోసం బూతు ఆచారాలను పాటించేవారని తెలుస్తోంది. ఆ సమయంలో బూతులు, తిట్లు

---

[4] " From the accounts given in the Śrautasūtras at least two significant features of the Aśvamedha may be derived at a glance: (i) Women in general, and Queens in particular, had to play a very important part in the function. It was compulsory for the queens to stay in the sacrificial hall. Their attendants respresented women of different classes coming from different strata of society. On the horse's return to the sacrificial ground, the queens had to conduct everything. When the horse was killed they had to go around it and observe ceremonial mourning. Finaly the chief queen had to unite with the dead horse. They had to enter, along with their young female attendants, into an 'obscence abusive dialogue' with the priests. (ii) The mantras recited in connection with the Aśvamedha were all quoted from the Rgveda, the Taittirīya Saṃhitā and the Vājasaneyī Saṃhitā.

This is a subsequent of the ceremonial, but the original form may easily be reconstructed from the mantras uttered in connection with it, especially from the so-called 'obscene abusive dialogue'

సంభాషించేవారని, అవి వేద మంత్రాల్లో సైతం ఒక భాగంగా ఉన్నాయని తెలుస్తోంది. అంటే ప్రాచీన కాలంలో బూతులను, తిట్లను వేద మంత్రాలతో సమానంగా గౌరవించేవారని మనం భావించవచ్చు.

శ్రీనాథుని శృంగార నైషధంలో కూడా అశ్వమేధం వర్ణించబడి ఉంది. అశ్వమేధ యాగంలో యజమాని (యజ్ఞకర్త) భార్య అశ్వంతో సంభోగించే ఆచారం ఉన్నట్లు చెప్పబడింది. ఇలా తరతరాలుగా వచ్చే అశ్వమేధ యాగ కర్మకాండ (RITUAL) ను కలిపురుషుడు పరిహసించినట్లుగా పేర్కొనబడి ఉంది. ఈ కింది పద్యాన్ని పరిశీలించండి --

"యజమాన ప్రమదా వికస్వర భగ న్యస్తాశ్వ దీర్ఘ స్మర

ధ్వజ దండం బగు నశ్వమేధ మఖ తంత్రంబున్నిరీక్షించి యి

క్కుజనుం డొత్తిలి నవ్వె వేద విదులం గుత్సించి పుష్పాస్త్రు చే

నిజ హస్తంబున వ్రేసి యుశ్రుకణముల్ నిండార నేత్రంబులన్" [5]

కాబట్టి సమాజంలో నాగరికత అభివృద్ధి చెందే కొద్దీ అవన్నీ మనకు అసహ్యంగా గోచరించ వచ్చు. సమాజం ఎంత అభివృద్ధి చెందినా ఆనాటి ఆచారాలు ఎక్కడో ఒక చోట, ఏదో ఒక రూపంలో మనకు కనిపిస్తూనే ఉంటాయి.

4.3. మొక్కుబళ్ళ మనస్తత్వం :- ప్రజలు తమకు మేలు జరగాలని వివిధ విషయాల మీద మొక్కుకునే మనస్తత్వాన్ని కలిగి ఉన్నారు. సకాలంలో వర్షాలు

---

( Vāj.Sam.,XXII - XXIII) forming part of the mantras. They narrate an event of the earlier tradition, the original rite itself, which was subsequently mimed in the horse sacrifice. From the evidence furnished by the Vājasaneyi saṃhitā, it becomes clear that the union of the principal queen with the dead horse is a relic, or rather a transformation, of an older ritual, in which a man, evidently a priest, had to play the part of the horse and, after his ceremonial intercourse with the queen, he was probably put to death. This sexual intercourse between the priest and the queen is significantly brought in relation to the act of sowing in the field:"

- THE INDIAN MOTHER GODDESS; NARENDRA NATH BHATTACHARYYA, Page- 281.

5. శృంగార నైషధము; శ్రీనాథుడు, ఆశ్వాసం - 7, పద్యం -133.

బాగా పడాలని, పంటలు బాగా పండాలని, తాము అనుకొన్నవి జరగాలని, పెద్దమ్మ వారు, కలరా, పశువ్యాధులు, కరువు, కాటకాల నుండి రక్షణ పొందడానికి ప్రజలు గంగమ్మకు మొక్కుకుంటుంటారు. అనుకున్న పనులు నెరవేరితే అమ్మవారికి వేషాలు వేయడం, నెత్తిన చప్పరాలు పెట్టుకొని, వాటి వెదురు దబ్బలను నడుముకు కుట్టుకోవడం, తలస్నానం చేసి తడి బట్టలతో 'అడుగడుకు దండాలు' బెట్టి అంగప్రదక్షిణం చేయడం, బలులు సమర్పించడం, స్త్రీలు వేప చీరలు ధరించి గుడిచుట్టూ తిరగడం, పొంగళ్ళు పెట్టడం వంటి మొక్కుబళ్ళను ప్రజలు జాతర సమయంలో తీర్చుకుంటారు. ఇలా ప్రజలు తమ కోర్కెలు ఈడేరాలని గంగమ్మకు మొక్కుకునే మనస్తత్వాన్ని కలిగి ఉన్నారు.

**4.4.** బలులు ఇచ్చే మనస్తత్వం : - దున్న పోతులు, మేకపోతులు, కోళ్ళు వంటి వాటిని గంగమ్మకు బలిగా ప్రజలు సమర్పిస్తారు. మొక్కుకోక పోయినా కూడా గంగమ్మను సంతోష పెట్టడానికని బలులిస్తారు. గంగమ్మకు రక్తం చిందిస్తే తృప్తి పొందుతుందని, ఆగ్రహోదగ్రురాలైన ఆమె శాంతిస్తుందని ప్రజల మనోభావం.

బలులిచ్చే మనస్తత్వం మానవునికి ఆత్మారాధన (ANIMISM) దశ-నుండే ప్రారంభమైంది. చనిపోయిన వారి ఆత్మ పరిసర ప్రాంతాలను ఆవహించే ఉంటుందని, ఆత్మలకు కూడా బతికున్నవారికుండే అవసరాలుంటాయని, అవి తీరక పోతే ఆగ్రహంతో తమవారికి ఆపదలు కలుగజేస్తాయని మనమిదివరకే తెలుసుకొని ఉన్నాం. కాబట్టి ఆత్మలను ప్రసన్నం చేసుకోవడానికి వాటికి కావ-లసినవి సమకూర్చేవారు. బతికున్నప్పుడు ఆహారంతో పాటు సేవకులుండేవారు. అందుకని ఆత్మలకు సేవ చేయడానికి , వాటికి తోడుగా ఉండడానికి మరో ఆత్మ అవసరమని నాటి ప్రాచీన మానవులు భావించి, నరబలిచ్చి పైనున్న ఆత్మకు తోడు పంపేవాళ్ళు. ఈజిప్టులో మరణించిన రాజుతో పాటు అతని భార్యలను, మందీమార్బలం, సేవకులను కూడా నిర్దాక్షిణ్యంగా పిరమిడ్‌లలో సజీవ సమాధి చేసేవారు. (మన దేశంలో సతీసహగమనం కూడా ఇలాంటిదేనని చెప్పొచ్చు.) ఇలా ఆత్మారాధన పద్ధతుల్లో నరబలులుండేవి. క్రమంగా ఆరాధన పద్ధతులు మారాయి. అయినా బలులు మాత్రం ఆగలేదు. పూర్వం శ్రీశైలంలో శివసాయుజ్యం కోసం 'కొండకొమ్ము' పైనుండి దూకి భక్తులు ఆత్మార్పణం చేసుకునే వారు. ఆత్మనివేదన వల్ల దైవానుగ్రహం పొందుతారని మన ప్రాచీ-నులు నమ్మేవారు. హిందూ మతంలో నవవిధ భక్తి మార్గాల్లో ఆత్మనివేదనం ఒకటి. శరీరంలోని వివిధ అంగాలను - ఒక చేతినో,కాలినో, కన్నునో - దైవానికి సమర్పించే వాళ్ళు. ఇప్పుడు కూడా భక్తులు తమ అవయవాలకు ఏవైనా

జబ్బులొస్తే గంగమ్మకు మొక్కుకుంటారు. తర్వాత ఆ అవయవం (కన్నో, చెయ్యో, కాలో) వెండి బొమ్మలను గంగమ్మకు సమర్పిస్తుంటారు. తిరుమల శ్రీవారికి కూడా భక్తులు ఇలాగే బంగారు, వెండి అవయవాలను ఎన్నో వందల సంవత్సరాలనుండి సమర్పిస్తున్నట్లు ఆధారాలున్నాయి." A man who is lame presents a silver leg ; if blind,a gold or silver eye ; in fact, there are innumerable ways in which Hindoo superstition develops itself upon this occasion " [6] అని క్రీ.శ. 1855 లో తిరుపతి విశేషాల్లో ప్రస్తావించబడి ఉంది.

కొంత కాలానికి ఆత్మనివేదనానికి బదులుగా మరొకరిని బలిచ్చేవారు. మన పురాణాల్లో కూడా నరబలి కనిపిస్తోంది. రాజులు తమ కోరికలు నెరవేరడానికి, దైవానుగ్రహం పొందడానికి, యాగఫలాలకు నరబలులిచ్చేవారు. అలాగే గ్రీకు, పాలినేషియా, ఆఫ్రికా, జపాను, ఫిజి దేశాలలో నరబలులుండేవి. ఖురాన్‌లో కూడా నరబలి ప్రసక్తి ఉంది. బాబిలోనియాలో మనిషికి (అంటే తన ప్రాణానికి) బదులు గొర్రెను సమర్పిస్తున్నట్లు మంత్రం జపించి బలివ్వడం ఉంది. అలాగే క్రైస్తవ మతంలో ఒకదానికి బదులు, మరొక దానిని అర్పించే సంప్రదాయం కన్పిస్తుంది.

కాబట్టి మానవుని మనస్తత్వాన్ని బట్టి బలులలో మార్పులొచ్చాయి. దైవానుగ్రహం కోసం తనను తాను అర్పించుకునేవాడు. తర్వాత తనకు బదులుగా మరొకర్ని బలిచ్చేవారు. ఆ తర్వాత మనిషికి బదులుగా జంతువులను బలివ్వడం ప్రారంభించారు. మొదట దున్న పోతుల్ని బలిచ్చేవారు. కొంతకాలానికి మేక పోతుల్ని, కోళ్ళను బలిచ్చేవారు. జంతుబలిని కూడా నిషేధించే సరికి ప్రస్తుతం గుమ్మడి కాయల్ని, నిమ్మకాయల్ని బలిగా సమర్పిస్తున్నారు. కాని జంతు బలుల విషయంలో మానవుని మనస్తత్వం మారలేదు. నాగరికత ఇంతగా అభివృద్ధి చెందిన నేటి రోజుల్లో కూడా నరబలులివ్వడం ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది[7].

---

6. A GAZETEER OF SOUTHERN INDIA; by Pharoah & Co., Page- 272.

7. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రసరిహద్దులోని వెంకటాపురం మండలం 'పాము-నూరు ' గిరిజన కుగ్రామానికి సమీపంలో ఉండే మధ్యప్రదేశ్ రాష్ట్రానికి చెందిన బస్తర్ జిల్లా బిజాపురం రెవెన్యూ డివిజన్లో మారుమూల అటవీ ప్రాంతంలో 'గొత్తికోయలు ' అనే తెగవారు వ్యవసాయంలో విత్తు పండుగప్పుడు, పంటల నూర్పిడి సమయంలోను తమ ఇష్టదేవతైన 'మావిలి' కి నరబలులిస్తుంటారు.

4.5. పూజలు చేసే మనస్తత్వం :- తిరుపతి గంగమ్మకు ప్రజలు వివిధ రకాలైన పూజలు చేస్తారు. ఈ పూజలు మొక్కుబళ్ళు, బలుల రూపం లోనే కాకుండా, చీర, రవికలను పెట్టి, పసుపు కుంకుమలు, గాజులు, పూలు వంటి వాటితో స్త్రీలు గంగమ్మను పూజిస్తారు. దీనివల్ల స్త్రీలు తామెప్పుడూ ముత్తైదువులుగా ఉండాలనుకునే మనస్తత్వం కనిపిస్తోంది. అలాగే స్త్రీలు 'వెయ్యి కళ్ళ దుత్త ' (వెయ్యి రంధ్రాలున్న దుత్త) లో దీపం వెలిగించుకొని వెళ్ళి గంగమ్మ గుడి దగ్గర పగులకొడ్తారు. అంటే గంగమ్మ వెయ్యి కళ్ళు కలిగిన దేవతని, తమ కుటుంబాన్ని వెయ్యి కళ్ళతో కాపాడాలనే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు. గంగ జాతరలో చివరిరోజు గంగమ్మ బొమ్మను బంక మట్టితో పెద్దదిగా తయారు చేసి పూజలు చేసి చెంపను నరుకుతారు. అంటే గంగమ్మను వారం రోజుల పాటు వివిధరకాలుగా కొలిచి, ఆమెను సంతోష పరచి సాగనంపడం తెలుస్తోంది. కాబట్టి మశూచి, కలరా, పశువ్యాధులు వంటివి రాకుండా ఉండాలంటే వాటిని కలగజేసే అమ్మవారిని శాంతింపజేసి సాగనంపే ప్రజల మనస్తత్వం తెలుస్తోంది. విఘ్నాలను కలుగజేసే వినాయకుడిని కూడా పూజలు చేసి నిమజ్జనం చేయడాన్ని ఇక్కడ గుర్తుంచుకోవాలి.

4.6. నమ్మకాల మనస్తత్వం :- జాతర చివరి రోజు గంగమ్మ బొమ్మను చేసిన తర్వాత చివరలో కళ్ళు పెడ్తారు. అంటే గంగమ్మకు ప్రాణం వచ్చినట్లు భావిస్తారు. గంగమ్మ బొమ్మకు అడ్డుగా ఉండే తెరను తొలగించేటప్పుడు ఎదురుగా కుంభం పోసి ఉంటారు. ఆ సమయంలో గంగమ్మ బొమ్మకు ఎవరూ ఎదురుగా నిలబడరు. అలా నిలబడితే వాళ్ళు ఏదో ఒక రకంగా బలైపోతారనే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు.

---

గొత్తి కోయలు, వెదురు, అటవీ ఉత్పత్తులను సేకరించడానికి అడవుల్లోకి వచ్చే గిరిజనులను బంధిస్తారు. వీరు అంగవైకల్యం లేని యువతీ, యువకుల్ని, బాల బాలికల్ని బలిస్తుంటారు. ఇలా 1982 నుండి 1991 జూన్ వరకు నరబలులు జరిగినట్లు బలైన వారి కుటుంబాల నుండి పోలీసులకు ఫిర్యాదులందాయి. వీరు ఇతర సమయాల్లో కూడా ఎవరైనా ఎదురైతే కూడా బలిచ్చేస్తుంటారు.

ఇటీవల తిరుపతి కొండలకు సమీపంలో ఉండే కోడూరు ప్రాంతంలోని అడవిలో పశువుల మేపే ఒకబాలుడ్ని పట్టి 'నిధి' కోసం బలిచ్చారు. ఆ బాలుడి శరీరాంగాల్ని పుట్టపై చెక్కి, పేగుల్ని పుట్టకు చుట్టి అతి దారుణంగా పూజించినట్లు దినపత్రికల్లో ఫోటోలతో సహా ప్రచురించబడి ప్రజల్లో తీవ్రసంచలనాన్ని సృష్టించింది.

మట్టి బొమ్మతో చేసిన గంగమ్మ చెంపను నరికిన తర్వాత ఆ గంగమ్మ మట్టిని పొలాల్లో వేస్తే పంటలు బాగా పండుతాయని, ఇంట్లోని దొంతుల్లో ఉంచితే ధాన్యం తరగదని, ఇంట్లో ఉంచుకొంటే శుభం జరుగుతుందని, అనారోగ్యంగా ఉన్నప్పుడు ఆమట్టిని కాస్త చప్పరిస్తే రోగాలు నివారణ అవుతాయనే ప్రజల మనస్తత్వం ద్యోతకమౌతోంది.

అలాగే కైకల వాళ్ళు వేసే సున్నపుకుండలు ఊరంతా తిరిగి పూజలందుకున్నాక, వేషాన్ని విప్పేసేటప్పుడు సున్నపు కుండల్ని పగుల గొడ్తారని మనకు తెలిసిందే. ఆ సున్నపుకుండల పెంకుల కోసం ప్రజలు ఎగబడి ఇళ్ళకు తీసుకొని వెళ్ళి పెట్టెల్లో, బీరువాల్లో దాచి పెడ్తారు. ఎందుకంటే ఎందరో ఆ సున్నపు కుండల్లో ధనాన్ని వేస్తారు కాబట్టి సున్నపు కుండల్ని ధనలక్ష్మి గా భావిస్తారు. ఆ కుండ పెంకుల్ని పెట్టెల్లో, బీరువాల్లో దాచడం వల్ల ఇంట్లో ధనానికి కొరత ఉండదని విశ్వసించే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు. అలాగే వెయ్యికళ్ళ దుత్త పెంకును కూడా గంగమ్మ గుడి వద్ద నుండి ఇంటికి తీసుకొని వెళ్తారు. చిన్న పిల్లలకు జ్వరాలు, వాంతులు, విరోచనాలు వంటివి వస్తే పెంకును సాది నాలుకపై పూస్తే వెంటనే తగ్గిపోతాయనే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు.

ప్రజలు గంగమ్మను పూజించేటప్పుడు మైల తగలకుండా శుచిగా ఉంటారు. ఇంటికి దూరమైన ( ఋతుస్రావమైన) స్త్రీలు గంగమ్మ పూజల్లో పాల్గొనరు. పూజలకు వెళ్ళేవారిని తాకరు. ఎంతో నియమ నిష్టలతో గంగమ్మను పూజిస్తారు. 'మైలు' తగిలితే గంగమ్మ ఆగ్రహించి తమకు కష్టాలను, నష్టాలను కలుగజేస్తుందనే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు.

జాతరలో తోటివేషం రోజు గంగమ్మ వేషధారి భక్తులను చేటతో కొట్టడం మనకు తెలిసిందే. అలా చేటతో కొట్టించుకోవడం వల్ల బిడ్డలకు పళ్ళు కొరకడం పోతుందని, విరోచనాలు వంటివి రావని, గాలి, ధూళి పీడిస్తున్నా దూరమౌతాయని, ఒళ్ళు బాగా లేకపోతే బాగవుతుందనే మనస్తత్వం ప్రజలకుంది.

అలాగే గంగజాతర జరిపిస్తే పంటలు బాగా పండుతాయని, వానలు బాగా కురుస్తాయని, చెరువుకట్టలు తెగిపోకుండా ఉంటాయని, ఊరు సురక్షితంగా ఉంటుందని ప్రజల విశ్వాసం.

4.7. నైవేద్యం పెట్టే మనస్తత్వం :- గంగమ్మకు అంబళ్ళు, పొంగళ్ళు, మాంసాహార తళిగెలు, మద్యపానాలను (సారా, కల్లును) నైవేద్యంగా పెడ్తారు.

గంగమ్మ ఆగ్రహించకుండా ఉండాలంటే ఆమెను శాంత పరచాలి, అంటే చల్లబరుస్తూ ఉండాలి. అంబలి చలువ చేసే వంటకం కాబట్టి అంబళ్ళను గంగమ్మకు నైవేద్యంగా పెట్టి ప్రజలు తాగుతుంటారు. ఎండాకాలంలో (జాతర సమయంలో) చలువ చేసే అంబలి తాగడం వల్ల ప్రజలు వేడి తాపం నుంచి ఉపశమనం పొందుతారు. అలాగే గంగమ్మ కూడా అంబలి వల్ల తమలాగే ఉపశమనం పొందుతుందనే మనస్తత్వాన్ని కలిగి ఉన్నారు. తమ జీవితం మధురంగా ఉండాలనే మనస్తత్వంతో బెల్లంతో చేసిన తీపి పొంగళ్ళను వండి గంగమ్మకు నైవేద్యంగా ప్రజలు పెడ్తారు. అలాగే గంగమ్మ గుడి ముందు తళిగెలలో అన్నంతోపాటు, వండిన మాంసం, కరవాడు (ఎండుచేప) పులుసు, కోడిగుడ్లు పెట్టడం చూస్తుంటే, తమకు జీవితంలో ఇలాంటి ఆహారానికి కొదవ లేకుండా చూడమని, 'ఇలాంటి ఆహారం మాకు లభింపజేస్తున్నందుకు కృతజ్ఞతగా నీకు అర్పిస్తున్నామ'నే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు. దీనిని బట్టి ప్రజలకు మాంసాహారంపై ఉండే మక్కువ తెలుస్తోంది.

ఇక మద్యపానాలను అంటే సారా, కల్లును గంగమ్మకు నైవేద్యంగా పెట్టడంలో ప్రజల మనస్తత్వం ఏమిటో పరిశీలిద్దాం-

వేద కాలం నుండి సురాపానం ఉన్నట్లు తెలుస్తోంది. 'సుర' తాగి-నందువల్ల సురలు (దేవతలు) అయినారు. తమను ఊహా లోకాల్లోకి మద్యం తీసుకుపోవడం వల్ల, దీనిలో అద్భుతమైన శక్తి ఏదో దాగి ఉందని భావించి దానిని గ్రామ దేవతలకు నైవేద్యంగా ప్రజలు పెడుతున్నారు. పైగా తమకిష్టమైన మద్యాన్ని, గ్రామ దేవతల ప్రీతి కోసం ఉంచడం వల్ల, ఆ దేవతలు సంతోషించి తమపై అనుగ్రహం చూపుతారనే మనస్తత్వాన్ని కూడా ప్రజలు కలిగి ఉన్నారు. జాతరల్లో, వివిధ ఉత్సవాల్లో గ్రామ దేవతలకు కల్లు, సారాను నైవేద్యంగా సమర్పించడం నేటికీ ఉంది. తిరుపతి గంగజాతరలో గుడి తరపున ఆనువంశికంగా వేషాలు వేసే వారిలో కొందరు, వివిధ వేషాలను వేసే సామాన్య జనులు, చప్పరాలు కుట్టుకునేవారు, పలకల వాద్యగాళ్ళు చాలావరకు మద్యపానం చేసి చిందులు తొక్కుతారు. చాలా మంది మద్యపానం చేస్తేనే జాతర బాగా జరుగుతున్నట్లు భావిస్తారు. తెలంగాణాలో బొడ్డెమ్మ పండుగ, బ్రతుకమ్మ పండుగల్లో కూడా గ్రామ దేవతలకు మద్యాన్ని సమర్పించడమే కాకుండా, కుటుంబ సభ్యులందరూ కలసి మద్యపానం చేయడం కొంతమందికి ఆశ్చర్యం కలగొచ్చు. అలాగే జాతరల్లో దేవతకు బలిచ్చే జంతువుపై కూడా మద్యాన్ని పోస్తారు. తాంత్రికులు కూడా మద్యపానం చేశాకే మంత్రోచ్చారణ చేస్తారు. ఓరాన్స్, బైగా తెగలవారు

వ్యవసాయం ప్రారంభించే ముందు భూమిపైన మద్యాన్ని పోస్తారు. ఆటవిక తెగలైన చెంచులు, గోండులు, ఇప్పపూల నుండి చేసిన 'ఇప్పసారా' ను వివిధ ఉత్సవాల్లో, కర్మక్రియల్లో సేవిస్తారు. కొన్ని ఆటవిక తెగలవారు మద్యం వల్ల జబ్బులు నయమౌతాయని విశ్వసిస్తారు. పూర్వకాలంలో మద్యం వల్ల భూమి ఫలవంతమౌతుందని, మద్యానికి సఫలత (Fertility) గుణం ఉందని భావించే వారని తెలుస్తోంది. మన దేశంలోనే కాకుండా వివిధ దేశాల్లో కూడా ప్రజలు మద్యాన్ని అనేక సందర్భాలలో సేవిస్తున్నారు. రష్యా, చైనా, జపాన్, కొరియా, బెంగాల్, బ్రెజిల్, స్కాండినేవియా, ఐరోపా ఖండంలోని అనేక దేశాల్లో పెళ్ళి సందర్భంలో వధూవరులు మద్యాన్ని (wine) సేవించే ఆచారం ఉంది. అలాగే బంగ్లాదేశ్‌లో ఎవరైనా చనిపోతే, ఆ కుటుంబీకులు మూడురోజుల పాటు మద్యాన్ని సేవించి, నృత్యం చేసే ఆచారం ఉంది. మన పల్లెల్లో కూడా ఎవరైనా మరణించినపుడు, పుట్టినప్పుడు మద్యాన్ని సేవించడం మనకు తెలిసిందే. ఇలా మద్యాన్ని ప్రత్యేక సందర్భాలలో సేవించడమే కాకుండా తిరుపతి గంగజాతర సమయంలో కొందరు ప్రజలు మద్యాన్ని గంగమ్మకు తలిగెల దగ్గర, నట్టింటిలో మొక్కేటప్పుడు నైవేద్యంగా పెట్టి, దానిని గంగమ్మ పవిత్రపానంగా భావించి సేవించే మనస్తత్వాన్ని కలిగి ఉన్నారు.

4.8. పూనకాల మనస్తత్వం:- తిరుపతి గంగజాతర్లో చివరిరోజు బంకమట్టితో గంగమ్మ బొమ్మను తయారు చేసి, దానికి కళ్ళు పెట్టి ప్రాణ ప్రతిష్ట చేస్తూనే గుమ్మడి కాయలు కొట్టి హారతిచ్చే సంగతి మనకు తెలిసిందే. ఆ సమయంలో కొందరు భక్తులకు పూనకాలొచ్చి వూగి పోతుంటారు. అప్పుడు గంగమ్మ బొమ్మకు కర్పూరంతో హారతిచ్చి పూనకం వచ్చిన వ్యక్తి చేతిలో వెలుగుతున్న కర్పూరాన్ని పెడ్తారు. ఆ వ్యక్తి వెలిగే కర్పూరాన్ని నోట్లో వేసుకొని మింగి శాంతిస్తాడు. పూనకాలు ఎక్కువగా స్త్రీలకే వస్తుంటాయి.[8] ఆ విధంగా గంగమ్మ బొమ్మకు ప్రాణప్రతిష్ట జరిగిన వెంటనే నిజమైన భక్తులను ఆవహిస్తుందనే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు.

4.9. గంగమ్మంటే భయ భక్తులుండే మనస్తత్వం :- గంగజాతర వచ్చిందంటే స్థానిక ప్రజలు ఎంతో భయభక్తుల్ని కలిగి ఉంటారు. గంగజాతర చాటిస్తే స్థానికులు ఊరు వదలి వెళ్ళరు. వెళ్ళినా వెంటనే వచ్చేస్తారు. చాటిస్తే జాతరయ్యేంత వరకు స్థానిక ప్రజలు పెళ్ళిళ్ళు చేయరు. అంటే గంగజాతరలో

---

[8] స్త్రీలకు పూనకాలు అధికంగా రావడానికి హిస్టీరియా కారణమని, హిస్టీరియా స్త్రీలలో అధికమని మనస్తత్వ శాస్త్ర వేత్తలంటారు.

గంగమ్మ వేడుకలప్పు మరోవేడుక జరుగ కూడదనే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు. తిరుపతి గంగజాతరలో వేషాలు వేసి బూతులు తిట్టకపోతే గంగమ్మకు ఆగ్రహం వస్తుందని భయపడే మనస్తత్వాన్ని కలిగి ఉన్నారు. తిట్లు తిన్న వారు కూడా ఏమీ పట్టించుకోరు. తిట్టేవారిని అడ్డుకుంటే తమకు గంగమ్మ కీడు చేస్తుందేమో ననే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు. అలాగే మొక్కుబళ్ళను ఎగ్గొట్టకుండా, వాయిదా వేయకుండా భయభక్తుల్తో మొక్కు-బళ్ళు తీర్చుకుంటారు. బలులు నిషేధించినా గంగమ్మకు ఇష్టమని భావించి బలులిస్తారు. పోలీసులు, అధికారులు వారిస్తున్నా, వారిని ఖాతరు చేయకుండా భయభక్తుల్తో గంగమ్మకు బలులిచ్చే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉన్నారు.

స్త్రీలు అర్ధరాత్రిపూట, వేకువ జామున వేప చీరలు అంటే దారంతో కట్టిన వేప మండల్ని మోకాలు నుంచి వక్షస్థలం వరకు చుట్టుకొని గంగమ్మగుడి చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణం చేస్తారు. ఆ సమయంలో గుడి చుట్టూ ఎందరో మగవాళ్ళు ఉంటారు. అయినా వయసులో ఉన్న స్త్రీలు సిగ్గు, బిడియం లేకుండా గంగమ్మగుడి చుట్టూ తిరిగి వేప చీరను గుడిదగ్గరే వదలి, అక్కడే మామూలు చీర, రవికలను తొడుక్కొని వెళ్తారు. ఇలా స్త్రీలు ఏమాత్రం సంకోచం లేకుండా, ఎవరు చూసినా, ఏమనుకున్నా గంగమ్మ మీద ఎంతో భయ భక్తులతో మొక్కు తీర్చుకునే మనస్తత్వాన్ని కలిగి ఉన్నారు. అలాగే మగవాళ్ళు కూడా వేప చీరల్తో వెళ్ళే వారిని దురుద్దేశంతో చూడ్డానికి భయపడ్తారు. అలాచూస్తే గంగమ్మ తమకెక్కడ కీడు చేస్తుందోననే మనస్తత్వాన్ని కలిగి ఉన్నారు.

4.10. ఇతరులను ఆదరించే మనస్తత్వం :- గంగజాతర వచ్చిందంటే స్థానికులు తమ దగ్గర బంధువుల్ని, స్నేహితుల్ని ఆహ్వానిస్తారు. విందులు, వినోదాలతో అందరు కలసి మెలసి గడపడానికి గంగజాతర ఒక చక్కని అవకాశంగా ప్రజలకు కలిగింది. ఇలా గంగజాతరలో పదిమందిని ఆదరించే మనస్తత్వాన్ని ప్రజలు కలిగి ఉండడాన్ని మనం గమనించవచ్చు. అలాగే దూర ప్రాంతాల నుండి జాతరను చూడవచ్చే ముక్కు, మొహం తెలియని జనానికి కూడా అంబళ్ళు పోసి ఆకలి దప్పులను తీరుస్తుంటారు. ఇలా మానవత్వంతో పొరుగువారిని ఆదరించే విశాల మనస్తత్వాన్ని కూడా మనం చూడొచ్చు.

4.11. కులం పట్టింపులు లేని మనస్తత్వం :- తిరుపతి గంగజాతరను కులాల పట్టింపు లేకుండా అన్ని కులాల వారు కలసి జరుపుతారు. అగ్రకులాలైన రెడ్లు, వెనుకబడిన కులాలైన కైకల, కంసాలి, చాకలి, మంగలి, కుమ్మరి, గొల్ల, హరిజనులు, పంబల వాళ్ళు వంటి కులాల వాళ్ళు కలసి గంగజాతరను

దిగ్విజయంగా నిర్వహిస్తారు. మిగిలిన కులాల వారు జాతరను జరుపుకుంటారు. జాతర వివిధ దశల్లో, వివిధ కులాల జోక్యం ఉంటుంది. అన్ని కులాలకు ప్రాతినిధ్యం ఉంటుంది. అలాగే తమిళ, కన్నడ ప్రాంతాల ప్రజలు కూడా హాజరవుతారు. ప్రజల్లో కుల, భాషా పట్టింపులు లేని మనస్తత్వాన్ని మనం చూడొచ్చు. తిరుపతి గంగజాతర "జాతి సమైక్యతకు" చక్కని నిదర్శనం.

ఇలా తిరుపతి గంగజాతరలో ప్రజల మనస్తత్వాన్ని మనం పరిశీలించ వచ్చు.



# 5. చిత్తూరు జిల్లాలో ప్రముఖ గంగ జాతరలు

చిత్తూరు జిల్లాలో గంగమ్మ ఉన్న ఊర్లు, గంగమ్మకున్న పేర్లు, జాతరలు జరిగే విధానాలు వంటి విషయాలను మనమిది వరకే తెలుసుకొని ఉన్నాం. అలాగే ప్రత్యేకించి జిల్లాలోని కొన్ని ప్రాంతాల్లో జరిగే గంగజాతర విశేషా-లను, పూజా విధానాలను ఆరాధనా పద్ధతులను కొంత వరకు తెలుసుకోవడం సమంజసం.

## 5.1. చిత్తూరు గంగ జాతర

జిల్లా కేంద్రమైన చిత్తూరు పట్టణంలో గంగజాతర ఎంతో వైవిధ్యంతో జరుగుతుంది. ప్రతి ఏడాది మంగళవారం జాతర ప్రారంభమై బుధవారం సాయంత్రంతో ముగుస్తుంది. చిత్తూరు పట్టణంలో గంగజాతర బజారు వీధిలో ప్రధానంగా జరిగినా, పట్టణంలో అనేక చోట్ల గంగమ్మ ప్రతిమలను ప్రతిష్ఠించి జాతరను జరిపించడం ఇక్కడ విశేషంగా చెప్పవచ్చు. ఈ గంగ జాతరలో కూడా పురప్రజలు వివిధ వేషాలను వేసుకొని గంగమ్మను దర్శించి వస్తారు. బజారు వీధిలో తీర్చిన గంగమ్మ ప్రతిమను దాదాపు 30 వేల మంది దర్శిస్తారని అంచనా. పట్టణంలో గ్రీమ్స్ పేట, సంతపేట, దొడ్డిపల్లి, మురకంబట్టు, కొంగారెడ్డి పల్లి, సాంబయ్య కండ్రిగ, ఓబనపల్లి ప్రాంతాల్లో గంగమ్మ బొమ్మను తీరుస్తారు. చిత్తూరు గంగ జాతరలో పిల్లలు, మహిళలు శూలాలను నాలుకలపైన, దవడల్లోను గుచ్చుకొని పురవీధుల్లో ప్రదర్శిస్తుంటారు. అలాగే ఓం శక్తి భక్తుల ప్రదర్శన ఉంటుంది. కొందరు భక్తులు ఇనుప కొక్కీలను వీపులోను, తొడల వెనుక భాగంలోని చర్మానికి గుచ్చుకొని ధృడమైన తాడుతో వాటిని గట్టిగా ముడివేసి పెద్ద కొయ్యకు వేలాడదీసుకొని గంగమ్మను ఆరాధించి తమ మొక్కులను తీర్చుకుంటారు. కొక్కీల బాధను భరించి ఇలా ఎంతో ఎత్తుపై నుంచి వేలాడుతూ మొక్కులు తీర్చుకోవడం చెప్పుకోదగ్గ విషయం. చిత్తూరుజిల్లాలోనే నగరి సమీపంలోని 'సత్రవాడ' లో కూడా అంకాళ పరమేశ్వరి ఉత్సవాల్లో ఇలా ఇనుప గొలుసులకు అమర్చిన కొక్కీలను శరీర అవయవాలకు గుచ్చుకొని ఎంతో ఎత్తునుంచి వేలాడుతూ హారతులివ్వడం గమనార్హం. ఇలా ఇనుప కొక్కీలను శరీరానికి గుచ్చుకొని పైనుంచి వేలాడడం వందల సంవత్సరాల నుండి ఆచారంగా ఉన్నట్లు తెలుస్తోంది. 14 వ శతాబ్దానికి చెందిన 'క్రీడాభిరామం' గ్రంథంలో మైలార వీర భటులను వర్ణించే పద్యంలో





చిత్తూరు గంగ జాతరలో గాలపు కొక్కికి వేలాడుతున్న భక్తుడు,

తిలకిస్తున్న జనం

గాలంపు కొంకికి కంకాళ చర్మాన్ని గుచ్చి నడి వీధుల్లో ఉయ్యాలను ఊగినట్లు వర్ణించబడి ఉంది. కింద పద్యాన్ని గమనించండి-

"అవ అవ మందు నెఱ్ఱని చంద్ర మల్లెల

చోద్యంపు గుండాలు చొచ్చువారు

కరవాఁడి యలుఁగుల గనప పొఁతర్లలో

నుట్టి చేరులు గోసి యుఱుకు వారు

గాలంపుఁగొంకిఁగంకాళ చర్మము గ్రుచ్చి

యుడు వీధి నుయ్యెల లూఁగువారు

కటికి హొన్నాళంబు గండ కత్తెర పట్టి

మిసి మింతులును గాక మ్రింగు వారు

సందులను నారసంబులు సలుపువారు

యెడమ కుడి చేత నారతులిచ్చువారు

సాహసము మూర్తి గైకొన్న సరణివారు

ధీర హృదయులు మైలార వీర భటులు"[1]

ఇదే విధంగా తెనాలి రామకృష్ణుడు రచించిన 'పాండురంగ మాహాత్మ్యం' లో గాలి గంగల జాతర సమయంలో ఒక స్త్రీ మేఘాల్లో తేలాడే విధంగా సిడి [2] మాను నుండి వేలాడినట్లు పేర్కొనబడి ఉంది. దీనిని బట్టి పూర్వం మహిళలు కూడా గంగ జాతరల్లో ఇనుప కొక్కిలను చర్మానికి కుట్టుకొని సిడి మానులపై వేలాడినట్లు తెలుస్తోంది. కింది పద్యాన్ని చూడండి-

"అంభోదరము కింద నసియాడు నైరా వ

తియుఁబోలె సిడి వ్రేలెఁదెఱవ యొర్తు

---

1. క్రీడాభిరామము, వినుకొండ వల్లభరాయడు (శ్రీనాథుడు) పరిష్కర్త వేటూరి ప్రభాకరశాస్త్రి; ప - 142.

2. " సిడి = సిడుల జాతరకు నాటిన స్తంభము మీది యడ్డు మాను ఇది గంప సిడి, గాలపు సిడి అని ద్వివిధము "(శబ్దరత్నాకరము)

చిత్తూరు జిల్లాలో ప్రముఖ గంగ జాతరలు

చెందమ్మి కొలన రంజిల్లు నంచయుఁబోలె

నిప్పుటేటఁజరించె నెలఁత యోర్తు

తొలు సంజ యెండ వర్తిలు జక్కవయుఁబోలె

నీఁగెఁబందిరి గుండ మింతి యోర్తు

జల నీలిపై నిక్కు కలువ మొగ్గయుఁబోలె

ననఁటాకు నర్తించె నతివ యోర్తు

కాంత యొక్కర్తు మూఁపునఁగండలిచ్చె

మాఱుగా లిచ్చె నొక సుధా మధుర వాణి

లలన యొక్కర్తు నోరి తాళంబులిచ్చె

శక్తి జాతరఁదమ భక్తి శక్తు లెసఁగ"[3]

పై పద్యాన్ని పరిశీలిస్తే సిడిమానుపై వేలాడడమే గాక, స్త్రీలు నిప్పులపై నడవడం, కృత్రిమ పాదాలను (లోహపు అవయవాలను) సమర్పించడం, నోటి ఓగాలతో (మౌనవ్రతం కోసం దవడల్లో లోహపు కడ్డీలను కుట్టు కోవడం) మొక్కులు తీర్చుకోవడం వంటి చాలా విషయాలు నేటికీ జాతరల్లో మనం చూడొచ్చు.

"విజయనగర చక్రవర్తుల కాలములో వీపున కొంకిని గ్రుచ్చుకొని జనులు ఉయ్యేల లూగిరనియు, ఇతర సాహస హింసాయుత కార్యాలను ప్రదర్శించిరనియు కాంటి యను యూరోపు ఖండవాసి వర్ణించి యుండెను."[4]

'సిడి'ని గురించి సురవరం ప్రతాపరెడ్డి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో విపులంగా వివరించారు. [5] కానీ చివరలో "ఈ సిడి యాట నేడు లేదు.500

---

[3] పాండురంగ మాహాత్మ్యం, తెనాలి రామకృష్ణుడు (వ్యాఖ్యాత - వంతరాం రామకృష్ణరావు) పుటలు - 107 - 108.

[4] ఆంధ్రుల సాంఘిక చరిత్ర, సురవరం ప్రతాపరెడ్డి; పుట - 204.

[5] "ఆ కాలములోని ఆంధ్రుల వినోదాలలో కొన్ని ముఖ్యమైన విప్పుడంతరించి పోయినవి. అందు ముఖ్యమైనది సిడి అనునట్టిది. దానిని కేవలము వినోదమనుటకు వీలులేదు. అది భక్తి ప్రధానముగా ఆత్మహింసాత్మకముగా చేయునట్టి ప్రదర్శనము. జనులు మ్రొక్కు బళ్ళు చెల్లించుటకై సిడిపై వ్రేలాడుతుండిరి. ఒక పెద్ద గడయొక్క కొనయందు ఒక యినుప కొండిని కట్టి అది గడ చుట్టు తిరుగుటకై ఒక యినుపకడెమును గడె





ఇనుప కొక్కెంకు తాళ్ళను కట్టి లారీలను లాగుతున్న భక్తుల దృశ్యం



ఇనుప చువ్వలను దవడల్లో గుచ్చుకొన్న భక్తులు

ఏండ్లలోనే యింత మార్పు !"అన్నారు.అయితే చిత్తూరు జిల్లాలోని జాతరల్లో నేటికీ సిడి ప్రదర్శనలున్నాయి. ఇక్కడీ ఆచారం మిగిలి ఉన్న సంగతి రెడ్డి గారికి తెలిసి ఉండక పోవచ్చు.

చిత్తూరు గంగ జాతరలో ఓం శక్తి భక్తులు తాడు కట్టిన ఇనుప కొక్కేలను వీపు చర్మానికి తగిలించు కొని లారీలను, ట్రాక్టర్లను, కార్లను, ఆటోలను లాగడం మరో ప్రత్యేకమైన విషయం. అలాగే కొంత మంది భక్తులు ఐదు అడుగుల ఇనుప చువ్వలను దవడల్లో గుచ్చుకొని వీధుల్లో ప్రదర్శిస్తుం-టారు. ఇంకొందరు వొళ్ళంతా కొబ్బరి కాయలు, నిమ్మకాయల్ని కుట్టుకొని గంగ జాతరలో కన్పిస్తుంటారు.

చిత్తూరు గంగ జాతరలో వివిధ రకాల వేషాలను ప్రజలు వేస్తుంటారు.

---

కొనయందమర్చి దానికా కొండిని తగిలించెడి వారు. ఆ కొండిని స్త్రీ పురుషులు తమ వీపు చర్మములోనో నరాలలోనో గ్రుచ్చుకొని దానిపై వ్రేలాడి స్థంభము చుట్టును గిరగిర త్రిప్పబడు చుండెడివారు. దీనిని బార్బోసా చూచి యిట్లు వ్రాసెను. "ఈ దేశములోని (విజయనగర రాజ్యమందలి) స్త్రీలు అతి సాహసికురాండ్రు. తమ మ్రొక్కుల చెల్లించుకొనుటలో భయకరములగు పనులను చేతురు. ఒక యువతి ఒక యువకుని ప్రేమించినచో, ఆమె తన మ్రొక్కు చెల్లినచో సిడిపై వ్రేలాడెడిది. నిర్ణయమైన ఒక దినమున అలంకరింపబడిన యెద్దుల బండిపై ఒక మోకును దానికొక యినుప కొండి యుంచి తీసుకొని పోదురు. మంగళ వాద్యములతో ఆమె బయలు దేరును. ఆమె నడుమునకు మాత్రము బట్ట కట్టు కొనును. సిడి స్థంభము వద్దకు వెళ్ళి యినుప కొండిని ఆమె వీపు చర్మములోనికి గ్రుచ్చి సిడి పైకెత్తుదురు. ఆమె యెడమ చేతిలో చిన్న బాకుండును. గిరకను స్థంభానికి తగిలించి ఆమెను దానిపైకి లాగుదురు. ఆమె గాలిలో కొండిపై వ్రేలాడును. రక్తము కాళ్ళ పొడవునను కారినను ఏమాత్రమున్నూ తాపమును ప్రకటింపదు. పైగా కూతలు పెట్టుచు కత్తి త్రిప్పుచు నిమ్మకాయలతో తన ప్రియుని కొట్టుతుండును. కొంత సేపటికి ఆమెను దింపి గాయమునకు కట్టు కట్టుదురు. ఆమె దేవళమున కందరితోపాటు నడిచి బ్రాహ్మణులకు దానాలు చేయును."

సిడిని సిడిమ్రాను అనియు నందురు. దానినిట్లు వర్ణించినారు. ఒక స్థంభమును పాతి దాని కొనను ఒక గుండ్రని రాతిలో రంధ్రము చేసి తగిలింతురు. దానిపై సన్నని దూలమును పెట్టుదురు. ఆ దూలమును గుండ్రముగా త్రిప్పుదురు. దానికే గిరకతోటి కొండిని తగిలింతురు. ఆ కొండిపై మనిషి వ్రేలాడును. కృష్ణదేవరాయల అష్ట దిగ్గజాలలో నొకడని ప్రతీతియే కాని, తర్వాతి కాలము వాడగు తెనాలి రామకృష్ణుడు తన పాండురంగ మాహాత్మ్యములో ఈ సిడిని గురించి వర్ణించెను. ఇది రెడ్లలోనే యెక్కువగా నుండినట్లు తెలిపినాడు ........ ఈ సిడి యాట నేడు లేదు. 500 ఏండ్లలోనే యింత మార్పు !"

- ఆంధ్రుల సాంఘిక చరిత్ర, సురవరం ప్రతాపరెడ్డి; పుటలు : 289 to 291

కానీ బూతులు తిట్టడం చాలా తక్కువ. పులివేషం, చేట పొరక (భూతం) వేషం వంటివి ప్రధానమైన వేషాలు. మొక్కుబడితో కొందరు వేపాకు చేతబట్టుకొని తెలిసిన వారి మూడు ఇళ్ళకు వెళ్ళి, వాళ్ళిచ్చే డబ్బు (బిచ్చం) ను తీసుకొని గంగమ్మను దర్శించుకొని వచ్చేస్తారు. ఇలా మూడు సంవత్సరాలు వేస్తారు. అలాగే జంతు బలులు కూడా ఉంటాయి. గంగ జాతరలో చివరిరోజైన బుధవారం సాయంత్రం గంగమ్మను చుట్టు పక్కల ఉండే బావుల్లోగాని, గుంటల్లో గానీ నిమజ్జనం చేస్తారు. అలంకారాలను తొలగించి మట్టితో చేసిన గంగమ్మను నీళ్ళలో కలిపేస్తారు.

ఇలా చిత్తూరు పట్టణంలో జరిగే గంగ జాతర ఓ ప్రత్యేకతను సంతరించుకొని ఉంది.

## 5.2. కుప్పం గంగజాతరలు

చిత్తూరు జిల్లాలో పడమటి ప్రాంతంలో కర్నాటక, తమిళనాడు పరిహద్దులో కుప్పం పట్టణం ఉంది. ఇది ఒకప్పుడు తాలూకా కేంద్రం. నేడు మండల కేంద్రం. జిల్లాలో బాగా వెనుకబడిన ప్రాంతం. కుప్పం పట్టణంలో అనేక గంగమ్మలు, గ్రామదేవతలు వెలశారు. అయితే పట్టణం నడిబొడ్డులో వెలసిన శ్రీ ప్రసన్న తిరుపతి గంగమాంబ, కొత్త పేటలో వెలసిన శ్రీ ప్రసన్న పెద్దపులి గంగమాంబ, రాము చంద్రా రోడ్డులో వెలసిన శ్రీ ప్రసన్న ముత్తు మారెమ్మలు ప్రధానమైన వారు. ఈ ముగ్గురు దేవతల్ని కుప్పం ప్రజలు గంగమ్మలనే వ్యవహరిస్తారు. ముత్తుమారెమ్మను గంగమ్మగానే భావించడం గమనార్హం. వీరికి జరిగే జాతరలనే గంగజాతరలంటారు. ఈ మూడు గంగజాతరలకు స్థానికులే కాకుండా పక్క రాష్ట్రాలైన కర్ణాటక తమిళనాడుల నుంచి కూడా ప్రజలు వేల సంఖ్యలో హాజరవుతారు.

కుప్పంలోని శ్రీప్రసన్న తిరుపతి గంగమాంబ జాతర ప్రతి సంవత్సరం మే నెలలో జరుగుతుంది. జాతరజరిగే పదిహేను రోజుల ముందుగా మంగళవారం అర్ధరాత్రి చాటింపు వేస్తారు. ఈ చాటింపుకూడా గంగమ్మ శిరస్సు ఊరేగింపుగా వెళ్ళే సరిహద్దు వరకు పలకలు వాయిస్తూ ప్రకటిస్తారు. ప్రసన్న తిరుపతి గంగమాంబ జాతర మొత్తం ఐదురోజులు జరుగుతుంది. అయితే చివరి మూడు రోజులే అధిక ప్రాధాన్యం కలిగి అత్యంత వైభవంగా జరుగుతుంది. ప్రతి సంవత్సరం ఈ చివరి మూడు రోజులు సోమ, మంగళ, బుధవారాల్లో జరుగుతాయి. సోమవారం 'దేవి అగ్నిగుండ ప్రవేశ' ఉత్సవం, పుష్పపల్లకి

జరుగుతాయి. ఆ రోజు గెరిగ నృత్యాలు కూడా చేస్తారు. మంగళవారం 'శిరస్సు వూరేగింపు' జరుగుతుంది. శిరస్సు వూరేగింపు సమయంలో కనులు మిరమిట్లు గొలిపేటట్లు చెవులు దద్దరిల్లేటట్లు బాణాసంచా కాలుస్తారు. పలకల నృత్యాలు, నయ్యాండి నృత్యాలు వంటివి జాతరలో ప్రధానమైన అంశాలు. జాతర చాటింపు రోజు గంగమ్మ గుడిని పరిశుభ్రపరచి తలభాగంలేని గంగమ్మ శరీరానికి శంఖం, చక్రం, శూలం వంటివాటిని అమర్చి దేవి విగ్రహాన్ని భయంకరాకారంగా తీర్చి దిద్దుతారు. జాతర చివరి రోజైన బుధవారం ఉదయాన్నే గంగమ్మ విగ్రహానికి 'శిరస్సు'ను జతచేస్తారు. ఈ కార్యక్రమాన్ని చూడడానికి ప్రజలు వేల సంఖ్యలో తండోపతండాలుగా గుడి దగ్గర గుమిగూడుతారు. గంగజాతరలో అనేకమంది అనేక విధాలుగా తమ మొక్కుబడులను తీర్చుకుంటుంటారు. కొంతమంది రకరకాల వేషాలను వేసుకొని గంగమ్మను దర్శిస్తుంటారు. గంగమ్మను దీపారాధనతో, పొంగళ్ళతో, జంతుబలులతో ఆరాధిస్తారు.

ప్రసన్న పెద్ద పులి గంగమాంబ జాతర కూడా సుమారు 15 రోజుల పాటు జరుగుతుంది. ఈ జాతర ప్రతి సంవత్సరం ఏప్రిల్ చివరి వారంలో ప్రారంభమై మే నెలలో ముగుస్తుంది. ప్రతిరోజు గుడిదగ్గర హరికథా కార్యక్రమం ఉంటుంది. గంగమ్మ రథోత్సవం, పుష్పపల్లకి, ఉత్సవ ఊరేగింపులు, పాటకచ్చేరీలు ఉంటాయి. చివరి రెండు రోజులు ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకొని ఈ జాతర జరుగుతుంది. ఒక రోజు దేవి అగ్నిగుండ ప్రవేశం, మరోరోజు దీపారాధన, పొంగళ్ళు ఉంటాయి.

అదేవిధంగా ప్రసన్న ముత్తు మారెమ్మ జాతర ప్రతి సంవత్సరం ఆగస్టునెలలో సుమారు ఐదురోజుల పాటుజరుగుతుంది. జాతర జరిగే ఐదురోజులు ఉత్సవ ఊరేగింపులు ఉంటాయి.

మూడు గంగజాతరల్లో ప్రముఖంగా, వైభవంగా జరిగేది శ్రీప్రసన్న తిరుపతి గంగమాంబ జాతరే. కుప్పం గంగ జాతరల్లో ప్రజలు ఆసక్తి తో తిలకించేది 'నయ్యాండి డాన్సు'. ఇది ఈ ప్రాంత జాతరల్లో ప్రత్యేక-మైంది. 'నయ్యాండి నృత్యాలను' అందమైన యువతులు అర్థనగ్నంగా నెత్తిన రంగుకాగితాలతో, పూలతో అలంకరించిన కుండను లేదా చెంబును పెట్టుకొని చేత్తో పట్టుకోకుండా, మేళ తాళాలకు, నాదస్వరం, పంబల వాయిద్యాలకు అనుగుణంగా డాన్స్ చేస్తారు. జాతర రోజుల్లో నయ్యాండి డాన్స్ చేసేవారిని తమిళనాడులోని రోజ్‌కోట, ధర్మపురి, సేలం, కృష్ణగిరిల నుండి పిలిపిస్తుం-టారు. ఇలా కుప్పం నియోజకవర్గంలో ప్రతి సంవత్సరం రామకుప్పం, వి.కోట,

గుడుపల్లి, శాంతాపురం వంటి మండలాల్లో అనేకప్రదేశాలలో అనేక విధాలుగా గంగ జాతరలు జరుగుతుంటాయి.

కుప్పంలోని ప్రసన్న తిరుపతి గంగమాంబ గుడి సుమారు 70 ఏళ్ళ నుంచి ఉన్నట్లు స్థానికులు చెప్పడాన్ని బట్టి తెలుస్తోంది. ప్రసన్న తిరుపతి గంగమాంబ అనే పేరును బట్టి పరిశీలిస్తే గంగమ్మను తిరుపతి నుండి తీసుకెళ్ళి ప్రతిష్ఠించినట్లు తెలుస్తోంది. ఎందుకంటే వందల ఏళ్ళుగా తిరుపతి గంగమ్మ ప్రసిద్ధిచెందిన గ్రామ దేవత. కాబట్టి ఈ గంగమ్మకు జరిగే జాతరను చూడడానికి జిల్లా ప్రజలే కాకుండా ఇతర సరిహద్దు రాష్ట్రాలనుండి కూడా వస్తూఉంటారని మనమిదివరకే తెలుసుకొని వున్నాం. కుప్పంనుంచి తిరుపతి గంగజాతర చూడడానికి ప్రతిసారీ రాలేని కొందరు భక్తులు ఈ తిరుపతి గంగమ్మ పేరు మీద కుప్పంలో జాతరలను జరిపిస్తూ ఉండొచ్చు లేదా తిరుపతినుంచి ఎవరైనా కుప్పంకు వలస వెళ్ళి అక్కడ 'తిరుపతి గంగమ్మ' పేరు మీద మరో గంగమ్మను ప్రతిష్టించి జాతరలకు శ్రీకారం చుట్టి వుండవచ్చు.

## 5.3. పలమనేరు గంగ జాతర

పలమనేరు పట్టణం చిత్తూరు పడమటి ప్రాంతంలో తమిళనాడు, కర్ణాటక సరిహద్దులో ఉంది. ఇక్కడ ప్రతిఏటా 'మే నెలలో ' 'తిరుపతి గంగమ్మ ' పేరు మీద జాతరను ఎంతో ఘనంగా జరిపిస్తారు. పలమనేరు పట్టణ నడిబొడ్డులో తిరుపతి గంగమ్మను క్రీ.శ. 1805 వ సంవత్సరంలో ప్రతిష్ఠించినట్లు స్థానికులు చెప్తారు. తిరుపతి నుంచి గంగమ్మ విగ్రహం తేవడం వల్ల 'తిరుపతి గంగమ్మ ' అనే పేరు వచ్చిందని కూడా అంటారు. గంగమ్మ గుడిలో ఏడుమంది గంగమ్మ మాతృకల విగ్రహాలతో పాటు అష్ట లక్ష్మల విగ్రహాలు, మహాసరస్వతి, కన్యకాపరమేశ్వరి వంటి 48 విగ్రహాలను ప్రతిష్టించారు. పలమనేరులో గంగ జాతర వారం రోజులకు ముందు చాటింపుతో ప్రారంభమౌతుంది. అయినా చివరి మూడురోజులే జాతర ప్రధానంగా జరుగుతుంది. శుక్రవారం తెల్లవారు జామున ఎన్నో వేల మంది భక్తుల మధ్య పలమనేరు పట్టణ పుర వీధుల్లో ' గంగ శిరస్సు'ను ఊరేగిస్తారు. గంగ శిరస్సును ఊరేగించే సందర్భంలో లెక్కలేనన్ని జంతువుల్ని గంగశిరస్సుకు అభిముఖంగా బలిస్తుంటారు. గంగమ్మ గుడిలో 'గంగ శిరస్సు ' ను దర్శించడానికి సుమారు 50 వేల మంది హాజరవుతారని అంచనా. చివరిరోజైన శనివారం గంగమ్మ 'జలధి' కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. ఈ గంగ జాతరకు కూడా తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల నుండి అనేక మంది

భక్తులు హాజరవుతుంటారు. గుడి ప్రాంగణమంతా పొంగళ్ళతో కిటకిటలాడి పోతుంటుంది. ఈ గంగజాతరలో కొన్ని కులాల మతాల వాళ్ళు పాల్గొంటారు. ప్రత్యేకించి ముస్లింలు కూడా పాల్గొనడం విశేషం.

పలమనేరులోని గంగమ్మకు తిరుపతి గంగమ్మ అనే పేరు పెట్టడానికి కారణం కేవలం తిరుపతి నుండి గంగమ్మ విగ్రహం తేవడమే కాదు. తిరుపతి గంగమ్మ మీదుండే అపారమైన నమ్మకం, భయభక్తులేనని కూడా చెప్పొచ్చు.

## 5.4. పుంగనూరు గంగ జాతర

పుంగనూరు పట్టణం చిత్తూరు జిల్లాలో పడమటి ప్రాంతంలో ఉంది. పుంగనూరు పట్టణం నడిబొడ్డులో పుంగనూరు మాజీ జమీందారులచే ' గంగమ్మ' ప్రతిష్టింపబడింది. 18 వ శతాబ్దంలో జమీందారులు కర్ణాటకలోని సుగుటూరు నుంచి వచ్చి స్థిరపడడం వల్ల పుంగనూరులోని గంగమ్మకు 'సుగుటూరు గంగమ్మ ' అనే పేరు వచ్చింది. పుంగనూరు జమీందారులకు సుగుటూరు గంగమ్మ ఇలవేల్పు, ప్రజలకు ఆరాధ్యదైవం.

పుంగనూరు మాజీ జమీందారుల గురించి ఒక ఐతిహ్యం ప్రచారంలో ఉంది. ఈ జమీందారులు సుగుటూరు నుంచి పుంగనూరుకు వచ్చినప్పుడు సాధారణ కుటుంబీకులుగానే ఉన్నారు. వీరు వ్యవసాయం చేసినా తగిన రాబడి రాక భూమిశిస్తుకూడా చెల్లించలేని స్థితిలో ఉండేవారు. అలాంటి సమయంలో ఈ వంశీకుల్లో ఒకరు పొలం గట్టున నిద్రిస్తున్నప్పుడు నాగుపాము పడగవిప్పి నీడ నిచ్చిందట. ఆ సంఘటనను కళ్ళారచూసిన ఇమ్మడి, ముమ్మడి అనే పాలేర్లు ఈ విషయాన్ని తమ యజమానికి తెలియజేసారు. వారు జ్యోతిష్కులను సంప్రదించి తమకు రాజయోగం ఉందని, అపారమైన ధనం సంక్రమిస్తుందని తెలుసుకుంటారు. కొన్ని రోజుల్లోనే జోష్యం ఫలించి పుంగనూరు సమీపంలోని కొండకింద రహస్యంగా ఉన్న రత్నాల నిధి లభిస్తుంది. అక్కడే పూజలు చేసిన పాద పీఠం కూడా ఈ వంశీకునికి కన్పిస్తుంది. ఆ పాదపీఠాన్ని సమీపించేసరికి అతనికి నిద్రావహించేస్తుంది. నిద్రలో ఆ పాద పీఠం మహిమోన్నతురాలైన గంగమ్మదని, ఆశక్తి స్వరూపిణిని ఇలవేల్పుగా భావించమని కలగనడంతో దానిని దైవానుగ్రహంగా భావిస్తాడు. గంగమ్మ అనుగ్రహంతో అతను జమీందారైన తర్వాత ఆ పాదపీఠాన్ని తరలించుకొని వస్తుండగా ఊరిలో ఒక చోట బండి ఇరుసు విరిగి పోవడంతో అక్కడే గంగమ్మ గుడినికట్టి పూజిస్తున్నారని ప్రతీతి.

చిత్తూరు జిల్లాలో ప్రముఖ గంగ జాతరలు

ప్రతి సంవత్సరం ఉగాది పండుగకు (రెండు రోజుల) ముందు గంగమ్మ జాతర మూడు రోజుల పాటు ఎంతో వైభవంగా జరుగుతుంది. అయితే వారానికి ముందుగానే జాతరను చాటిస్తారు. జమీందారు వంశీకులు 'కలశ ప్రతిష్ఠ ' చేసి గంగమ్మ విగ్రహాన్ని ఊరేగించి గుళ్ళో ప్రతిష్టిస్తారు. ఈ సందర్భంలో గెరగలతో, వివిధ వేషాలతో గంగమ్మకు మొక్కులు తీర్చుకుంటారు. ఈ గంగజాతరలో కూడా వందలాది జంతువులను బలిచ్చి పొంగళ్ళను పెట్టి ఆరాధిస్తారు. గంగమ్మను చివరి రోజు ఊరేగించి నిమజ్జనం చేస్తారు. ఈ గంగజాతరను చూడడానికి దాదాపు 20 వేల మంది కర్నాటక, తమిళనాడుల నుండి భక్తులు వస్తుంటారు.

## 5.5. పాకాల గంగ జాతర

చిత్తూరు జిల్లాలోని పాకాలలో కూడా ప్రతి సంవత్సరం గంగ జాతర ఎంతో వైభవంగా జరుగుతుంది. సత్యమ్మ గుడి దగ్గరుండే 'తిరుపతి పెద గంగమ్మ' ను భక్తులు వేల సంఖ్యలో దర్శించుకొని మొక్కుబడులు తీర్చు-కుంటారు. ప్రజలు వివిధ రకాల వేషాలను వేసుకొని పట్టణంలో తిరుగుతారు. అలాగే జాతర సమయంలో వాటా గంగమ్మను, మిట్టూరు దగ్గరుండే గంగమ్మను కూడా భక్తులు అధిక సంఖ్యలో దర్శించుకొని పూజలు చేస్తారు.ఇక జంతుబలులు సర్వసాధారణంగానే ఉంటాయి.

## 5.6. పులిచెర్ల మండలంలో గంగ జాతరలు

పులిచెర్ల మండలంలోని కూనపల్లిలో ఉండే గంగమ్మ గుడి దగ్గర ప్రతిసంవత్సరం జాతర ఎంతో ఘనంగా జరుగుతుంది. అలాగే ఉప్పరపల్లెలో కూడా గంగజాతర ప్రతి ఏటా వైభవంగా జరుగుతుంది. పులిచెర్ల మండలంలోని అనేక గ్రామాల్లో గంగజాతరలు ఎంతో వైభవంగా జరుగుతాయి. గంగమ్మ గుళ్ళకు కళ్ళు మిరమిట్లు గొల్పేటట్లు విద్యుత్ దీపాలంకారాలు చేస్తారు.

## 5.7. చింతపర్తి గంగ జాతర

వాయల్పాడు మండలంలోని చింతపర్తిలో ప్రతి ఏటా గంగజాతర

ఎంతో వేడుకగా జరుగుతుంది. ఇటీవల 1994 ఏప్రిల్ నెలలో జరిగిన జాతరలో గంగమ్మకు దున్నపోతును బలిచ్చే సందర్భంలో పోలీసులు జోక్యం చేసుకున్నందుకు వారిపై భక్తులు తిరగబడి రాళ్ళు రువ్వి దాడి చేయడం గమనార్హం.

## 5.8. పెద్దతిప్ప సముద్రం మండలంలో గంగజాతరలు

మండల కేంద్రమైన పెద్ద తిప్ప సముద్రంలో ప్రతిఏటా గంగ జాతర ఎంతో వైభవంగా జరుగుతుంది. గంగ జాతర రెండు రోజులకు ముందు ప్రారంభమై బుధవారం రోజుతో ముగుస్తుంది. పెద్ద తిప్పసముద్రం ఊరి నడిబొడ్డులో గంగమ్మను ప్రతిష్టించి జాతర చేస్తారు. పై మండలంలోనే రంగ సముద్రంలో కూడా గంగజాతర ప్రతి ఏటా ఎంతో వేడుకతో జరుగుతుంది. ఈ గంగ జాతరల్ని చూడడానికి ఇతర ప్రాంతాల నుండి వేలాది మంది జనం తరలి వస్తుంటారు. ఆర్టీసీ వారు పెద్ద తిప్పసముద్రం, రంగ సముద్రం గంగ జాతరలకు ప్రత్యేక బస్సులను నడపడాన్ని బట్టి కూడా ఇక్కడి జాతరల ప్రాముఖ్యాన్ని మనం అర్థం చేసుకోవచ్చు.

## శ్రీ కాళహస్తి మండలంలో గంగ జాతరలు

## 5.9.శ్రీ కాళహస్తి ఏడు గంగల జాతర

శ్రీ కాళహస్తి పట్టణంలో ప్రతి ఏటా కార్తీక మాసంలో అంటే డిసెంబర్ మొదటి వారంలో ఏడు గంగల జాతర అత్యంత వైభవంగా జరుగుతుంది. వారం ముందే చాకలి వాళ్ళు జాతరను చాటిస్తారు. పట్టణంలోని ఏడు వీధులవారు తమ వీధుల్లో గంగమ్మ ప్రతిమలను తయారు చేసుకొని, బాగా అలంకరించి, బొమ్మకు ముసుగు వేసి బండ్లపై పెట్టుకొని ముత్యాలమ్మ గుడి వీధిలో ఉండే గంగమ్మ గుడికి తీసుకొని వస్తారు. ఇలా ఏడు గంగమ్మల బొమ్మలు గంగమ్మ గుడికి చేరాక అక్కడ గంగమ్మలకు ప్రాణ ప్రతిష్ట చేస్తారు. అంటే దిష్టి చుక్క పెడ్తారు. ముసుగులు తొలగిస్తారు. ప్రతి గంగమ్మ ప్రతిమ ముందు రెండేసి పసుపు ముద్దలు పెడ్తారు. తర్వాత గంగమ్మ ప్రతిమలకు పూజలు చేసి ఆయా వీధులకు పంపుతారు. ఇదంతా మంగళవారం

రాత్రి జరుగుతుంది. వీధుల నుండి ప్రతిమలు గంగమ్మగుడిని చేరుకోవడానికి అర్ధరాత్రి అవుతుంది. గుడి నుండి బయలు దేరిన ప్రతిమలు ఆయా వీధులను చేరుకొనేసరికి తెల్లవారు జాము కానీ, ఒక్కోసారి తెల్లవారిపోవడం కానీ అవుతుంది. ఏడు గంగలు గంగమ్మగుడి నుండి బయలుదేరేటప్పుడు దారి పొడవునా భక్తులు తళిగెలు వేసి, పొట్టేళ్ళను, కోళ్ళను బలిస్తుంటారు. ఇలా గంగలను ఊరేగించేటప్పుడే రోడ్లపై బలివ్వడం ఇక్కడి ప్రత్యేకత. గంగమ్మగుడి నుండి బయలుదేరిన ఏడు గంగమ్మల్లో ఒక గంగమ్మ మొదట పెండ్లి మండపం (ప్రాచీన రాతి మండపం) దగ్గర నిలుస్తుంది. అక్కడ్నుంచి మిగిలిన ఆరు గంగలను తీసుకొని వెళ్ళి తేరువీధి, గాలిగోపురం, బేరివారి మండపం, కొత్తపేట, పూసలవీధి, గాంధీ వీధుల్లో ప్రతిష్టిస్తారు. గంగమ్మ గుడిలో పసుపు ముద్దల్తో పాటు దీపాన్ని కూడా ఇస్తారు. దీపాన్ని కుండలో పెట్టుకొని వచ్చి గంగమ్మను వీధిలో నిలిపాక, గంగమ్మ ఉన్న బండికిందనే దీపాన్ని ఆరకుండా పెడ్తారు. బుధవారం ఉదయం నుండి ఆయా వీధుల్లో గంగమ్మలకు పూజలు చేస్తారు. మొక్కుబడి ఉన్నవారు వేప చీరలతో, వెయ్యికళ్ళ దుత్తలతో వేషాలతో వచ్చి గంగమ్మను దర్శించుకుంటారు. ఆయా వీధుల్లోని ప్రజలు ఆయావీధుల్లో ఉన్న గంగమ్మలను పూజించి, ఆరాధిస్తారు. ఒక వీధి వారితో మరో వీధి వారు పోటీపడి గంగజాతరకు చందాలు వసూలు చేసి జరిపిస్తుంటారు. ఏడు గంగలకు ఏడు కమిటీలున్నాయి. ఈ ఏడు కమిటీలకు కలిపి మరొక పైకమిటీ ఉంది. వీరే జాతరను నిర్వహిస్తారు. పూజారులుగా చాకలి కులస్థులుంటారు.

బుధవారం సాయంత్రం గంగమ్మలుండే బండ్లు తిరిగి గంగమ్మ గుడికి బయలుదేరుతాయి. దారి పొడవునా పులివేషాలు, నాగిని నృత్యాలు, రికార్డు డాన్సులు, పలకల వాయిద్యాలు, చిందులు వంటి వాటితో హోరెత్తి పోతుంది. కొందరు యువకులు గంగమ్మను మాత్రమే బూతులు తిడ్తారు. ఉదా :- చిందులెయ్యదల్చుకున్నవారు, హారతులివ్వదల్చుకున్నవాడు 'నిలపండిరా లంజను ' అంటూ గంగమ్మను అడుగడుగునా ఆపుతుంటారు. అన్ని వీధుల గంగలు కలిసేది ముత్యాలమ్మగుడి వీధిలో కాబట్టి ఆ వీధి జన ప్రవాహంలా ఉంటుంది. తర్వాత గంగమ్మ గుడి ముందు గంగమ్మ దీపాలను, పసుపు ముద్దలను, పూలను తీసుకొని, దిష్టి చుక్కల్ని తుడిపేస్తారు. ఆ తర్వాత పక్కన ఉండే సువర్ణ ముఖినదిలో పసుపు ముద్దల్ని నిమజ్జనం చేస్తారు. అంటే గంగమ్మలను నిమజ్జనం చేసినట్లే. తర్వాత గంగమ్మ ప్రతిమలను ఆయా వీధుల వారు విడి భాగాలుగా చేసి తర్వాతి సంవత్సరానికి భద్ర పరుస్తారు. గంగమ్మ ప్రతిమ ముఖం వెండితోను, మిగిలిన అవయవాలు ఇత్తడి రాగి వంటి లోహాలతో తయారు

చేయబడి ఉంటాయి. శూలం, కిరిటాలన్నీ కూడా ఉంటాయి. కాబట్టి గంగమ్మగా భావించే పసుపు ముద్దను నిమజ్జనం చేస్తారు.

# 5.10. పానగల్లు గంగ జాతర

పానగల్లు శ్రీకాళహస్తి పట్టణంలోని ఒక భాగమే. కాకపోతే సువర్ణముఖీ నదికి ఓ వైపున కాళహస్తి, మరో వైపున పానగల్లు ఉన్నాయి. కాళహస్తికి, పానగల్లుకు వేర్వేరు జమీందారులుండేవారు. కానీ గంగ జాతరల్లో వీరి ప్రమేయమేమీ లేదు. పానగల్లులో ప్రతి ఏటా జూన్ నెలలో గంగ జాతర జరుగుతుంది. ఊర్లో ఒక వేపచెట్టు కింద గంగమ్మశిల, శూలాలు ఉంటాయి. జాతరకు వారం ముందు మంగళవారం చాటిస్తారు. గంగజాతర మంగళవారం రాత్రి ప్రారంభమై బుధవారం రాత్రికి ముగుస్తుంది. పానగల్లులో గంగమ్మ ప్రతిమను ప్రతిష్ఠించడానికి ముందు అంటే మంగళవారం ఉదయం పక్కనుండే పొన్నాలమ్మకు పొంగళ్ళు పెడ్తారు. తెల్లవారు జామున 3 గంటలకు గంగమ్మ నిలుస్తుంది. జాతరలో గొర్రెపోతును నరికి పేగుల్ని మెళ్ళో వేసుకొని, గొర్రె నాలుకను నోట్లో పెట్టుకొని ఊరు చుట్టూ తిరుగుతూ గంగమ్మను బూతులు తిడ్తారు. దున్నపోతును కూడా బలిస్తుంటారు. బలి అన్నం ఊరంతా చల్లుతారు.

పానగల్లులో గంగమ్మబొమ్మను మట్టితో చేస్తారు. గంగమ్మబొమ్మను ఊరేగించేటప్పుడు 'ఎదురు కుంభాలు ' వేస్తారు. అంటే తళిగెలు వేస్తారు. పొట్టేళ్ళను, కోళ్ళను బలిస్తుంటారు. బుధవారం ఉదయం నుండి ఆడ, మగ వేషాలు వేసుకొని గంగమ్మను, దర్శిస్తుంటారు. గంగమ్మను మాత్రమే తిడ్తారు. దారిలో వచ్చి పోయే వారిని తిట్టరు. పానగల్లు గంగమ్మకు పూజారులుగా పల్లెరెడ్లు వంశపారం పర్యంగా ఉంటారు. బుధవారం తెల్లారి ఎద్దుల బండ్లను ఊరిలోకి పంపి అంబళ్ళను గంగాళాలపై సేకరించి గంగమ్మ ముందుంచి పూజించి అడిగిన వాళ్ళకు, బీదలకు, పిల్లలకు పోసేస్తారు. మధ్యాహ్నం నుంచి పొంగళ్ళు పెడ్తారు. సాయంత్రం 4గంటల నుండి కుంభాలు, తళిగెలు వేస్తారు. బుధవారం సాయంత్రం వేపచీరలు కట్టుకుంటారు. అడుగడుక్కు దండాలు, పొర్లు దండాలు పెడ్తూ గంగమ్మను దర్శిస్తారు. మొక్కుబడి ఉన్నవారు 'నడగోకలు ' (నడచి వెళ్ళడానికి ఉపయోగించే చీరలు) మీద పొర్లు దండాల వారు, వేపచీరల వారు దొర్లుకుంటూ గంగమ్మ దగ్గరకెళ్తారు. వేపచీరలు ఎక్కువగా స్త్రీలే ధరిస్తారు. కొందరు పురుషులు కూడా వేప చీరలు కట్టుకొని

వెళ్తుంటారు.

పానగల్లు గంగ జాతరలో భక్తులు నిమ్మకాయల్ని ఒళ్ళంతా కుట్టు కుంటారు. కొందరు చిన్న తేరు లాంటి బండిని (దీన్ని చప్పరం అని కూడా అంటారు) దారంతో కట్టి, దాన్ని ఇనుప కొక్కికి ముడేసి, ఆ కొక్కీలను వీపుకు గుచ్చుకొని, దారి వెంబడి లాగుతూ వెళ్ళి గంగమ్మను దర్శిస్తారు. ఈ తేరు బండిలో కలశం పెట్టి ఉంటారు. కొందరు భక్తులు నాలుకలపై, దవడల్లో శూలాలను గుచ్చుకుంటారు. కొంధరు భక్తులు నోటి బీగాలను వేసుకొని వెళ్ళి గంగమ్మను దర్శిస్తారు. పానగల్లు జాతరలో కత్తిసాము, కర్రసాము చేస్తారు. నోట్లో కిరోసిన్ పోసుకొని అగ్ని జ్వాలలు ఊదుతుంటారు. ఇవన్నీ ఇక్కడి జాతర ప్రత్యేకతలు. బుధవారం సాయంత్రం గంగమ్మను సువర్ణ ముఖినదిలో నిమజ్జనం చేసేస్తారు.

ఇలా పానగల్లు గంగజాతర ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకొని ఉంది

## 5.11. బి.పి. అగ్రహారం గంగ జాతర

శ్రీ కాళహస్తిని ఆనుకొని ఉండే బి.పి. అగ్రహారంలో ప్రతి సంవత్సరం బుధవారం గంగ జాతర జరుగుతుంది. అంటే గంగమ్మ మంగళవారం తెల్లవారు జామున ప్రతిష్టింప బడుతుంది. బి.పి. అగ్రహారం కాళహస్తి పట్టణంలో ఒక భాగమే. సువర్ణముఖీనదికి ఇవతల గట్టుపై ఉంది. అంటే పానగల్లుకు, కాళహస్తికి మధ్యలో. అక్కడ గంగమ్మ చప్పరాన్ని తయారు చేసి ఆరాధిస్తారు. మంగళవారం ఈ గంగ జాతర సందర్భంగా బి.పి.అగ్రహారంలో ఉండే పొన్నాలమ్మ గుడి దగ్గర కూడా స్త్రీలు పొంగళ్ళు పెడ్తారు. బుధవారం రాత్రి గంగమ్మ నిమజ్జనంతో జాతర పరిసమాప్త మవుతుంది.

అలాగే కాళహస్తి పట్టణంలో 'తిరుపతి గంగజాతర ' సందర్భంలో మంగళవారం ముత్యాలమ్మగుడి వీధి కుమ్మర మిట్టలో ఉండే గంగమ్మ వేపమాను దగ్గర స్త్రీలు పొంగళ్ళు పెట్టి గంగమ్మను ఆరాధిస్తారు. అదేవిధంగా కాళహస్తి పట్టణంలోని గాండ్ల వీధిలో గంగమ్మ నిలిచే స్థలంలో కూడా తిరుపతి గంగ జాతర సందర్భంలో అక్కడి ప్రజలు గంగమ్మను ఆరాధించి అంబళ్ళు పోస్తుంటారు.

దీనిని బట్టి కూడా తిరుపతి గంగజాతర ఎంత విశిష్టమైందో మనకు అర్థమౌతుంది.

## 5.12. రేణిగుంట గంగ జాతర

తిరుపతి సమీపంలోని రేణిగుంటలో కూడా గంగజాతర ప్రతి ఏటా వైభవంగా జరుగుతుంది. మంగళవారం ఉదయం నుండి సాయంత్రం వరకు మహిళలు పెద్ద సంఖ్యలో పొంగళ్ళు పెడ్తుంటారు. రేణిగుంట చుట్టు పక్కల గ్రామాల నుండి జనం హాజరై గంగమ్మను దర్శించుకుంటారు. స్థానిక గంగమ్మ గుడి నుండి గ్రామ చావడి దగ్గరుండే గంగమ్మ శిల వరకు విద్యుద్దీపాలతో అలంకరిస్తారు. మంగళవారం రాత్రి 9 గంటల నుండి రికార్డు డాన్సులను ఏర్పాటు చేస్తారు. రికార్డు డాన్సులను చేయడానికి గుంటూరు వంటి పట్టణాల నుండి పిలిపిస్తుంటారు. అర్ధరాత్రి 12 గంటల నుండి గంగమ్మ గుడి నుండి గ్రామ చావడి వరకు ఊరేగింపు జరుగుతుంది. బుధవారం కూడా జాతర జరుగుతుంది. బుధవారం రాత్రి పాట కచ్చేరీలను ఏర్పాటు చేస్తారు. ఆ తర్వాత జాతర ముగుస్తుంది.

## 5.13. పన్నూరు గంగజాతర

నగరి నియోజకవర్గంలోని విజయపురం మండలంలోని పన్నూరులో గంగజాతర వైభవంగా జరుగుతుంది. ఇక్కడ గంగ జాతర మూడు రోజుల పాటు జరిగి ఆదివారంతో ముగుస్తుంది. ఇక్కడ కూడా చుట్టు పక్కల గ్రామాల నుండి జనం వచ్చి గంగమ్మకు మొక్కులు తీర్చుకుంటారు. పన్నూరు గ్రామప్రజలు గంగమ్మకు పొంగళ్ళు పెట్టి అంబళ్ళు పోస్తారు.

## 5.14. బండారుపల్లి గంగ జాతర

ఏర్పేడు మండలం బండారు పల్లిలో గంగజాతర ప్రతి ఏటా రెండు రోజుల పాటు జరుగుతుంది. మంగళవారం ప్రారంభమైన జాతర బుధవారంతో ముగుస్తుంది. గ్రామ ప్రజలు గంగమ్మను ఆరాధించి, పొంగళ్ళు పెట్టి, అంబళ్ళు పోసి, మొక్కులు తీర్చుకుంటారు.

# 5.15. సత్యవేదు గంగ జాతర

సత్యవేదులో ప్రతి సంవత్సరం చైత్రం లేదా వైశాఖ నెలలో గంగజాతరను జరిపిస్తారు. ఈ నెలల్లోఅమావాస్య పోయిన మరుసటి బుధవారం జాతర మొదటి చాటింపు వేస్తారు. రెండవ బుధవారం రెండో చాటింపు వేస్తారు. మూడవ బుధవారం గంగమ్మను ప్రతిష్ఠిస్తారు. గంగ జాతర బుధ, గురువారాల్లో జరుగుతుంది. సత్యవేదులోని సదుమాలమ్మ, శక్తికి ప్రతిరూపమని, ఈమెనే 'గంగమ్మ' అని అంటారు. శక్తి స్వరూపమైన గంగమ్మకు ప్రతి సంవత్సరం జాతరను వైభవంగా చేయడం వల్ల ఈ ప్రాంతానికి 'శక్తివీదు' అనే పేరొచ్చిందని అదే క్రమంగా 'సత్యవేదు' గా మారిందంటారు. సదుమాలమ్మ ఆలయం ఊరి బయట పంటపొలాల్లో ఉన్నా గంగమ్మను మాత్రం ఊరి మధ్యలో ప్రతిష్ఠిస్తారు. చాటింపు వేసిన రోజు సత్యవేదులో ఉన్న గంగమిట్ట దగ్గర ఉదయం ప్రజలు అంబళ్ళు పోస్తారు. ఆ రోజు సాయంత్రం సదుమాలమ్మ గుడి దగ్గర పొంగళ్ళు పెడ్తారు. మొదటి చాటింపు రోజు రాత్రి శక్తి కలశాన్ని అలంకరించి ప్రధాన వీధుల్లో ఊరేగిస్తారు. మొదటి చాటింపు వేసిన తర్వాత 15 వ రోజున జాతర జరుపుతారు. జాతర బుధవారం ప్రారంభమైనా వేషాలు మాత్రం సోమవారం నుండే మొదలౌతాయి. మగవాళ్ళు ఆడవేషం వేసుకొని నెత్తిన శక్తి కలశాన్ని పెట్టుకొని వీధుల్లో వూరేగుతారు. బుధవారం సాయంత్రం గంగమ్మ మట్టి బొమ్మను తయారు చేస్తారు. ఈ బొమ్మకు పసుపు, కుంకుమ పెడ్తారు. అలాగే వివిధ పూలతో అలంకరిస్తారు. సుగంధ ద్రవ్యాలను పూస్తారు. ఈ తతంగాన్నంతా తంభిరాన్ వంశస్థులు అనువంశికంగా నిర్వహిస్తుంటారు. బాగా అలంకరించిన గంగమ్మ ప్రతిమను సత్యవేదు పురవీధుల్లో బుధవారం రాత్రి వూరేగిస్తారు. ప్రజలు మొక్కుబడులను తీర్చుకుంటారు. గంగమ్మను ఊరేగించేటప్పుడు వేల మంది భక్తులు వూరేగింపు వెంట వెళ్తుంటారు. ఇలా రాత్రంతా పురవీధుల్లో వూరేగించి గంగమిట్ట దగ్గర కొచ్చేసరికి గురు వారం ఉదయం అవుతుంది. గురువారం ఉదయం గంగమిట్టలో జాతరకని వేసిన పందిరిలో గంగమ్మను కొలువు చేస్తారు. సత్యవేదు గంగజాతరకు ప్రజలు చుట్టుపక్కల ప్రాంతాల నుండి, మద్రాసు నుండి కూడా హజరౌతారు. ఈ జాతరకు ప్రతిసంవత్సరం దాదాపు లక్ష మంది పాల్గొని గంగమ్మను ఆరాధిస్తారు. ఇలా పూజలు చేసి, మొక్కులు తీర్చి ఆరాధించిన తర్వాత గంగమ్మను ఊరి బయట నిమజ్జనం చేసేస్తారు.

# 5.16. పేరూరు గంగజాతర

తిరుపతికి 5 కి.మీ. దూరంలో, వ్యవసాయ కళాశాల సమీపాన పేరూరు గ్రామం ఉంది. పేరూరులో గంగజాతర ప్రతి సంవత్సరం మే నెలలో, తిరుపతి గంగజాతరకు వారం ముందు అంటే అవిలాల గంగజాతరతో పాటు జరుగుతుంది. పేరూరులో గంగజాతరకు వారం ముందు, మంగళ-వారం చాటింపు వేస్తారు. మంగళవారం చాటించాక శుక్రవారం చాకలివాళ్ళు 'గరిగకుండ' ఎత్తుతారు. గంగమ్మగా భావించే 'గరిగకుండ' ఇంటింటికి వెళ్ళి పూజలందుకుంటుంది. పలకలు, కొమ్ములు, తాజాలు వంటి వాయిద్యాలు వెంట వెళ్తాయి. ఆ సమయంలో గంగమ్మకు అన్నం కూడా వేస్తారు. తర్వాత ఆదివారం రోజు 'మోకాటి కుండ'ను ఎత్తి ఊరంతా తిరుగుతారు. ఆ తర్వాత మంగళవారం 'దున్నపోతు కుండ' ను ఎత్తి ఊరేగుతారు.

గంగమ్మకు పూజారులుగా 'పనిబాటలోళ్ళు' అంటే చాకలి, కుమ్మరి వాళ్ళు ఉంటారు. జాతరను నిర్వహించేది పిన్నపెద్ద,పెదకాపు అనే రెడ్డి కులస్తులు. వీరు ఊరులోని ప్రతి ఇంటినుండి డబ్బుల్ని వసూలు చేస్తారు. దీనినే 'ఇంటింటికి పంపకం' అంటారు.మిరాశిదార్లను వదిలేస్తారు. అంటే పూజారుల వంటి వాళ్ళను డబ్బులడగరు.

మంగళవారం గంగమ్మకు బలిచ్చే దున్నపోతును ఊరేగిస్తారు. బుధ-వారం తెల్లవారుజామున వూరి మొదట్లో కుమ్మరోళ్ళు గంగమ్మ బొమ్మను తయారు చేసి, బాగా అలంకరించి, గొర్రె పిల్లను బలిచ్చి, గంగమ్మను ఊరే-గింపుగా తీసుకొని వచ్చి నాలుగు వీధులు కలిసే చోట ఉంచుతారు. అప్పుడు సూర్యోదయానికి ముందు ప్రజలు తమ శక్త్యానుసారం, మొక్కుబడులను బట్టి గంగమ్మకు బలులిస్తారు. 'ఎదురు కుంభాల'ను వేస్తారు. తర్వాత ఉదయం 8 గంటల ప్రాంతంలో అక్కడ్నుంచి గంగమ్మను ఊరి మధ్యలో గంగరాయి దగ్గర వేసిన చీరల పందిట్లో ప్రతిష్టిస్తారు. ఆ తర్వాత ఉదయం 10 గంటలపైన దున్నపోతును బలిస్తారు. దున్నపోతు పేగుల్ని పొలిచల్లే చాకలికి హారంలా చుట్టేసి, ఆ రక్తం కలిపిన అన్నాన్ని వూరు చుట్టూ, పొలాల చుట్టూ, పశువుల మీద 'పొలి పొలి' అంటూ కిలారింపులు చేస్తూ చల్లుతారు. దున్నపోతును నరికిన కత్తిని కూడా చేతిలో పట్టుకొని పొలి చల్లేవారితో పాటు వెళ్తారు. అప్పుడప్పుడు పొలి చల్లేవానికి పూనకం వచ్చి స్పృహ తప్పిపోతుంటాడు.

బుధవారం మధ్యాహ్నం 3 గంటల పైన భక్తులు పొర్లు దండాలను,

అడుగడుగు దండాలను పెడ్తుంటారు. అలాగే వెయ్యి కళ్ళ దుత్తల్ని తీసుకొని వచ్చి గంగమ్మను ప్రదక్షిణం చేసి పగులగొట్టి వెళ్తుంటారు. కొందరు ఒక పొద్దులు (ఉపవాసాలు) ఉండి పూజించి,హారతులిచ్చి వెళ్తుంటారు. అలా గంగమ్మ బుధవారం రాత్రంతా పూజలందుకుంటుంటుంది. గురువారం తెల్లవారుజామున 5 గంటల ప్రాంతంలో గంగమ్మను రకరకాల పేర్లతో పిలుస్తూ, బూతులు తిడ్తూ, హారతులిస్తూ ఊరి బయట నీళ్ళలో నిమజ్జనం చేసేస్తారు.

ఇలా గంగ జాతరలు చిత్తూరు జిల్లా అంతటా జరుగుతున్నా, ప్రత్యేకించి కొన్ని ప్రదేశాల్లో ఎంతో వైవిధ్యాన్ని సంతరించుకొని, మన సంస్కృతిలోని గొప్పదనాన్ని, విశిష్టతను చాటుతున్నాయి.



పేరూరు గంగ జాతరలో దున్నపోతును బలిచ్చిన దృశ్యం



పేరూరులో తడికెలతో, చీరలతో చేసిన గంగమ్మగుడి

# అనుబంధం - 1
## గంగమ్మ కథ

అమ్మా నంటే పలికినావుగా గంగో రేణుకా తల్లీ
ఆపతేరు గడ తోసినావుగా గంగో రేణుకా
అమ్మా నువ్వుండే దిక్కడ ఆగభోగమే గంగో రేణుకో తల్లీ
నువ్ లేని దిక్కడ సీకటి కోనే గంగో రేణుక
అమ్మా ఉత్తర భూమన బుట్టావమ్మా గంగో రేణుకా తల్లీ
ఉల్లి పూల సీర కట్టావమ్మా గంగో రేణుకా
అమ్మా దచ్చిన భూమన బుట్టావమ్మా గంగో రేణుకా తల్లీ
దామరపు సీర గట్టావమ్మా గంగో రేణుకా.
అమ్మా పడమటి భూమన బుట్టావమ్మా గంగో రేణుకా తల్లీ
బాణాల సీర గట్టావమ్మా గంగోరేణుకా
అమ్మా తూరుపు భూమన పుట్టావమ్మా గంగో రేణుకా తల్లీ
తుమ్మి పూల సీర కట్టావమ్మా గంగో రేణుకా
అమ్మా నాలుగు మూల్ల కానస్సేవులే గంగో రేణుకా తల్లీ
నడమధ్యలో జోతి మలుగునే గంగో రేణుకా
అమ్మా నువ్వుండే దిక్కడ ఆగుభోగమే గంగో రేణుకా తల్లీ
నువ్ లేని దిక్కడ సీకటి కోనే గంగో రేణుకా
అమ్మా అంగటి ముత్తా లేసే వమ్మా గంగో రేణుకా తల్లీ
అన్నం తినకుండ సేసేవమ్మా గంగో రేణుకా
అమ్మా పక్కన ముత్తాలేసేవమ్మా గంగో రేణుకా తల్లీ
పడక పొందుకోను సేసేవమ్మా గంగో రేణుకా
నువ్వు గెముడ్ల సూలం నాటావమ్మా గంగో రేణుకా తల్లీ
వూరిపైన ఎగవ సూశావమ్మా గంగో రేణుకా
అమ్మా నాలుగు మూల్ల కానొస్సేవులే గంగో రేణుకా తల్లీ
నడ మధ్యలో జోతి మలగునే జైగిరెంకమ్మా

"ఆ అమ్మవారూ, ఆలచ్చిమీ, ఆ రాజరాజేశ్వరీ నీకు పిలిస్తే పలికి లిస్తే వరమిచ్చీ, ఆ అమ్మవారికే అంశభూషణాలు కలిగీ, అనగా ఆ

అమ్మవారికి ముప్పైమూడు ఆనందములు, ఆ తల్లికీ, ముకమున తల్లీ, జగమున తల్లీ, నారికి తల్లీ, నరలోకమున తల్లీ, ఎండలు గాసేటి ఎన్నూరు కోట్ల భూమండలము, సెంద్ర మండలము, సప్తరాల సముద్రాలామె అరిసేతి నున్నాది. ఆ తల్లీ రాజరాజేశ్వరీ ! "

అమ్మా నిన్నూ నమ్మినాముగా వెయికనులా తల్లీ
దేవి నిన్నూ నమ్మినాముగా
అమ్మా నిన్నూ నమ్మినాము - అమ్మా నిన్నూ నమ్మినాము
ఆది మూలమైన శక్తి - వేదముల వెదికి తెచ్చి
బ్రమ్మ కిచ్చిన తల్లి గారివే అమ్మవారు నీవు
అమ్మ నిన్నూ నమ్మినాముగా
జాతరాలు సేతూ రమ్మకూ ॥ జాతరాలు ॥
జమినికాలు వాంతూరమ్మకూ
పోతూలు నరికిస్తూ రమ్మకూ
జోతులు వెలిగిస్తూ రమ్మకూ
సూడ సూడ వేదుకాయనే వెయి కనుల తల్లీ
నీకు సూడ వెయ్యి కనులాయెనమ్మా
దామినాయుడు పోతురాజు ॥ దామి ॥
దాటు దాటె నటన చేయ
సేవగల్లా సిద్దూలంతా సేరి నిన్ను కొల్తూరమ్మా
అమ్మ నిన్నూ నమ్మినాముగా వెయి కనులా తల్లీ
దేవి నిన్నూ నమ్మినాముగా
వేనిగాలు పీనిగాలు వేకమయ్యూ ఉండగామూ
అల్లు దండం సేసేవారు - పొల్లు దండం పెట్టేవారు
గండ జీమలు మోసెవారు - వేపసీరలు కట్టేవారు
వెయిగాండ్ల దుత్తలు వెత్తేవారు
సూడ సూడ వేదుకాయనే వెయికనుల తల్లీ
సూడ వెయ్యూ కనులాయె నమ్మా

"ఆయమ్మవారు, ఆ రాజరాజేశ్వరీ, ఆమే గంగాదేవీ, ఆమే నడీది గంగమ్మా, ఆమే దొడ్డి గంగా, ఆమే దొరసాని గంగా, ఆ అమ్మవారు మీకు పిలిస్తే పలికి, తలిస్తే వరమిచ్చీ, ఆ అమ్మవారికే అంశభూషణాలు కలిగి "

గణ నాయికా శివా గణ నాయికా
గణ న్నాయికా బ్రమ్మా గణ నాయికా
విద్దెల బుద్ది గల్లా వాడా
విద్దెల మేమడిగాము
విద్దెల మాకీయ వయ్యా విగినేశ్వరా
సదువులు సాము గల్లావాడా
సదువులు మేమడిగాము
సదువులు మాకీయవయ్యా స్వామి నాయికా
తొండముతో నీళ్ళు దెచ్చి
తోరము పూజాలు కడిగీ
నమసేతా పూజ వుంటవే విగ్గినేశ్వరా
కత్తరించినా సెరకు బిళ్లలూ
కాయలు కజ్జూర పండ్లూ
బొజ్జారాగించా వయ్యా గననాయకా
సేరదుతో సేరదు బోసీ
సెండూ మల్లాలూ జుట్టీ
సాంబ శివరా నీకు పూజ లే గననాయకా
మానెడుతో మానెడు బోసీ
మల్లాలు తాను జుట్టీ
మహదేవరా నీకు పూజలే గననాయికా

"ఆ విగ్నేశ్వర మహానుభావుడూ, గజానన బూతం, గణాతి సేవితం, ఫలహార భచ్చితం, విమోచితం జోగు విమోచకారణం, నమా విగ్నేశ్వరా నీపాద పంకజ బెట్టగాను, ఆ విగ్నేశ్వరు వివరంబు లేదు, పరమేశుడు తెలియంది పాట మివ్వలేదు గదా, ఆయన్ని గూడ వరణించి సభను నిలిపినాము. వెంటనే ఆ అమ్మవారు, ఆ శక్తి రాజరాజేశ్వరీ, ఆ అమ్మవారూ, కృతయుగం, త్రేతాయుగ ద్వాపరాయుగం నాలుగో యింతు అమ్మవారి కలియుగం జన్మించినాడు. కృతయుగంలో నగసింహావతారం, త్రేతా యుగంలో రామావతారం, ద్వాపర యుగంలో క్రిష్ణావతారం, ఇపుడు కలియుగానికీ, కలికంతానిండి యుండాడు మహాను భావుడూ, ఆ దశావతారాలు వేసీ, ఇపుడు కదుసారి కలికాన్నిండి ఉండాడు మహానుభావుడు, ఆయన్ని గూడా వరణించి సభను నిలిపినాము కదా. వెంటనే ఆ అమ్మవారు రాజరాజేశ్వరి, ఆ శక్తీ, ఆ గంగమ్మ,

ఆ 'ఓం' అనే బీజాక్షరీలో పుట్నాది,ఆ ఓంకార శబ్దంలో పుట్నాదీ. ఆ ఓం అనే శక్తి, ఆ రూపంతో జన్మించింది అమ్మవారు. చిన్న బిడ్డగానూ, మృదువుగానూ ఎనిమిదవ సారిలేదూ, కనింది కడసారి లేదూ, ఆ త్రినేత్ర మూర్తితో జన్మించింది అమ్మవారు. ఆ అమ్మవారు ఎట్లా పుట్టిందంటే. సిన్ని బిడ్డగానూ, మృదువుగాన్నూ, ఆ అమ్మవారు సతుర్ముఖంతో పుట్నాదంటా. ఆ సతుర్ముఖం వంటి అమ్మవారికి అనగా"

అరె దుత్తెడా రెట్టలయ్యా
ఆయమ్మ వారి పట్టెడ మెకేంబూ తల్లికైనా
సీమ తలాలా కన్నులయ్యా
మా యమ్మవారి శిరసున జడలూ ఓదేవీ
అట అరిసేతా పల్లికీలూ
ఆ యమ్మవారికి అమరియున్నాది జక్కోలా ఓదేవీ
అట ముంజేతా దరిసెనములూ
ఆ తల్లికి ముష్టి ప్రాదమూలూ అమ్మవారికే

" ఆ అమ్మవారికి కత్తి ఒక సేతనూ, అమ్మవారికీ, గెజంబు ఒక సేతమ, ఢెక్క ఒక సేతనూ, అమ్మవారికి ఢమరకం బొక సేతను, అసలమ్మ (?) దీసి అమ్మవారికి అంబోసి (?) పెట్టినాదీ, దుత్తల్ల మద్దొచ్చే, దిందుకో రత్నాల బట్టీనాదీ, రాక్షసుల గత్తిరించే, గందగద (?) రత్నాల బట్టినాదీ, రాయిదీ రంపం, బండేరు కొడవలి, ఉపరెదు శూలము, ఉచిరెదు గాలమూ, అమ్మవారు బండారు పంచివ్వడానికి బంగారు సేసిన కస్నాల పెట్టుండాదంట."

ఆ బంగారూ గెజనిమ్మపందు కస్నాన బెట్టిండాదమ్మవారు
"నాయనా ఏడు మనువుల గన్నేరాకుల గజన్నారశూలము"
ఆ నందల శూలము ఎడమ స్తాన పెట్టియుండాది
"ఆ యమ్మవారు"
ఆ ఎనిమది హస్తంబులు గలిగినా
ఆ యమ్మవారు యూపాత్రి గంగా
ఆ పండెండు హస్తములు గలిగినా
అపర భాగోతురాలూ
అట ముందర జూడగానూ
మన అమ్మవారికి మున్నూరు కన్నులూ

అట ఎనికల జూడగానూ
ఆ గంగమ్మకు ఏనూరు కన్నులూ
ఆ ఎంటు వంటి సందనా
ఆ యమ్మ వారికి వేలచ్చి కన్నులూ
ఆ పాపట బాపడ సందనా
ఆ గంగమ్మకు పదిలచ్చి కన్నులూ
ఆ నొష్టాత్రినేత్రం ఉండాదీ
మా యమ్మవారు కత్తి ఉండాదీ
ఆ కత్తు లివర కాసే
ఆ తొడిగినాది అమ్మవారు తొమ్మిది ముడ్ల దంతాల రవికా
ఆ వేసినాది అమ్మవారు నిప్పుల పెడవార ముసుగూ

"అప్పుడు అమ్మవారికి ఈపన కొ్రరూ అయింది. ఇన్నీపన కొ్రరూ, ప్రక్కన కొ్రరూ, అమ్మవారి ప్రాచ్చీపన కొ్రరూ, ఎదాన కొ్రరూ, ఎన్నీపన కొ్రరూ, పండెండు కొరువులమ్మ వారి పరావుళ్ళ సాంబవీ ! ఆ రూపంతో జన్మించింది అమ్మవారు. అమ్మవారికి పైదాళివి ఆకాశి, కింది దాళివి భూదేవి. ఆ లోపలా నాలుకా. ఏడు వూర్లు ఎలప ఎల్ల వేసి చూడాలా శక్తికి. నమ్మిన వారికి అమ్మవారు ఎంబడే సహాయబొచ్చును. నమ్మీ నమ్మన వారికి అమ్మవారు రొమ్మున గాల వేటున, మదంబట్న వారికి మట్టిలో స్థాపన జేస్తుండాది. కావరించిన వాళ్ళోటి అమ్మవారు కండల మీదాడ్తుండాది. పోత్సహించిన వాళ్ళోటి అమ్మవారు పొట్టల మీదాడ్తుండాది ఇటువంటి అకాల శక్తి, ఆ రాజ రాజేశ్వరి, ఇటువంటి రూపంతో పుట్టిందా శక్తి. అటువంటి అకాలశక్తీ ఆగంగమ్మా, అటువంటి రూపంతో పుట్నాదీ. పుట్టీ ఆదింతై, అంతై అమ్మవారూ ప్రాయానికి పధ్నాలుగు సంవత్సరాలొచ్చిందా యమ్మవారికి, ఆ పద్నాలుగో సంవత్సరంలో అమ్మవారు ప్రౌడమయిపోయింది. అమ్మవారు పుష్పవతి గలిగింది. పుష్పవతి అయితే, అపుడు క్రామ లోభా, క్రోధా, మద మాచ్చరం. ఆ యవ్వనమనే గుళ కలిగిందా శక్తికి, అపుడు యవనానికి పురుషుడు కావాలా. ఉండాడా ఎవ్వుడూ లేదు కదా. అపుడు అమ్మవారు జూసీ. అపుడామే ఏర్పాటు జేస్తుందా తల్లి. అపుడు మహావిష్ణు లేదు. ఈశ్వుదు లేదు బ్రమ్మదేవుడు లేదు. ఎవ్వరూ లేదు. కొండలు పొరిగిరి పర్వతములు, మధ్యలో మార్యాల మర్రి వృక్షములు. సప్తరాల సముద్రాల్లేదు. ఏమిలేదు. అమ్మవారు మింటికి సంటికి మెడాను దగ్గర, ఒక తట్టుకోసి, సేల్లోన నేత్రాలు పెట్టుకొని అమ్మవారూ. మన

అమ్మవారిని మించిందేమీలేదు మన గంగమ్మను మించిందేమీలేదు. ఆమే శక్తీ, ఆమే రాజరాజేశ్వరీ, అటువంటి అమ్మవారా శక్తీ, ఆరూపంతో పుట్టీ, అపుడు పురుషుని మీదా కోరిక కలిగిందామ్మగారికీ, అపుడు పురుషుడు, అపుడు ఆమే ఏర్పాటు చేస్తుందంటా తల్లీ, ఎట్ట ఏర్పాటు చేస్తుందంటే, అమ్మవారూ."

కుంచెలేకి కుడేసెమ్ జేర్చినాదీ
ఆకాశీ తీర్థం గొక్టంద్ర విబూదీ
"ఆ అఖిల్ బండారు, ఆయమ్మవారూ ఝల్లని మీట్నాదీ"

"అపుడు మహావిష్ణు అమ్మవారికే ఆ ప్రత్యచ్చ మవుతున్నాడూ తల్లికైనా అపుడు మహావిష్ణు ప్రత్యచ్చమైనాడు. ఓ విష్ణూ అన్నాది. ఓ విష్ణూ అంటే ఆయన ఏం తల్లా అన్నాడు. ఏం అమ్మా అన్నాడు. అమ్మా అనడం వల్ల అతిలోకే సరుడు, మన కోర్కె తీర్చదు, మన యవ్వనం తీర్చడనీ, అపుడా మహా విష్ణువు అమ్మవారు కడగా (వర్తుజేసిందా?) ఉంసేసిందా ఆ గంగమ్మ. రెండవది బ్రహ్మ సృష్టించినాదీ. బ్రహ్మకు నాలుగు శిరుసులు. నాలుగు శిరుసులుతో, ఆ బ్రహ్మ దేవుడు అపుడు ప్రసన్నమైనాడంట ఆ యమ్మవారికి. ప్రత్యక్షమైనాడూ. ఓ బ్రహ్మదేవా అంటే ఆయన ఏమి తల్లా అన్నాడు. అపుడు అమ్మవారు జూసినాదీ. మనం ఈ రూపంతో కోరుతుండాము. ఈ రూపంతో మనయమ్మవారు గంగమ్మ. ఈ రూపంతో ప్రత్యచ్చమవుతుండాదని, అపుడా బ్రహ్మ దేవుడ్ని కడగా పెట్టేసింది అమ్మవారు. అపుడు మూడోది ఆ యమ్మవారూ, ఆరాజరాజేశ్వరీ"

ఆ కుంచెలేకి కుడేసిం జేర్చినాదీ
ఆ కాశీ తీర్థం గొక్టంద విబూదీ
"ఆ అఖిల్ బండారు, మంతరించీ, అమ్మవారు ఝల్లన మీటిందంటా, అపుడు ఈశ్వరుడు ఆ మహానుభావుడు."

అపుడు ఈశ్వరుడో మన అమ్మవారికి ప్రత్యచ్చమాయెనే
ఓ ఈశ్వరా నాకోర్కె తీర్చవలెనూ
అన్నాదమ్మవారూ

"అపుడా అమ్మవారు ఆ కుంచెలో కుడేసిం జేర్చి ఆ అఖిల్ బండార్ అమ్మవారు ఝల్లున మీటిందంటా. అపుడు ఈశ్వరుడు అమ్మవారికి ప్రత్యచ్చమవుతాడు. ఎట్లంటే, ఆ ఈశ్వరుడూ"

పంచైదు ముకములూ, పంచైదు జడలూ

ఆ కలిగిన పరమార్థి శివుడూ
మన గంగమ్మకు ప్రత్యచ్చమవుతున్నాడో
ఆ వొళ్లళ్ల యిబూదీ
అయి వాలారి గోళ్ళు గదయ్యా
ఆ పదుతూల కక్షబాలా
అయిగ పిండుకున్న జడలూ
ఆ జడలే తిరి పిడములూ
ఆ జడలేనా కుందనములూ
ఆ ప్రావన జంజనములు
ఆ కంఠము రుద్రాక్ష ఈశ్వరుడికీ
ఆ కాయ వస్రములూ
ఆ కబండలములూ
ఆ పేమూ బెత్తమూ
ఆ గజన్నార శూలమూ
ఆ బంగారు పావు కోళ్లేసు కున్నాడో
ఆ సన్న రుద్రాక్షలు దండలూ
ఆ జపమాలికలూ
ఆ పొయ్యి వెందయ్యకో
ఆ విబూదీ పూతా
ఆ కట్ట వస్త్రం బయ్యకో
ఆ పులి తోలు కాపి కట్టిన వాడు ఈశ్వరుడూ
ఆ తొడుగు సాంబయ్యకూ
ఆ రుద్రాక్షమాలలూ
ఆ దేవదత్తమూ
ఆ డెక్క ఒక సేతనూ
ఆ శూల మొక సేతా
ఆ జింక తోలు ఆసనములూ
ఆ కలిగిన ఈశ్వరుడూ
ఆ రూపంతో గంగమ్మకూ
ఆ ప్రత్యచ్చమవుతుండాడో

“అపుడా ఈశ్వరుడు, ఆ గంగమ్మకు ఆ రూపంతో ప్రత్యచ్చమైనాడంట.

ప్రత్యచ్చమైతే, అపుడు సూసింది అమ్మవారు. ఈశ్వరా నాకోరిక తీర్చవల. నా క్రామ, లోభ, క్రోధ, మదయవనమును. ఆ యవనము తీర్చవల. ఏం చెప్తావు అని అడిగింది అమ్మవారు ఆ గంగమ్మ. ఈశ్వరుని అడిగితే, అపుడు ఈశ్వరుడు జూసి, సిన్న పెదవులా సిరునవ్వు నవ్వినాడు. పొక్కుడు తాంబూలాలు పక్కన పెదరినవీ. శక్తి ! ఆదిశక్తి, నువ్ సూస్తే అకాల శక్తిలా ఉండావు. అయితే అపుడా అమ్మవార్ని జూసీ అపుడు ఈశ్వరుడికీ"

అట వలంబుల దిరిగెనూ
ఆ ఈశ్వరుడికి వందనాలు పెట్నే గంగమ్మా
ఆ శరణం, శరణం అంటూ
ఆ సెయ్యెత్తి మొక్కినాదే
ఓ ఈశ్వరా నా కోరిక తీర్చవలెనూ
నా యవనం తీర్చు ఈశ్వరా
నా క్రామ, లోభ, క్రోధ, మదమాచ్చరం
తీర్చు అన్నాది గంగమ్మ

"అపుడు ఈశ్వరుడు జూసి, ఆదిశక్తీ, అయితే నువ్ సూస్తే అకాల శక్తిలా ఉండావు. నీకు పైదాళివాకాశి, నీకు కింద దాళివే భూదేవి, నీ లోపల నాలుకుండాదే, ఏడు ఊర్లు ఎల్లప ఎల్లవ దోస్తుండాది శక్తి. సూరెసెంద్రాదులు, సూడు ముక్కోటి దేవతలు, మునులు మునేంద్రులూ, యేగేశ్వరులు, సకల సంపన్నులూ, సాదులు, సిద్దులూ, నంబులు, వైష్టులు, ముని కన్నికలు, మునేంద్ర కన్నికలు, దేవ కన్నికలు, దేవేంద్ర కన్నికలు, దేవాతిదేవతలంతా నీ తిర్వాకుల అమరి యుండారే శక్తీ, ఆదిశక్తి దేవీ."

నీకు దుత్తడు రెట్టలూ
నీకు పట్టెడు మొకంబు దేవీ
సీమ తలాల కన్నులూ
నీకు శిరసున జడలు దేవీ
నీకు అరసేత పల్లికలూ
అమరి యున్నాది జోక్కోలా దేవీ
నీకు ముంజేత దరిపెనములూ
నీకు ముష్టి ప్రాదములూ
ఆ కత్తి ఒక సేతనూ

నీకు గజెంబు ఒక సేతబట్టి ఉండావు గంగమ్మా
ఆ డెక్క ఒక సేతనూ
నువ్ డమరకంబొక సేతనూ
నీకు ఆసర్ల మధ్యాచ్చా
నువ్ అంబులు సేత పట్టుండావు దేవీ
నువ్ దుత్తర్లు మధ్యాచ్చా
ఆ దిండుబల అస్తాన బెట్టి ఉండావు
ఆ రాక్షసుల గత్తరించా
ఆ గండ కత్తి అస్తాన బట్టి ఉండావు
నీకు రాయిది రంపమూ
నీకు బండేరు కొడవలీ
ఆ ఉక్రెద్దు శూలమూ
నీకు ఉచ్చులది గాలము
ఆ బండారు పంచివ్వడానికే
ఆ బంగారు సేసినయున్న
అస్తాన బట్టి యుండావు తల్లీ
ఆ బంగారు గజనిమ్మ పండూ
ఒక అస్తాన పట్టి యుండావు దేవీ
ఏడు మనువుల గన్నేరాకుల గజన్నార శూలమూ
ఆ యంద నందల శూలమూ
ఎడమస్తాన బట్టి ఉండావు శక్తీ
ఆ ఎనిమిది అస్త్రములు గలిగినా
ఆ యూపాత్రీ గంగా
నీకు పన్నెండు అస్త్రములు గలిగినా
నీ పన్నవ భాగోర్తురాలవు నీవూ
నీకు ముందర జాడగ మున్నారు కన్నూలూ
నీకు ఎనికల జూడగ ఏమూరు కన్నులూ
ఆ ఎంటిమంటు పందనా
దేవీ నీకు వేలచ్చ కన్నులూ
నీకు పాపట బాపట పందనా
నీకు పది లచ్చల కన్నుల దేవీ

నీ నొష్టా త్రినేత్రముండాదీ
ఆ కట్టి ఉండావు కత్తుల పీర కాసీ
ఆ తొడిగి ఉండావు తొమ్మిది ముడ్ల దంతాల రవికా
ఆ వేసి ఉండావు నిప్పుల పెడవార ముసుగూ

"ఈపన క్రొరు, ఇన్నీపన క్రొరు, పరతన క్రొరు,ప్రొచ్చేపన క్రొరు, ఎదానక్రొరు, ఎన్నీపన క్రొరు, పన్నెండు క్రొరుల పరావళి సాంబవీ. ఇటుమంటీ అకాల శక్తిగా ఉండావే, ఆది శక్తీ"

నువ్ కుంచె బోసి కట్టి ఉండావో
ఆ కోనలమ్మ సిరా
నీ వరనించి కట్టి ఉండావు దేవీ
ఆ వారంచు సీరా
నువు పాలించి కట్టి ఉండావు
ఆ పప్పుళ్ల సీరా
ఆ నాన్నెముతో కట్టి ఉండావు దేవీ
నల్ల బారాల సీరా
నువు దగ దగ మెరిసేటి
ఆ దండలు ధరించి ఉండావు దేవీ
ఆ నిగ నిగ మెరిసేటీ
ఆ నీలాపు గాజులూ
ఆ ఇటుమంటి అకాల శక్తిగా ఉండావు దేవీ
నీ కోరిక నీ యువనము తీర్చుమన్నావే శక్తీ

"అని అన్నాడు ఈశ్వరుడు. ఆ రూపంతో జెప్పినాడు. అపుడు అమ్మవారు జూసినాదీ. ఆ గంగమ్మ జూసీ, అయితీ ఈశ్వరా, అయితే ఏం నువ్ కోరేది. ఈశ్వర నీకేం కావాల. అడగంది నీ తప్పు. ఇయ్యంది నా తప్పా? అన్నాదమ్మవారు, ఆ గంగమ్మ. ఆ మాట పెప్పింది. అపుడు ఈశ్వరుడు జూసీ, ఏమీ లేదూ,ఆదిశక్తీ, నీ త్రినేత్రం ఉండాదీ, నీ మూడో కన్ను, నీ నేత్రమూ. ఆ మూడో కన్ను నాకిచ్చి నట్టొతే, నీ కోరిక, యువనం నేన్ తీరుస్తానన్నాడు ఈశ్వరుడు. ఆమాట జెప్పినాడు. అపుడా గంగమ్మ జూసీ అపుడా శక్తీ, సరసరా ఉప్పొంగి సంతోష పడినాదీ. అయితే అపుడమ్మవారు, ఆ శక్తీ, ఆ గంగమ్మ, ఆ

మూడో కన్నును, ఆ ఎడమ చే బొటన ఏలితో, ఆ మూడో కన్ను ఇచ్చేసిందంట ఈశ్వరుడికి. ఆమూడో కన్ను ఆమె నొక్కినాదీ. ఈశ్వరుడికిచ్చేసి నాదీ. అపుడు ఈశ్వరుడూ, అపుడు నొష్ట్న దాల్చుకున్నాడు. అమ్మూడోకన్ను నొష్ట్న దాల్చుకొనీ, మన ఆ గంగమ్మను పాలించినాడంట. పాలించి, దుష్టించి పార జూసినాడు. పారజూస్తే, అపుడా గంగమ్మా ఎట్టుండాదంటే తెల్లటి సీర గట్టుకొని, ఆ శక్తి, అకాలశక్తీ, ఆది పరాశక్తీ,ఓం శక్తి, ఓంకార శక్తి, ఆ శూలమొక పేతా, డెక్కో సేత, అనగానూ ఇటువంటి అకాల శక్తీ, ఆ రూపంతో ఉండాదా శక్తి. తెల్లటి సీర ఎపుడు ఆ ఈశ్వరుడు దుష్టించినాడో. అమ్మవారును దుష్టించి పారజూసినాడు. చూస్తే ఆ తెల్లటి సీర. అమ్మవారికి వొళ్ళంతా రక్తమండలమై పోయింది అమ్మవారికి. వొళ్ళంతా రక్తమై పోయింది. ఆ తెల్లసీర కండలకన్న రక్త ప్రయోగమయిందీ. అపుడు అమ్మవారు బాండదోడై పోయిందంట, బాండదోడై పోయింది. అపుడు అమ్మవారు ఈశ్వరుడు జూసి అయితే అమ్మవారు ఇకమా గంగమ్మ మనిషిని తాక కూడదని, అపుడాయమ్మ, ఆ శక్తి, ఆ మంటలకు, ఆ బాధలకు,ఆ గంగమ్మ తట్టుకోలేక అపుడు అమ్మవారు అపుడామే ఏర్పాటు జేస్తుందంటా శక్తి"

ఆ కుంచె లేకి కుడేసిం జేర్చి నాదీ
ఆ కాశీ తీర్థం గోచ్చాతి బండారు

"ఆ బండారు అమ్మవారు ఝల్లని మీట్నాది. అపుడు వాయుదేవుడు, వాయుదేవుడంటే గాలి. గాలి ప్రయాణం చేసిందా అమ్మవారు గంగమ్మ. గాలీ, ఆ సుడిగాలి ఏర్పాటు జేసినాదీ. ఆ సుడిగాలిలో అమ్మవారు 'ఓ' అని గగనాన ఎగిరి పోయిందంట అమ్మవారు. సూర్య మండలం, సెంద్రమండలం, సప్తరాల సముద్రాల మీదికీ, అమ్మవాడు మూడు ఝుక్కాలు గడియకి, అమ్మవారు ఆ సముద్రాలు పట్టుకొచ్చేసిందంట అమ్మవారు. ఆ సముద్రాల వొడ్డుకొచ్చీ, అమ్మవారూ, ఆ సముద్రాల వొడ్డనా, ఆ సముద్రం ఈమిరి కున్నూ, సల్లన గాలికీ, అమ్మవారు అక్కడ డేరా కట్టు కున్నాది. ఒక జీలీభరతం తయారు జేసినాదీ, ఆ జీలీభరతం తయారుదేసి ఆ రథములో ఒక తటామని తెప్పగావించుకున్నాది. ఆ తెప్ప గావించుకొనీ, ఆ తెప్పలో అమ్మవారూ, యాపాకు తెచ్చీ, యాపాకు (తడిక) తవిద ఏర్పాటు జేసిందంట అమ్మవారు: ఆ యాపాకు తడుగు ఏర్పాటు జేసీ, ఉత్తరము, దక్షిణము, తూర్పు, పడమరా, నాలుగు పక్కలా నాలుగు తడిగలు ఏర్పాటు జేసిందా శక్తి. ఏర్పాటు జేసుకొనీ, ఆ సముద్రాల వడ్డనా, ఆ సముద్రం ఈ విరికున్నూ, ఆ

సల్లన గాలికీ, అమ్మవారు సల్లగ తూలుతుండాది. నిద్ర పోతుండాదీ, అపుడు సూశారు. అపుడు మహా విష్ణువు, ఈశ్వరుడు, బ్రమ్మ దేవులు సూసినారు. వాళ్ళేం జేశారంటే, మన అమ్మవారు, ఆ శక్తి గంగమ్మా. ఆ శక్తి గగలానికి, పోడ్సింది. సముద్రాల వొడ్డుకి పోయింది. సముద్రాల వొడ్డుకి పోయిందీ, ఇపుడింక కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం. మూడు యింతుగా జరిగి పోతుందీ. ఇంక కలియిగం పుట్ట బోతాదీ. కలియుగంలో నర్మానవులు జన్మించుతారు. ఆ నర్మానవులు జన్మించినప్పుడు, ఆ నర్మాల (నరమానవుల) దెగ్గిరా, ఈ కలియిగంలో మనమే దేవుళ్ళూ, మనమే స్రుష్టి కర్తలూ, మనమే లయకర్తలూ, మనం మించిన దేవుళ్ళొకరుండరని, వాళ్ళేం చేశారంటే, వాళ్ళక్కడ వోంగుండాలు, సిరిగంధపు సెక్కలూ, నెయ్ డబ్బాలూ, ఏస్కోని, 'హో ' అని హోమం వెలుస్తుండారంట. ఓం కేశవాయనమః, ఓం మాధవాయనమః, ఓం అచ్చుతాయ నమః, ఓం శేషాయ నమః, ఓం దామోదరాయ నమః 'ఓ' అని హోమం వెలుస్తుండారంట, ఎవరు విష్ణు, ఈశ్వరుడు, బ్రమ్మదేవుడు. వాళ్ళు హోమం వెలుస్తుండారూ, అపుడు యతీశ్వరులు, మునీశ్వరులు, నారదులు, కిన్నెర, కిన్నీర్షులు, ఇరవై మునికన్నికలు, మునేంద్ర కన్నికలు, దేవ కన్నికలు, దేవేంద్ర కన్నికలు, ఈ దేవాది దేవితలంతా అపుడు సూసీ, మన అమ్మవారు ఆ గంగమ్మ, ఆ శక్తి, మన గగనానికి పూడ్సిందే. అమ్మవారు సముద్రాల వొడ్డుకు పూడ్సింది అమ్మవారు. పొయ్యింది కాబట్టీ, మనమంతా దేవాది దేవతలంతా, మన గంగమ్మకు మంగళారతులెత్తుకొనీ, లచ్చనంగా, మన అమ్మవారి దగ్గరికు, గంగమ్మ దగ్గరికు పోవాల్సిందే. అని అనుకొని మాట్లాడుకొని పోతుండారంట అందరూ ఆ గంగమ్మ దగ్గరికి. పోతుంటే ఆ సముద్రాల వొడ్డుకూ, అప్పుడు విష్ణువు, ఈశ్వరుడు, బహ్మదేవుడు జూసినారు. అపుడు ఈశ్వరుడి జూసీ, మనమిక్కడ హోం గుండాలేసుకొని హోం వేస్తుండాం గదా. ఇక్కడుండి ఎక్కడ్కో పోతుండారే వీళ్ళు తెలియలేదనీ. అపుడు మహావిష్ణు, ఈశ్వరుడు, బ్రమ్మదేవుడు. వాళ్ళేంజేశారంటే, ఆ హోంగుండాల్ని అక్కడ సాలించేశారు. అక్కడ స్టాప్ జేసీ వాళ్ళు గూడా యెలబారినారంట అమ్మవారి దగ్గిరికి, ఆ గంగమ్మ దగ్గిరికి. నేరుగా వచ్చినారు, ఆ సముద్రాల వొడ్డుకొచ్చీ, ఆ సముద్రాల వడ్డన అపుడు అమ్మవారు ఆ గంగమ్మ ఆయాపాకు తడిగి గట్టుకొనీ, ఆ సముద్రం ఈవిరి కున్నూ సల్లని గాలికీ, సల్లగా నిద్రపోతుండాదంట. ఉండాదీ అపుడు ఈశ్వరుడు జూసినాడు, ఈశ్వరుడు, మహావిష్ణు, బ్రమ్మ దేవుడూ మన గంగమ్మకూ, వొలంబడి దిరిగి, వందనాలు బెట్టీ, శరణా అని సెయ్యెత్తి మొక్కినారు. సష్టావపడి దణ్ణం బెట్నారు. దణ్ణం పెట్టే, అపుడు అమ్మవారు

గంగమ్మ జూసినాదీ. అపుడు గంగమ్మకు కోపం వచ్చేసింది. ఈశ్వరా ! నీవేం జేసినావంటే, నీ కోరిక నేన్ తీర్చినాను. నాకోరిక నువ్ తీర్చలేదు. నాకన్ను నాకివ్వక పోతివీ. నా కోరిక నువ్ తీర్చక పోతివీ. అని అమ్మవారు కోపం కలిగి పూడ్చింది. అపుడు ఆమె ఏం జేసిందంటే, అపుడు ఆ కుంచెలేకి కుడేశం జేర్చి, కాశీతీర్థం గౌక్షంద్రవిబూదీ, ఆ అఖిల్ బండారు అమ్మవారు ఝుల్లన మీటిందంట వాళ్ళపైన మీటితే అపుడు ముగ్గురు పురుషులుగా వుండే, ముగ్గురు స్త్రీలా గావించేదా గంగమ్మ. స్త్రీల గావించేసినాది. ఆ స్త్రీయలు గావిస్తే, ఆ స్త్రీయలు అపుడు అమ్మవారికి ప్రచ్చాలు చేస్తున్నారంట. నడుంబట్టేవాళ్ళు, పాదాలు బట్టేవాళ్ళు, పాద పద జూసేదీ. మన అనుజాన్మా, అస్తాలు బట్టేది, శిరుసు బట్టేది, వాళ్ళు దాదిసేవ సేస్తుండారు. అపుడు సూసింది గంగమ్మ. మనమే పురుషులు ఏర్పాటు జేసినాం. మళ్ళిపుడు స్త్రీలు ఏర్పాటు జేస్తే మనకు ధర్మం గాదనీ, అపుడా గంగమ్మా, వేసింది బీజాక్షమూ, మంత్రమూ, రెండవది మార్చేసినాదీ, మరి తిరగా త్రిమూర్తులను ఏర్పాటు సేసిందంటా గంగమ్మ. తిరిగి పురుషుల నేర్పాటు జేసినాది. ఏర్పాటు జేస్తే, అపుడు సూసినాదు ఈశ్వరుడు. అపుడు ఈశ్వరుడు జూసీ ఆదిశక్తీ, గంగమ్మా, నీవు ఇపుడుగానీ, మాదగ్గరగాని దెబ్బదిన్నావంటే ఇంక యుగములు నాలుగ్గదా క్రుత యుగం, త్రేతాయుగం, ద్వాపరాయుగం, కలియుగం. మూడు యుగాంతరాలు జరిగి పోతావి. ఇంక కలియుగం పుట్ట బోతాది. కలియుగంలో నర మానవులు జన్మిస్తారు. ఆ నర్మాలు జన్మించినపుడూ నువ్వొక శక్తిగా నీకు ఆకాశ తెలీదు. నీవే నూట మహాశక్తులు. పన్నిద్రవేళగంగలు, ఊరికొక్క శక్తె వుబ్బటేల వల్ల. నీవే సాటు గంగా, నీవే సోటు గంగా, నీవే నడీది గంగా, నీవే దొడ్డి గంగా, నీవే దొరసాని గంగా, వూరికొక్క శక్తె వుబ్బటేల వల్ల. ఆదిశక్తీ అపుడు నీవేం చేయాలంటే, ఆ కలియుగంలో నీది ఏడు మణువుల గన్నేరాకుల గజెన్నార శూలము. మాది రామసెక్రం ఆ సెక్రమూ, ఆ శూలంగాని కలియుగంలో మనం ప్రయోగం జేసినామంటే. వేదుల్లేని గ్రామాలకంతా వేదులు గావించవల. వేనిక్కి పెద్ద గెజ్జి గావించవల. వొంటికి వాది పోట్లు గావించవల. గుర్రానికి కదుపు నొప్పి గావించవల. గొర్రులుకు మిడసరోగములు. మేకలకు గాలెమ్మ. కోళ్ళుకు కొక్కర తేగులు. పారేటి పిండుట పాటు కావించవలె. సంక బిడ్డల కంతా నువ్ సందు గావించవలె. నీవే దిన సెరువ, నీవే నెల సెరువ, నీవే యేండ్ల సెరువ. నీవే దగ్గులు, పడిసెములు, తీటలు, తిముర్లు, నీవే తట్టమ్మా, నీవే ముత్తమ్మా, నీవే ఆట్లాటమ్మా, నీవే నల్లమ్మా, నీవే పెద్దమ్మా, ఇటువంటిబాధరాని బాధలుకలిగించ వాల. బాధరాని బాధలు కలిగించి నావంటే, ఈ నరమానవులు, నీ భక్తులూ,

నీ సేవకులూ, ఆదిశక్తీ, నీభయానికి భయపడి, నీ పోరూ మంటలు గాలి తట్టుకోలేక, నీకు లచ్చినంగా, ఆది శక్తీ, వేపాకుతో వేరు దోరణాలు గట్టిస్తారు. వేపాకుతో వేరు దోర్ణాలు గట్టించీ, అనగ్గాన్నూ పెద్ద ఎనుపుగాల అంబుళ్ళు బెట్టి, ఆది శక్తీ, నీకు సలవ పందుళ్ళు వేయిస్తారు. సన్నటి యిసుకు బోయిపించీ, యూపాకు దోర్ణాలు గట్టించీ, మామిడాకు దోర్ణాలు మై మేను గట్టించి, వేపాకు దోర్ణాలు వేడుకగ్గా కట్టించీ, ఆదిశక్తీ, పెద్దయినప కళీయిల్లో అంబళ్ళు పెట్తారు. యినప కళాయిల్లో నీకు అంబళ్ళు బెట్టించీ, ఆదిశక్తీ"

ఆరు కూటు కుంభములూ
నీ ప్రాదానికి పెద్ద అడ్డముల పాడుగో
ఆ వడి కూడు కుంభములూ
పెద్ద వామల పాడుగో

"ఆదిశక్తీ పదునూరు పుక్క దున్నలు, పదునూరు బలి పిల్లలు, పెద్ద గొర్రెలు, లగిడీ పొట్టేళ్ళు, నీకు లచ్చినంగా ఆదిశక్తీ, పందం పశువు, పైపాదిలేసి, ఆరు మణువుల కుంకుమ, నీ ప్రాదానికి అడ్డబొట్టు పెట్టి, ఆ బొట్టు, పోవును సెవ్వలో, నల్లని ప్రాప్తి కాపించీ, నీకు భక్త్రాత్రేయా, నీకు సముద్రానికొక్క దినమూ, నీకు యేడాది కొక్కదినమూ, మనసిన్నారి శివరాత్రీ, వెన్నెలా కాళారాత్రీ, జాగారణ జరుసుతాది సంవత్సరానికొక దినం. ఆ మార్చినెల్లో, ఎట్ల జాగారం జేస్తారో అమాదిరిగా నీకు సంవత్సరం గంగమ్మకు నీకు లచ్చల కొద్ది జాగారం జేస్తారు. ఆదిశక్తీ అప్పుడు, జాతర్లుజేసి, ఆదిశక్తీ నీకు, నీపైన ఆ లాలిపాటలు, జోల పాటల, దూల పాటలు, ఆ బండకూతల మాటలుండాయే పెద్ద మాటలు ఆ ఏల పదాలు ఏస్తారు. ఆ బండ కూత మాటలు, పెద్దమాటలు పాడ్తారు. పాడినప్పుడూ అందువలన నీ క్రామ, లోభా, యువనం, నీ ఆనందం, సంతోషం, నీలచ్చల సంతోషం దీర్చి, నీ ఆనందమును దీర్చీ, లచ్చినంగా నీ భక్తులకు, నీ సేవకులకు, నీ బిడ్డలకు."

నువ్ లచ్చినంగా ఆదిశక్తీ
వారి ధనమునకు ధనలచ్చిమీ
నువ్. సంపదందు సంపదలచ్చిమీ

"వాళ్ళ సౌభాగ్య లచ్చిమీ, అందరపు లచ్చిమీ, ఆధారణ దేవతా, ఎవరైతే ఏ రూపంతో కోరుతారో, ఆ నరమానవులకు, నీ భక్తులకు, వాళ్ళు లచ్చినంగా అనగ్గానూ, వాళ్ళెవరైతే ఏ రూపంతో కోర్తారో వాళ్ళకు వరప్రసాదియ్యై

నీవు, వాళ్ళను లచ్చినంగా, సల్లగా కాపాడుతావు. అని అనాడు సెప్పినాడంట ఈశ్వరుడు. అదే మాదిరిగా విసికిని నాలుగు భాగాలుగా ఏర్పాటుజేసిందంట. సెయ్యమని సెప్పినా దమ్మవారు. ఈశ్వరుడికి సెప్పినాది. ఈశ్వరా విసుకను నాలుగు భాగాలుగా ఏర్పాటుజేసి, ఒక భాగం మహావిష్ణు భార్య లచ్చిమి, ఈశ్వరుడి భార్య పార్వతి, బ్రమ్మభార్య సరస్వతి అనగాన్నా ఇటుమంటి ముఖ్వురైగాళ్ళు మూడుభాగాలెత్తుకోండి. ఇగో నాలుగో భాగముండాదే అది భూభాగం మీద సల్లమనిందమ్మ వారు. సల్లితే అపుడు నూట మహా శక్తులూ, పన్నిద్దరవేళ గంగలు, వూరికొక్క శక్తె, ఉబ్బుటేలవేళ, అనగాన్నా నీవే వేషాలమ్మ, నీవే తాతాయగుంట గంగమ్మ, నీవే తాళ్ళపాక గంగమ్మ, నీవే నేరేళమ్మా, నీవే ముత్యాలమ్మా, నీవే అంకమ్మా, ఆ రాజరాజేశ్వరీ, నూట మహాశక్తులూ, పనిద్దరేళ గంగలూ."

అత్తేలుపులు, సత్తేలుపులు
ఊరికొక్క శక్తి ఉప్పుటెల్లాల శక్తి

"అందువలన నీకు సంవత్సరమూ, ఏడాది కొక్కదినమూ, చిన్నారి శివరాత్రి, పెన్నాలా కాళాస్త్రీ ఆ ఈశ్వరుడికెట్లా జాగారణ జరుపుతారో, ఆ మాదిరి నీకు సంవత్సరం ఆ చిత్రినెల్లో, ఆ మేనెల 12,13 వతేదీ అశ్వానికి వైజయయ్యాత్ర జేసి"

వైజయ్యాత్ర చేస్తారో
అందరు ప్రజల్ని లచ్చినంగా నువ్ కాపాడీ

"నీ భక్తులకు, నీ సేవకులకు, నీ బాలలకు లచ్చినంగా కాపాడాల."[1]

---

1. చెంగల్రాయులు, దాసరి మఠం, తిరుపతి. (పంబలవాద్యగాడు)

# అనుబంధం - 2

## తిరుపతి గంగ జాతర ఏల పాటలు

1. "ఏ ..... నా కట్ల కట్లా కడవెత్తుకోని ఈదిలో గంగమ్మా
   మెట్ల బాయికే నీళ్ళాకు బోయెనే
   అట్ట మెట్టు జారే ముట్టు నిలిశా ఈదిలో గంగమ్మా
   కడవలోనే కొడుకు జన్మించినాడే"[1]

2. "ఏ ..... నా కన్నతల్లీ కరువు రాలూ నడీది గంగమ్మా
   నీకు కనమ కవతలా ఒక మనువు దెచ్చానే
   అట్ట కనమ లెక్కి దిగేటప్పుడు నడీది గంగమ్మా
   కంటి నీరూ రెండు కడవలకాయనే" [2]

3. "ఏ ......నా సుట్టుగుడిశె సిన్నదంట ఈదిలో గంగమ్మా
   అది సూద్దామన్నా బైటెళ్ళిరాదే
   అటు కాళ్ళు కురస సిన్నవాడు ఈదిలో గంగమ్మా
   వాడు కట్టు దిట్టమే వాడు బరిసెనే" [3]

4. "ఏ ..... నా చెల్లి వెల్లంది చెంగారెడ్డి పిల్ల
   పై చేయికి పాలుమారింది పాతరేణిగుంట
   మిడిమాలం మిట్టకండ్రిగ - విరుపాయ్‌ది వెంకటాపురం
   చిన్నపెద్దాలేని చిత్తానూరు - దానధర్మం చేసే దావినేడు
   చక్కాని సెలికాడా రాజామొనగాడా
   అది చేరింది గదరా నా చంద్రగిరిలో" [4]

5. "నా తగులు కున్నాది తాటి మాకుల కండ్రిగ
   ఎగురబొయ్యేది ఎంకటాపురం
   సక్కాని చెలికాడా రాజా మునగాడా

---

[1] చెంగయ్య : ముళ్ళపూడి, తిరుపతి రూరల్ మండలం

[2] Ibid

[3] సుబ్బయ్య, ముళ్ళపూడి, తిరుపతి రూరల్ మండలం

[4] Ibid

అది రచ్చ కీడ్చీదీ రాళ్ళుసెరువుపేటో"[5]

6. "ఏ .... నాచుట్టూరా చున్నావు గచ్చూ
నా నట్ట నడమనా నాముజన్నో
నా నాముజౌన్నా నడబాయియా నీళ్ళో
ఏసిగన్నా వాళ్ళ లంచామిస్తే వోళ్ళు ముంచనీరే" [6]

7. "ఏ .....అట్ల ఎగవ రెడ్డేరి పల్లెంట - దిగువ రెడ్డేరి పల్లెంట
నట్టనడీదిలో గారబాయిన నీళ్ళ జేందే మా సిన్నా వాదినో
మా యన్నాకంటా చున్నాము బెట్టే
నా గగల మారగాన బొయ్యే నా కన్నెగింజా
బాటన బొయ్యే బటాని గింజా
వీధిన బొయ్యే విసినిగీరా - దోవన బొయ్యే దోచ గింజా
నా కల్లో బొయ్యే కందీ గింజా
వరాయి, తురాయి, సిలకా చిన్నమరిడో......
నా ఏలి సున్నమో మీ అన్న కంటదు"[7]

8. "ఏ .....నా చెట్టు పుట్టా నాబట్ట బైలూ
ఏసికన్నా దాన్ని పట్టాబోకో పైటసెరుగో
నా పచ్చి కదుపారమే ఆంటిద్రేహమే
ఏసికన్నా దాన్ని వత్తాబాకో నా వోరుగు పోగునే" [8]

9. "ఏ .... నా చీమ చీమ చింతా మాని కిందా
ఏసికన్నా నా చిన్నా దాన్నే తేలుగుట్టో
నా తేలుగాదురో, పాముగాదురో
ఏసికన్నా దాని మిండగాడే నాగోటిదెబ్బో" [9]

10. "ఏ ..... నా ఈతమానూ విల్లుగాదూ
ఏసికన్నా నా తాటి మానే నా తావూగాదో
నాతగులుకున్న వాడో మొగుడుగాదో

---

5. సుబ్బయ్య; ముళ్ళపూడి, తిరుపతి రూరల్ మండలం
6. Ibid
7. Ibid
8. Ibid
9. Ibid

ఏసికన్నా నా తగరపేం బంగారుగాదో" [10.]

11. "ఏ .... నా సన్నచన్నా యిబూదిరేకలే
ఏసిగన్నా నా చంద్రకాంతో రొమాలుగుడ్డో
అట సందు దోవనా నేను బోతే
ఏసికన్నా నా చంద్రకాంతో చలిమించినాదో" [11.]

12. "ఏ ..... నా ఏటి మింద ఏడు నెల్లూ తాతాయి గుంట సినగంగే
నువ్ ఎతికినాదే మరులు మందో
అట గుడబకుండా గుండుకిందా నడీది గంగమ్మా
నువ్ గుర్తు పట్టివే గురిజింజ మొలకనే"[12]

13. "ఏ .....గాలోజు దాటే గిలోజు దాటే ఈదిలో గంగమ్మా
గాజులమండ్రాము దాటే
అట గాజులామెనె తగుల కుంటె ఈదిలో గంగమ్మా
నావన్నె చిన్నెలు గాజుదొడిగెనే"[13]

14. "ఏ .....నా కుందేలికే కులుకులందమే ఈదిలో గంగమ్మా
నెమిలికేమో సోగలందమే
ఆ నడమదిరిగే నల్ల దానికే ఈదిలో గంగమ్మా
ఎడమ సేతీ గాజులందమె"[14.]

15. "ఏ .....నా రాళ్ళు సెరువు కట్టకిందా కలుపు దీసే మాసిన్న వొదినా
నీ ఎడమ రొమ్ముా ఎండతగిలో
అట నా కట్ట మింద పొయ్యే రామ సిలకా
సక్కాని చెలికాడా రాజా మొనగాడో
అట నీ గోరు గిల్లరా గొడుగులు బట్టో " [15]

16. "ఏ .....నాకరువుకే కాలానికే సాకిన పూ -- తాతాయిగుంట సినగంగే

---

10 సుబ్బయ్య ; ముళ్ళపూడి (తిరుపతి రురల్ మండలం)
11 Ibid
12 చెంగయ్య; ముళ్ళపూడి (తిరుపతి రూరల్ మండలం)
13 Ibid
14 Ibid)
15 సుబ్బయ్య; ముళ్ళపూడి (తిరుపతి రూరల్ మండలం)

నా కళ్ళు జూస్తా ఎట్టా బొయ్యేదే
అట కంబిడాలికే గంతగట్టే తాతాయిగుంట సినగంగే
నువ్ కానకుండా పొయ్యా రావలనే"[16]

17. "ఏ .....ఏహే ....దాని మొకము జూడా న(డంగు మొగము
నడీది గంగమ్మా
దాని మొకము జూడే సంపెంగ మొకము
దాన్ని సూసేవారే భూమిలో లేరే నడీది గంగమ్మా
అది సంపమానే మందు బెట్లేదే
అది ఏసోదమ్మ మానో దిగుకోనే నడీది గంగమ్మా
అది సంపేదానికే పయ్యానం వేసే
అది తెల్లవారే మిండగోడి పోరే నడీది గంగమ్మ
అది తెల్లవారి జామనో బిడ్డపోరే"[17].

18. "ఏ .....అడె ఏమ్మ మానో నిచ్చాన వేసే నడీది గంగమ్మా
ఆ పళ్ళు దాన్నే తగులుకుంటే
అట ఉండే ఉండే ఉండలేకో నడీది గంగమ్మా
పళ్ళుదాన్నే తగులుకుంటే
పళ్ళు దాన్నే పేరు సాటో నడీది గంగమ్మా
అది ఏమిజేసే ఏమి చేయవలెనే
అట మిండగోడో గోడు దెబ్బే నడీది గంగమ్మా
అది పోరు బడ్లేదో మొగుడు జంపే" [18]

19. "ఏ .....నా వచ్చేపొయ్యే దోవలోన తాతాయి గుంట సినగంగే
నీకు వగలకత్తే మంచమేశా
అట నువ్ కాదను కున్నావో, నేను గాదనుకున్నావో
పసిబిడ్డ ఏంజేస్తున్నదంటే
రైలు కాడికి బొయ్యింది, టికెట్ తీసుకునింది, రైలెక్కింది
అది రేణిగుంట టేషన్లో బండి దిగింది
బండాడ్నుంచి గూడూరుకు బొయ్యింది

---

16. చంగయ్య ;ముళ్ళపూడి (తిరుపతి రూరల్ మండలం)
17. సుబ్రమణం ;ముళ్ళపూడి (తిరుపతి రూరల్ మండలం)
18. Ibid

గూడూరు నుంచి అబ్బ దానబ్బడాల
ఎట్టెట్ట పోతున్నదంటే ......................
గూడురులో చేందబాయి కాడ
నీళ్ళు చేందే మా విన్న వొదినా
సుంయున్న కంతా సున్నం అందియ్యే
నా ఏలి సున్నము మీ అన్నకందదు
దోవనబొయ్యే దోసగింజా - చేలో పోయే చీనిగింజా
ఈతమాను ఇల్లు సొచ్చిగా - తాటి మాను తావు సొచ్చిగా
శ్రీ పెరుందూరు రెండూళ్ళు సందనా
వొంటిగున్న వారధికాడ - నాతగ్ దిట్ కానీల్లేసుకోని
దిండూ దీవానమేసుకోని
అబ్బా దానబ్బడాల అది తాతాయిగుంట
కట్టమింద కాలు మింద కాళ్ళేసుకోని
అది తిత్తిలో చెయ్యేసి కుంటే
నా నూటు మిందా చిల్లరుండెనే" [19]

20. "ఏ .....ఇట బండ్లు బండ్లు చీరగట్టకొనీ
బటానాల రయిక వేసుకొనీ - వొసే నీ అబ్బడాల
పిడికిడొక్కలు, పిడికిడాకులు
కలబులా నవ్వులు కుంటా
డబ్బుడబ్బడే పోతూ వుంటే - వొసే నీ అబ్బడాలా
నిను బాటక పక్క బొల్లిచ్చు కుంటే" [20]

21. "ఏ .....అట నిన్ను జూస్తే ఎట్లావుండే
దాని పూ.- దానెబ్బడు దెం -
దాని పూ - దాని విన్నాయున దెం-
వొసే నీ అబ్బడాలా
లంజా ఈ పొద్దు జూస్తే - మారీమొకమే" [21]

22. "ఏ ..... అట పొట్టిదంట పొడగాటిదంటా
తాతాయిగుంట పినగంగే ఒసే నీ అబ్బడాలో

19. వెంగయ్య ; వుల్ళపూడి (తిరుపతి రూరల్ మండలం)
20. రాజాగోపాల్, కొర్లగుంట (లేదా)కుశాలపల్లి
21 Ibid

నా పొన్నకాయల గుబ్బాలిదంటా
అట ఇచ్చినోనికి ఈడులేదే
తాతాయిగుంట సినగంగే ఒసే నీ అబ్బడాలో
అడిగినోనికే దమ్ము లేదే" [22.]

23. "ఏ ....అట తాటి మాను సక్కదనమే - వొసేనీ అబ్బడాలో
అట తాటి మాను సక్కదనమే
వొరబ్బే సిన్నోడా తాతాయిగుంట సినగంగే - వొసే నీ అబ్బడాలో
నే తాడు లేందే నే నెక్కలేనే
అట్ల రయిక చిట్లిరా రగతమాయెనే
వొరబ్బే సిన్నోడా తాతాయిగుంట సినగంగే - వొసే నీ అబ్బడాలో
నా రయికి చిట్లిరా రగతమాయా"[23.]

24. "ఏ .....ఏహే.. అట కమ్మా సిన్న దంటా
పొద పొదన లేసింది - పాలు బిర చేసుకుంది
సది బువ్వ చేసుకుంది
అద్దంలో చూసుకుంది - బాగుందనుకుంది
బొట్టు పెట్టుకున్నాది - కమ్మి దేగు తోటకు పొయ్యింది
కంబిడేలు కోసుకుంది - వొంటి కాడ వారధి దగ్గర
తనవంతుగోడు కోసం ఎదురు చూస్తాఉంటే
తిరుపతి మూలస్థానెల్లమ్మా .........
సాయంకాలం నాలుగ్గంటలకే - దాని వొంతుగోడు వచ్చా
సాయంకాలం నాలుగ్గంటలకే - దాని వొంతుగాడొచ్చి
ఏమే లంజా నీదేం ఆల్చం, నాదేం ఆల్చంలేదు
ముంత మామిడి చెట్టల్లో - గిచ్చుకుంటా గిల్లుకుంటా
పట్టుకుంటా కొట్టుకుంటేటప్పుడు
తలారి సుబ్బారెడ్డి చూపి - గ్రామ సుబ్బారెడ్డితో చెప్తే
గ్రామ సుబ్బారెడ్డి వచ్చి - దాని కొప్పు పట్టుకొని
పడంగా లేవ కొడ్తావుంటే
ఒరే వన్నెగాడడ కూల కర్ముడా

22. A. గురవయ్య; జ్యోతికాలని, అక్కారంపల్లితిరుపతి రూరల్ మండలం)
23 Ibid

తలారి చిన్నోడా తప్పుగల్ల - మన్నించరా తలారి చిన్నోడా
నువ్ వదులు కోరా .... పోరా ఏహే" [24]

25. "ఏ ..... ఇట నా ఎఱ్ఱ చినమ్మ నాబఱ్రె చినమ్మో
మంచి మంచోళ్ళు కల్లో కొస్తారు
కాదు కానోళ్ళు కల్లోకొస్తారు
జాజి కాయేస్కో మాసి కాయేస్కో - ఒసే నీ అబ్బడాలా
నా కమ్మలిస్తా నువ్ వస్తావంటే" [25.]

26. "ఏ ....అది ఎత్తలకారి ఎల్లోన కొడకా
సారంగధరా వుద్దోడ మొలక
లేత్తోట మొలకా, వైరామచిలకా
నా చేతిలో పటికా వోరబ్బే పలకన్నా
నే డబ్బులిస్తా ఇక దుమ్ము లేపూ" [26.]

27. "ఏ .....ఇట చిలకలు రెండు కూడుకోని - ఒరబ్బే ! పలకన్నా
ఇక చిలవనూరూ ఇక భూమిదున్నే
ఇట చిలవనూరూ భూమిదున్నే - ఒరబ్బీ సక్కాని సెలికాడో
ఇక చిత్రమైనా ఇక చిత్రకోళ్ళు " [27.]

28. "ఏ .....ఇట తూరుపుటీది సిన్నదంట
పొదపొద్దన లేసిందంట - ముదువేరు చేసుకొన్నాదంట
గులమే చేసుకున్నాదంట - అలవే చేసుకున్నాదంట
కడవెత్తి సంకన పెట్టుకున్నాదంట
బాయికి పోయిందంట
రెండుగాళ్ళ పంగ దెరిచిందంట
వొంగి చేందేటప్పుడంటా - ఒరబ్బే పలకన్నా
మాయన్నకంటూ సున్నాముబెట్టో
అరె దోవలో ఏసిన దోవగింజ
బాటలో ఏసిన బటానిగింజ

---

24. సుబ్బారాయుడు, బహుదూర్‌పేట (తెట్టు). శ్రీ కాళహస్తి
25 Ibid.
26 Ibid.
27. Ibid.

నా దారి కొచ్చిన దోసగింజ - ఒసే నీ అబ్బాడాల
నే పువ్వులిస్తా నువ్ పక్కయిస్తా" [28]

29. "ఏ ....అదో కాళాస్త్రిలో సాకలిసిన్నదంట
పాద పొర్దన లేసింది - పలువరస చేసింది
సాదు చుక్క బెట్టింది - కళ్ళకు కాటుకేసుకుంది
పూల చీరేసుకుంది - నల్ల రైకేసుకొంది
నల్ల బొగ్గు లేసుకొంది - నిలువుటద్దంలో నీడచూసుకొని
పిడుగు రాళ్ళుచేత బట్టుకొని - పలుకు సున్నం రాసుకొని
అగడ్తల వీధిలో - అగరాల పేట సందులో
అగరాల పేట సందుకాడ
అంస బాయిలో నీళ్ళు చేదే మా వొదినగారో
మాయన్న కంటా చున్నాము బెట్టో" [29]

30. "ఏ .....అది ఏలెవారు మహానుభావ మా దొరగారో
మేం బిడ్డలామూ మే మొచ్చినాము
ఇంక వారి వారి నగిరి ముందర మహానుభావా
నీ బిడ్డలమూ మే మొచ్చినాము
అగో కాకులాలు గద్దలాలూ
ఇంక నెమిలి పిట్టలే ఇంక డేగలాడే" [30]

31. "ఏ .....ఎగువ మల్లారమంట దిగువ మల్లారమంట
రెండూళ్ళ సందన కొప్పరోళ్ళపల్లి
కొప్పరోళ్ళ పల్లో ఇద్దరక్కచెల్లింద్రు
అక్కను చూసిన కంట చెల్లిని చూడగుండ్లేదు
చెల్లిని చూసిన కంట యక్కను చూడగుండ్లేదు
యావూర్లో యప్పాసామి - యప్పాసామి కొడుకు కుప్పాసామి
కుప్పాసామి కొడుకు సారాముస్వామి
సారాముస్వామి కొడుకు నాకైదు రూపాలిచ్చినాడు
యెరువు యిచ్చినాడు - చెల్లికి ఐదురూపాయిలిచ్చినాడు

---

28 సుబ్బరాయుడు, బహదూర్ పేట (తెట్టు) శ్రీ కాళహస్తి
29 శ్రీనివాసులు, కాళహస్తి (తెట్టు)
30. Ibid

యెరువు యిచ్చినాడు
తిరుపు తిరుపు ఎండవాయే తాతాయిగుంట చినగంగే
పనికి విచ్చినా ఎన్నిజడలే - వాళ్ళుత్తగారూరు నడవలూరు
నడవలూరు నుంచి నలుగురొచ్చినారు
నూరే మందుకు నులుగులేదు
పోచే మందుకు పొందులేదు
ఇరుగు పొరుగు ఇందలేదు - పొరుగుపూరు పొందలేదు
నలుగు నాలుగు రూకలేచుకొని
డోరీ కట్టించుకోని - డోరిలో పెట్టుకొని
జల్లాసుపత్రికి వెత్తేటప్పుడే వేషాలమ్మో
వాడాలి బిడ్డలు వాడాసాలిడిపెనే"[31]

32. "ఓ .....ఓహో ఓహో
పరమట చినదంట ||ప ||
పొగులు జుకుదంట - రావే నీయక్క రాకాసి నీయక్క
అట్టారిసి పొగ పొద్దనే లేసింది - పొలువరుస చేసుకునింది
సాలా సద్దికూడా బోంచేసుకునింది
సాల్తాత్రక మెత్తుకునింది - నాయమైనోడు దెం--
చీనాపల్లికొచ్చింది - చీనా పల్లి రెడ్డికొడుకు
పొద్ద పొద్దన లేసినాడు - పలువరస చేసుకున్నాడు
సాలా సద్దికూడు భోంచేసుకున్నాడు
సాల్తాత్రకమెత్తుకున్నాడు - విద్దురు కలుచుకున్నారు
పిగిలేరుకొచ్చినారు - పిగిలేరు బస్టాండులో
బస్సెక్కినారే ... వేషాలమ్మో - తిరుపతోడు బజారు జేరేను
ఆ తిరపతోడు బజారు జేరిందీ
కాటిక గంధం తీసుకునింది - కొప్పుల్నల్లుకుంది
పిడికిడొక్కలు పిడికిడాకులు తీసుకునింది
సేత బట్టుకునింది - మిడిగుడ్లు మొకంది
మిటాయి మొకంది - కనుసోగలు కలిసింది
కరకంబేట చిన్నది - యామలపూడి కొండల మింద
ధరలు తాల్చటప్పుడే ఏసాలమ్మో

---

[31] వెంకటనాగులు, శేషాపురం (రంగపేట దగ్గర) చంద్రగిరి మండలం.

నువ్‌యెట్ట జూడీ సీ మర్దిసాయే" [32]

33. "ఏ .... ఆ యూకాసాన పోయే దానా ఒసే సీ అబ్బాడాం
 సీకు వాతులేమే అంత పొడుగో
 మా ఇంట్లోవాడు పిండిగాడే తాతాయిగుంట సినగంగే
 పిండి గడ్డనే వాడు పెంచినాడే" [33]

34. "ఏ ..... కల్లలంటే పుల్లలేరే
 ఏ బిడ్డి సుందరాసాయిత్యాదాని వంటే
 దొండ పీజిత నువ్వు దిండూగట్టెనే
 ఆ ఎత్తలేక ఎద్దల బండి ఎదిగి
 సుందరసాయిత్యాదాని వమ్మే
 దించలేక దిగులు బడితివే" [34]

35. "ఏ ..... ఈమ మొగ్గా విలాయిమొగ్గ
 ఏసాలమ్మా
 మల్లి మొగ్గనే నువ్ చూడలేదే
 ఆ ఇమ్చ విరజల్లుగుడ్డ పీకి పారేసికుండెనే
 ఏసాలమ్మా
 ఎప్పుడు బాయెనే ఈ దోవనేమో "[35]

36. "నా పొట్టిదంట పొడుగోటి దంట సక్కనిసెలికోడో
 నా పొన్నకాయల బుగ్గాలిదంట
 అట్టాదే మనూళ్ళో వుంటే ఏసిగన్నా
 ఇక వన్నె కొక్క బిడ్డ పుట్టెనో" [36]

37. "ఏ ..... నువ్ ఆకులొక్కలు పంపినావు మునికిష్ణయ్యా
 నేను వరుస కాదు నేనేమి చేతూ
 నువ్ మల్లె మల్లె సరాలు పంపి మహానుభావా

---

32. వెంకటనాగులు; శేషాపురం (రంగంపేట దగ్గర) చంద్రగిరి మండలం

33 Ibid

34 Ibid

35 Ibid

36 తిరుపాలు, శ్రీకాళహస్తి

నే మళ్ళీ మళ్ళీ పడకలిస్తా " [37]

38. "ఏ ..... బుడబుక్కల తిమారెడ్డంట ॥ బుడ ॥
బూడ్డి గడ్డీ వెంగారెడ్డి- యావూరు యాపకుప్పము
ముచ్చగని బతికిన మొనెప్పనాయుడు తోపులోనే ఏసాలమ్మా
నువ్వు ఒప్పినావు కోడిపందెమూ
ఈ వార కోడి ఈ వార కొచ్చింది
యావార కోడి యావారకు బోయింది
సచ్చిన కోడి వొడ్డు పోయాడు
కొడుకు జేతికిచ్చెనే ఏసాలమ్మా
బంగపడిరి బాదూరు దొరలు" [38]

39. "ఏ ..... నారవాకు యిగురు వేసెనే తిరపాలి ఏసాలమ్మా
నాయుకురాలే కురులు దువ్వనే
అట గొడ్డురాలుకు బిడ్డలేలనే ఏసాలమ్మా
ముసిలిదానికే చూచు ఏలనే " [39]

40. "ఏ ..... అదొ తిరపతి తిరనాళ్ళకు పొయ్యేటప్పుడు ఏసిగన్నా
నా సాదుచుక్కలూ, సలవకోకలు
కస్కద్దిస్కాని కస్కద్దీసుకొని
అపీరోదికి (?) మాసికాగితం జల్ల (?) దగ్గరకు పోయేటప్పుడు
ఏసేమందు ఏస్తంటే - పోసేమందు పోస్తాడు
సక్కని సెలికోడు నామన్నెదొర
తిరిగి మజిలయ్యేటప్పుడు
సక్కని సెలికోడ నా మన్నెదొర
దానికేడుపు మొకమూ - యిడిబిడోపు గాళ్ళూ "[40]

41. "ఏ....... యవాలి కొండన ఎదురు మొలక పోయినమారి చిత్రినెల
గెరినాల మీద బొంగెత్తే సినమొకముదాన
ఇక ఎండితే సారకాయ బుర్ర

---

[37] తిరుపాలు, శ్రీకాళహస్తి
[38] వెంకటనాగులు; శేషాపురం
[39] I bid
[40] తిరుపాలు ; శ్రీకాళహస్తి.

నా చంద్రగిరి ఉక్కుతంతే మూలస్థాన ఎల్లమ్మ
యిక వస్నెకొక్కరూ పలుకు చిలికా
నే దుత్త కొప్పుబెట్టుకోని సక్కాని కిష్ణయ్య
గుంట కట్టకూ నీళ్ళకు బోతే
ఆ గుంట కట్ట గురవారెడ్డి సక్కాని పెలికోడా
ఇక దుత్త కొప్పురా గుత్తకడిగెనూ"[41]

42. "ఏ........ దాని పూ ----- లోనే వుండుబుట్టెనే ఏసాలమ్మా
వాని మొ ---- లోని గడ్డ లేసెనే
అ మందు లేక మాకు లేకనే ఏసాలమ్మా
మళ్ళి దెం ---- తే మాని పోయెనే"[42]

43. "హే ....... తిరపతి కచ్చేరిలోనే తాతాయి గుంట చినగంగే
మాతంగి పూవులే పూసినాయె
అట కోర్టు నుంచెల్ల బారి
వేసాల మానుకాడ తిరుక్కోని
వేసాలమాను కాడ్నుంచి బేరీధికి బొయ్యి
బేరీధినుంచి పెద్దీధికి బొయ్యి
పెద్దీధి నుంచి చినగాపు తోపులోకి బోయ్యి
చినగాపు తోపులోంచి నాలుగ్గాళ్ళ మండపం కాడికొచ్చి
నాలుగ్గాళ్ళ మండపం కాడ్నుంచి పెద్దకాపు దోవలోక్ బొయ్యి
కాయకర్పారం కోట్టుకొని
తిరిగి మజాలై వచ్చేటప్పుడే తాతాయి గుంట చిన గంగే
మాతంగి పువులు మాట లాడెనే"[43].

44. "ఏ ...... ఎగవ రెడ్డోరి పల్లె, దిగవ రెడ్డోరి పల్లె
రెండూళ్ళ సందన దరమరాజు దేవాలమూ
యక్కాను సూసిన కంట - సెల్లిని సూడను గుండ్ల
సెల్లిని సూసిన కంట - యక్కాను సూడను గుండ్ల
పొద్ద పొద్దన్నే లేసింది - పలువరస జేసింది

41 తిరుపాల్ - కాళహస్తి
42 వెంకటనాగులు - శేషాపురం
43. Ibid

చాద్పుక్క బెట్టింది - కండ్లక్కాటుకేచుకునింది
పళ్ళకు ద్రాచ్చేసుకొనింది - పలవకోక కట్టుకునింది
పద్దెన్నం బోంచేసుకునింది - కరణాల సుబ్బారాజు పిల్ల
కొడుకు లైదు మందంట - అందరికన్న కడుగొట్టోడు
మాటుకని తెలుసుకున్నోడు
వూరికి తూరుపుగా, టెంకాయతోపు
పడకలంటే పూసుకున్నారు
కురుకు, తెలుపు, నలుపు, ఎరుపు - అంటా జలిమించినాది
ఇస్తేమందులిస్తావుంటే ఇందలా
పోసే మందు పోస్తావుందే పొందలా
ఆ ఏలూరాస్పత్రికి పొయ్‌నారు - లక్కడా బాగ్గాల
ఎత్తారు ఆస్పత్రికి పొయ్‌నారు - అక్కడా బాగ్గాం
నాలుగ్గాళ్ళ మండపం కాడికొచ్చినారు
కాయూ కర్పూరం కొనుక్కున్నారు
దండమంటూ పెట్టుకున్నారు
వాళ్ళత్తగారూరు ఎగవ బొప్పరాజు పల్లె
వాళ్ళమ్మ గారూరు దిగవ రెడ్డోరిపల్లె
ఎచ్చేజాబులు వస్తావుంటే
పొయ్యేజాబులు పోతావుంటే
చక్కని సెలికాడా
నా చదువు కొడుకురా చావు జాబుకే" [44]

45. "ఆ ...... ఎగువ రామాపురమూ
దిగవ రామాపురమూ
రెండూళ్ళ సందనా దరమరాజు దేవలమూ
యక్కాను జూసిన కంట - చెల్లిని జూడగుండ్లే
చెల్లిని జూసిన కంట - యక్కాను జూడగుండ్లే
పొద పొద్దన్నే లేసింది - పలువరస జేసింది
సొద్పుక్క బెట్టింది - కండ్లక్కాటు కేసుకొనింది
పళ్ళకు ద్రాచ్చేసుకునింది - సలవ కోక కట్టుకునింది
సద్దెన్నం బోంచేసుకొనింది - కోమటి చెట్టి దగిరికి బోయింది
కాళ్ళో ఏళ్ళో పట్టుకొనింది

44. నెల్లూరి నారయ్య; చెంగారెడ్డి పల్లి

కాౖటాపాయా చేతికి దీసుకొనింది
సిద్దారెడ్డి దగిరికి బొయ్యింది
అర్ధరూపాయడిగి తీసుకొనింది
ఆకుతోటకాడికి బొయ్యింది
ఆకులంట కొప్పి గంప గొట్టు బెట్టింది
చిత్తానూరి కోనేరుకాడా
కట్టకడనా మొట్టమొదటా - రాగిమానూ రచ్చకాడా
కాలిమీద కాలేసుకోని - కూర్చొని వుండే మా పెద్ద హొదిన గారో
నీకి ఎండాలేదే గాలి లేదే" [45]

46. "ఏ ..... నాకన్న తల్లి కరువురాలే
నడీది గంగమ్మా
కనుమలెక్కి మనుషు దెచ్చెనే
నా గుండు రాళ్ళా గుండూములా
నడీది గంగమ్మా
నేను గురిది బడితిరా - గురిగింజ ములకనే" [46]

47. "ఏ .... నా చూరుడా ఉదయించేటప్పుడా
నడీది గంగమ్మా
చూరెకాంతా జలిమించినాదె
నా చంద్రుడా పుట్టునా చక్కదనమూ - నడీది గంగమ్మా
తప్పులేదే తల్లిసాలే " [47]

48. "ఏ ..... దాని దెం -- దెం -- పాయివాయె
తాతాయిగుంట చినగంగే
దేవరిల్లే కాలిపాయో - దాని దెం -- స కోవలోనే
తాతాయిగుంట చినగంగే
నా దద్దు కడగనూ నీళ్ళు లేవే " [48]

49. "ఏ ......యాపమానే చారవ నీళ్ళే నడీది గంగమ్మా
నీ ఎంటి రమ్మంటే వచ్చునంటే

---

45 వెల్లూరి నారయ్య; చెంగారెడ్డి పల్లి
46. Ibid
47. I bid
48 I bid

వొంటిగానే ఒకనాలి పొందే నడీది గంగమ్మా
నువ్ దుక్క పోతే దక్కునంటరూ " [49]

50. "ఏ ....నా పూ -- చిన్నది పొట్టుడాతులు చినగంగే
నేనెట్ల దెం -- దే నాదైవమా
నా బొట్టనేలు నిగడదన్ని తిరపతి సినగంగే
నువ్ కొట్టరా కొన గొ-దాకా "[50]

51. "ఏ ... అట గంగరేని చెట్టుకింద సక్కాని సెలికోడా
రెండుంగరాలూ నే మరసినాను
ఆ ఉంగరాల రంగుజూసి నడీది గంగమ్మా
నాకుండ లేదయ్యా ముండ మనసూ " [51]

52. "ఏ ..... అట నా వూరి ముందర ఉల్లిపూసె తిరపతిసినగంగే
మాలాడ ముందరా మల్లి మొల్చా
మాల మంగి మాటలిని మహానుభావా
ఇక మల్లె తీగరో మల్లె చూసెనో " [52]

53. "ఏ .... నా ఇచ్చు మొగ్గా ఇల్లాయి మొగ్గా నడీదిగంగమ్మా
అది ఎట్టా పాయా బడాయి మొగ్గా
నాయిచ్చి గుండా యిరదల్లి గుండా నడీది గంగమ్మా
ఇప్పుడు బాయరా ఈ దావనంటే " [53]

54. "ఏ ..... నా పట్టు గుబ్బల పట్టుకోనే తాతాయ్ గుంటా చినగంగే
తలుపు గుబ్బలా తన్నీకోనే
ఎద్దల కాడ్నే చీకటింట్లో నడీది గంగమ్మా
నేనెంత సేపూ ఎతలబడుదునే " [54.]

55. "ఏ .....న తొలి చమర్తా మలిచమర్తా రెండోసమర్తా
పెట్టిన పూ -- ఒసే నీ అబ్బాడాలా

---

49 నెల్లూరి నారయ్య; చెంగారెడ్డి పల్లి
50 తిరుపాల్ ; శ్రీకాళహస్తి
51 Ibid
52. I bid
53 I bid
54. I bid

కోసి దీగిట్లో పెట్టొచ్చినానే
పూ -- లో మొ -- బెట్టుకోని తాతాయిగుంట చినగంగే
ఎడమ చేత్తో బిగబట్టి కోనే
హోద మరిచా నిద్రబోతే తాతాయ్‌గుంట చినగంగే
పూ -- లో మొ -- యె కుక్క దెంకపోయెనూ " 55.

56. "ఏ .... నా మట్టె గుంట కాడ నడీది గంగమ్మా
దాని ఎర్ర పూ -- తేలు గరిసెనే
తేలుగాదు పాముకాదు నడీది గంగమ్మా
దాని కొన గొల్లెరా కొక్కరిచ్చెనే "56.

57. "ఏ ..... నా వగలకు వడమాల పేట
సిగ్గుకు సిరాశపాలెం - పెగ్గుకే పెడకంటి పల్లి
సక్కని చాపమూర కంద్రిక - నా ఎనక నడవలూరు
కుదిరెనో కొంత్రపాకం - తలుకైన తనప్పల్లి
నానగ ననక్కాలవ - తీరైన తిరప్తిబొయ్యి
అపరపు సప్పరం దీసి - గంగిరెడ్డి మాకలకాడ
మెరిసేటి కచ్చేరి కాడ - పది పలకోళ్ళు, రెండు తాజోళ్ళు
నాలుకొమ్మోళ్ళు, తట్టుకోయాపనం కుట్టుకొని
ఆడుకుంటూ పాడుకుంటూ - ఏడున్న గంటలకంతా
ఏసాలమ్మ కాడికొచ్చి - కాయా కర్పారం తీసుకోని
దండ ప్రమాణం జేసుకొని
యాయపరపు సప్పరం నేలకు పెరికిపారేసి
ఆ ఏసికంతేన్, యారత్తోనే దాని జాడబట్టుకొని
దొన్లోకం బొయ్యెగుండు
దిగవుంట్లో పట్టెమంచమేసుకొని,
పాను పేసుకొని పేతులు కాళ్ళు అదుంకోని
గజం కట్టు మొలగో సడగతుంటే
లోకు మాతయా నే నడపే కాళ్ళు పట్టీనాదే "57.

---

55. తిరుపాల్ ; శ్రీకాళహస్తి
56. **Ibid**
57. మూగయ్య; కుంత్రపాకం (తిరుపతి రూరల్ మండలం)

58. "ఏ ..... నా వగలకు వడమాల పేట
సిగ్గుకే సిరాశ పాలెం - పెగ్గుకే పెదకంటి పల్లె
సక్కనైన చాపమూర కండిగ - నా ఎనక నడవలూరు
కుదిరైన కుంట్రపాకు - తలుకైన తనపల్లి
నానగ ననక్కాలవ - తీరైన తిరప్తికి పొయ్యి
అప్పురపు సప్పురం దెచ్చి - గంగిరెడ్డి మాకల కాడ
మెరిసేటి కచ్చేరికాడ - పదిపలకళ్ళు, రెండు తాజల్లు
నాలుగు కొమ్మాలు - తట్టుకో యాపనం గుట్టుకోని
ఆడుకుంటూ పాడుకుంటూ
అడ్డబేరి మత్తకొచ్చే కాడికీ గంగమ్మా
నీ కెదురే దగిలేయో ఎర్రచిన్నదీ - ఆ ఎర్రచిన్నదే దాన్ని
నిల్చుకుంటే నిల్చుకో గుండ్లే - ఆడుకుంటే ఆడగుండ్ల
పాడుకుంటే పాడగుండ్ల - పనుకుంటే పడక్కుదర్లా
మందులో మందుగుదరకుంటా
పెదకామందు కడకు బొయ్యి
పెదకామందు కాడ్దెంగో లెప్నోసేసుకోని
చినకామంద కడకు బొయి
చినకామందు కాడ్దెంగో దండపాన్‌జేసుకోని
ఆ యుప్పురపు సప్పురం - నిలవన పెరికి పారేసి
ఏస్కోంటేనే యారంతోనే - దాని జాడ బట్టుకొని
దానిలోకం పొయ్యిగుండు
దిగవింట్లో పట్టుమంచెం వేసుకోని
పాను పేసుకోని - సేతులు కాళ్ళు అదుంకొని
దర్జంజాట్టు మూలదోసె అడగతుంటే
అబ్బే ఏసిగన్నా వాడిసె కాళ్ళు నిన్ను పట్టీనాదీ
జడ్‌జక్, జడజక్, జడ్‌జక్ "[58].

59. "ఏ ...... నా ఎద్దె పేరు వెలక పండూ అబ్బే ఏసికన్నా
నా యావు పేరే యరటి పండూ
నా పరమటీధిలో నీ లంజిపేరు అబ్బే ఏసికన్నా
పాదరసమూ గెజనిమ్మ పండూ " [59].

---

58 Ibid

59. మూగయ్య; కుంట్రపాకం (తిరుపతి రూరల్ మండలం)

60. "ఏ ...... ఆ తాటి మాను పక్కదనము అబ్బేఏసికన్నా
నువ్ తాడు లేందే ఎక్కబాకా
అట మామకూతురు మంచిదని అబ్బే ఏసికన్నా
మాట లేందే పొందబాకా "[60]

61. "ఏ ...... నా స్వప్రమంటే సంతోషపడితివే అబ్బే ఏసిగన్నా
నువ్ కుట్టాలంటే కుశాలపడితివే
పది పలకలు, రెండు తాజాలు
నాలుగు కొమ్ములు, తట్టుకు యాపపుల్లను కుట్టుకుని
గంగిరెడ్డి మాకల కాడ
మిరికిలెత్తేటప్పుడు అబ్బే ఏసికన్నా
నీకంటి నీరురో కడవలాయా "*[61]

60. I bid.
61. I bid.
* ఈ ఏలపాటలు 1994 తిరుపతి గంగజాతర సందర్భంలో సేకరించివవి.


N
W
E
S
మల్లయ్య గుంట
తాతయ్య గుంట గంగమ్మ గుడి
తాతయ్యగుంట
చిన్న కాపు వీధి,
బండ్లవీధి, పెద్దకాపువీధి,
తాళ్లపాక చెరువు
తాళ్లపాక గంగమ్మ గుడి

# ఉపయుక్త గ్రంథాలు


అన్నమయ్య — 'ఆధ్యాత్మిక సంకీర్తనలు'
రేకు - 179
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ఆది శేషువు, హరి. — 'జానపద గేయ వాఙ్మయ పరిచయం'
మహోదయ ప్రెస్, శ్రీకాకుళం - 1954.

కన్నయ, లాల — 'సుంకరి కొండడి వేషపు కథ'
సి.వి. కృష్ణా బుక్ డిపో
19/99 అమ్మన్ కోవిల్ వీధి
వాల్ టాక్సు రోడ్డు పోస్టు
మదరాసు - 1 . 1964

కృష్ణకుమారి, నాయని. డా॥ — 'తెలుగు జానపద గేయగాథలు'
8-3-898/2, నాగార్జున నగర్
హైదరాబాదు - 500873. 1977

గోపీకృష్ణ — 'శ్రీనివాస మంగాపురం మరియు
మన ఆలయముల చరిత్ర'
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి. 1980

చిన తిరు వెంగళనాథుడు, తాళ్ళపాక — 'తాళ్లపాక అన్నమాచార్యుల
జీవిత చరిత్రము'
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి. 1982

ధర్మారావు, తాపీ. — 'దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు?'
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్, విజయవాడ - 520004
ఆరవ కూర్పు - 1977

ప్రతాపరెడ్డి, సురవరం. — 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు -ఆం.ప్ర.

ప్రభాకర శాస్త్రి, వేటూరి. — 'అన్నమాచార్య చరిత్రము'
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి - 1949

ప్రేమలత, రావి.
'తెలుగు జానపద సాహిత్యము
అవేరా ప్రింటింగ్ ప్రెస్ - పురాగాథలు'
కవాడి గూడ, సికింద్రాబాద్-1983

మౌలాన, పైడాల.
'చిత్తూరు జిల్లా తిరునాళ్ళ గేయాలు'
పైడాల పబ్లికేషన్స్, తిరుపతి. 1989

రామకృష్ణుడు, తెనాలి.
'పాండురంగ మాహాత్మ్యము' (వ్యా.భా.)
వంతరాం రామకృష్ణారావు
ఆంధ్ర భాషాధ్యాపకుడు, ప్రభుత్వ కళాశాల
రాజమండ్రి. 1986

వల్లభరాయుడు, వినుకొండ.
(శ్రీనాథుడు)
'క్రీడాభిరామము'
మణి మంజరి, హైదరాబాదు - 20
ప్ర. ము. - 1960

వెంకట సుబ్బారావు, తంగిరాల.
(సంపాదకుడు)
'కాటమరాజు కథలు'
ఆంధ్రసారస్వత పరిషత్తు
హైదరాబాదు. 1976

వెంకటేశ్వర రెడ్డి, అన్నప రెడ్డి.
'సిగ్మండ్ ఫ్రాయిడ్'
తెలుగు అకాడమి, హైదరాబాదు - 1985

వెంగమాంబ, తరిగొండ.
'జలక్రీడా విలాసము'
పరిష్కర్త: డా॥ కె.జె. కృష్ణమూర్తి
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము
ప్రాచ్య పరిశోధనాలయము, తిరుపతి - 1985

శ్రీనాథుడు
'శృంగార నైషధము'
గంగాధర పబ్లికేషన్స్, రామ మందిరం వీధి
విజయవాడ -2, ప్ర.ము. 1987

శ్రీనివాసులు రెడ్డి, పేట. డా॥
'జానపద శృంగార గేయాలు'
విష్ణువంశీ ప్రచురణలు
418, బండ్లవీధి, తిరుపతి -1989

శ్రీనివాసులు రెడ్డి, పేట. డా॥
'జానపద గేయాల్లో శ్రీ వేంకటేశ్వరుడు'
విష్ణువంశీ ప్రచురణలు
418, బండ్లవీధి, తిరుపతి - 1991

సుందరం, ఆర్వీయస్. డా॥ — 'ఆంధ్రుల జానపద విజ్ఞానం'
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు - 4 . 1983.

సుబ్బారావు, తంగిరాల. డా॥
తిరుపతిరావు, చన్నాప్రగడ. డా॥
(సంపాదకులు) — 'వీరగాథలు' (రెండవ సంపుటం)
1978

........................................ — 'ఆంధ్ర మహాభారతం'
సంశోధిత ముద్రణము, తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము, 1973

........................................ — 'గంగమ్మ జాతర వేషపు హాస్యములు'
సి.వి. కృష్ణాబుక్ డిపో
19/99, అమ్మన్ కోవిల్ వీధి
మదరాసు - 1. 1994

వ్యాసాలు :-

శ్రీనివాసులు రెడ్డి, పేట. డా॥ — 'తిరుపతి గంగజాతరలో జానపద కళారూపాలు'
'తెలుగు' వైజ్ఞానిక మాసపత్రిక - 1992
తెలుగు అకాడమీ, హైదరాబాదు

## ENGLISH

Arthur F. Cox
Compiled — Madras district Manuals
North Arcot
Madras - 1894

................................ — Andhra Pradesh District
Gazetteers 1979
Chittoor Gazetteer of India
The director of Printing
and stationary at the
Govt.Press Kurnoor A.P 1979.

Bhattacharyya, N.N. — 'The Indian Mother Goddes'
Manohar Book service
2 Ansari Road, Darya ganj
New Delhi - 110002
1977. Second Edition.

Bhattacharyya, N.N. — 'History of the Śākta Religion'
Munshiram Manoharlal
publishers pvt. Ltd.
54, Rani Jhansi Road
New Delhi,First Edition - 1974.

Henry White head — 'The Village gods of South India'
Summit publications, Delhi - 1976

James Hastings (Editor) — 'Encyclopedia of Religion and Ethics' T.T Clark, 38, George street Edinburgh

Pharoah and Co., — 'A Gazetteer of Southern India' Printed and published by Pharoach and co Atheneum press Mount Road, Madras - 1855

Pushpendra Kumar — 'Sakti cult in Ancient India'

Richard M. Dorson — 'Folklore and folklife' The university of chicago press Chicago and London - 1972

Sir, John Marshall — 'Mohenjodaro and the Indus civilization' London - 1931

Thurston. E — 'Castes and Tribes of southern India' Cosmo publications, Delhi - 110006. India

Vishwanatha Reddy Kalikiri . Dr. — 'An Anthropological study of Telugu folk songs' of chittoor district, Andhra pradesh S V University, Tirupati - 1990


* మిరాశిదార్లైన కైకల కులస్థులు నాలుగు కుటుంబాల వారున్నారు. వారు కైకాల నరసింహారెడ్డి, కైకాల కృష్ణారెడ్డి, కైకాల తులసమ్మ, కైకాల శ్రీనివాసులు రెడ్డి. వీరిలో ముగ్గురికి ఒక్కో సంవత్సరం మిరాశి వస్తే, తులసమ్మ కు మాత్రం మూడు సంవత్సరాల మిరాశి వస్తుంది. ఈమె తరపున మనవళ్ళు (కూతురు బిడ్డలు) మిరాశిని చూసుకుంటారు. వాళ్ళు సుబ్రమణ్యాం రెడ్డి, వెంకటేశ రెడ్డి, సాంబశివా రెడ్డి, నాగభూషణం రెడ్డి. ఇలాగే ఇతర కులాలకు చెందిన మిరాశిదార్లకు కూడా వంతులవారిగా మిరాశి సంక్రమిస్తుంటుంది.